శ్రీరస్తు

# దిలారాము

కేతవరపు వేంకటశాస్త్రి విరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1952

# ఉపోద్ఘాతము

శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు జగమెఱింగిన బ్రాహ్మణులు: జందెమువేసి యాయన కులగోత్రములు తెలియఁజేయవలసిన యవసరము లేదు. వారు, 'రాయచూరుయుద్ధము' రచించి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వారి వలన బహుమానము వడసి యాంధ్రప్రపంచమందు పేరు వడసినారు. ఆనవల రెండవ బహుమానమును గైకొన్నది; నిశ్చయముగా మొదటి బహుమానము నకే యర్హమైనదని తెలిసినవా రనేకు లభిప్రాయపడిరి; పడుచున్నారు.

'రాయచూరుయుద్ధము' నందుఁ గథా కల్పనా చమత్కారము కడు మెండుగా నున్నది. ఇప్పటికి బయలువెడలిన స్వకపోలకల్పితములైన తెనుఁగు నవలలో నట్టి కథాచమత్కారము సాధారణముగాఁ జూడఁబోము. పట్టుకొన్నది మొదలు వదలిపెట్టనీయకుండఁ గట్టిపెట్టి యుంచఁగల శక్తి యాకథ యందున్నది. ఇప్పటి యీ 'ఛత్రసాలవిజయము' నందలి కథయు నట్టిదే. ఇదియును విజ్ఞానచంద్రికామండలివారికి బహుమానముకొఱకుఁ బంపుకొన్న నవలయే. ఏలకో యా మండలివారు తమకీమాఱు వచ్చిన నవలలలో నొక్కటియు బహుమానమునకుఁ దగియుండ లేదని తీర్మానించిరి. శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి 'ఆంధ్రుల చరిత్ర మూడవభాగము' కూడ విజ్ఞానచంద్రికవా రీమాఱు ప్రచురింపరైరి ఇదియు నదియు ముడిపెట్టి చూచుకొన్నయెడల, నిజమైన స్థితియెట్టిదో పొడఁగట్టక పోదు.

శ్రీ. శాస్త్రిగా రాంగ్లేయనవలలను

* వావిళ్లవారు ముద్రించిన 'ఐవన్హో' ధర రు. 1-0-0

చూడుడు. అద్భుతములు కొన్ని, యసంభవములు కొన్ని, యసాధ్యములు కొన్నియుం గలిసి తెలుఁగు నవలలగుచున్నవి. తెనుఁగు నవలలే కావు : మన దేశమున భాషాంతరములందు నవలలు వ్రాయుచున్న శ్రీయుత బంకిం చంద్ర ఛటోపాధ్యాయులు మొదలగు వారుకూడ రెయినాల్డ్సు నవలలనే యనుకరించుచున్నారుగాని సుప్రసిద్ధములైన తక్కిన యాంగ్లేయనవలల ననుసరించి వ్రాయుచున్నట్లు కనఁబడదు.

పాత్రపోషణమందును పాశ్చాత్యనవలల ననుకరింపవలసిన యావసరము కనఁబడుచున్నది. చిక్కులేని చోట్లఁగూడఁ బాత్రములను దత్తుల్యస్వభావానుగుణముగా నడపించిన నవలాకారుల సంఖ్యయుఁ దెలుఁగువారిలోఁ దక్కువ. ఈవిషయమున 'ఛత్రసాలవిజయము' లో లోపము లేదని చెప్పవచ్చును. మానవ మనోధర్మములఁ జక్కగా గుర్తెఱిఁగి మిక్కిలి చిక్కయిన యవస్థల లోను నిసుమంతయు నసందర్భములు రాకుండఁ దమపాత్రములను నడుపనేర్పు పాశ్చాత్య నవలాకారులకే చెల్లినది. ఇట్టి చిక్కు స్థితిలో నాయికా నాయకులను బెట్టి చాలవఱకు సరిగా నడుపుట శ్రీయుత రవీంద్ర నాథ ఠాకూరు గారి *'నౌకాభంగము' నందు గానవచ్చుచున్నది. అట్టిచిక్కుస్థితులలో మానవ మనోధర్మము లెట్లెట్లు మాఱునో యాతీరంతయుఁ స్వభావవిరుద్ధము గాకుండఁ జూపించు శక్తి పాశ్చాత్యులయందును జార్జి ఎలియటువంటి కొలఁదిమందికే కలదు. ఇంత త్వరలోఁ దెలుఁగునవలలయం దానేర్పు కనఁబడుట కష్టము.

నవలలు వ్రాయువారి శైలిలో విశేషముగా మెఱుఁగులుండవలసిన యవసరము లేదు : అట్టి మెఱుఁగులు కూడదని కూడ కొందఱి యభిప్రాయము. వ్యాకరణయుక్తమై చదివిన సరికి భావమంతయుఁ జక్కఁగాఁ దెలుపుడు చేయుశైలియే యుత్తమమైనది. వేంకటశాస్త్రిగారి శైలి యిట్టిది. ఆంగ్లేయనవలాకారులకందఱకు నాదిపీఠముగాఁ బేరుపడిన స్కాటు శైలియు నిట్టిదే.

విశాఖపట్టణము.
9-10-16.

సెట్టి లక్ష్మీనరసింహము.

---

* విశ్వభారతివారు ముద్రించిన "పడవమునుక" ధర రు. 5-0-0.

శుభం భూయాత్

# దిలారామ

అను నామాంతరముగల

# ఛత్రసాల విజయము

## 1-వ యధ్యాయము

### ఫకీరు : ఇరువురుయువతులు

శ్లో. "వికసితసహకారభారహారి
పరిమళపుంజితగుంజితద్విరేఫః
నవకిసలయచారుచామరశ్రీ
ర్హరతి మునేరపి మానసం వసంతః."

శిశిర మతిక్రమించెను ; వసంతమరుదెంచెను. వసంతము సకలప్రాణులకును సంతోషదాయకము. సౌఖ్యావహము. అది శుభకార్యములకుఁ జెప్పినది. లోకులు సామాన్యముగా శుభకార్యముల నందొనర్తురు. కావున వారికాదినములు పండుగుదినములవలె నుత్సాహకరములు. అవి యట్లగుట కేవలము మానవకోటికే కాదు. తరులతాగుల్మాదులకుఁ గూడ నవి పండుగుదినములే. ఆదినములలో నెంత నిఱుపేదలైనను, ఎంత లుబ్ధాగ్రేసరు లయినను నూతనవస్త్రాభరణాదులను దాల్చి తదితరకాలములకంటెఁ దమ కపూర్వశోభను దెచ్చుకొందురు. అట్లే వసంతమునఁ దరులతాదులుగూడ నూత్న పల్లవాది విభూషితములై క్రొత్తశోభను వహించును. అప్పుడు

సాధారణముగా నడవులు గూడఁ బ్రవాళాది శోభితములై రమణీయములై చూపట్టును. ఇఁక నుద్యానవనములను గూర్చి చెప్పనేల? అట్టివానిలో నెల్ల మధురానగరమునకు సమీపముగా యమునానదీతీరమున విలసిల్లు పుష్పవనము ప్రధానమైనదని చెప్పవచ్చును. ఆప్రదేశము నదీతీరమగుటచే సారవత్తరము. యమునానది దానికిఁ జాలినంత నిర్మలోదకము నిచ్చును. ఇఁక దాని యభివృద్ధి కేమితక్కువ? అందలి ప్రతి తరువును శాఖోపశాఖలచే వర్ధిల్లి మనోహరముగానుండెను. కొన్ని వృక్షములు ననలెత్తి యరుణకాంతుల నీనుచుండెను; మఱికొన్ని పుష్పించి యపూర్వరూపసంపదలచేఁ జూపఱకుఁ గనులపండువు లొనర్చుచుండెను; ఇంకొక కొన్ని ఫలభారసంపన్నములై వంగి సంపన్నులకు నమ్రభావమును బోధించుచుండెను. ఉపఘ్నములందును, దరువులందును నల్లిబిల్లిగనల్లు కొన్నలతలు కోమలపుష్పవిరాజితలయి యాతోఁట కపూర్వసౌందర్యమును గూర్చుచుండెను. మధుకరములు తత్పుష్పసంతతులందుఁ ద్రిమ్మరుచుఁ దన్మరందమును దనివిదీఱఁ గ్రోలి మదించి ఝుంకారనినాదముల నెఱపుచుండెను. వసంతునకుఁ బ్రధానదూత లనఁదగిన కోకిలములు సహకారశాఖలఁ జరించుచుఁ దదీయ నవీనపల్లవముల మెసవి మత్తెక్కి కర్ణసుఖముగాఁ బంచమస్వర మాలాపించుచుండెను. అట్టి ఆవన మెవరి హృదయమున కానందము కొలుపదు? తన్మధ్యమున నున్నతమై సుధాలలితమై యొక సౌధరాజము విరాజిల్లుచుండెను. దాని పురోభాగమున జాతీలతా పరివేష్టితమగు నొకపందిరి యొప్పులు గుల్కుచుండెను.

దాని క్రింద నిరువురు యువతీమణులు స్ఫటికశిలావేదిక పైఁ గూర్చుండిరి. వారిలో నొకతె నామము జోహరా; రెండవదానిపేరు దిలారామ. వారి నామములచేతను, దుస్తుల చేతను, వారు మహమ్మదీయ యువతులని చెప్పకయే తెలిసి కొనవచ్చును. వారిరువురును యౌవనాలంకృతలే. అయినను వారికిఁ బ్రాయమునఁ దారతమ్యము లేకపోలేదు. జోహరా కొంచెము పొట్టిగాను, స్థూలముగాను నుండుటచే, నేపరియుఁ గృశాంగియు నగు దిలారామకంటె నల్పవయస్కురాలైనట్లు తోఁచును. కాని దిలారామకంటె జోహరా నాలుగైదేండ్లు పెద్ద. జోహరా వయస్సునఁ బెద్దదైనను, సౌందర్యము నందును, సద్గుణములందును, దెలివితేటలందును దిలారామ కంటెఁ జిన్నయే. సామాన్యస్త్రీలకుండు మూర్ఖత్వము, పర నింద, మాత్సర్యము మొదలగు దుర్గుణము లిరువురకును లేవు. వారప్పుడే వనవిహారము సల్పివచ్చిరి. వారిముఖపద్మ ములు గొంచెము వాడియుండెను. ఆణిముత్యములవలెఁ జెమటబిందువులు వారికపోలముల నావరించియుండెను. విశ్రాంతికై వారందు ప్రవేశించిరి. సాయంతనసమీరకుమారుఁడు యమునా నదీ తరంగడోలికల నూఁగియూఁగి పుష్పిత లతలఁ గౌఁగిలించుకొని మందమందముగ వచ్చి వారిచెక్కిళ్లను ముద్దాడుచుండెను. వారట్లొకగడియ విశ్రాంతిసుఖ మనుభవిం చిరి. ఆయాసమడఁగెను. మరల విహరింపఁదలంచి దిలా రామ యాసనమునుండి లేచెను. జోహరా యామెను వెంబ డించెను. బాటప్రక్కనున్న పుష్పితవల్లులను గాంచుచు వారు పదిగజములదూర మేగిరి. అచ్చట మనోహరకుసుమవిలసిత

యగు నొకలత గాలి తాఁకుడువలన నాశ్రయముతోఁ గూడ నేలఁ గూలియుండెను. దాని పుష్పములు కొంచెము ధూళి ధూసరితములై యుండెను. దానిసొబగు చెడియుండెను. దిలారాము యదిచూచి సత్వరముగాఁబోయి నెమ్మదిగా నూఁతకఱ్ఱను బాఁతి దానిపై లతను బ్రాఁకించుచుండెను. జోహారా యట నిలిచి చూచుచుండెను. దిలారాము యిట్లనియె.

"తోఁటకాపరులు సోమరిపోతులై సరిగాఁ బనిచేయకున్నారు. ఇచ్చటి లతలలోనెల్ల నిది మిక్కిలి రమణీయమైనది. గాలి తాఁకుడువలన దీనికెన్ని పాట్లు సంభవించెనో చూడుము. దీని నొకగుజ్జు మామిడిచెంతను బాఁతి యందుఁ బ్రాఁకించినచో నిట్టి యపాయము సంభవింపక పోవును." అనిచెప్పుచు నామె దన పని ముగించెను.

జోహారా దిలారామకంటె నెక్కుడు లోకానుభవము గలది. ఈలతాదులవలన నామెకు మనస్సులో నేవియోభావములు కలిగెను. మందహాసముచేయుచు నామె మఱందలా! "సదాశ్రయేణ శోభంతే పండితా వనితా లతా." యని పండితు లందురు. "ఇప్పుడీయాశ్రయమున నుండుటచే నీలతకు వెనుకటికంటె నెంతశోభ వచ్చినదో చూడుము. ఇది జ్ఞప్తియందుంచుకొనుము," అని పలికెను.

దిలారామ యామెవచనములు వినెను. ఆలత పూర్వస్థితిని స్మరించుకొనుచు నిప్పటిస్థితిని జూచుచు, గొంచెమాలోచించుకొనెను. జోహారాపలికిన లోకోక్తియర్థమును గ్రహించెను. "వదినే! నీయభిప్రాయమంతయు నాకవగతమైనది. ఏమిచేయుమందు," వనెను.

# 1-వ యధ్యాయము

"ఏమి చేయుమందునా ? నీవును దగిన యాశ్రయము నాశ్రయించి సుఖముగా నిరపాయముగా నుండుమందును. అంతకంటె నేనేమందును ?" అని జోహారా మాఱుచెప్పెను.

"వివాహమాడి భర్తృసన్నిధి నున్నవారందఱును సుఖమనుభవింతురా ?" అని మందహాసముచేయుచు దిలారామ యడిగెను.

దిలారామయభిప్రాయము జోహరా తెలిసికొనెను. మొగము వెలవెల వోవ, "ముఱఁదలా! లోకములో నాసాటియే చూచుకోవలెనా ? దురదృష్టవంతురాలనగు నాసంగతి యుక్తకము. నాదుష్కర్మవశమున నాకట్టి చపల చిత్తుఁడు లభించెను. నీపూర్వపుణ్యవశమున నీకుమంచి పురుషుఁడు లభింపరాదా?" అని యామె పలికెను.

"వదినే ! పూర్వజన్మమున నేనాచరించినది సుకర్మమో దుష్కర్మమో చెప్పఁగలవా ?"

"ఏమో, యెవరు చెప్పఁగలరు ?"

"నా యొనర్చినది సుకర్మమౌనో కాదో తెలియని యప్పుడు నాకు మంచిపురుషుఁడు లభించునని నిశ్చయించు టెట్లు ?"

"నిశ్చయించుట కష్టమే ? అయినను బ్రయత్నించి చూడవలయును. అప్పుడు నీయదృష్టవశమున మంచివాఁడే లభింపవచ్చును."

"దురదృష్టమున మాయన్నవంటి చపలచిత్తుఁడే లభించినచో ?"

"అప్పుడు నావలెనే నీదురదృష్టమును నిందించు కొనుచు నుండవలయును."

"ఆడుసు ద్రొక్కనేల ? కాలు గడుగనేల? అని పండితు లందురు. వింటివా ?"

"వింటిని. అట్లని యెంతకాలము నిరాహారహితవై యుందువు ?"

"యావజ్జీవమును " అని దిలారాము నిస్పృహతోఁ బలికెను.

"అది కేవల మయుక్తము. సాధ్య మగునంతవఱకుఁ బరిశీలించి యొక పురుషునిఁ జేపట్టుము. దురదృష్టవశమున జపలచిత్తుఁడు లభించి సౌఖ్యముల వడకపోయినను బరులవలని యపాయములు రాకుండఁ దప్పించు కొనవచ్చును. మనశరీర స్థితి యెప్పుడు నొక్కవిధముగా నుండదు. దైవవశమున నేదేని దుర్దశ సంభవించిన నీక్షేమ మరయువా రెవ్వరు ? తల్లి దండ్రులు గతించిరి కదా! తక్కినవారు నిన్నిపట్టున గౌరవించు చున్నను, విపమదశ సంప్రాప్త మగునపుడు నీమొగము చూతురో చూడరో చెప్పఁజాలను. అట్టిసమయమునఁ బ్రాణ విభుండే యున్నచో భయపడ నవసరములేదు. ఎట్టి పుష్ప సంపదలతోఁ బొదలుచున్నను రసాలమునఁ బ్రాఁకినప్పుడే పుష్పలత ప్రకాశించును ; గాలిదెబ్బలవలన నపాయమును బొరయకుండును. ఇందుల కీలతాదులే దృష్టాంతము."

ఈపలుకులు దిలారామహృదయమును గలంచినవి. మొగము వెలవెల వోయెను. తనయసహాయస్థితిని స్మరించు కొనఁ గన్నులనుండి బాష్పములు జొటజొటఁ బ్రవహింపఁ

జొచ్చెను. సంపదలందును, నాపదలందును గంటిని ఱెప్ప విధంబునఁ దన్ను సంరక్షింపఁజాలువానిఁజేపట్టకుండినఁ దనకిఁక సుఖ మలవడదని తెలిసికొనెను.

"వదినే! నీవచనములు సత్యములే. అనుకూలుఁడగు వాఁడు సంభవింపనిచోఁ జేయవలసినదేమి?" అని యామె యడిగెను,

"సంభవింపకేమి? రహీమున్నాఁడు కాఁడా అతఁ డందము గలవాఁడు నిన్నుఁ బ్రేమించుచున్నవాఁడు. అతని వరించినచో,—"

"వరింప నాకిష్టములేదు"

కారణమేమి? అందము చాలదనియా" అని జోహారా ప్రశ్నించెను,

"కాదు. అందమునకేమి? అతనిగుణములు నాకింతేనియు సరిపడవు. వధూవరుల గుణము లేకీభవింపనిచో నెట్లుండునో చెప్పవలయునా? "ఎద్దెండకు లాగగా, నెనుఁబోతు నీడకు లాగినదఁట!" అని దిలారామ బదులుచెప్పెను.

"అతనిగుణములు నీకెట్లు తెలిసినవి?"

"సందేహమెందుకు? అతనిప్రవర్తనమే వేమొగముల ఘోషించుచున్నది. అతఁడు డాంబికుఁడు. కల్లలగంప. సద్గుణము వెదకినను లేదు."

అని దిలారామ పలుకునంతలోఁ జెలికత్తె యొకతె ఫలములఁ గొన్ని పళ్లెరముతోఁ దెచ్చి యామెకు జూపెను. ఆమె జోహారాతోఁ గూడ వచ్చి పందిరి క్రిందఁ గూర్చుండెను. పళ్లెమునందలి ఫలములను వేర్వేఱ వర్ణించుచు

దిలారామ కొన్నింటినిదీసి జోహరామునందుంచి వినియోగింపు మనియెను. కాని యందులకామె యిష్టపడక, "మఱఁదలా! ఇవి క్రొత్తఫలములు ముందుగా నొకపకీరునకు సమర్పించినఁ గాని నేఁ దిననొల్ల"నని తననిశ్చయ మెఱిఁగించెను.

"అది యుక్తకార్యమే. మనమిచ్చటికి వచ్చునపుడు బాటప్రక్కనున్న చెట్టుక్రింద నొకపకీరున్నాఁడు. అతనిఁ బిలిపించి యిప్పుడే యొసఁగుదము" అనిపలికి దిలారామ యతని నిమిత్త మొక సేవకునిఁ బంపెను. అప్పుడు జోహరా దిలారామతో నిట్లనియె.

"మఱఁదలా! పకీరులు మనుజుల ప్రవర్తనాదు లున్న దున్నట్లు చెప్పఁగలరు. రహీమును గూర్చి యడిగి తెలిసికొందము. పకీరు రహీముప్రవర్తనము మంచిదన్నచో?—"

"అన్నచోఁ గదా?" అని దిలారామ యనెను.

"అతనికి నీయందు మిక్కిలి యనురాగము గలదని నేనిశ్చయముగాఁ జెప్పఁగలను."

"మొదటఁ బురుషులట్లే యుందురు; తరువాత విపరీతులగుదురు. ఇందులకు మాయన్నయే నిదర్శనము."

"అందఱు మీయన్నవంటివారే యుండవలెనా?"

"ఏమో! అందఱమాట నేఁజెప్పలేను. కాని నీవన్న రహీము మాత్ర మట్టివాఁడే. అతఁడు దుష్కార్యములందు మాయన్నకుఁ గుడిభుజము."

అని ప్రసంగించునంతలోఁ బకీరు వచ్చెను. అతనితో సంభాషించుచు రహీము గూడ వచ్చెను. తమతోఁ గూడఁ జిన్నతనమునఁ బెరిఁగినవాఁ డగుటచేత రహీమున కాయువతులు

రాణివాసము చేయు వాడుక లేదు. వారు ఫకీరునకు సలాములుచేసి దీనవలు వడసి రహీమున కుచితమర్యాదలు చేసిరి. క్రొత్తవారిరువురు నాసనాసీనులైరి. జోహారా వారియెదుట నిలువఁబడెను. దిలారాము యామెకుఁ గొంచెము వెనుక నిలువఁబడెను. దాసి వారిప్రక్క నిలిచెను. రహీము మంద హాస మొనర్చుచుఁ గడకంటిచూపులచే దిలారాముసౌందర్యము జూఱగొనుచుఁ బకీరుతో సంభాషించుచుండెను. అతనితల గుడ్డచీలికలచే బద్ధమైయుండెను. జోహారా అది చూచి వెఱఁగొంది,—

"రహీము! అదేమి, కట్టుకట్టితివి?" అని యడిగెను.

"పందెపుగుఱ్ఱమును బర్వెత్తించుచు జాఱిపడితిని. దానిచే నీదెబ్బ తగిలినది. అయినను బందెమును నేనే గెలిచితిని" అని రహీమనెను.

"ఎంతప్రమాదము! ఎంతప్రమాదము!" అని జోహారా యాశ్చర్యమును సూచించెను.

"నిన్న సాయంకాలమున మాకగపడినప్పుడీ కట్టు లేదే! గుఱ్ఱపుపందెము లెప్పుడు జరిగినవి? గతించినరాత్రియా?" అని దిలారామ వీణానాదమువంటి మధురస్వరముతోఁ బ్రశ్నించెను.

రహీము కొంచెము తడఁబడి "కాదు కాదు, గుఱ్ఱపుపందెములు కావు. రాత్రి మనపురమునకు వచ్చిన దొంగలను దఱుముచుండఁగా జాఱిపడితిని" అని యనాలోచితముగా బదులు చెప్పెను.

“అదియు నసంగతమే. జాతిక్రిందఁబడినప్పుడు నడినెత్తికి దెబ్బదగులుట యెట్లు?” అని దిలారాము మందహాసము చేయుచుఁ బలికెను.

ఆమందహాసమున నెంతో తిరస్కారమున్నది. కాని యది రహీం మెఱుఁగఁడు. తనప్రేమకుఁజోటయిన యాబోటి మందహాసము ననురాగసూచకమనియే భావించి సంతసించి యేమియుఁ బ్రత్యుత్తరమీయక దరహసితవదనుఁడై యూరకుండెను.

అంత జోహారా కొన్ని ఫలములను బకీరునకును, గొన్ని రహీమునకు నర్పించి పకీరు నిట్లనియె.

“స్వామీ! మీరు మహానుభావులరు. మీకు సమస్తము దెలియును. ఈమె మామఱఁదలు. ఈరహీము నాకు దగ్గఱచుట్టము. వీరిరువురకుఁ బెండ్లి గావింపవలెనని యున్నది. కావున మామఱఁదలు వినుచుండఁగా రహీము నాయుర్భాగ్యాదులను వివరించి చెప్పవలెను.”

ఆమాటలకు రహీమానందము పట్టఁజాలక మొగము కొంచెమువంచి కాలి బొటనవ్రేలితో నేల రాయుచు పకీరేమి చెప్పునోయని జాగ్రత్తతో వినుచుండెను.

పకీరామెను జూచి “సుందరీ! నీవడిగినది మీయందఱ యెదుటను జెప్పనిష్టములేదు. ఒక పత్రము మీఁద వ్రాసి యిచ్చెదను. మీరు తరువాతఁ జదువుకొనుఁడు” అని చెప్పెను. ఆయువతి యందుల కంగీకరించెను. అతఁడు రహీమువృత్తాంతమును లిఖించి జోహారా కిచ్చి యాఫలములను గైకొని వెడలి పోయెను. దిలారాము జోహారాచేతిలో నుండి యా పత్రమును లాగికొని దాఁచిపెట్టెను. రహీమునకు దానిని

జూచుట కవకాశము చిక్కలేదు; దానిఁ జూడ నిమ్మని యడుగుటకు మొహమాటపడెను. అందుచే నీఁకనందులకై ప్రయత్నింపక పకీరునడిగి తెలిసికోవచ్చునని వెడలిపోయెను. అప్పటికిఁ జీఁకటి పడుటచే దిలారామ జోహరాతోను దాసితోను బురమునకుఁ బోయెను.

శుభం భూయాత్

# దిలారామ

## 2-వ యధ్యాయము

### ప్రియసమాగమము

శ్లో. "నికామం శ్యామాంగీ సరసకదళీగర్భసుభగా
కళాశేషామూర్తిశ్శశిన ఇవ నేత్రోత్సవకరీ!
అవస్థామాపన్నామదనదహనోద్దాహవిధురా
మియం నః కల్యాణీ రమయతి మనః కంపయతి చ"

యమునానదీతీరమునఁగల ప్రసిద్ధపట్టణములలో మధురాపురము తలమానికము వంటిది. అది మనకథాకాలమునఁ గాకపోయినను బురాణకాలమున మిక్కిలి ప్రఖ్యాతిఁ గాంచి యుండెను. పూర్వము కంసుఁడు దానిని రాజధానిగాఁ జేసికొని శూరసేన దేశమును బాలించెను. విష్ణుని పూర్ణావతారంబును, ద్వాపరయుగాలంకారభూతుండును, సజ్జనావనపరుండును నగు శ్రీకృష్ణునిపుట్టుకచేఁ బరమపవిత్రమైన దీనగరంబే. అందుఁ బూర్వకాలమునాఁటి శిథిలగృహంబులు పెక్కులు గలవు. ఇటీవలివారు వానిని విడిచి ప్రత్యేకముగా నిండ్లు కట్టుకొనుటచేఁ బుర మెక్కుడుస్థలము నాక్రమించియుండెను. ఆశిథిలగృహములు కాలక్రమంబున విఱిగిపడి లతాగుల్మాదులకు నిలయము లయ్యెను. అవి నివాసయోగ్యములుగా గన్పట్టవు. అయినను గొందఱు బీదలు వాని శుభ్రపఱిచికొని యందు నివసించుచుండిరి.

నేను వర్ణించునది నిశాసమయము. అది వులకు సుఖమొసంగును. పశుపక్ష్యాదులు పవలెల్ల నాహారము సంపాదించుకొని రాత్రిసమయమునఁ దమతమ నెలవులఁజేరి సుఖించును. ప్రజలు దివాసమయమునఁ గార్యస్థానముల కరిగి తమ కార్యముల నెఱవేర్చికొని వచ్చి యిండ్లఁజేరి సంసారము నకు మూలకందమువంటివారగు దారసుతాదులను గూడి సుఖింతురు. ఆలోచింప వియోగులకుఁ దక్క రాత్రిసమయ మెవ్వరికి సుఖావహము గాదు? అట్టిరాత్రి యొకజాము కడచెను. తమము లవివేకిహృదయమును వలె రోదసీకు హరము నావరించెను; కాని చంద్రుఁ డప్పుడే యుదయించి తనకరనికరముచేఁ జీఁకట్లయుద్రేకమును గొంత మాయిం చెను. ఆకాశమునఁ బెద్దచుక్కలు వితానమున వ్రేలాడు పాద రసపుబుడ్డ ననుకరించుచుండెను. తక్కినవి తైలావసానమున నాఱిపోవు దీపములవలె మినుకు మినుకు మనుచుండెను. వెన్నెలలో బాలురు విచ్చలవిడిగా నాడుకొనుచుఁ గోలా హలధ్వను లొనర్చుచుండిరి. యువజను లొకచోఁట గూర్చుండి సరసాలాపముల నాడుకొనుచుండిరి. ముదుసలితాతలు తమ చుట్టును గూర్చుండియున్న బాలకులకుఁ బుక్కిటి కథలను జెప్పుచుండిరి. వర్తకు లంగళ్లె నెత్తిపెట్టి నాఁటి యాదాయ వ్యయముల లెక్కించుకొనుచుండిరి. నిద్రాదేవి సౌందర్య వతివలెఁ దనవిలాసములచే లోకమును మోహింపఁజేసి మూర్ఛాధనముగాఁ జేయుచుండెను. కాని యిందొక్క భేద మున్నది. సౌందర్యవతివిలాసము లారోగ్యవంతులైన యౌవన కౌమారవంతులను మాత్రమే మోహింపఁజేయఁ

గలవు. నిద్రాదేవిలీల లట్లుగాక వియోగులను లుబ్ధులను జోరులనుదక్కఁ దక్కినసర్వావస్థలవారిని మోహింపఁజేయఁ గలవు.

యమునానదీమారుతములు మెల్ల మెల్లన వచ్చి జనముల జోకొట్టి యుపచారములఁ జేయుచుండెను. ఆసాయము వలన నిద్రాదేవికి సులభముగా లోకము స్వాధీనమయ్యెను. జనములు శయ్యాతలముల కఱుగుచుండిరి. అట్టి సమయమున నొకపురుషుఁ డాపురమును బ్రవేశించి రాజమార్గమునఁ బడి సత్వరముగాఁ బోవుచుండెను. అతఁ డాపురమునకుఁ జిరపరిచితుఁడేమోయని తోఁచుచున్నది. నిద్రావస్థకుఁ జిక్కనివారు కొందఱుందురని చెప్పితిని. వారిలో నెవ్వరైన నతనికి దారసిల్లినచో నాపురుషుఁడు తప్పించుకొని పోవుచుండెను. ఆ రాజవీథియందుఁ జూడఁదగిన విశేషము లెన్నియో కలవు; అయిన నతఁ డచ్చట నిలుపక పట్టణము చిట్టచివర కేగెను. అచ్చట నిలిచి నలువంకలు పరిశీలించెను. అక్కడ నేదో యతని చిత్తము నాకర్షించెను గాఁబోలు! ఆ సమీపమున సామాన్య జనుల యిండ్లును, బూర్వకాలమునాఁటి శిథిల గృహావశేషములుం దక్క మఱేవియును లేవు. అవియే యతని మానసము నాకర్షించియుండును. అవి యతని నాకర్షించినట్లు రాజవీథిఁగల సౌధరాజములైన నాకర్షింపవైను. అటఁ గొంచెము సేపుండి యతఁడొక యిఱుకు మార్గము ననుసరించి కొంతదూరమేగెను. అచ్చట నింకను జనులు నిద్రింపలేదు. అత్తా కోడండ్రు పరస్పరము తిట్టుకొనుచు విపరీతవాదములు సల్పుచుండిరి; తగవు దీర్పువారు

గూడ నల్గురైదుగు రచ్చట నున్నట్లు సంభాషణమువలనఁ దెలియవచ్చెను. ఆయింటిచెంతనుండియే తాను బోవలసి యున్నది. ఎట్లు పోవును? పోయినఁ దన్ను గుర్తింపక మాను దురా? అది తనకు సమయము కాదని యతఁడు వెనుకకు మరలెను. అచ్చటికి యమునానది మిక్కిలి సమీపముగా నున్నది. అచ్చటి కతఁడేగి, ముడుతలువడిన తెల్లపట్టుపంచె వలె మనోహరమగు నాసైకతమునఁ గూర్చుండెను. చంద్రిక వలన నాసైకతము ధవళకాంతులు రెట్టించుచుండెను. నది నుండి చల్లని గాలు లరుదెంచుచుండెను. ఆమనోహరస్థల మునఁ గూర్చుండి యేదియో యతఁడు యోజించుచుఁ గొం చెము కన్నులు మూసికొనెను. అతఁడు తన కనుసూలుఁడేమో యనుకొని నిద్రాదేవి తనకటాక్షవీక్షణములు ప్రసరింపఁ జేసెను. కాని యతఁడు నిద్రకుఁ జిక్కువారిలోవాఁడు కాఁడు. వెంటనే తెలివి తెచ్చుకొని యతఁడు నిద్రను గసరి తఱిమి వేసెను. నక్షత్రముల వంకఁజూడఁగా, రెండవజాము మిగియు చున్నట్లతనికిఁ దెలియవచ్చెను. అటనుండి యతఁడు వెనుకటి పూరియిండ్లచెంతకు వచ్చెను. అచ్చటివారు శయనించిరి. అప్పటప్పటఁ గుక్కల యఱపులును, గస్తుదిరుగు రాజభటుల కేకలును దప్ప మఱియేశబ్దంబు నతనికి వినరాలేదు. రాజ భటులు తనగమనమును నిరోధింతురేమోయని యతఁడు భయ పడలేదు. వారు ధనవంతులగృహములచెంతను, దమ నాయకుని మందిరంబుపొంతను మాత్రమే తిరుగుదురు. కాని యాబీద గృహములదరికి రారని యతఁ డెఱుంగును. సత్యమే; రాజభటులస్వభావ మట్టిదియే. పురమంతటిని రక్షించుట

వారికి విహితకృత్యమైనను నిద్రాయువతికిఁ జిక్కి యట్లు చేయక, తమపై దోషారోపణముచేసి తమ ప్రభువుతోఁ జెప్ప కుండుటకై ధనవంతుల యిండ్లచెంతను, భటులు విహితకృత్య ముల జాగరూకులై యున్నట్లు దెలిసికొనుటకుఁ దమనాయ కునిగృహము నొద్దను రెండు మూఁడు తడవలు కేకలువేసి వారు తమ నిలయములకరిగి హాయిగ నిద్రింతురు.

ఇట్టి సంగతులఁ జక్కఁగా నెఱిఁగిన మన బాటసారి యెంత మాత్రమును జంకక గంతవ్య స్థానమును జేరెను. అది యూరికిఁ గొనయందుండెను. లతాగుల్మాదు లటమెండుగా నల్లుకొని యుండెను. శిథిలగృహము లట పెక్కులు గలవు. ఆనవాలుపట్టి వానిలో నొకయింటి నతఁడు సమీపించెను. ఆయింటికొక ప్రాకారపుగోడఁగలదు. అది యిప్పుడు కట్టినది కాదు; చిరకాలమునాఁటిది. దానికొక ద్వారము గలదు; అదియుఁ దొల్లింటిదే. తలుపు వానకుఁదడిసి యెండకెండుటచే బీఁటలువాఱియుండెను; అయినను దృఢముగా లేకపోలేదు. బాట సారి తలుపుతట్టెను. కాని యది నిర్బంధింపఁబడియుండ కదల లేదు. తలుపురంధ్రములలోనుండి దృష్టిని బ్రసరింపఁ జేయఁగా లోపల మినుకు మినుకు మనెడి చిన్న దీప మున్నట్లు గాన వచ్చెను. మనుష్యుల యలుకు డేమియు వినరాలేదు. తలుపు నొద్ద చెవినుంచి వినఁగా మెల్లనిఘురఘురధ్వని వినవచ్చెను. అది తిరుగటి చప్పుడని యతఁడు గ్రహించి, లోపలివారు భోజనా దుల నిమిత్తము కాయకష్టములు పడుచున్నట్లు తెలిసికొనెను.

అతనికిఁ దమ పూర్వస్థితి తలంపునకు వచ్చి హృద యము చెదరిపోయెను; దుఃఖ మమితముగా నావరించెను;

ఎంత నిరోధించిననునాఁగక యతనికన్నులనుండి బాష్పబిందువులు ప్రవహింపఁ జొచ్చెను; కంఠము స్తంభిత మయ్యెను. లోపలివారిని బిలువ నెంతయత్నించినను మాటవెలువడలేదు; వెలువడినను, స్పష్టముగాలేదు. ఏమిచేయును? తమకంటె నెక్కుడు కష్టము లనుభవించిన దురదృష్టవంతుని స్మృతి దర్పణమునఁ బ్రతిఫలించిరి. వారినిజూడ మనస్సునకుఁ గొంత యూఱట గలిగెను; దుఃఖోద్రేకము తఱఁగెను; హృదయమున ధైర్యము నెలకొనెను. తలుపునొద్దచెవినిడి జాగరూకుఁడై యతఁడు మురల వినెను; వెనుకటి తిరుగటి చప్పుడిప్పుడు వినరాలేదు. అతఁడు తలుపు తట్టెను; ప్రత్యుత్తర మేమియులేదు. ఆబాట పారి మరలఁ దలుపు మెల్లగాఁదట్టుచు "శాంతా, శాంతా" యని పిలిచెను. లోపలనున్న యాపడఁతి యది విని నివ్వెఱపడి, తమ్మువంచించుటకై మాయావు లెవ్వరైనను వచ్చి తలుపు తట్టుచున్నారేమో యని మొదట సందేహించెను. గాని యజ్ఞాతవాసము చేయుచున్న తన నామ మెఱులకుఁదెలియుట యసంభవమని యెంచి యాసంశయమును నివర్తించుకొనెను; ఆ వచ్చినవాఁడు తన ప్రాణనాథుఁడే యని నిశ్చయించెను. ఆనందపూర్ణమగు హృదయముతో నాయిల్లాలు సత్వరముగాఁ బోయి తలుపుదీసెను. ఆపురుషుఁడు లోపలఁ బ్రవేశించి కవాటము బంధించి, దీపపు కాంతిలోఁ దనప్రియురాలిని గాంచెను. ఆయువతి విరహానలమున సంతప్తయై కృశించి బాల చంద్రరేఖను బోలుచుండెను. చిరకాలమునుండి సందర్శనోత్సుకమైన యతని మనస్సున కాయోషామణి సుందర

రూపము సంతోషమును గల్గించెను; మిక్కిలి కృశించిన దగుటచే సంతాపమును గల్గించెను.

# చి లా రా మ

## ౩-వ యధ్యాయము

### దంపతుల సంభాషణము

శ్లో. "తనుస్పర్శాదస్యాదరముకుళితే హంత నయనే
ఉదంచద్రోమాంచం వ్రజతి జడతామంగమఖిలం
కపోలౌ ఘర్మార్ద్రౌ ధ్రువముపరతాశేషవిషయం
మనస్సాంద్రానందం స్పృశతి ఝటితి బ్రహ్మపరమం."

—విశ్వనాథకవిరాజు

తన మనోవల్లభుని సుందరరూపము కంటఁబడినప్పుడు శాంతయానందమునకు మేర లేదు. భర్తను సమీపించి యామె గాఢముగాఁ గౌఁగిలించుకొనెను. ఇరువురి శరీరములును రోమాంచకంచుకితము లయ్యెను; ఉత్కంఠాతిశయమునఁ గంఠములు స్తంభితము లయ్యెను. తా మనుభవించుచున్న సుఖమో దుఃఖమో వారికిఁ దెలియలేదు.

ఆశాంత స్వభావ మతినిర్మలము; హృదయము నవనీత కోమలము. పతివ్రతలలో నామె తలమానికము; సద్గుణముల కాలవాలము; భర్తృప్రేమకు నిలయము; సహజ సౌందర్యమునకు నిధానము. చిరకాలమునుండి యామె ప్రియ విరహాగ్నిచేఁ గ్రాఁగుచున్నది. తన్ను నిష్కపటముగాఁ బ్రేమించుచుఁ, గంటిని ఱెప్పవిధమున సర్వదా కాపాడుచు, నపార సౌఖ్యములు గూర్చుచుండు ప్రాణనాథుని బహుకాల మెడఁబాసియున్న యా యువతీమణి కాకస్మికముగాఁ బ్రియుని

సందర్శనము లభించినప్పు డామె భావము లెట్లుండునో యను భవంబునఁ దెలిసికోవలయునే కాని మాటలవలనఁ గాదు.

పాపము! ఆశాంత యదివఱకుఁ గష్టము లెఱుగదు. ఒకప్పు డేదైన స్వల్పకష్టము సంభవించినను భర్తృహితరై యుండుటచే దాని సరకుగొనలేదు; అది యామెకుఁ గష్టముగాఁ దోఁపలేదు. వనమాలికా రససంపర్కమున లోహము బంగారుగా మాఱునట్లు దైవవశమునఁ దనకు సంభవించిన కష్టము భర్తృసాంగత్యమున సుఖముగా మాఱుచుండెను. భర్త నెడఁబాసియుండుట యామెకు మహాభర మనిపించుచుండెను. దానికిఁదో డజ్ఞాతవాసముగూడఁ జేయవలసివచ్చెను. ఆపై గృహకృత్యములుగూడఁ స్వయముగా నెఱవేర్చుకొనక తీఱి నదికాదు. అట్టి సమయమున నామెస్థితి యెట్లుండునో వర్ణింప నెవ్వరితము?

ఆసుందరి ప్రియుని వక్షమునఁ దన శిరస్సునుంచి కన్ను లరమోడ్చి ప్రియాలింగనసుఖ మనుభవించుచుండెను. ఆపురుషుఁడును గొంతదాకఁ దత్సుఖ మనుభవించి యొకచోఁ గూర్చుండి ప్రియురాలిని దొడపైనిడికొని చెదరిన ముంగురులను సవరించుచుండెను. ఇంతలో శాంతకు బాహ్యజ్ఞాన మంకురించెను. తన నేత్రములను భర్తవదనమున నిలిపి గద్గద స్వరముతో "నాథా, ఈదినమిట్టి సుదినమని యనుకొనలేదు. నాకీ సౌఖ్యము సమకూర్చిన భగవంతునికి వందనములు. మనోవల్లభా, ఇంతకాలమునకు మేము జ్ఞప్తికి వచ్చితిమా?" అని యామె ప్రశ్నించెను.

"సుందరీ, ఇట్లు పలికి నన్ను విచారసాగరమున ముంప కుము. నీవెఱుగని దేమికలదు? నేనిచ్చటికి రాకపోవుట రాజ శాసనమునఁగాని మీయందుఁ బ్రేమలేక కాదు. ఇప్పుడైనను బ్రాణములు పిడికిటిలోఁ బెట్టుకొని వచ్చితిని." అని హీన స్వరముతో నతఁడు పలికెను.

"నాథా, సంపద్విజ్ఞాన బలాదులచే విరాజితులగువారు గొప్పవారని జను లూహింతురు. కాని దైవవశమున సంభ వించిన యాపదలకు జంకక ధైర్యబలమున వాని సులభముగా నతిక్రమించువారే గొప్పవారని నేను నిశ్చయముగాఁ జెప్పఁ గలను. కష్టములన్నియు దుస్సహములే. కాని భర్తృవియోగ మును మించిన కష్టము లేదని నానమ్మకము."

"సుందరీ, అనుభవించునప్పు డేదైనను దుస్సహము గానే చూపట్టును. నీవిదివఱకు భర్తను విడిచియుండమిచే నీకట్లు తోఁచుచున్నది. దానికేమి! మన కుమారి క్షేమముగా నున్నదా?"

"ఆఁ, ఉన్నది. మీరాకనుగూర్చి పలుమాఱడుగుచుం డును. సంతతమును జదువుకొనుచు విద్యాపాటవమును సంపాదించుచున్నది."

"సుందరీ! మీకు భోజనాదులకుఁ జాలినంత ధనము న్నదా?"

"నాథా! కలదు. మీదయవలన మాకశన వసనాదు లందు సుంతేనియు లోపము లేదు. కాని మేమిట్లజ్ఞాతవాసము చేయుట యెంతకాలము? పాండవుల యజ్ఞాతవాసము నకు హద్దుండెను. కాని మా యజ్ఞాతవాసమున కది లేదు.

మనోహరా ! మీతోఁ గలసిమెలసి సుఖముగానుండు నదృష్టము మాకీ జన్మమున లేదు కాఁబోలును ? ఈపురమున ఈ శిథిలగృహములో నసహాయులమై నివసించి దినమొక యుగమునుగా భావించుచున్నాము. నాకంతమునఁ బ్రాణముండఁగా నామానమునకు భంగమురాదు. మానాభిలాషిణి నగు నాకుఁ బ్రాణము తృణప్రాయము. నన్నుఁ గూర్చి నాకంత భయములేదు. మన కీమారి నవయౌవనోపేత. సౌందర్యవతి. ఆ నా ముద్దులకూఁతును నధికప్రేమాస్పదురాలిని, నిష్కారణముగా దుష్టుల పాలుసేయ"—అని యామీఁదదుఃఖముతో కొంత మాటాడ లేకపోయెను.

ఆపురుషున కావాక్యములవలన దుఃఖము తలముసుకలయ్యెను;కంఠము గద్గదిత మయ్యెను. కన్నులు బాష్పపూరితములయ్యెను. తనవంటిమహావీరునిదారసుత లట్టి కష్టములొందుచుండుట కతఁడు మిక్కిలి నొచ్చుకొనెను. కొంచెము ధైర్యము వహించి, "సుందరీ ! నీవచనములు సత్యములు. నామహాపరాక్రమమును, నన్నును, నమ్ముకొనియున్న మిమ్ము సుఖింపఁ జేయలేమికి, విచారించుచున్నాను. మిమ్ము వెంటఁ బెట్టుకొని బయలుదేఱినచో నాపదలు చుట్టుముట్టక మానవు. నేను రాజభటులకుఁ జిక్కినచో నిఁక బ్రదుకుట కష్టము. విచారింపక ధైర్య మవలంబించి కొంచెముకాల ముండుఁడు. మిమ్మవలీల నేను నిరపాయముగా నీస్థలమునుండి కొనిపోవు నుపాయ మాలోచించెదను. కొలఁదికాలములోనే మీకష్టములు గడతేఱునని నమ్ముఁడు," అని పలికెను.

శాంత వివేకవంతురాలు; భర్తవచనములు యథార్థములని యెఱుఁగును. వెంటనే తత్స్థానమునుండి తప్పింపుమని నిర్బంధింపలేదు. మాటిమాటికిఁ బొడము దుఃఖము నడంచుకొని, "హృదయేశ్వరా! చక్రవర్తి వర్తనమును, శాసనము నెఱుఁగుదును. ఇప్పుడే మీతోఁ గొనిపోవలెనని కోరను. అచిరకాలములోనే మాకీచెఱ వదలింప యత్నింపుఁడు. నాకంతములో జీవమున్నంత కాలమును నాముద్దులపట్టి కెట్టి యపాయమును గల్గనేరదు. చెట్టంత కొడుకును, ముద్దుల మాటగట్టు కోడలిని నట్టేటిపాలు గావించుకొన్న దురదృష్టవంతురాలను. ఇప్పుడీ యొక్క పిల్లను నోటఁ బడవేసికొని రాకాసివలె నెట్లు జీవింపఁ గల్గుదును?" అని యామె కన్నీరు కాలువగట్ట నేడువనారంభించెను. ఆమాటలవలన నాపురుషుని హృదయము చెదరిపోయెను. వెనుక గతించిన సంతతి తలంపునకు వచ్చి దుఃఖసముద్రమున నతని నడుగంట ముంచెను. దుఃఖాతిశయమున నతఁడు నిశ్చేష్టితుఁడయ్యెను. కొంతసేపట్లుండి తెలివితెచ్చుకొని దుఃఖమును ద్రోసిపుచ్చి భార్యనోదార్చి, ప్రేయసీ! ఇఁకఁ బూర్వసంగతులను మఱవుము. వానిఁ దలఁచుకొన్న డెందము చిందఱవందఱ లగును. గతమును గూర్చి యిప్పుడు విచారించుట నిష్ప్రయోజనము. ఎట్లో ధైర్యమవలంబించియుండుము. అచిరకాలములోనే మిమ్మీస్థలమునుండి కొనిపోదును. విచారము విడువుము. జాగరూకురాలవై యుండుము," అని బోధించి లేచెను.

శాంత యిఁక నేమియుఁ జెప్పలేక పోయెను. ప్రాణనాథుని గౌఁగిలించుకొని యతని వక్షస్థలమునఁ జిబుకము నాని

తన నయనమధుకరముల నాతని ముఖపద్మమునఁ బ్రసరింపఁ జేసి, "నాథా! మిమ్మువిడిచి యుండుట మాకొకక్షణ మొక యుగముగాఁ దోఁచుచున్నది. మీవియోగము క్రమక్రమముగాఁ బెరిఁగి కొండవలె దుర్భరమై చూపట్టుచున్నది. అతి కష్టముతో మోయుచున్నాను. ఆబరువు దింపి శీఘ్రకాలములో నన్ను సుఖవంతురాలినిగాఁ జేయుము. లేనిచో నడుగంటవలసి వచ్చును," అని సబాష్పనయనయై పలికెను.

"ప్రియురాలా! వియోగదుఃఖభారమును నీవలె మోయుచున్న నాకింతనఱకుఁ జెప్ప నవసరము లేదు," అని యామెను సంతసింపఁజేసి యతఁడు లోనికిఁ బోయెను. అతనిముద్దు కుమారి సుఖనిద్ర సల్పుచుండెను. మొదట నామెను మేల్కొల్పవలెనని యతఁడు తలంచెను గాని యట్లయిన నాఁటికిఁ బయనము సాగుట కష్టమని యంతరాత్మ బోధింపఁజొచ్చెను. పొంగి పొరలి వచ్చుచున్న వాత్సల్యరసమును బంధించి యామెను దీవించి శాంతతోఁ జెప్పి యతఁడు కుటీరము వెలువడెను. శాంతయు యతనిఁ గొంతదూరము వెంబడించి మరలి తనకుటీరమును బ్రవేశించెను.

# దిలారామ

## 4-వ యధ్యాయము

### —పద్మావతి—

శ్లో॥ "సరసిజమనువిద్ధం శైవలేనాపిరమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం.

— మహాకవి కాళిదాస

అప్పటికి రాత్రి యామమాత్ర ముండెను. శాంత తనప్రియునంపి శయ్యాతలమును జేరి నిద్రింపవలెనని యత్నించెను, గాని నిద్రరాలేదు చిత్తము మాటి మాటికి మనోహరుని పైకే పోవుచుండెను. దానికి నిలుకడలేదు. విశ్రాంతిని కోరలేదు. మనస్సు తాదృశస్థితిలోనుండ నెట్లు నిద్రపట్టును? అయినను శయనించి యామె జరిగిన చర్యను దలపోయ సాగెను. తనప్రియుని యాగమన సంభాషణాదులు స్వప్న వృత్తాంతములుగాఁ గన్పట్టుచుండెను. అట్టి స్వల్పకాలసంతోష మైనను దనకు సమకూర్చినందుల కరవిందాక్షుని కామె వందనము లర్పించెను. ఇట్లు శాంత నిర్నిద్రయై నిశావశేష మతికష్టమునఁ గడపెను. ఆమె ప్రభాతమున మేల్కని యెప్పటి విధమున గృహకృత్యము లొనర్చుకొనుచుండఁగా కొంతసేపటి కామె కుమారిక మేల్కనెను. ఆమెకీ సమాచార మేమియుఁ దెలియలేదు. శాంతయు నామె కది తెలుపలేదు. జనకాగమనముఁ దెల్పి

నచోఁ జూడనియందుల కాపిల్ల యుల్లమునఁ దల్లడిల్లునని శాంత యెఱుంగును. తనకుమారికి విచారము గలుగకుండఁ జేయుటయే పనిగా నెంచుకొను శాంత యెఱింగియు నీవృత్తాంత మేల తెలుపును? శాంతకుఁ గూఁతురామె ప్రాణము. ఇఁక నామె యెంత ప్రేమాస్పదురాలగునో చెప్పనేల? ఎట్టి దుర్దశలందైనను దనయాలలామ కావంతయు లోపము రానీక, శాంత తన శేముషీబలంబునఁ గాపాడుచుండెను. తాము చేయుచున్న యజ్ఞాతవాసమగుటచేఁ గుమారి నిల్లుగదలనీయక సర్వకాలములందును గ్రంథములు చదివించుచుండెను; పలువిధముల నీతులు నేర్పుచుండెను. శాంతకుఁగాని కుమారికిఁగాని వృథా ప్రసంగములఁ గాలముపుచ్చుమూఢస్త్రీల సహవాస మెప్పుడును సంభవింపలేదు. సంభవించినను వారిచిత్తము లంగీకరింపవని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. అందుచే వారికి విద్యాప్రసంగము దక్క వేఱొకచింత లేదు. వారికా యజ్ఞాతవాసమున నదియే సుఖకాలక్షేపమునకు ముఖ్యసాధనమయ్యెను. బాలకులకుఁగాని బాలికలకుఁగాని దుష్టసహవాసంబున దుష్ప్రవర్తనము గల్గుట చిన్నతనమందే. అట్టి చిన్నతనమంతయు సుగుణవతియు విద్యావతియునగు తల్లితోనే గడుపుటచేఁ గుమారికకు దుర్గుణములు పట్టుపడ నవకాశము లేకపోయెను. కావుననామె యల్పవయస్కయయ్యును, సత్ప్రవర్తనమందును, విద్యాబుద్ధులందును దల్లికిఁదులఁదూఁగుచుండెను. ఆమె ప్రాయము పదునాఱు వత్సరముల మించియుండదు. కాని కొంచెము పొడవరియగుటఁ జూచినవారొకటి రెండువత్సరము లధికముగానుండు

నని భావింపక మానరు. ఆమె పేరు పద్మావతి. స్త్రీలు విద్యా లగుటయే కష్టము; చదువుకొన్నను బుద్ధివిశేషముండుట సున్న. విద్యాబుద్ధులున్నను సుగుణంబు లలవడుట దుర్లభము; విద్యాబుద్ధి సుగుణములున్నను సౌందర్యము శశవిషాణ ప్రాయ మగును. పద్మావతికిఁ దల్లి సహవాసమువలన విద్యాబుద్ధి సుగుణ ములు సులభముగా లభించెను; సౌందర్యము సహజగుణమై యుండెను. కృత్రిమమనియు, సహజమనియు సౌందర్యము రెండువిధములు. అందు మొదటిది వస్త్రాలంకారాదులవలనఁ గల్గునది; రెండవది పుట్టుకతోనే యవయవముల నంటివచ్చునది. పద్మావతి సౌందర్యము సహజమే కాని కృత్రిమము కాదు. ఆమె యవయవములు సూక్ష్మములై సుందరములై కోమలములై యుండెను. విశాలచంచలనేత్రములును, మృదులములై దీర్ఘ ములై సాంద్రములై చమరీవాలముల నీసడించు శిరోజములును, నామె సౌందర్యమునకు వన్నె పెట్టుచుండెను. ఆమె కంఠధ్వని మృదుమధురమై కోకిలాలాపమువలె నాకర్షణ శక్తిగలదై యుం డెను. శరీరచ్ఛాయ పదాఱువన్నె బంగారున కెనవచ్చుచుండెను. యౌవనమంకురించి సర్వాంగములందును లావణ్యరసమును దొలకులాడించుచుండెను. ఆమె దాల్చినవి ముతుకగుడ్డలు; ఆవస్త్రస్పర్శమువలనఁ దదీయ కోమలశరీరము కందునని చూచిన వారూహింపక పోరు. ఇట్టి కుమారికారత్నమును గన్నుం లారఁగాంచు తల్లిదండ్రుల కెంత యానందమో యెంత సుఖమో! ఆనంద మన్న వారిదే యానందము; సుఖమనిన వారిదే సుఖము; భాగ్యమన్న వారిదే భాగ్యము! కాని శాంత కానంద

మేమియు లభింపక విచారమే పొంగి పొరలివచ్చుచుండెను. ఆవిచారము మాత్సర్యముచేతనా? కాదు కాదు; సద్గుణవంతు రాలగు శాంతస్వాంత పుట్టిదుర్గుణమున కవకాశమీయదు. ఆమె ప్రాణభర్త నెడఁబాసి, బంధువులకు దూరమై, యసహాయురాలయి, నిజవైభవము గప్పిపుచ్చి, యజ్ఞాతవాసము చేయుచుండెను. ఇట్లుండ నసామాన్యసౌందర్య విభాసమానయగు తన కూఁతు నున్నతవంశసంభూతురాలినిగాఁ బరులు దలంపక మానుదురా? తలంచి తమ వృత్తాంతము తెలిసికొనక విడుతురా! తెలిసికొని తన కన్యారత్నమును సంపాదింపఁ బాటుపడకుందురా? పాటుపడియు విఫలప్రయత్నులయిన దుష్టుల సహాయురాండ్రయిన తమ్ము నాపదలపాలుచేయక వదలుదురా? ఇదియే శాంతకుఁ గల్గుచున్న చింత. ఆశాంత కమూల్యాలంకారములు లేక పోలేదు; మనోహరవస్త్రములు లేక పోలేదు. తాను వానిఁదాల్చినచోఁ దమయున్నతస్థితి పరులకుఁ దెలియునేమోయని యామె భయపడుచుండెను. కావుననే మలినవస్త్రము దాల్చి నిరలంకారయై సాధారణ స్త్రీవలెఁ గానవచ్చుచుండెను. తన కుమారికనుగూడ నట్లే దాఁచవలెనని యామె తలంపు. అందుచే నామెకొక యలంకారమైన నిడలేదు; శుభ్రవస్త్రమును ధరింపనీలేదు. కేశపాశంబు నొకప్పుడైనను సంస్కరింపలేదు. సామాన్యముగా యువజనులుగాని యువతులుగాని చక్కఁగా నలంకరించుకొని సౌందర్యముఁగలవారని జనుల మెప్పును గొన నువ్విళ్లూరుచుందురు. కాని పద్మావతి కాతలంపు లేదు. ఆమె తమదుర్దశ యెఱుంగును. తనజనని యభిప్రాయము

నెఱుంగును. ఇఁక నేవిధమున నలంకరించుకొనఁ గుతూహల ముండును? దానును దల్లివలె మలినవస్త్రధారిణియై వర్తించు చుండెను. అయినను వారి మనోరథము సఫలము కాలేదు. మలిన వసనములను దాల్చినను, సంస్కారము లేమి ముంగురులు చెదరి ఫాలభాగమును గప్పుచున్నను, భూషణములు దాల్చి క్రొత్తయందము తెచ్చుకొనక పోయినను, నవయౌవనముచే నినుమడించిన పద్మావతి సహజసౌందర్యవిలాసములు ప్రసరించుచుండఁగా వారివాంఛిత మెట్లు నెఱవేఱును? సహజ సౌందర్యభాసురమగు వస్తువునకు మలినవస్తు సంపర్క మొక లోపము తేఁగల్గునా? శైవాలముచే బద్ధమైనను పద్మము కాంతి హీనమగునా? కస్తూరిని గప్పిపుచ్చినను దాని నెత్తావులు ప్రసరించి తదీయస్థితిని లోకులకుఁ దెలుపక మానునా ? మొగలి పూవు కంటకావృతములగు పత్రముల నడుమనున్నను బరిమళములు వ్యాపించి తదీయస్థితిని వెల్లడి చేయక విడుచునా? అట్లే పద్మావతి యెంతదాఁగినను, శాంత యెంత దాఁచుచున్నను,దదీయ సహజసౌందర్యవిలాసములు నిరంకుశముగా వెలువడి యామె యున్నతస్థితిని లోకులకుఁ దెలుపుచునే యుండెను. అందుచే దుష్టమ్లేచ్ఛభూయిష్ఠమగు నాకాలమునఁ దమకెట్టి యిక్కట్టు వచ్చునో యని భయపడుచుఁ గుమారిని గంటకుల కంటఁబడకుండఁ గాపాడుచు శాంతఁ గాలము పుచ్చుచుండెను.

# దిలారామ

## 5- వయధ్యాయము

### రోగచికిత్స

గీ. "తమ్ముఁ గనిపెంచు, మిగులహి-తమ్ముఁ గూర్చు
కడుపునిండగ మేపుఁబి-ట్టేశుమబాపు,
తల్లికంటెను బరసై వ-తమ్ము లేదు
తల్లిసేవించువాఁడెగా- ధన్యతముఁడు."

ఆపదలు పక్షులవంటివి. గుంపుగా నుండి వర్తించుట పక్షులస్వభావము. తమగుంపులో నొకటి భూమికి దిగినఁ దక్కిన వన్నియును దిగును; ఒకటి గగనభాగమున కెగసినఁ దక్కిన వన్నియు నట్లేచేయును. ఆపద లదేవిధమున నొకటి యొక్కనిఁ జుట్టుముట్టినఁ దక్కిన వన్నియు వరుసగా వచ్చి వానినే చుట్టుముట్టును. ఒకటి వానిని విడిచి చనినఁ దక్కిన వట్లే చేయును. గాయమున్న కాలికే దెబ్బతగిలినవిధమున నాసన్నులైనవారికే యాపదలు సంభవించుచుండును. ఇది వానికి నైజము. ప్రస్తుతము భర్తను బంధువులను నెడఁబాసి దుస్సహమగు నజ్ఞాతవాసరూపకష్ట మనుభవించుచున్న శాంతకుఁ గొలఁది దినముల నుండి విషమజ్వర మొకటి యావహించి బాధింపఁజొచ్చెను. మొదటఁ బద్మావతియుఁ దల్లియు నది సామాన్యజ్వరమని లక్ష్యపెట్టలేదు. నాల్గుదినములు గడచినవి, అది హెచ్చుటయే కాని తగ్గలేదు. పద్మావతి గృహకృత్యములు నెఱవేర్చుచుఁ దల్లికిఁ దగినయుపచారము లొనర్చుచుండెను; వేళతప్పకుండ భోజన

పదార్థములు సిద్ధముచేసి పెట్టుచుండెను. కాని శాంత కవి రుచింపలేదు. అయినను దాను దినకున్నఁ గుమారి తినదేమోయని కొంచెము తిన్నట్లు నటించి యామె లేచిపోవుచుండెను. పద్మావతియు విచారాతిశయమునఁ దనకన్నముపై నిష్టము లేకున్నను దల్లి విచారాక్రాంతస్వాంతురాలగు నేమోయని భయపడి యన్నము తిన్నట్లు నటించి లేచిపోవుచుండెను. ఇట్లు వారము దినములు కావచ్చెను. జ్వరము వర్ధిల్లుచుండెనే కాని తగ్గలేదు. జ్వరాతిశయముచేతను నన్నపానాదులు సరిగా లేకపోవుట చేతను, శాంత క్రమక్రమముగాఁ గృశించి మంచము పట్టి లేచుటకైనను సమర్థురాలు కాకుండెను. అందువలనఁ బద్మావతి విచారమతిశయించెను. నిద్రాహారములు సరిగా లేకపోవుటచే నీమెయు, గ్రమక్రమముగాఁ గృశింపఁ జొచ్చెను. ఇదివఱకామె యిట్టిదుర్దశ యనుభవింపలేదు. ఆసమయమునఁ దల్లిదక్క వేఱొక గతి కనుపింపలేదు. ఇరుగుపొరుగులనైన నావిపత్కాలమునఁ దోడుచూపువారు లేరైరి. తోడుమాటకేమి? మాటాడువారైనను లేరు. తల్లి జ్వరాతిశయమున నొడలెఱుఁగక పండుకొని యుండెను. ఇఁక నామెకుఁ గాలక్షేపమెట్లు? ఆమె గ్రంథమొకటిఁ దీసికొని చదువనారంభించెను గాని యేమియు బోధపడలేదు. మానసము చింతామగ్నమై పలువిధములఁ బోవుచుండ గ్రంథపఠనమెట్లు? ఇట్టటు నడయాడ మొదలిడెను. అదియు విసుగుగాఁ దోఁచెను. ఇల్లు దాఁటి పైకిఁ బోవఁ దల్లియనుమతి లేదు. ఇఁక నేమిచేయును? చెక్కిటఁ జేయిచేర్చి యామె తల్లిమంచముచెంత గూర్చుండెను. పాఠకులారా!

ఒక నావికుఁడు తననౌక నధిరోహించి సముద్రయానము చేయుచుండెను. నావ సాగరమధ్యమును జేరినది. ఉభయ కూలంబులును గంటికిఁ గానరాలేదు. దైవికముగా ఝంఝా మారుతము భయంకరముగా వీవఁజొచ్చెను. వెంటనే కొండల వంటియుత్తుంగతరంగము లెగసెను. ఆమహాభయంబునఁ బడిన కొట్టుకొనిపోవుచుండెను. తనయావచ్ఛక్తిని వినియోగించి వాఁడు దాని నిలుపజూచెను. ప్రయోజనము లేకపోయెను. ఎటుచూచినను నీటివెల్లి దప్ప నేమియుఁ గనఁబడలేదు. ఇక వాఁడేమిచేయును? ఒక్కచోఁ గూర్చుండి దుఃఖించును గదా? పద్మావతిస్థితి యానావికునిస్థితి కెనవచ్చుచుండెను. ఆమె యజ్ఞాతవాసమునునాపదను దల్లిసాయమునఁ దరించుచుండెను. ఇప్పుడు దైవవశమున మహారోగము విజృంభించి యా శాంతను గాలప్రవాహమునఁ దఱిమివేయుచుండెను. పద్మావతి చేయునుపచారములు నిరర్థకము లగుచుండెను; రోగము హెచ్చుచుండెను. ఎటు చూచిన నెవ్వరును లేరు. పాపము! పద్మావతి యసహాయ, అల్పవయస్క; ఇట్టికష్టము లిదివఱ కనుభవింపలేదు. తల్లిని వీక్షించుచు నట్లే కూర్చుండెను. ఆమెకు తన దుస్థితి తలంపునకు వచ్చెను. డెందమాందోళన మందుచుండెను? కనుగొలుకులనుండి జొటజొట బాష్ప బిందువులు స్రవించుచుండెను. పద్మావతి హృదయసముద్రమున దుఃఖరసప్రవాహములు వెడలి వేలల నతిక్రమించి పొంగి పొరల నారంభించెను. వాని నరికట్టుటకుఁ బద్మావతి యత్నించెను. గాని లొంగలేదు; ఆమె నడుగంటుముంచుట కవి సిద్ధముగా నుండెను. ఇఁక వాని నిర్బంధింప నెవ్వరు సమర్థులు?

అగస్త్యమహర్షి యుండినఁ బుడిసిటం బట్టి యొక్కపెట్టునఁ ద్రాగునేమో కాని యతఁడిప్పుడెట్లు లభించును? అగస్త్యుఁడు! పద్మావతికప్పుడు జ్ఞానమిత్రుఁడు ప్రసన్నుఁడై యాదుఃఖప్రవాహమును మునుముట్టఁ ద్రావివైచెను. చిన్నప్పటినుండియు జ్ఞానమిత్రునిఁ గాపాడి విద్యాసాహాయ్యమునఁ బెంచి కృచేసి నందులకామె కీవిపత్కాలమున నతఁడు తోడ్పడి "మిత్రమావది జానీయాత్త" నెడిలోకోక్తిని స్థాపించెను. ఇప్పుడు పద్మావతి కొంచెము స్వస్థతచెందెను. కాని కన్నులనుండి నీరింకను గారుచునే యుండెను. ఇంతలో శాంత కనువిచ్చి చూచెను. హిమజలబిందుపూరితమై కొంతిదక్కిన యరవిందమువలె నున్న కుమారివదనము గనఁబడెను. శాంతకుఁ దొందరపాటు హెచ్చయ్యెను.

"కుమారీ! ఏడ్చుచున్నావేమి?" అని యామె యడిగెను. మొగము వంచుకొని, "లేదు" అని పద్మావతి బదులు చెప్పెను.

"నీకన్నులందా బాష్ప మెందుకున్నది?"

"కన్నులు నాయానతి మీఱుచున్నవి, ఏమిచేయుదును?"

ఇఁక శాంత దానికిఁ బ్రత్యుత్తర మీయలేక యేమేమో తలపోసికొనుచుండెను.

అప్పుడు పద్మావతి తల్లికిట్లనియె:—

"జననీ! నాదుఃఖమునకు హేతు వడుగుచున్నావా? ఎట్టి విపమదశలందైనను నాకు లోపము గల్గనీయక యఱచేతిలోఁ బెట్టుకొని పెంచి పెద్దచేసిన నీవిప్పుడు నన్ను వదలి కాలప్రవాహమునఁ గొట్టుకొని పోవుచుండఁ జూచి యెట్లు

సహింతును ? నీజ్వరబాధను జూచి యెట్లోర్తును ? నాకే యిట్టివిపద్దశ సంభవించిన నీవూరకుందువా ? అక్కటా ! నేను గతినాత్మురాలను; ప్రత్యుపకారము చేయలేని యనాథను ; మాతృఋణము తీర్పని కృతఘ్నురాలను ; పరమ పాపాత్మురాలను ; కడుపారఁగన్నతల్లి రోగార్తయై నిలవిల తన్నుకొనుచుండ నందులకుఁ దగిన మందీయక కన్నులారఁ జూచి యూరకున్న నిర్భాగ్యురాలను, ఛీ, ఛీ, ఈ నాజన్మ మెందుకు" అని వెక్కి వెక్కి యేడువసాగెను.

శాంత కుమారిసంతాపమును దెలిసికొని, యిఁకఁ దాను ధైర్యము నెలకొల్పిననగాని కార్యము లేదనుకొని "కుమారీ ! నీవు వట్టి వెఱ్ఱిదానవు. కాల మనుకూలింపనియపుడు కష్టములు వచ్చును. నాపూర్వకర్మఫల మిప్పుడు రోగరూపమై నన్నావరించినది. తత్ఫలము నే ననుభవింపనిచో మఱెవ్వ రనుభవింతురు ? నాపూర్వకర్మ మంతమందినప్పుడే నారోగ మంత మందవలెనుగాని మందులుపోయుటవలనఁ గాదు. మంచి దినములు రానియపుడు నీవుకాదు, దేవవైద్యులు వచ్చి మందిచ్చినను బ్రయోజనముండదు. నిన్నటికంటె నేడు కొంత సుఖముగానున్నది. దీనివలన మన కనుకూలదినములు వచ్చు చున్నట్లు తోఁచుచున్నది. ఇఁక రెండు మూఁడు పూటలలో నా దేహ మారోగ్యవంత మగును. నాకేమియు మందువద్దు. నీవుచేసెడి యుపచారములే వేయిమందులపెట్టు" అని పలికి కుమారిని దగ్గఱగాఁ దీసికొని కన్నీరుదుడిచి యోదార్చెను.

పాపము ! పద్మావతి తల్లివచనములు సత్యములని భావించెను. ధైర్యమువలంబించి మఱి మూఁడు దినములు గడ

ను. రోగము వర్షకాలమేఘమువలెఁ గ్రమ్ముచుండెను గాని శాంతింపలేదు. తన తల్లి తనకు ధైర్యము నెలకొల్పుటకే యట్లు పలికినదికాని శరీరస్వాస్థ్యమును బట్టి కాదని పద్మావతి యప్పుడు దెలిసికొని తగిన మందియ్యనిచోఁ దల్లి జీవింపదని నిశ్చయించెను; ఎన్ని బన్నములు పడవలసినను బడి మందుదెచ్చి తల్లిని జీవింపఁజేయుట విహితకృత్యమని యొంచుకొనెను. తల్లికిఁ దెలిపినచోఁ దన్నుఁబోనీదని యెఱుంగును. ఆమె నిద్రించినప్పుడు సత్వరముగాఁ బోయి యౌషధము తెచ్చుట యుచితమని సిద్ధాంతము చేసికొనెను. ఒక నాఁడు తల్లి నిద్రించుచుండఁగా నదేసమయమని యామె కొంచెము ద్రవ్యము దీసికొని, తలుపు మెల్లగా బంధించి, వాకిట నిలువఁబడి మేలిముసుఁగు సవరించుకొను నంతలో వెనుకటి జ్ఞానమిత్రుఁ డభిముఖుఁడై యిట్లు ప్రసంగించెను.

"అక్కా! ఎక్కడకేగుచున్నావు?"

"తల్లి రోగము నివారింపఁ జేయఁ జాలిన మందుఁ దెచ్చుటకు—"

"ఇది నీకుఁ దగనిపని.

"కాదు; నాకిది విహితకృత్యము. కష్టదినములలోఁ జుట్టములేతోడు సూపకున్న నిఁక దిక్కేది!"

"సత్యమే; కాని యది నీవిషయమై పనికిరాదు?"

"కారణమేమి"

"ఇప్పటి యాపదలకంటె గొప్ప యాపద రానుండుటచే?"

"ఆపద రాఁబోవునని విహితకృత్యమును విడుచుట సముచితమా?"

"ఇంతకంటె గొప్పయాపదకుఁ గారణ మగుచున్నప్పుడు విహితకృత్యము గూడ వదలవలసినదే."

"ఇంతకంటె గొప్పయాపద లేదనియే నా యభిప్రాయము "నమాతుః పరదైవతమ్మ"ని బుధులు పల్కుదు రెఱుంగవా!"

ఇఁక దానికిఁ బ్రత్యుత్తరమీ లేక జ్ఞానమిత్రుఁ డంతర్ధానము చెందెను. పద్మావతికి మాతృభక్తి హృదయమున నెలకొని తక్కిన యాలోచనములను ద్రోసిపుచ్చెను. ఆమె కవాటము బంధించి వెంటనే యిల్లువెడలి యొక శూద్రాంగనకు ధనాశ చూపి తన్ను వైద్యశాలకుఁ గొనిపొమ్మనియెను. అందులకది సమ్మతించి ముందు నడువ నారంభించెను; పద్మావతి దాని వెంబడించెను.

అప్పటికెంతో ప్రొద్దులేదు. సూర్యతాపము పూర్తిగాఁ జల్లారెను. సాయంతన వాయువులు యమునానదీతరంగ డోలికల దూఁగి మధురాపురవీథులందు విహరించుచుండెను. కార్యనిర్వహణార్థమును, విహారార్థమును వీథులందుఁ బ్రజలు క్రిక్కిఱిసి సంచరించుచుండిరి.

పద్మావతి మేల్ముసుంగుతో వైద్యశాలను సమీపించి వెంటనే వైద్యశాలాధికారిని దర్శించి తానుదెచ్చిన రొక్క మర్పించెను. ఆవైద్యుఁ డధికానందము చెంది రోగలక్షణములను శ్రద్ధతో విని తగిన మందిచ్చెను. పద్మావతి దానిఁ దీసికొని సత్వరముగా నింటికి మరలి వచ్చెను. తల్లియింకను మేల్కాన

లేదు. ఆ యువతి యందులకు సంతసించి యెప్పటియట్లు గృహ కృత్యముల నెఱవేర్చుకొనుచుండెను.

అమాయికురాలగు పద్మావతి తాను మేల్ముసుఁగువైచికొని పోవుటచేఁ దన్నెవ్వరును జూడలేదనియే తలంచుకొనెను. కాని రాజవీథిఁ బడిపోవునపు డామెను బ్రజ లెగాదిగా చూడకపోలేదు; చూచి గుసగుస లాడకపోలేదు. కాని యామె కది తెలియదు.

కుమారి దెచ్చిన మందును జూచి, "రాజవీథికి నీవేల పోయింతివి?" అని శాంత పద్మావతిని గోపించెను. ఆమె ప్రత్తర మీాలేదు. నాల్గుదినములలో రోగము తఱిగిపోయెను.

# దిలారామ

## 6-వ యధ్యాయము

### ఏకీ లేమి వ్రాసెను

శ్లో. "ఆకారేణైవ చతురా స్తర్కయంతి పరేంగితమ్
గర్భస్థం కేతకీపుష్పమామోదేనైవ షట్పదాః."

మధురానగరమునకుఁ బశ్చిమపార్శ్వమున మనోహరములగు పుష్పవనములును వానినడుమ నున్నతములగు సౌధములును గలవు. ధనికులగు మహమ్మదీయు లందు నివసించుచుందురు. ఆసౌధావళిలో నెల్లఁ దత్పురాధినేతది మిక్కిలి శోభాస్పదమై యుండెను. అది యాపురమును బాలించిన హామీద్ఖానుచే నిర్మింపఁబడినది. ఆఖాను షాజహానుదయకుఁ బాత్రుఁడై చాలినంత ద్రవ్యమునే కాక గౌరవముఁగూడ నార్జించెను. సద్గుణవంతుఁ డగుటచేఁ దత్పౌరు లతనిని మిక్కిలి ప్రేమించియుండిరి. ప్రజానురాగముచేతను, రాజగౌరవముచేతను, ధనసంపదలచేతను దులదూఁగుచు నాఖాను రెండవ చక్రవర్తివలె నాపురమును సుఖముగాఁ బాలించుచుండెను.

ఆఖానున కొక కుమారుఁడు గలఁడు. ఆకుమారుని తర్వాత నలువురు పిల్లలు పుట్టి పురుటింటిలోనే గతించిరి. కొంతకాలమున కతఁ డెక్కడనుండియో కాని యైదేండ్లయాఁడు పిల్లను గొనివచ్చి భార్య కిచ్చెను. ఆయువతి యాపిల్లసౌందర్యమునుజూచి యచ్చెరువొంది కడుపునఁబుట్టినబిడ్డకంటె నెక్కుడుగాఁ జూచి పెంచుచుండెను. ఆపిల్లయు నేవిధమైనరోగములను

కొందక బాలచంద్రరేఖవలె దినదిన ప్రవర్ధమానయై జననీ జనకులకే కాక యాపురజనులకుఁ గూడ నేత్రపర్వము లొనర్చుచు క్రమక్రమముగా తల్లిదండ్రుల ప్రేమమును జూఱగొనెను. ఆదంపతులామెను గన్నకొడుకుకంటె నెక్కుడుగాఁ జూడసాగిరి.

హామిద్ఖాను దన సంపదలో నర్ధభాగ మాపిల్లకు ముట్టఁజెప్పి, యామె సంపదజోలి కెన్నఁడును బోఁగూడదని కొడుకును శాసించెను. ఆతఁడును దండ్రికి మాఱాడక యందుల కంగీకరించెను. అనంతరము కొలఁది కాలములోనే యాఖాను కాలధర్మమందెను. తద్వియోగదుఃఖముచే నాతనిభార్యగూడ మరణమందెను. ఆపిల్ల జననీజనకుల వియోగదుఃఖముగఁ గొంత కాలము సంతప్తయయ్యెనుగాని క్రమముగాఁ బెంపుడు తల్లుల యుపచారములచే నాదుఃఖమును మఱచి, తండ్రి తనకుఁ బ్రత్యేకముగా కట్టించియిచ్చిన సౌధమున నివసించుచుండెను.

ఆమె యొకనాఁడొంటిగాఁ దనగదియందుఁ గూర్చుండి యేమేమో యోజించుకొనుచుండెను. ఆసమయమున వేఱొక యువతీమణి యామందిరమును బ్రవేశించెను. ఆమెను జూచి "వదినే, రమ్ము. కూర్చుండుము" అని యామె యుచితమర్యాద చేసెను.

ఆమె కూర్చుండి "మఱఁదలా! ఫకీరేమి వ్రాసియిచ్చెనో నీవు చెప్పవైతివి; నన్నుఁ జూడనీవైతివి. నీమనోహరుఁడగు రహీము సద్గుణముల నపహరింపుము లెమ్ము" అని మేలమాడెను.

"వదినే, అతని కట్టిగుణము లుండినగదా యపహరింతురు? పాపము! నీకాశాభంగము గల్గినందులకు విచారించుచున్నాను," అని యామె మందహాసపూర్వకముగాఁ బలికెను.

ఈయువతు లిర్వురును జోహారా దిలారామ లని పాఠకులు గ్రహించియుందురు. రహీము దిలారామను మోహించియుండెను. వాఁడు జోహారా దయను సంపాదించి తనకు దిలారామ నెట్లయినను సమకూర్పవలెనని ప్రార్థించెను. ఆమె వాని మొఱాలకించి దిలారామకు రహీమునం దనురాగము పుట్టింపఁ దఱుచుగా నచ్చటికి వచ్చుచుండెను. చతురురాలగు దిలారామ యామెహృదయమును దెలిసికొని యామెకుఁ దగులునట్లు సంభాషించెను.

ఆపలుకులకు జోహారా కొంచెము చిన్నవోయి, "మఱఁదలా, కలిగిన నీకాశాభంగము కలుగవలెను, గాని నాకెందులకుఁ గల్గును?" అని మాఱుచెప్పెను.

"అయ్యో! కాదా? రహీము సద్గుణవంతుఁడని నీవు కొండంతాశ పెట్టుకొన్నావు. అట్టిగుణములు లేకపోవుటచే నీకే యాశాభంగము, నాకట్టియాశయును లేదు; భంగమును లేదు," అని పలికి దిలారామ తనపెట్టెలోని యుత్తరమును దీసి యామె కిచ్చెను.

జోహారా యిట్లు చదివెను.

"ఓయువతీ! రహీము వీరుఁడే; శూరుఁడే. కాని వాని శక్తియంతయు దొంగతనమందును, దారులుగట్టి బాటసారులఁ దన్ని ధన మపహరించుటయందును మాత్రమే వినియోగింపఁ బడుచున్నది. నిన్న నేను ఢిల్లీనుండి వచ్చుచుండ నీ సమీపా

రణ్యమున వీఁడును వీనిసహాయులును నొకపాంథుని బాధించు చుండిరి. వాఁడు మొఱపెట్టఁజొచ్చెను. అదివిని నేను వడిగా ఖడ్గపాణినై వీనిసహాయులను బాఱఁదోలితిని. అంత నీ రహీము నన్నెదుర్కొనెను. మేమిరువురమును ఘోరముగాఁ బోరితిమి. నాఖడ్గమున కెరగావలసినదే. కాని వీనియదృష్టమున నాదెబ్బ కొంచెము తప్పిపోయినది. అప్పటికిని వాని నడునెత్తిని పెద్దగాయము తగిలినది. ఆగాయము తత్త్వమును దెలిపినచో మీరు నిందింతురని కల్లలాడ నారంభించెను. వీఁడు కల్లలగంప; డాంబికుఁడు. నీవు వీనిని వరించుట కాకి ముక్కునకు దొండ పండు గట్టుటయే. నేను వీని నెఱుఁగుదును, గాని నన్నతఁ డెఱుఁగఁడు. నేనీపురమున నొకకార్యము నెఱవేర్ప నొకదిన ముండవలసి వచ్చెను. పరులెఱుంగకుండఁ బకీరువేషముచే నానిజరూపమును గప్పిపుచ్చితిని. తన భవిష్యత్కాల మెట్లుం డునో చెప్పవలయునని రహీము నన్నుదయము నుండియు నాశ్రయించెను. వీని చరిత్రమిది." అని చదివి బల్లపైఁ బడవై చెను. తోడనే దిలారామ యామె మొగము నిరీక్షించి, "వదినే నేనన్నది సత్యమో యసత్యమో యిప్పుడు దెలిసినదా?" అని పల్కెను.

"ఈపకీరు మాయావి కాని మహిమఁగలవాఁడు కాఁడు. ఇంతేకాక రహీమునకు బద్ధవైరివలెఁ జూపట్టుచున్నాఁడు. శత్రువుల నెవ్వరైనఁ బొగడుదురా? కాన దీనివలన రహీము దుర్గుణుఁడని నిర్ణయింపఁ వలనుపడదు," అని జోహరా పలికెను.

"వదినే, నీవెంచుకొన్న పకీరేకదా? అతని వచనములు నీకేల ప్రమాణములు గావు? అతఁడొకవేళ బూటకపుఁ బకీరై

నను నతని వచనములు యథార్థములు గాకమానవు, అని దిలా రామ ప్రసంగించునంతలో దాసి యెందుకో పిలిచెను. దిలా రామ లోనికేగెను. జోహరా యాలోచన మగ్నురాలై యుం డెను. రహీమప్పుడు మెల్ల మెల్లన వచ్చి కూర్చుండెను. అది చూచి జోహరా ఫకీరిచ్చిన యుత్తరమును రహీమున కంది చ్చెను. అతఁడా వృత్తాంతమెల్ల నవలీల గ్రహించి, తానప్పు డెట్లో కష్టముకోని తన చరిత్రమును నిష్కళంకముగాఁ జేసి కొనఁదలఁచిన దనకార్యము విఫలమగునని నిశ్చయించి యిట్లు చెప్ప నారంభించెను.

"అయ్యో! ఎంతపని జరిగినది? ఆదుష్టుఁ డెంత మాయావి? వానినావేళఁ దుదముట్టింపక వదలినందులకు నాకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేసినాఁడు. చూచితివా? జోహరా! ఆఫకీరు మాయావియగు దుష్టుఁడు. నాలుగు దినముల క్రిందట వాఁడొకరియింటఁ గన్నము ద్రవ్వుచుండ నేనును గొందఱు భటులును వానిని బట్టుకొంటిమి. భటులు వానిని విఱిచికట్టి నాయెదుటికిఁ దెచ్చిరి. వాఁడు నన్ననరాని మాట లాడెను. తోడనే నేను వానిని నాఖడ్గమునకు బలియిచ్చుటకు సిద్ధముగా నుంటిని. అంత వాఁడు బుద్ధితెచ్చుకొని నాపాదములపైఁ బడి హృదయము కరఁగునట్లు విలపించెను. దయార్ద్రహృదయుఁ డనై వానిని విడిచి పుచ్చితిని. చూడు మీయుపకారమునకుఁ బోఁగా నపకార మెదురయ్యెను. వాఁడు నాపైఁ గసిదీర్చు కొనుటకే యీఫకీరువేష మూనినాఁడు. నన్నుఁ జంపుట తప్ప వానికీపురమున వేఱొక కార్యము లేదు," అని గంభీరస్వర ముతోఁ బలికెను.

అది విన్నతోడనే జోహరావదనము వికసించెను. రహీము చెప్పినవి శిలాక్షరములని భావించెను. ఆమె యతని వీక్షించి, "రహీమూ, ఆదుష్టుని నీవానవాలు పట్టలేకపోతివా? మహా మహిమగల పకీరనుకొన్నాను గాని వేసగాఁడని యూహింపలేకపోతిని," అని పలికెను.

"నేనును మోసపోయితిని. కొంచెమైనను దెలిసినది కాదు. తెలిసినచో మీయెదుటనే నాకరవాలము వాని కంఠ రక్తముఁ గ్రోలకుండునా ? సర్వవిధముల దుష్టుఁ డుప కరించినను నపకరించినను దన నీచగుణమును విడువఁడు కదా ? వానిఁ దుదముట్టింపకున్న నాకిఁక నిద్రపట్టదు," అని రహీ మనెను.

"దుష్టుల కుచ్చ నీచము లుండవు. అగ్నిహోత్రము చందమున సర్వమును రూపుమాపఁ దలంతురు. నీవు జాగరూకుఁడవై యుండుము," అని జోహరా హెచ్చరించెను.

"ఇఁక భయములేదు. నాల్గు దినములలో నాదుష్టుని తల యీ తరవారికి గ్రుచ్చి మీకుఁ గన్నుల పండువు లొనర్చెదను. చూడుము నామహిమ" అని రహీము చెప్పు నంతలో దిలారాము వచ్చెను. రహీము వచ్చుట కనిపెట్టి కొంత సేపటినుండి యామె చాటుననుండి వారిసంభాషణము వినుచుండెను. ఆమె మహా బుద్ధిమంతురాలు; రహీము చెప్పిన దానిలో నెంత సత్యమున్నదో యవలీల గ్రహించెను. ఆసంభాషణ యామెకు నవ్వు పుట్టించెను. దాని నడఁచికొని మందహాసవిభాసితవదనారవింద యై వచ్చి, తనయాసన మలంక

రించి, "ఎవనిశిరము కరవాలమున కెరయాట!" అని ప్రశ్నించెను.

"ఫకీరు వేషము దాల్చిన దుష్టుని శిరము," అని జోహారా బదులుచెప్పె, యంతతో నిలువక రహీము చెప్పిన దంతయుఁ బూసగ్రుచ్చిన ట్లామెకుఁ జెప్పి వానిని నిందింప నారంభించెను.

దిలారాము రెప్పవేయక నెఱిఁగనియు ట్లాశ్చర్యముతో వినుచు, "లోకమున నెందఱో దుష్టులుందురు. దానికేమి? కాని పాపమీతని నడితల యెట్లు గాయపడినదో తెలిసినది కాదు," అని మెల్లగాఁ బల్కెను.

రహీము కోరచూపులతో దిలారామసౌందర్యమును గన్నులారఁ జూచి గ్రుక్కిళ్లు మ్రింగుచుండెను. వాఁడేదో యోజించుకొనుచు దిలారామప్రశ్నము వినలేదు. అతఁడేమి ప్రత్యుత్తరమిచ్చునోయని జోహారా యతని వైపుఁ జూచి చూచి యేమియు బదులుచెప్పక పోవుట కనిపెట్టి దిలారాము ప్రశ్నము నతనికిఁ దెల్పి సమాధానము చెప్పుమనెను.

"పోనిమ్మాతని నేల బాధించెదవు? ఆ కారణమును మఱచి పోయె నేమో?" అని దిలారాము పరిహాసముగాఁ బలికెను.

"గుఱ్ఱమునుండి జాఱిపడితినని చెప్పితిని గదా?" అని రహీము వెనుకటి ప్రత్యుత్తరమును జెప్పెను.

"అవును జెప్పితివి. గుఱ్ఱమునుండి పడినప్పుడు నడినెత్తికి దెబ్బ దగులుట యసంభవమని మామఱఁదలు ప్రశ్న వేసినది. దానికి సమాధానము చెప్పుము," అని జోహారా యనెను.

"అయ్యో! పొరబడితిని. రాజకీయ వ్యవహారవ్యగ్ర మనస్కుఁడ నగుటచే నొకదాని కొకటి చెప్పితిని. అదికారణము గాదు. బందిపోటుదొంగలతోఁ బోరుచుండఁగాఁ బ్రమాద వశమున నాకీదెబ్బ తగిలినది. అయినను జయలక్ష్మి నన్నే వరించి నది." అని రహీము సగర్వముగాఁ బలికెను.

"మొన్నటి పకీ రాదొంగల గుంపులోని వాఁడేనా?" అని దిలారాము యడిగెను.

"అవును; వీడంత శూరుఁడు కాఁడు, కాని తక్కిన వారందఱును శూరులే?" అని వాఁడు బదులు చెప్పెను.

"పకీరు కన్నపుదొంగయా! బందిపోటుదొంగయా?" అని దిలారాము ప్రశ్న వేసెను.

రహీము తడఁబడెను. అంతలో వానియదృష్టవశమున నెవ్వరో వానిని బైనుండి పిల్చిరి. అది విని యప్పుడే వచ్చెద నని వాఁడు కదలిపోయెను. అనంతరము జోహరా దిలారాము లేదియో సంభాషించుకొనుచుఁ జల్లగాలికై సౌధోపరితలమున కేగిరి.



# విలారామ

## 7-వ యధ్యాయము

### శాంతను జోరులెత్తుకొని పోవుట

చ. "మదమున దుర్నివార్యులయి మానక క్రూరులు గొంద ఱుర్విలో
నదయత లోనఁ బూని యసహాయుల సాధుల బాధపెట్టుచుం
డుదురయినన్ రమాపతి యనూనకృపామతితోడ నల్ల దు
ర్మదులను ద్రుంప, సజ్జనుల మన్పఁగఁ బన్ను నుపాయమేదియో."

సమయము నిశీథము, గాఢాంధకారబంధురము. నక్షత్ర పంక్తులు బారులు గట్టి గగనయాత్రను సలుపుచుండెను. ఇలకోడి, చిమ్మట మొదలగువాని రుతములు తప్ప మఱేమియు వినరాలేదు. అట్టిసమయమున మథురాపురములో నొకసందునఁబడి నలుగురు దొంగలు పోవుచుండిరి. వారిభుజములపై నొకమంచముండెను. దానిపై నెవ్వరో శయనించియుండిరి. ఆజాడఁజూడఁ గొందఱు తమ శత్రువు నెచ్చటికో కొనిపోవుచున్నట్లు తోఁచుచున్నది. వారు నల్లని వస్త్రముల దాల్చియుండిరి. వారిశరీరములు పసరు పూఁతగల వగుటఁ గాఁబోలును నల్ల జీడిపిక్కల ననుకరించుచుండెను. వారు మెల్లమెల్లగఁ దప్పటడుగు లిడుచు నిశ్శబ్దముగాఁ గొంతదూరము పోయిరి. అప్పుడు వారిలో నొకఁడు, "ఇచ్చట మార్గము పాయలైనది. మన గంతవ్యస్థానమున కేమార్గమునఁ బోవుదము?" అని యడిగెను.

"చుట్టుదారియైనను నదీతీరమునుండియే పోవుదము. మనము వచ్చినదారిని బోయినచో మనరహస్యము వెల్లడి కాక మానదు" అని యింకొకఁడు పలికెను.

ఆపలుకుల కందఱును సమ్మతించిరి. వారు నిరాటంక ముగా యమునాతీరమును సమీపించిరి. ఇఁకఁ గొంచెము గట్టిగా మాటాడుకొన్నను దమ రహస్యము బయల్పడదని వారెఱుంగుదురు. నిశాసమయమున నాస్సైకతమున నెవ్వరుం దురు? అంత వారిలో నొకఁడు "మనమనుకొన్న యువతి యిది యౌనో కాదోయని నాకింకను గొంచె మనుమానము బాధిం చుచున్నది." అని పలికెను.

వాఁడు దొంగల యజమానుఁడు. వాఁడు రెండు పర్యా యములు తన యనుమానమును దెలిపెను. ఒకవేళ నతని సం దేహము నిశ్చయమైనచోఁ దమ ప్రయాసము వ్యర్థ మగుటయే కాక వారు తమయజమానుని దురుక్తులనుగూడఁ బడవలసి వచ్చును. "ఈయిసుమతిన్నెపై మంచమును దింపుఁడు. మంట వేసి యావెలుతురునఁ జూచి సందేహమును దొలఁగించుకొనుట మంచిది. ఇఁక ముందునకుఁ బోకుఁడు. పడవల రేవు సమీపిం చుచున్నది." అని యొకఁ డనెను.

మంచము నచ్చట దింపిరి. చుట్టుపట్లనున్న పుల్లలను బ్రోగు చేసి చెకుముకిరాతివలన నిప్పునుసృజించి మంటఁ జేసిరి. వారి యజమానుఁడా వెలుతురున నామెవదనము చూచి వెలవెల పోయెను. నిట్టూర్పుపుచ్చి, "ఓరీ, మన ప్రయాసమంతయు వ్యర్థ మైనది. తొందరపడి కార్యము చెడిపితిరి. నాకు మొదటి

నుండియు సందేహము బాధించుచునే యున్నది." అని పలికెను.

"పోనిండు. ఇఁక నాలస్యము చేయక దీనినచ్చట యుంచి యాయువతిని గొని వత్తము," అని తక్కిన వారిలో నొకఁడనెను.

వీరి సంభాషణము వలనను యమునానదీ వాత పోతముల తాఁకుడువలనను నాతరుణీమణి మేల్కాని మీఁదికిఁ జూచెను, తమయింటి కప్పు గానరాలేదు. తారావాస విలసితమగు గగనమండలము చూపట్టుచుండెను. క్రిందికిఁ జూచెను; తమయింటి కట్టడపునేల గానరాలేదు. అచ్చెరుపాటుతోఁ బ్రక్కకుఁ జూచెను; ఇంటిగోడలేదు. ఉత్తుంగతరంగమాలాలంకృతయగు యమునానది యుండెను. ఇంకొక ప్రక్కకుఁ జూపు పఱపెను; తన కుమారిక మంచము కనఁబడలేదు. దగ్గఱ తాళ సంకాశాకృతులగు నలుపురు పురుషులు కంటఁబడిరి. తన్నెవ్వరో జోరులు మోసపుచ్చి యెచ్చటికో తీసికొని పోవుచున్నారని యామె గ్రహించెను. పాఠకులారా! ఆసమయమున శాంతచిత్తవృత్తి యెట్లుండునో యెవ్వరు వర్ణింపఁగలరు? సమయ మంధకారబంధురము, తానున్నది పురబాహ్య ప్రదేశము, నిర్జనము. తా నెలుఁగెత్తి కేకవేసినను బరులు వచ్చి రక్షింతురను నమ్మక మావంతయును లేదు; తానబల, ఒక్కర్తుక. వారు బలిష్ఠులగు నలుపురు పురుషులు, పచ్చి దొంగలు, కరుణారసము సుంతేనియు లేని శుష్కహృదయులు. అప్పటి యంధకారమును ద్విగుణముగాఁ జేసి భయముగొల్పు శరీరములవారు, ఆయుధపాణులు, ప్రత్యక్షమైన యమదూతల

లెనుండిరి. అట్లయినను శాంత కొంతవఱకు ధైర్యవంతు రాలయి యుండెను. కాని వారి సంభాషణము చెవులఁబడిన కొలఁది నామెధైర్యమును జిక్కఁబట్టలేక, వారివలనఁ దనకేదో కీడు మూడుట సిద్ధంబని తలపోయఁ జొచ్చెను తోడనే గుండె ఝల్లుమనెను; ఉల్లమున భయశోకములు మల్లడి గొన నారంభించెను; తోడనేశాంత యెలుఁగెత్తి పెద్దపెట్టునవిలపింపఁ జొచ్చెను. "ఓ దీనావనా! ఓద్రౌపదీమానరక్షా! ఓపరమ పురుషా! నన్నురక్షింపవే? రక్షింపవే" యని యొకకేకవేసి పరమేశ్వరుని వేఁడుకొనెను. దుఃఖాతిశయమున మఱి గొంతుక వచ్చినదికాదు. అంత యజమానుని యానతిచే నొకఁడు వచ్చి యామె చేతులువెనుకకు విఱిచి కట్టఁగా మఱొకఁడు వచ్చి నోటిలో గుడ్డలు క్రుక్కెను. పాప మా యబలారత్న మేమిచేయును? యజమానుఁడామె స్థితిని జూచిమందహాసము చేయుచు, "ఈమూర్ఖురాలి కిశిక్ష మొదటనే చేయవలసినది" అని పల్కెను.

వేఱొకఁడామెను బరికించి, "ఓసీ మూఢురాలా రా! నీరోదన మాలించువా రిచ్చట నెవ్వరున్నారు? నీరోదనమరణ్య రోదనమే," యని పరిహాసించెను. ఆసమయమున నాకస్మిక ముగా నొకపురుషవ్యక్తి యటఁ బ్రత్యక్షమయ్యెను. ఆవచ్చిన వాఁడామె ప్రార్థించిన పురుషోత్తముఁడో వేఱొకఁడో తెలి యదు. ఎవఁడైనఁ దాదృశాపత్కాలమునఁ దోఁడు చూప వచ్చువాఁడు పురుషోత్తముఁడే. అతనిఁజూచి యా దొంగలు నివ్వెఱపాటునఁ గదలలేకపోయిరి. ఇంతలో నాపురుషుని కర వాలముచే నొకనిశిరము ధరాతలమునఁ బడెను. ఇరువురు పర్వె

ర్త. నాలవ వాఁడు యజమానుఁడు. తన ప్రయాసము వ్యర్థము చేయుటకును, దన చెలికానిని ఖండించుటకును, నిండు కోపమూని వాఁడాతని నెదుర్కొని యొక్క వ్రేటు వేసెను. ఆపురుషుఁడు దానిని దప్పించుకొని సత్తుఁ గోలఁది వాని భుజము నఱకెను. పెద్దగాయము పడినది; రక్తము మిక్కుటముగాఁ బ్రవహింపఁ జొచ్చెను. ఇఁకఁ దనపౌరుష మతని చెంత వమ్మయినదని తెలిసికొని కాలికి బుద్ధిచెప్పి వాఁడు పర్విడెను. అప్పు డా పురుషసత్తముఁ డాసతిలలామమును సమీపించి బంధవిముక్తి గావించెను. అంత నాయువతీరత్నము నోట గుడ్డలులాగికొని యాపురుషుని పాదములపైఁబడి తనకన్నీటిచే నాతనిపాదములు తడుప నారంభించెను. ఆమె దుఃఖమును జూచి యింక నతఁడు సహింపలేకపోయెను. అతనిహృదయము కరఁగి పొంగి పొరలఁ జొచ్చెను. అయిన నతఁడు దాని నడఁచి కొని. "సతీతిలకమా! నీవెవతెవు? ఈదుర్మార్గుల కెట్లు చిక్కితివి?" అని దయాళుఁడై యడిగెను.

"ఆర్యా! నేనొక యనాథస్త్రీని, మాయింట శయనించియుండఁగా నీదురాత్ములు ద్రోహబుద్ధితో నన్నుఁగొని వచ్చిరి. ఓ మహాత్మా! మీదయవలన నా ప్రాణములు నిల్చినవి. మీఋణ మెప్పటికిని దీర్చలేను. నా ప్రాణములు గాపాడి పుణ్యము గట్టుకొన్నారు. ఇపుడు పాఱిపోయిన యాదురాత్ము లింటనున్న నాకుమారి కేమి హానిచేయుదురో? నేనింటికిఁ బోవులోపల మఱల నన్నేమి బాధింతురో! కావున నీవు దయార్ద్రహృదయుఁడవై నాతో వచ్చి నాకుమారిని గూడఁ గాపాడి రెట్టించినపుణ్య మార్జించికొమ్ము. నాయుదంతము

విపులముగాఁ గలదు. దాని నెమ్మదిగా మాయింట విన్నవించు కొందును," అని శాంత పలికెను.

దీనాతిదీనముగాఁ బ్రార్థించు నామె మాట నతఁడు తిరస్కరింప లేకపోయెను. ఎట్టి కఠినహృదయుఁడైనను దావపావకునివలనఁ దప్పించిన కోమలలతను వేఁడినీటిచేఁ దడుపఁ బ్రయత్నించునా? ఆమె యిల్లు చేరులోపల పర్విడిన యాక్రూరులు మరలవచ్చి యెట్టియిక్కట్టు పెట్టినను దిక్కేమి? ఆమెను దత్కుమారికను నారాత్రి వేగినదాఁక రక్షించుటయే తనకు ముఖ్యకార్యమైనట్టు తట్టినది. ఆమెనుజూచి "సాధ్వీతిలకమా! ఇఁకనీకెంతమాత్రమును భయములేదు. నీవింటికి దారిదీయుము. ఖడ్గపాణినై నిన్ను వెంబడింతును." అని యతఁడు పలికెను.

అతని వచనము లామెచెవుల కమృతధారాపాతము లయ్యెను. ఆమె యమితానంద మొందెను. అతని ననేకవిధముల దీవించి, యాసుందరి ముందు నడువఁగా, నావీరోత్తముఁడామె వెనువెంట నడిచెను.

# ధిలారామ

## 8-వ యధ్యాయము

### అనురాగము

శ్లో. "లగ్నం పాదతలే నఖేషు విలుఠత్సంసక్తమూరోర్ద్వయ్యాగే
విశ్రాంతం జఘనస్థలే నిపతితం నాభీసరోమండలే
శూన్యం మధ్యమవేత్య రోమలతికామాలంబమానంక్రమా
దారూఢం స్తనయోః ప్లుతం నయనయో ర్లీనం మనః కైశికే."

శాంత యాపురుషోత్తమునితోఁ దన మందిరమునకుఁ బోవునప్పటి కెంతోరాత్రి లేదు. వడివడిగా లోనికిఁ బోయి కుమారి మంచమును సమీపించి చేతితోఁ దడవి కుమారి హాయిగా నిద్రించుట కాత్మలో నలరి యామె దీపము వెలిగించి వెంటనే యాపురుషున కొకశయ్య నమర్చెను. అతఁడందుఁ గూర్చుండెను. శాంత యాదగ్గఱనున్న యొక స్తంభమున కొరగిల్లి యుపవేశించెను. శాంత సాధారణ కాంతయని యాపురుషుఁడు మొదట భావించెను, గాని దీపపుఁగాంతి సాయమున నామె యసామాన్యసౌందర్యముఁగాంచి యుత్తమకులప్రసూత యానని నిశ్చయింపక పోలేదు. అతఁడామెం జూచి "నీకుమారి భద్రముగా శయనించియున్నదా?" అని ప్రశ్నించెను.

"భవదమేయకృపారసమునను, బరమేశ్వరునను గ్రహముపలనను, భద్రముగానే యున్నది. నేఁడు నీవొనర్చిన

సాయము లెన్నిజన్మములకైన మఱవఁ జాలను." అని శాంత యనెను.

"నా చేసిన యుపకార మేపాటిది? దానికేమి? నీవ్వాంత మిప్పుడు నిశ్చింతగానుండి మీవృత్తాంతము వినవచ్చినచో వినిపింపఁ గోరెదను" అని యాయన యడిగెను.

"అయ్యా! దుఃఖజనకమగు నాచరిత్ర మేమని విన్న వింతును? నేనొక వీరునిభార్యను. పేరు శాంత," అని చెప్పు చుండఁగా,

"సతీతిలకమా! చాలు, చాలు. నీవృత్తాంతము నాకవగతమైనది. నేను కృతకృత్యుఁడనైతిని. ఆడఁబోయినతీర్థ మెదురాయె నన్నట్లయినది. నా ప్రయాసము సఫలమైనది." అని యాపురుషుఁడు సంతోషమును వెలిపుచ్చెను.

ఆవచనములు శాంతకుఁ గర్ణపర్వము లొనర్చెను. అతని వృత్తాంతమరయఁ గుతూహల మధికమయ్యెను? "నాయనా! నీవృత్తాంత మేమో చెప్పి నాచిత్తపుఁదత్తరపాటును దీర్పు"మని యామె యడిగెను.

"ఉత్తమురాలా! నేనొక రాజపుత్రుఁడను. నా పేరు ప్రతాపరాయుఁ డందురు; నేను మాధవరాయుని కుమారుఁడను. ఛత్రసాలుని దయకుఁ బాత్రుఁడనై సేనానాయక పదవి నుంటిని. ఛత్రసాలమహారాజు మిమ్ము నిరపాయముగాఁ గొనిరా నాకాజ్ఞయిచ్చెను. నేనీదినమున నాగ్రానగరమువ నొకనధిరోహించితిని. గాలి ప్రతికూలముగా నున్నందున సాయంకాలము నకుఁ జేరవలసిన పడవ యించుమించుగా నిశీథమున కీపురము చేరెను. నాతోవచ్చిన బాటసారులు పురమున కరిగిరి. ఆ

పడవ ఢిల్లీకిఁ బోయెను. నాకీపురము క్రొత్త దగుటచే నెచ్చటికిఁ బోవుటకును బాలుపోక యీనదీతీరమునఁ గూర్చుంటిని. ఉదయమున గుర్తులను బట్టి మిమ్మరయవలెనని యుంటిని. కాని భగవంతుఁడు నాకా ప్రయాసము లేకుండఁ జేయుటయే కాక నిన్నురక్షించి యపారపుణ్యమును నమేయకీర్తిని సంపాదించుకొన్నట్లు చేసెను.” అని యతఁడు పలికెను.

అతని వదనారవిందమునుండి నిష్యందమగు వచనమకరందమును బూరిగాఁ గ్రోలి యాలలన సంతోషపరవశురాలయ్యెను; నేఁటితోఁ దమ కష్టములు గట్టెక్కెనని నిశ్చయించెను. అతనిఁ జూచి, “ఓవీరవరేణ్యా, నిన్నుఁ జిన్నతనమునఁ గాంచితిని. నీకు జ్ఞానము రాక మున్నే మేము ఢిల్లీకి వచ్చియున్నాము. అందుచే నీవు మమ్మెఱుఁగి యుండవు. నీకుఁ దెలియునో లేదో కాని నీతండ్రి నాసహోదరుఁడు. నీవు మాకు మేనల్లుఁడవగుదువు. నీవాపద్రక్షకుఁడవే కావు; మాకు ముఖ్యబాంధవుఁడవు. నేఁడింత యానందము లభించునని యనుకోలేదు. నీసందర్శనమువలన నింతకుఁ బూర్వము మాకుసంభవించిన కష్టములు గష్టములుగాఁదోఁపలేదు. నేఁడు నాకుసంభవించినకష్టము మఱపురానిది కదా? అట్లయినను నాకదివచ్చినట్లే లేదు. భవద్దర్శనజనితానంద మా కష్టమును గప్పిపుచ్చెను. ఆహా! భగవంతుని మాయామహిమ వాఙ్మనసాతీతముగదా? కుమారా! అచ్చటి రాజకీయవ్యవహారము లెట్లున్నవి?” అని శాంతయడిగెను.

“ఇప్పటికి ఛత్రసాలున కనుకూలముగానే యున్నవి. ఇది వఱకు బుందేలుల కపజయము లేదు. ఇఁక నొక మహా

సంగ్రామము జరుగనున్నది. సన్నాహములు జరుగుచున్నవి. మన మచిరకాలములోనే యిచ్చటి కరుగవలెను.” అని ప్రతాపుఁడు పలికెను.

శాంత యానందముతో నందుకు సమ్మతించెను. ఇంతలోఁదూర్పు తెల్లవారెను. పక్షివితానములు కిలకిల ధ్వనులు చేయుచుండెను. ప్రాభాతిక మందమారుతములు ప్రసరింపఁ జొచ్చెను. ప్రతాపుఁడు నిద్రచే శయ్యనొఱగెను. అది చూచి శాంత గృహకృత్యములు నిర్వహింప సాగెను.

పాపము! పద్మావతి కీవృత్తాంత మేమియుఁ దెలియదు. కన్నులు నులిమికొనుచు శయ్యనుండియే యామె నలుగడలుఁ బరికింపఁగా, నిద్రించుచున్న యాపురుషుఁడు గోచరమయ్యెను. మానస మాశ్చర్యాకులమై యామె సత్వరముగఁబోయి తల్లిని సమీపించి యాతని వృత్తాంతమడిగెను. శాంతయారాత్రి వర్తిల్లిన యుదంతము నంతయుఁజెప్పి కెవ్వునఁ గేకవేసి యేడ్చుచు, “తల్లీ! రాత్రి సంభవించిన గండమునకు నేను గనుకఁ జెల్లినది. నీవయినచో నిన్నీజన్మమున మరలఁ జూచియుండను గదా?” యని పిల్లను గౌఁగలించుకొని వాపోవఁ జొచ్చెను. పద్మావతియు నేడువనారంభించెను. శాంత దుఃఖము నడంచుకొని కుమారిక నోదార్చి యాపురుషోత్తముని వృత్తాంతమును దెలిపెను. పద్మావతి నిశ్చేష్టితురాలై కొంతవఱకట్లై చూచి “అక్కటా! నాఁడు నేను ముందున కరుగుట మిక్కిలి యపాయకరమని యిప్పుడు తట్టినది,” అని విచారింపసాగెను. తల్లి యామె నోదార్చెను. పద్మావతి మన స్సతినిర్మలము; అతి సరళము; కృతజ్ఞతానిధానము; యుక్తాయుక్త వివేకనిలయము. ఆపురుషోత్త

ముందు రాత్రి తమకొనర్చిన మహోపకారము తల్లివలన విని యామె యపరిమితానందము చెందెను; ఆతనికిఁ దన కృతజ్ఞతా సూచక నమస్కారము లర్పింప నువ్విళ్లూరుచుండెను. కొంతవడి కారాజకుమారుఁడు మేల్కొని తనశయ్యపైఁ గూర్చుండఁగా నాతని సుందరాకారము పద్మావతి కన్నులారఁగాంచెను. ఇదివఱకతని గూర్చి వినుటయే కాని ప్రత్యక్షముగాఁ జూడలేదు. ఇప్పుడు చూచిన తోడనే యాసుందరి డెందమున వింత వికారముదయించెను.

ఆమెయచ్చెరువు స్తంభాకృతిఁ దాల్చెను. ఇఁకఁ గృతజ్ఞతా సూచకనతుల నర్పింప నామె యత్నింపలేదు. యత్నించినను గొనసాగుట దుష్కరము. అతని సుందరాకారమున మొట్టమొదట విహారముసల్పవచ్చిన యాయువతీమణి చూపు లిపుడెంత త్రోసిపుచ్చినను బ్రసరింపలేదు; త్రపాతిరేకమున మరలిపోవుచుండెను. ఇఁక వానికి నిర్వక్రగమనము లేదు; అవి కుటిలత్వ మవలంబించెను. చాటుచాటున మెల్ల మెల్లనఁబోయి యవి యతని సౌందర్యము గొల్లలాడ నారంభించెను. లజ్జాతిశయమునఁ జూపులే నిరంకుశముగాఁ బ్రవర్తింపనియపు డాతని సన్నిధి కామె యేగుట యెట్లు? తనకృతజ్ఞతను దెలుపుటెట్లు? పద్మావతి యాతని దృష్టిపథమును విడిచి చాటునకేగెను. ప్రతాపరాయుఁడు వింశతిహాయన వయస్కుఁడై యౌవనప్రారంభదశయందుండెను. నేఁడతనికి సాక్షాత్కరించిన సౌందర్యదేవతయో యనఁ బద్మావతి కనులపండువు లొనర్చెను. అంతియే కాదు. చంచన్మధుకరీపంక్తుల నీసడించు నామె వీక్షణపరంపర లతని

వదనారవిందమునఁ బడుచుండెను. ఆచూపులైనను శుష్కములు గాక సానురాగములై సాభిప్రాయములై యుండెను. సంస్కారరహితము లగుటచే లలాటస్థలమున విరిసిన నెఱికురుల తెర నొత్తిగించుకొని యనివార్యములై క్రమక్రమదత్తసంతాపములై పైఁబడినచూపుల కతని డెందము తాళఁజాలక యాందోళన మందసాగెను. మనోరథపరంపరచే నాతఁడా కాశహర్మ్యము నిర్మించుకొనఁ దొడఁగెను. ఇదివఱ కామెను గూర్చి యతఁడు వినియుండెను. గాని యంతటి సౌందర్యవతియని యనుకొనలేదు. అతఁడు తన చిత్తమును బలాత్కరించి యామె రూపమునుండి లాగుకొను చుండెను; కఠినముగా శాసించుచుండెను. కాని యది యతనికి లొంగలేదు. ఆయువతీలలామ మెఱపువలె దళుక్కున మెఱసి త్రపాతిశయమున మాయమయినప్పు డతని హృదయము గళుక్కు మనుచుండెను. అతఁడు ప్రాతఃకాలకృత్యములను దీర్చుకొని యొక్కచోఁ గూర్చుండఁగా నప్పుడు శాంత సమీపించి యతనితో నేమో సంభాషించుచుండెను. పద్మావతి సిగ్గుచే నతని యెదుటఁ బడలేక తలుపుచాటునఁ గనఁబడియుఁ గనఁబడని విధమున నిలువఁబడి వారి సంభాషణము వినుచు, నప్పటప్పట సమయమును గనిపెట్టి మదనుని యర్ధచంద్రబాణములవంటి చుఱుకు గడకంటిచూపుల నతనిపైఁ బ్రసరింపఁ జేయుచుండెను. శాంతతో మాటాడుచున్నను ప్రతాపుఁడుగూడఁ దనవీక్షణముల నడుమ నడుమ యటుపఱపి పద్మావతి చూపులతోఁ గలిసి తత్పరిచయమును సంపాదించుచుండెను. ఇతని చూపు లామెను బాధించెనో లేదో కాని

యామె చూపులు మాత్రమతనిఁ గలఁగించి బాధింపఁజొచ్చెను. శాంత వారిచేష్టలను రహస్యముగాఁ గాంచి యొకపరి వారిరువురను జూచి మనమున సంతసించుచు నుండెను. తమకుపకృతిచేసి చేయ నున్నయతనికిఁ గృతజ్ఞత చూపుటకు మాఱుగాఁ బద్మావతి ఖరతరములగు తన వీక్షణాశరముల పాలు చేయుట యుక్తమాయని మాచదువరు లందురేమో కాని నాయభిప్రాయమది గాదు. శత్రువీరుల మధ్యమునయున్న భీష్మద్రోణకృపాచార్యులను సమీపింప వలనుపడమి నర్జునుఁడు దూరమున నుండియే నమస్కార కుశల ప్రశ్నబాణములఁ బ్రయోగించి తన భక్తిభావమును నివేదించుకొనెను గదా? అట్లే పద్మావతి త్రపావివశురాలగుటచే నాపురుషోత్తముని చెంతకుఁ బోలేక దవ్వులనుండియే తనమనోహరవీక్షణములనెడి నమస్కార కుశలప్రశ్నబాణములను బఱపి తనకృతజ్ఞతను వెలిపుచ్చెను. భీష్మాదులా పాండవమధ్యముని భక్తికి వలె నతఁడామెకృతజ్ఞతకు సంతసింపక పోలేదు.

అనంతర మాప్రతాపరాయుఁడు తానొకపరి పురము చూడఁబోయెను. అందు దర్శనీయములగు సౌధములును బూఁదోఁటలును బేఁటలును నెన్నియో కలవు. వానిఁజూచి తృప్తిచెంది శీఘ్రముగా మరలుట యెట్టివారికిని బొసఁగదు. అయిన నారాజకుమారుని నేత్రములకవి సంతుష్టికరములు కాలేదు; మీఁదు మిక్కిలి యసహ్యములుగాఁ జూపట్టెను. వీనికంటె శాంతశిథిలగృహమే వేయిరెట్లందముగా నున్నట్లతనికి దోఁచి యతఁడింటికిఁదిరిగివచ్చెను. ఇంతలో నతనికిఁ దగిన విందు శాంత సిద్ధము చేసెను. ఆమె నలభీమపాకములను మించు

నట్లు పాకము చేయఁగలదు. నాఁడా మహోపకారి నిమిత్త మెక్కుడు శ్రద్ధతో భోజనపదార్థములు సిద్ధపఱచి యతనికి వడ్డించెను. అవి యతి రుచ్యములే యయిన నతనికి రుచికరములుగాఁదోఁచలేదు. అంతకంటెఁ బద్మావతియొనర్చు చూపుల విందే యతని కింపుగా నున్నట్లు తోఁచెను.

# దిలారామ

## 9-వ యధ్యాయము

### —— నూతనదంపతుల చర్యలు ——

గీ. "మొలcతయప్పుడు మందాక్షమీలితములు
సౌహృదస్మేరములునైన సంగమముల
ముకుళితంబులుc బుష్పితంబులునునైన
భూజములతోడి యుద్యానభూమివోలె."

శ్రీనాథుcడు.

ఒకనాcడు ప్రతాపరాయుcడు విహారార్థమరిగి తిరిగి యింటికి వచ్చి బంధింపcబడిన తలుపు తట్టcగా, పద్మావతి వచ్చి తలుపు దీసెను. అతcడు లోపలc బ్రవేశించి కవాటమును బంధించెను. ఆసమయమున శాంత యింట లేదు. ప్రతాపున కది తెలియదు. పద్మావతితో సంభాషింపవలెనని యతని మన సువ్విళ్లూరుచుండెను గాని యంత వఱకును సమయము లభింపలేదు. శాంత యింటలేదని యతనికిc దెలిసినచోcబోయిం తనయభీష్టాలాపమును దీర్చుకొనును. అతcడది యెఱుcగమిచే నొకచోc గూర్చుండి పద్మావతి సుందరరూపమును హృదయ దర్పణమునc జూచి యానందించుచుండెను.

పద్మావతి నవయౌవనవతి ; సరసురాలు ; విద్వాంసురాలు. ప్రతాపుని సుందరరూపము చూచినప్పటి నుండియు మన్మథవ్యథల పాలగుచుండెను. ఎట్టయిన నతని సమీపించి మాటాడవలెనన్న తలంపామెకుండెను; అతని యనురాగ

మును సంపాదింపఁ నామెయూటలూరుచుండెను; తనతల్లియింట నున్నప్పుడు తనకోర్కి దీర్చుకొన సిగ్గుపడుచుండెను. ఇప్పుడు తనకుఁ దగిన సమయము చిక్కెనని సంతసించెను, గాని సాహసింప లేకపోయెను.

శాంత యింట లేదని ప్రతాపుఁడప్పుడు గ్రహించెను. పద్మావతికిఁ దనయం దనురాగమంకురించెనని ప్రతాపుని కింతకుముందే తెలియును. అయినను నిశ్చయముగా నెఱుంగ వలెనని లేచి యతఁడామె చెంతకుఁ బోయెను. ఆమెయు లేచి సిగ్గున నాలుగడుగులు వెనుకకుఁ బోయి తలుపునూతఁగా గొని నిల్చియుండెను; అంతియకాని మునుపటివలె మెఱుపువలె మెఱసి యంతర్ధానము కాలేదు. నిలుకడ గన్న మెఱపు దీపవలెనున్న యాయువతిని సమీపించు కొలఁది నతని గుండె దడదడఁ గొట్టుకొనఁ జొచ్చెను. ఏకాంతమున నట్టి దివ్యసుం దరిని గన్నులారఁ గాంచినతోడనే యతఁడు మోహాతిశయ మున నంధుఁడయ్యెను; అతనికి శరీరము కంపించుచుండెను;. చెమ్మటలు ప్రవాహములగుచుండెను. మంత్ర బద్ధమగుసర్పము వడువున నతఁడట్లే నిలిచిపోయెను.

పద్మావతికిని మోహోదయ మయ్యెను. ఒక మాఱు తనిని నొక మాఱు నేలను జూచుచు నామె నిలువఁబడెను. గాని యేమియును మాటాడలేదు. ప్రతాపుఁడేదో సంభా షింప యత్నించెను గాని కంఠము స్వాధీనము కాలేదు. అను రాగరసము పొంగి కంఠదఘ్నమయియుండెను. ఎట్లు సంభా షింపఁ గలఁడు? కొంతసేపటి కాయుద్రేకమడఁగి కంఠము ;ను గాని యేమి మాట్లాడవలెనో యతనికి

బోధపడలేదు. అంతవనుక సమయము లభించినచోఁ బద్మావతిని సమీపించి యెంతో సేపు సరస సంభాషణము సలుపనున్న ప్రతాపుఁడే యతఁడు! వెనుకటి యూహాలన్నియు ననురాగ సముద్రమున మునిఁగిపోయెను కాఁబోలు! ఎట్లో స్మరించుకొని సుందహాసవదనారవిందుఁడై యామెను జూచి, "సుందరీ! నీసుందరరూపమును గూర్చి యిదివఱకుఁ జెవులార విని సంతసించితిని. నేఁడు కన్నులారఁగని సంతసించితిని. కృతార్థుఁడనైతిని," అని యతఁడు మెల్లగాఁ బలికెను.

"ఆర్యా! నారూపము నీకానందము గొల్పినదని వినుటకు నేనును సంతసించుచున్నాను; కృతార్థురాలను, మీసందర్శనముచే నాజన్మము సార్థకమయినది," అని త్రపాతిశయమున నొక్కుడుపడెడి గొంతుకతోఁ బద్మావతి పలికెను.

వారిట్లు సంభాషించుచున్నపుడు వారిచూపులు పరస్పరము మేలములాడుకొనుచు నొండొరుల చిత్తములఁ జొచ్చి కలఁగింప నారంభించెను.

అపుడు ప్రతాపుఁడాయువతి వదనకమలమునఁ దన నిరీక్షణములఁ బ్రసరింపఁజేసి, "యువతీ! నీనిశాతకటాక్షవీక్షణ నారాచములచే నాహృదయము నెందులకు వ్యర్థముగాఁ జీల్చెదవు? దయయుంచి నాయందనురాగమును నెలకొల్పుము," అని కామవివశుఁడై పలికెను.

"మాయమ్మకు మీరుచేసిన మేలునకు మాఱుగా మీరేమి కోరినను నేను కాదనలేదు. సంశయమేలా? మీయందుఁ బూర్ణానురాగ ముదయించెను," అని యాబాల

మందహాసమునఁ బలికి వెలిదమ్మిఱేకులవంటి తళుకుఁజూపులఁ బ్రసరింపఁజేసెను.

"అది నిశ్చయమే కదా?" అని యతఁ డడిగెను.

"అవును," అని యామె చెప్పెను.

"అట్లని నాచేతిలోఁ జేయివేయుమా," అని యతఁడు చేయిచాఁచెను. ఆమె సిగ్గుతోఁ దలవంచుకొని యతనిచేతిలో జేయివేసెను. అప్పు డతఁ డామె చేతిని బట్టుకొని దగ్గఱగాఁ దీసికొనెను. తోడనే యిరువురి శరీరములను బులకాంకురము లుదయించెను, వారి హృదయసాగరముల భావతరంగములు లేవ నారంభించెను. ఇరువురును మైమఱచిరి. ఇంతలో తలుపు చప్పుడాయెను. ప్రతాపుఁడు తటాలున తనస్థలమున కరిగెను. పద్మావతిఁ బోయితలుపు దీసెను. శాంత లోపలికివచ్చి వారి ప్రవర్తన మాకార చేష్టాదులచే గ్రహించెను. అయినను దానిని దలంపలేదు; పద్మావతిని గోపింపలేదు; ఏలకోపించును? చిన్నప్పటి నుండియుఁ బద్మావతి నెవ్వని కర్పింపవలెనని శాంతకోరుచుండెనో యారాజకుమారుని యనురాగమునకుఁ బాత్రమగుకూఁతును జూచిసంతసించుటకు మాఱు కోపగించునా?

అనంతరము ప్రతాపుఁడచ్చటఁ గొన్నిదినములు సంతసముతోఁ గడపి యొకనాఁటిరాత్రి రహస్యముగా శాంతా పద్మావతులతో బయలువెడలి నౌకాప్రయాణముసల్పి బుందేల ఖండమునకుఁ బోయెను.

# దిలారాము

## 10-వ యధ్యాయము

### హుస్నేను

శ్లో. "పరవాదే దశవదనః పరరంధ్రనిరీక్షణే సహస్రాక్షః
సద్వృత్తవిత్తహరణే బాహుసహస్రార్జునః పిశునః."

మధురాపుర పాలకుఁడగు హామీదునకు హుస్నేనను నొకకుమారుఁడుండెను గదా? తండ్రి కాలధర్మమందినతోడనే పురపాలనాధికార మతఁడు వహించెను. యౌవనసంపన్నుఁడును, సంపన్నుఁడు నగువా మ్లేచ్ఛకుమారున కీయధికారము సంప్రాప్తము కాగానే వాని గర్వాతిశయము మిన్నంటెను. ఇఁక వానికిఁ గ్రిందుచూపు లేదు. ఆలోచింపఁ గ్రిందిచూపేమి యేచూపును లేదు. గర్వాంధుఁడైనవాని కదెట్టులబ్బును? ఆపుర వాసులలో నెవ్వరి నెట్లాదరింపవలెనో వాఁ డట్లు చేయలేదు. తాను వహించినది పురాధికారమే యయినను వాఁడట్లు భావింపలేదు; తనది మొగలు సామ్రాజ్యాధికారమనియే వానియుద్దేశము. ఇట్టివాఁ డౌరంగజేబు చక్రవర్తి నొకపరిచారకునిగా నెంచుననినను నతియతిశయోక్తి కాదు. మొదట వీనికిఁ బురపాలనాధికార మిప్పించుటకై పనిచేసిన తగు మనుష్యులందఱిపుడు వీనిచేఁ దిరస్కృతులై తమ యవివేకమునకు వగవఁ జొచ్చిరి. వగచి యూరకుండ లేదు; వీని దుర్గుణములను దెలుపుచుఁ దదధికారము వేఱొకని కిప్పింప వలయునని చక్రవర్తికిఁ జాటున పత్రమంపుకొనిరి. కాని చక్ర

వర్తికి హామీాదు కుటుంబమునం దధికగౌరవముండుటచే నాయన దానిని సరకుగొనలేదు. ఈపురాధికారి దుష్ప్రవర్తన మున కది మఱింత దోడ్పడెను. మునుపే కోఁతి; ఆమీాఁద నిప్పు ద్రొక్కినదన్నట్లు వాఁడు మొదటనే దుస్స్వహగర్వాంధుఁడు; ఆపైఁ జక్రవర్తి యనుగ్రహమునకుఁ బాత్రుఁడు. ఇఁక వాని చర్య లెట్లుండునో వర్ణింపనేల? వాఁడు పరధనము నపహరింప వెనుదీయఁడు; పరదార స్వీకారము సేవగించువాఁడు కాఁడు; లంచములు గొన సంకోచింపఁడు. ఇట్టి దుర్గుణము లెన్నియో వానియెడఁ గలవు. వాఁడిట్టి యవగుణముల కాలవాలమైనను వానిపితృభక్తి కెంతేనియు మెచ్చవచ్చును. వాఁడు తండ్రి నెంతో గౌరవముతోఁ జూచుచుండెడివాఁడు. జనకుఁడు మర ణించిన యనంతరముగూడ నతని యనుమతి నుల్లంఘింపలేదు. వాఁడు తనచెల్లెలగు దిలారామనుగూర్చి తండ్రి చెప్పినట్లు వర్తిం చుటయే యిందులకొక ప్రబలనిదర్శనము. ఇదివఱకుఁ జదువరు లకుఁ బరిచితులగు జోహారా వీని భార్యయే, రహీమనెడి తురు ష్కాగ్రణి వీనికిఁ గుడిభుజమువంటి వాఁడని యిదివఱకే వచిం చియుంటిని. చిన్నప్పటినుండియు రహీము హుస్సేనులు కలసి మెలసి గాఢమైత్రితో వర్తించుచుండిరి. ఏకార్యము చేయవలసి వచ్చినను నిర్వురు నాలోచించియే చేయుదురు. దుష్కార్యా చరణమందు హుస్సేను మనస్సు వెనుదీయునది కాదు. అగ్నికి వాయువు దోడుపడినట్లు రహీమతనికి సహాయుఁ డయ్యెను. రహీము దొంగతనమునకుం బెట్టినది పేరు. వాఁడు పరులకుఁ బట్టుపడువాఁడు కాఁడు, పట్టుపడినచో నధికారులతని శిక్షింతు

రేమోయనుభయము పూర్వముండెడిది; కాని యిప్పుడు దుష్కార్యధురంధరుఁడగు తనమిత్రుఁడే యధికారి యైనందున వాని కాభయము పూర్తిగా నశించెను. ఈరహీము దిలారామను గామించుటయు, జోహారా సాయమునఁ బ్రయత్నించుటయు మాచదువరు లెఱుఁగుదురు. జోహారా యుపదేశము వలనఁ దనకార్యము నెఱవేరునన్న నమ్మకము రహీమునకు లేదు. ఇఁక హుస్సేను సాయమున నెఱవేర్పఁ దలంచుకొని యుండెను. దిలారామ హుస్సేనునియాజ్ఞ యుల్లసింపదను దృఢవిశ్వాసము వానికిఁ గలదు. అది వాస్తవమే; అధికారపదవియందు నిరంకుశముగ వర్తించు సోదరుననుమతి నామె దాఁటఁ గలదా? దాఁటిన నిఁక నాపురమున నామెకు దిక్కేమి? రహీమిట్లాలోచించుకొని యొకనాఁడు మిత్రదర్శనమునకుఁ బోయెను. వీఁడరుగు నప్పటికి హుస్సేను తనగదిలో నొంటిగాఁ గూర్చుండి యేమిమో యోజించుకొనుచుండెను. ఒకరినొకరు మించిన దుష్టులు, వారొక్కచోఁ గూడినప్పుడు వారి ప్రసంగ మెట్లుండునో చెప్పనేల? "మిత్రమా! రహీము! నీధైర్య సాహసములు నాకాశ్చర్యమును గొల్పుచున్నవి. నీ మాయోపాయములు దేవుఁడైన నెఱుంగఁ జాలఁడు? బలుగాయములు నిన్ను బాధించుచున్నను సహించి యిట్టి కార్యమాచరించుట యెట్టివారికైన నసాధ్యమే కదా! నీవంటి హితుఁడు నాకు వేఱొకఁడు లేఁడు? బలే, నీ చాతుర్యము వర్ణనీయము."

"సఖా! నీవున్నతాధికారమును వహించి మమ్మేలుఱక రక్షించుచుండ మాకేమి లోపము? మేమే కార్యమును

నెఱవేర్పఁ జాలము? పరులవలనఁ బ్రాణాపాయకరములగు గాయములు దినియు సహించి యాకార్యము చేయుట నీ కానందము గల్గించుటకే. ఆయువతీమణియందము నీడెందము నకు హాయి గల్గించుచున్నదా?”

“ఆహా! ఓయీ! దానిసౌందర్య మేమనిచెప్పను? ఇట్టి యాఁడుది ప్రపంచములో వేఱొక్కతె యుండునని నేఁ దలంపను. ఓయీ! దానిశరీరము బంగారుముద్దయే దాని కన్నులు చేరలకుమించును? అబ్బా! అదేమి చూపులోయి? అది తేఱ పాఱఁ జూచునప్పటికి నాడెందము చిందఱవందఱ లైనది. అది చేరనిచ్చినది కాదు గాని బలమునఁ గౌగిలించుకొనవలెనని బుద్ధిపుట్టినది, సరియే దానికేమి? నీగాయము లెట్లున్నవి?”

“కొంచెము మానుచున్నవి. తక్కినచోట్ల దెబ్బలకు నేనంతగా లక్ష్యము చేయనుగాని ముఖముమీఁదఁ దగిలిన యీ గాయమునకు విచారించుచున్నాను. నా ముఖసౌందర్య మంతయుఁ జెడిపోయినది. దానివలన స్త్రీ లసహ్యపడుదు రేమో యని జడియుచున్నాను,” అని రహీము కొంచెము విచారపూర్వకముగాఁ బలికెను.

“నీవెంత మాత్రము జడియవలసిన పనిలేదు. అట్టిగాయ ములు శూరుల కలంకారములు గదా? నీశౌర్యమున కెవ్వరు మెచ్చరు? నీపరాక్రమాదులను బరిశీలించిన నేయువతి నిన్నుఁ గామింపదు? పోనిమ్ము. చూడు రహీమూ, పెద్దదానిని నీవు పరిగ్రహింపఁ గూడదా! వయస్సు ముదిరినను దానియందము సుంతేనియుఁ దఱుఁగలేదు. దానిశరీరపాటవ మేమిచెప్పను?

లేభ్రాయముఁ గన్నెలాగున నున్నది. బలే! నీకును దానికి జోడు చక్కఁగానుండును."

"నీవన్నది సత్యమే కాని నేను దానిఁ గోరను. మనస్నే హితుఁ డహమ్మదు దానిఁ గామించియున్నాఁడు. వాఁడీకార్య ములో బహుశ్రమపడెను. అట్టివాని కాశాభంగము గల్గించిన నిఁక మనకు జయముగల్గదు. పాపమతఁడు భార్యావియోగపీడి తుఁడై యున్నాఁడు. అతని కీయుపకారము చేయవలదా?" అని రహీము పలికెను.

రహీమున కా పెద్దకాంతపై మనస్సుపాఱలేదు. దిలా రామను దప్ప వేఱొకదానిఁ జేపట్ట వానికిఁ దలంపులేదు. ముందామెను గూర్చి హుస్సేనుతోఁ జెప్పఁదలంచుకొనెను. ఇపుడు హుస్సేను చెప్పినకాంతను తాను వలదన్నచో నతఁడు గోపించి యిఁకముందు దనకుఁ దోడ్పడడేమో యని సందే హించి వేఱొక మిత్రుఁడు దాని గామించెనని సాఁకు బొంకి తనమిత్రప్రేమను వెలిపుచ్చెను. ఈతలంపు హుస్సేనెఱుఁగఁడు. రహీమును జూచి "వహ్వారే! నీహృదయ మెంతమంచిది! నీకు మిత్రులందెంత యనురాగమున్నది! నీవంటి మిత్రుఁడు గల్గుట మాపూర్వపుణ్యము సుమీ! ఈయువతీరత్నములను గష్ట పడి తెచ్చినవాఁడవు నీవు; కష్టపడిన నీవూరక వలకాఁకలకుఁ జిక్కి చూచుచుండ మేమాయువతీరత్నముల ననుభవించుట యుక్తమా! నీకుఁదగిన కామిని చిక్కునంతకు మేముగూడ నీవలె నుండువారమే," అని హుస్సేను పలికెను.

"అట్లువలదు; నానిమిత్తము మీరారు సుఖమును జెఱుచు కొనకుఁడు. నీపూర్ణానుగ్రహముండినఁ జాలును. నాకు యువతీ మణియే లభింపదా ?" అని రహీము నెను.

రహీము తలంపేమియో హుస్సేనున కింకను బోధ పడలేదు. వాఁడింకను బెరటిదారినే యున్నాఁడు. రహీము నుదారబుద్ధి కెంతయో సంతసించి "మిత్రమా! తరిచిన కొలఁది సముద్రమునందు రత్నములువలె నీయందు గుణములు వెలం పడుచున్నవి. నీసహనగుణమునకు మిక్కిలి సంతసించితిని. మాసౌఖ్యమును గూర్చి నీవింత శ్రమపడుచున్నప్పుడు నీసౌ ఖ్యమును గూర్చి మేమంత శ్రమపడకున్న కృతఘ్నుల మని పించుకొనమా! ఇదిగో! నీకేమియు భయములేదు. ఈపుర మునఁగాని, చుట్టుపట్లగ్రామములందుఁగాని, నీమనసునకు నచ్చిన యువతీమణి యున్నచో నపహరించి తెత్తు. నీకేమియు హానిరాకుండఁ జేయువాఁడు నేనున్నాను. వెఱవకుము" అని హుస్సేను సంతసముతోఁ బలికెను.

"ఓయీ! నాయందు నీకంత యనుగ్రహమే యుండిన, నాయందు నీకసమానమగు మిత్రభావమే వెలయుచుండిన, వర్షా కాంతా సాంగత్యము లేమి వలకాఁకల వేఁగుచున్నాఁడనన్న కనికరమే నీమానసమున సంకురించిన, నీమిత్రుఁడనగు నాకు నీవేయువతిని సమర్పింప లేవు? నీవంగీకరించినచో నాయ భిలషించిన యువతి యిచ్చటనే యున్నది" అని రహీము పలికెను.

హుస్సేను గొంతసేపు యోజించి యతని వచనమునకు విపరీతముగా నర్థము చేసికొని "ఆఁ యేమీ! నేను గోరుచున్న

కాంతనే నీవును కోరుచున్నావా యేమి? అని కొంచెము మొగము చిట్లించి పల్కెను.

“రహీమట్టి మిత్రద్రోహి కాఁడు; అంత పాపాత్ముఁడు కాఁడు; యుక్తాయుక్తవివేకశూన్యుఁడు గాఁడు; తనయంతట మెంతో హుస్సేను నంతరమెంతో యెఱుంగును” అని రహీము కొంచెము దుడుకుగాఁ బల్కెను.

‘ఓయీ! అట్లయిన నీవెంచుకొన్న కాంత యెవ్వరో చెప్పుము. నావశమయినచో మిత్రకార్యము, అందులో నీ కార్యము కొనసాగించుటలోఁ గొఱంత యేమున్నది? చెప్పుము చెప్పుము,” అని హుస్సేను తొందర పెట్టెను.

“..వాగ్రహింపనని యందువేని చెప్పెదను.”

“చెప్పుము, ఆగ్రహింపను.”

“మిత్రమా! హుస్సేనూ! నామనసు చిరకాలమునుండి నీచెల్లెలగు దిలారామయందు దవిలియున్నది. ఎంత మరలించినను మరలకున్నది,” అని రహీము మెల్లఁగాఁ బలికి యతఁడేమి బదులు చెప్పునోయని యతని వదనము వీక్షించుచుండెను.

హుస్సేనున కావచనములు కర్ణశూలము లయ్యెను. సౌందర్యవంతురాలగు తన చెల్లెలికి రహీమర్హుఁడు కాఁడని యతఁ డెఱుఁగును. అతని కెంతో కష్టమనిపించినది; ఏమనుటకు దోఁచలేదు. ఆలోచనపరుఁ డయ్యెను. నిమీలితనేత్రుఁ డై యుండి కొంతసేపటికి, “రహీమూ! ఇది యసాధ్యమని తోఁచెడిని, నాచెల్లెలు నావచనమును మన్నించనో, మన్నించదో.” అని యతఁడు పలికెను.

"ఓయీ! నీయాజ్ఞను నీపురజనులందఱును బుష్ప దామకమునువలె శిరంబునఁ దాల్ప నీచెల్లెలు వినకుండునా? ఇట్టు వికల్పములు చెప్పక నాసౌఖ్యమునే నీవు గోరినయెడల నాకామెను గూర్పుము."

"నాకుఁ గూర్పవలెననియే యున్నది. కాని యామె మహాధనవంతుని గాని వరింపనని నేమినేయఁ గలుగుదు మని సంకోచించుచున్నాను?"

"మిత్రమా! రహీము ప్రజ్ఞావిశేష మెఱింగియు నీవట్లను టచే మనసు విచారించుచున్నది. నీస్నేహితుఁడు దలంప ధనమున కేమిలోపము? రత్నముల కేమి కొఱఁత? చూచుము నామహిమ. ఱేపు సాయంకాలమునకు వలయునంత ధనమును గ్రుమ్మరించెదను. నీవిట్టి యాలోచనలు విడువుము. నీమిత్రుని యందు నీకుఁ బరిపూర్ణకటాక్ష ముండిన నిది యసాధ్యము కాదు; కష్టసాధ్యముగూడఁ గాదు; నీయభిలషితకాంతలను దెచ్చుటలో నీరహీ మెంత శ్రమపడుచుండెనో యోజింపుము; నీనిమిత్త మెట్టిగాయములకు గుఱియయ్యెనో విచారింపుము; నీనిమిత్త మితఁడు చిన్నతనమునుండియుఁ జేయుచున్న యుపకారములను మఱవకుము సర్వకాలములందును నీశ్రేయస్సును గోరుచున్న వీనివాంఛితమును దీర్పకుండుట యుత్తమ వంశసంభూతుఁడవగు నీకుఁ దగదు. నీస్నేహితుని యావజ్జీవము ను బ్రహ్మచారినిగా నుంపవలెనని తలంపకుము, నమ్ముకొనిన మిత్రునికోర్కె దీర్పుము; సౌఖ్యములను గూర్పుము; మేలు చేయుము; సత్కీర్తి వడయుము. నాచెప్పవలసినది చెప్పితిని.

పిమ్మట నీచిత్తము. నాభాగ్యము," అని రహీము నిశ్చయముగాఁ బలికెను.

ఈవచనములు హుస్సేనుని మదికెక్కెను. అవి యుచితములని యతఁడు తలపోసెను; వాని యుపకారములు తలంచుకొనెను. వాని ముందటఁ దానుజేయునది నలుసుపలెఁ జూపట్టెను. ఇంతేకాక వానివచనములు హృదయమును గరఁగించెను. మిత్రప్రేమ క్రమముగా వర్ధిలి సోదరీప్రేమను దొలఁగించెను. తన సోదరిని వానికిచ్చి పెండ్లిచేయుట సముచితమనియె యిప్పుడు తోఁచెను. రహీమును జూచి, "మిత్రమా! నీవు విచారింపకుము. నీవు కోరినట్లు నాచెల్లెలినే నీకిచ్చి వివాహము చేసెదను. ముందుగా మంచి మాటలను బోధించెదను; వినకపోయిన నధికారము చూపుదము; అప్పటికిని లొంగనిచో బలాత్కారమున వశము గావించుకొందము. ఈదినముననే నేనొక యుత్తరము వ్రాసిపంపెదను. ఆమె వ్రాయు ప్రత్యుత్తరమును జూచి కర్తవ్యము యోచించుకొందము" అని హుస్సేను పలికెను.

"ఇంతకంటె నీవే పోయి మాటాడిన యుక్తముగా నుండునేమో?" అని రహీమనెను.

"కాదు కాదు; చిరకాలమునుండి ప్రేమించువారి యెదుటఁబడి కఠినముగా మాటాడుట కష్టము. నోరు భయపడును. గాని చేయి భయపడదు."

"అవును; చక్కఁగా నుడివితివి. మీరీ యువతులను బరిగ్రహింపరాదా!"

"ఇంకను బరిగ్రహింపము. మనమందఱ మొక్కసారియే పరిగ్రహింపవచ్చును. నేను ఢిల్లీకిఁ బోవలసియున్నది. ఈపరాశ్రయమైనను బోయి చక్రవర్తిని దర్శింపకున్న మర్యాద దక్కదు. నేఁబోయి వచ్చెదను. నేఁవచ్చునందాఁక వ్యవహారము లన్నియు నీవు చూచుచుండుము. కారాగృహము నేమఱక రక్షించుచుండుఁ," డని చెప్పి రహీమును సంతసింపఁజేసి పురాధికారమతని కప్పగించి కార్యత్వరచే నామఱునాఁడే హుస్సేను బయనమై ఢిల్లీకిఁ బోయెను.

# దిలారామ

## 11-వ యధ్యాయము

### కారాగారబద్ధుల వృత్తాంతము

గీ. "పరమయువతికి సుగుణసం-పదయుఁ బోలె
ద్రవ్యమును సోయగమును ము-దమ్ము నీవు
ధనముచే సోయగముచేతఁ-దన్మనంబు
ద్రిప్ప నెంచినఁ దీరని-ముప్పు వచ్చు."

జరుగఁబోవు నిశానిశాకరుల పరిణయోత్సవమునకుఁ బ్రారంభమునఁ గాలపురుషుఁడు మచ్చునకై వదలిన కాగితపు బుట్టయో యన సూర్యుఁడు కాంతికలాపము దక్కి పడమటి కొండశిఖరమునఁ జూపట్టెను. సాయంతనవాయువులు మెల్ల మెల్లనఁ బ్రసరించుచుండెను. సంజకెంజాయఁ బర్విన మేఘములకుఁ జోటయి యాకస మెఱ్ఱవడి; రక్తముచేతను మాంసముచేతను, బీరంగులచేతను, నిండియున్న యుద్ధభూమివలెఁ జూపట్టుచు సూర్యునకును, జీఁకటిరాజునకును వర్తిల్లిన సంగ్రామోద్ధతిని దెలుపుచున్నట్లుండెను. ఇట్టి సమయమున దిలారామ చంపావతితోఁ గూడఁ దన సౌధోపరితలమునఁ గూర్చుండి మలయమారుత మనుభవించుచు నిట్లు సంభాషించెను.

"చంపావతీ! పురమున విశేషము లేమి?"

"మీ సోదరుఁడు పురాధికారమూన, రహీము మంత్రిపదమునసుండ, నిఁక విశేషముల కేమి కొఱఁత?"

"అదేమి? అట్లనుచున్నావు? ఏదైనఁ జెప్పుము?"

క్రొత్త విశేషములనా, ప్రాఁత విశేషములనా, చెప్ప మందువు?"

"క్రొత్తవానినే చెప్పుము."

"ఈపురమున నామూల శిథిలగృహములో నొకయువతీమణి కూఁతుతో నైదాఱేండ్లనుండి నివసించుచుండెనట! అది యెవ్వరికిని దెలియనే తెలియదు. వారిరువురును మిక్కిలి మంచివారఁట! సౌందర్యవిభాసమానలఁట! తత్కుమారి కున్నంత యందము లోకములో నెవ్వరికిని లేదఁట! కొలఁది దినముల క్రిందటనే తల్లి దుస్సహరోగపీడితయాటచే నందులకుఁ దగిన మందుఁ దెచ్చుటకై యాపిల్ల వైద్యశాల కరిగెనఁట! ఆసమయమున మీరాయన్నయు రహీమును వీథివెంటఁ బోవుచు నామెను జూచిరఁట! అనంతర మామెకుఁ గొంత దూరమున వెంబడించి పోవుచు వారిరువురును దదీయవృత్తాంత మంతయు నరసి వచ్చిరఁట! ఒకనాఁటిరాత్రి రహీము ముగ్గురు మనుష్యులతోఁబోయి నిండ్రించియున్నవారిలోఁదత్కుమారిని దెచ్చుటకు మాఱుగాఁ దల్లినే మంచముతోఁ గూడఁ గొనిపోయెనఁట"

"అక్కటా! ఎంత ఘోరకృత్యము! రహీమంతటి క్రూరుఁడే! తరువాత నేమి జరిగెనే? చెప్పు చెప్పు" అని దిలారామ తొందర పెట్టెను.

"వారు యమునాతీరమునకుఁ గొనిపోయి తమ తెలివి తక్కువను దెలిసికొని మరలఁ బోయి యాపిల్లను గొనిరా

యత్నించుచుండ నొక మహాపురుషుఁడు ప్రత్యక్షమై వానిని దరిమి యాస్త్రీని విడిపించెనఁట!"

"రహీము పరాక్రమశాలియే ? ఊరకుండువాఁడు కాఁడే? అతని నెదుర్కొన లేదా?"

"ఎదురు కొనకేమి ? ఎదుర్కొనెను. కాని యతనిచే దిట్టముగా దెబ్బలుతిని పర్వెత్తెనఁట! ప్రబలమైన గాయములు తగిలినవని చెప్పుకొనుచున్నారు."

"వానికిఁ దగిన శిక్షయైనది. ఈమాఱు బుద్ధివచ్చునని తలంచెదను."

"లేదు లేదు. ఎన్ని తన్నులుదిన్న నీజన్మమున వానికి బుద్ధి రాదు"

"ఇంకను వాఁడు దౌర్జన్యము వదలలేదా?"

"లేదు. విను చెప్పెదను, ఆవీరుఁ డాస్త్రీలను గొనిపోవు నిమిత్తము వచ్చినవాఁడే యఁట! వానినివాసస్థలము బుందేలుఖండమఁట! అతఁ డొకనాఁటిరాత్రి వారితోఁ బడవెక్కి తమ దేశమునకుఁ బోవుచుండెనఁట! రహీముది తెలిసికొని తాను దన సహచరులును బాటసారుల విధమున ముందుగా నాపడవలోఁ బ్రవేశించి నావికులకు లంచమిచ్చి వెనుకకుఁ ద్రిప్పికొనివచ్చి పడవను మనపురి రేవును జేర్చెనఁట!"

"అకటకటా! ఆ రహీమెంత మాయావియే? పాపము! వారి కీసమాచారమే తెలియదు కాఁబోలును?"

"వారు హాయిగా నిద్రించుచుండిరఁట! వారి కీగొడవ యేమియుఁ దెలియదఁట!"

"పిమ్మట నేమి జరిగెను."

"అదివఱకు మీరాయన్న సిద్ధముచేసిన జనము పడవ రేవును జేరఁగనే పోయి వారిని బంధించిరఁట."

"ఆ వచ్చినవాఁడు మహావీరుఁడేమో?"

"అవును; అయిననేమి ప్రయోజనము? చేత నాయుధము లేదు. అప్పటికిని బిడికిటి పోట్లతో నిద్దరను జంపెనఁట!"

"వారిప్పు డెచ్చట నున్నారు?"

"ఇచ్చటనే కారాగారమున నున్నారు?"

"ఈవృత్తాంతమంతయు, నీకింత స్పష్టముగా నెట్లు దెలిసినదే?"

"రహీము మీరాయన్నయుఁ జెప్పుకొనుచుండఁగా విన్న పరిచారకురాలొకతె నాకుఁ దెల్పినది.

"అయ్యో! ఇదేమోకాని యీ వృత్తాంతము విన్నప్పటినుండియు నాగుండె యదురుచున్నది. పాపము! వారినేమిచేయుదురో"

"సందేహమేల? ఆపిల్ల నీకు వదినెగా రగును, ఆతరుణి యత్తగారు. అతఁడేమౌనో చెప్పలేదు?"

"కష్టపడిన రహీమున కేమియు లేదా?"

"లేకేమి? నీవున్నావుకావా?"

దిలారామ కది హృదయశల్య మనిపించెను కన్నులెఱ్ఱవడియెను. బొమముడిచే మనోహరవదనము భయంకరమయ్యెను. "ఆఁ! ఏమీ; వినిపింపలేదు. మరొక్క మాఱు చెప్పుము" అని సక్రోధముగా నామె చూచెను.

"అమ్మా! నామీఁద నీకంత యాగ్రహ మెందుకు? మీవదినెగా రనుమాట ననుకరించితిని అంతయకాని నా కాస బంధ మిష్టమనుకొంటివా?" అని దాసి మందహాసపూర్వకముగాఁ బలికెను.

దిలారాము ముఖము సుప్రసన్నత ధరించెను. "చెలియా! ఆదుష్టుఁడు వెనుకటివలె నిప్పుడు రాలేదేమి?"

"ఏమి వచ్చును? ఎకసక్కెము లాడి పంపుదువు. దానికి జోడీమధ్యమునఁ బ్రబలములగు గాయములు గూడ దగిలినవి. అవి చూచి నీవూరకుండవు. ఆభయముచేతనే రాలేదను కొందును"

అని వీరు సంభాషణము సల్పుచుండఁగా జోహారా! వచ్చెను. చంపావతి యామెనుజూచి "అదిగో! మీవదినె వచ్చుచున్నది వారినిగూర్చి నివేమయిననడుగఁదలఁచిన నడుగుము" అని పలికెను.

జోహరా ప్రవేశించి, "మీరిచ్చటనా యున్నారు? క్రిందిగదిలో నున్నారేమో యని తలంచి యచ్చటికిఁ బోయితిని." అని పలికెను.

"లేదు వదినే! చల్లగాలికై యిచ్చటికి వచ్చితిని. నమ్ము కూర్చుండుము" అని దిలారాము యామెను మన్నించెను. ఆమె యుచితాసనమునఁ గూర్చుండెను. అపుడు దిలారాము మందహాసపూర్వకముగా నిట్లనియె.

"వదినే! నాకు మఱొక్క క్రొత్తవదినెగారు వచ్చినారఁట!"

"మఱఁదలా! మఱొక్కరే కాదు, ఇంకొక్కరే కాదు; వలయు నందఱు వదినెలు రాగలరు? మీయన్నగారి సద్గుణములకు మోహింపనివా రెవ్వరు? నీయదృష్టము నీకెక్కడఁ జూచినను వదినెగారే!"

'ఎక్కడఁ జూచినను తోఁబుట్టువులు గల్గియుండుట నీయదృష్టమే యనుకొనరాదా! సరియే, దాని కేమి; అపరదేసు లేమి చేయుచున్నారు, వారిని జూచితివా?"

'చూచితిని; కారాగృహమున నున్నారు. మొదట నందఱు నొకగదిలో నుండిరి. కాని యిప్పుడు వేఱువేఱు గదులలో నున్నారు."

'అట్లు వారిని వేఱుచేయుటలో నభిప్రాయ మేమి?"

'వారు పాఱిపోవుటకై పరస్పర మాలోచించుకొందు రేమోయని.

దంతయును రహీముప్రభావమేఁట గాదా!"

"మీయన్నగారికి సహపాఠియై తోడునీడై, మిత్రుఁడై యుండుటచేతనే యతని కిట్టి ప్రభావము లభ్యమైనది!

"అన్యాయము లాడకుము, అతనిసహవాసమువలననే మాయన్నవర్తనము చెడినది

ఏమో? నేనట్లనలేదు. ఇద్దఱిద్దఱే!"

'ఇప్పుడయిన రహీమును గూర్చి యభిప్రాయము మార్చుకొందువా

ఈకాలమున నామాత్రము దుర్గుణములు లేనివా రెవ్వరు?'

ఉండినను రహీమునకు వలె సంఖ్యాతీతములగు దుర్గుణము లుండవు. దానికేమి ? వదినే ! ఆకారాగృహావాసులను జూచుటకు వీలగునా!"

"కాకేమి ? రమ్ము చూతుము. వారిలోఁ బిల్లను జూచిన చో గుండె నీరగునుగదా ? పాపము ! వారికి దురదృష్టదినములు వచ్చినవి. ఎవ్వరేమి చేయఁగలరు?"

"అచ్చటి కిపుడు పోవుదమా?"

"పోవచ్చును; ఇప్పు డెవ్వరు నుండరు."

వారు ముప్వురును లేచి మేడ దిగఁబోవుచుండఁగా నొకవృద్ధస్త్రీ మేడపైకి వచ్చుచుండెను. దిలారామ యది చూచి, వదినే! మీదాసి వచ్చుచున్న దెందులకో?"

చూచి. "అదిమాయందఱకు దాసిగాదు; మీయన్న గారికిఁ బ్రేమాస్పదురాలైనదాసి. అతఁడు కోరిన వనితలను దెచ్చి కూర్చుటలో దీనికిఁ గలచాతుర్యము వేఱొక్కతెకు లేదు" అని జోహరా పలుకునంతలో నాదాసివచ్చి దిలారామకొకయుత్తర మిచ్చెను. తోడనే దిలారామ దానిని విచ్చి మనస్సులోఁ జదువుకొనెను, గుండె నీరయినది; కనుఁగొలుకులనుండి జొటజొట బాష్పకణలు రాలజొచ్చెను. అదిచూచి చంపావతియు జోహారాయు నాశ్చర్యమగ్నలై, "వృత్తాంతమేమి ? చెప్పుము, చెప్పుము" అని యడిగిరి. దాని కామె బదులుచెప్పక యాయుత్తరమిచ్చెను. జోహారా యిట్లు చదువ నారంభించెను.

"సోదరీ ! చిన్నప్పటి నుండియు నీకష్టసుఖము లరయువాడఁను నేనే కదా ? నీశ్రేయస్సు నభిలషించు నేను

నీకుఁ దగినవరునిఁ గూర్చకపోవుట సమంజసము కాదు. వీరాగ్రగణ్యుఁడును ధనసంపన్నుఁడును నగు రహీమునకు నిన్నియ నిశ్చయించినాఁడను. ఈ నావచనమును సంతోషపూర్వకముగా నంగీకరింతువని తలంతును. విరుద్ధవచనము నీనోటనుండి రాఁగూడదు. నీకంటెః బెద్దవాఁడను, నధికార మహిమోన్నతుఁడను నగు నావచన ముల్లంఘించుట నీకు మేలగునా? దీని కంగీకార పత్రమును వెంటనే పంపుము.

హాంన్సేను.—"

అని చదివి యామె యాయుత్తరమును జంపావతి కిచ్చెను. ఈ యుత్తరములోని ప్రత్యక్షరమును దిలారామ కొక్కొక శూలఘాతమువలెఁ దాఁకెను; లోపలఁ గ్రోధాగ్ని మండఁ జొచ్చెను; శరీర మావేగ మొందసాగెను; కన్నులు రక్తాంబుజములయ్యె; ఆక్రోధాతిశయమున నోట మాట రాక యాసనమునఁ గూలఁబడి చెక్కిటఁ జేయిచేర్చి చూపులు ప్రక్కకుఁ బ్రసరింపఁజేసెను. జోహరా తనయభిలషిత మిఁకఁ దీఱకతప్పదు గదా యని లోలోన సంతసించుచుండెను. గాని దానిఁ గప్పిపుచ్చి విచారము మొగమునఁదోఁప మాటాడక యామె వైఖరిఁ జూచుచుండెను. చంపావతి తనయధిపురాలి కన్నను మహాదుఃఖ మనుభవించుచుండెను. ఆమె కోపమున నాయుత్తరమును జింపి నలిపి పాఱవైచెను. "జోహరా యది చూచి" "ఏమే యట్లు చింపివైచితి?" వని ప్రశ్నించెను.

"దుఃఖకరమగు నీయుత్తరము నుంపఁగూడదు. ఇది యుండినఁ జూచినపుడెల్లను దుఃఖముప్పతిల్లును," అని చంపావతి యనెను.

"దుఃఖింపవలసినంత యవసర మేమున్నది?"

"రహీమును బెండ్లాడుటకంటె నధికదుఃఖము లోకమున నుండునా?"

"మీయధిపురాలి వివాహస్వాతంత్ర్యమంతయు నీ తలనే యున్నట్లున్నది."

"సర్వదా తదీయహితమునుగోరు నాతలనుండక యిం కెవ్వరితల నుండును?" అని దాసి యనెను.

ప్రసంగము ముదురుచున్నదని గ్రహించి దిలారాము చంపావతిని జూచెను. దిలారామ కోపము కొంచెము తఱిగినదని జోహారా దెలిసికొని యిట్లు ప్రసంగించెను.

"మఱి దలా! దీనికేమైనఁ బ్ర తీకమీయఁ దలఁచ కొంటివా?"

"ఈయక తీఱునా! దుస్సహాగ్నిజ్వాల లింటిని జుట్టు కొన్నప్పు డెట్లో చల్లార్పుకొనవలెను, గాని యూరకుండిన జీవించుటెట్లు" ఇదివఱ కెక్కడనో యేమూలనో యున్న యగ్నిహోత్ర మిప్పుడు నిర్దయమై నామందిరముపైఁ బడినది," అని దిలారామ విసువుఁదలతోఁ బలికెను. ఆవచనము లామె నోట వెలువడునప్పుడు చంపావతికిఁ గల్గినకోపమునకు మేర లేదు. తనకు శక్యమగునేని రహీము వాని సేనల నొక్కపెట్టునఁ జంపి వచ్చుననుటకు సందియము లేదు. జోహారా యది విని "మఱిఁ [illegible] న్యాయము విపరీతముగా నున్నట్టులున్నది!" అని

"లేదు లేదు. మాయన్న యాజ్ఞ యగ్నిజ్వాలవలె సమస్తవస్తువులం దొక్కరీతిగానే వర్తించుననుట కల్లంటిని. అంతియ కాని విపరీత మేమున్నది?"

"రహీమును బెండ్లాడుదువా?"

"తప్పించుకొనవలెనన్నఁ దప్పునా?"

"తప్పించు కొనవలెనని యున్నదా?"

"యత్నము సాగనియప్పు డుండిన నేమి ప్రయోజనము?"

"రహీముపై నిష్టములేదా యేమి?"

"మాయన్న యాజ్ఞావచనమునకైన నుండదా?"

"నీయంతట నీకతనియం దనురాగములేదనుట నిశ్చయము, దాని యర్థమదే?"

"వదినే! నన్నెందులకూరక ప్రేలింతువు, మాయన్నగారి యుత్తరమెంత తీవ్రముగానున్నదో చూచితివా? రహీమునందు నాకనురాగము లేకున్నను దెచ్చికొని యతని వరించి మాయన్నయాజ్ఞను మన్నింపకున్న నాఁకిక సుఖమేది? సుఖము మాట దేవుఁడెఱుఁగును. జీవించు టెక్కడ? బ్రదుకుపై నాస వదలుకొన్నచో నందులకు వ్యతిరిక్తముగా నడువవలెను. ఇంతకంటె వేఱొక మార్గము కానరాదు. ఇఁక నేమిచేయుదును? నీవు మాయన్నయొుఁ దక్క నాకిఁక దిక్కెవ్వరు? మీ యనుమతికి విపరీతనై మీ యాగ్రహమునకుఁ బాత్రురాలనై దిక్కులేక పలుబాము లనుభవించుటకంటె రహీమును బెండ్లాడుటయే యుక్తముగా నున్నట్లు తోఁచుచున్నది." అని దిలారామ పలికెను.

"అవును ; తలకుమించి వచ్చినపు డేమి చేయుదువు? నీయాలోచనము యుక్తముగానే యున్నది. నీ సంగతివలన మా రహీమునకు బుద్ధిరాకపోదు లెమ్ము. అపరదేశులఁ జూడ వత్తువా?"

"ఇప్పుడు రాను : తేపుపోయి చూచెదను. నామన స్సిప్పుడు వ్యగ్రముగా నున్నది."

"మంచిది, నేను బోయివచ్చెదను" అని జోహారా వెడలి పోయెను. దిలారామయుఁ జంపాలతో నేమేమో యోజించు కొని యప్పుడే రహీమును వరింప నిష్టమున్నట్లు ధ్వనియించు నుత్తరము వ్రాసిపంపెను.

# చి లా రా మ

## 12-వ యధ్యాయము

### పద్మావతి విచారము

చ. "సహజవిలాసవంతుఁడును, సద్గుణవంతుఁడు నాపతి స్మరా
వహతను బెండ్లియాడి యనపాయసుఖంబులఁ బొందువేళయం
దహహా! సహింపకల్లవిధి యాతనిఁ బ్రాణము వాపసాధ్వి తా
సహగమనం బొనర్పదె? వెసన్ విధవాత్యకృశానుభీతయై."

పాపము! పద్మావతి యిదివఱ కిట్టికష్ట మనుభవింపలేదు. జనకు నెడఁబాసియున్నను నది యామెకుఁ గష్ట మనిపింపలేదు. తనతల్లి సుంతేనియు లోపము గల్గకుండ వేళపట్టున నాహారాదులనర్పించి సంరక్షణచేయుచుండ నామె కేమికష్టము! అజ్ఞాతవాసమామెకుఁ దృణప్రాయముగాఁ దోఁచెను. ఇప్పు డామె శీకారాగారమునఁ గాలక్షేపముచేయుట బహుకష్టముగానుండెను. దురాత్ముఁడగు హుస్సేను దనకెట్టి భంగపాటు గల్గించునో యనుసందియము డెందమును గొందలపఱచుచుండెను. పుట్టినప్పటినుండియు నామె దల్లిని విడిచి యుండలేదు. ఇప్పుడా దుస్సహామాతృవియోగము గూడ సంభవించినది. దురాత్ములగు తురకలు తమ ముగ్వురిని వేర్వేఱుమందిరముల నుంచుటచే నిప్పటికిఁ బదునేనుదినములనుండి మాతృసందర్శనము నామె చేయలేదు. ఇఁక నామెహృదయ మెట్లుండునో చెప్పనేల? ఇవి చాలవేమో యన్నట్లు ప్రియవియోగమొకటి ప్రతాప

రాయుని సౌందర్యము వీక్షించినది మొదల లామెహృదయ మాతనినుండి మఱి మరలలేదు ; మరల్చుకొంద మన్నను వశము కాలేదు. స్వల్పకాలసహవాసమే యైనను వారిప్రేమ బీజము లొండొరులందు గాఢముగా నాటుకొన్నవి. శాంత యాబీజములను మఱింత వర్ధింపఁజేసెను. వారిరువురకును బరిచయ మెక్కువయ్యెను. పద్మావతిని దప్ప వేరొకయువతిని జేపట్టనని ప్రతాపరాయుఁడు ప్రతిజ్ఞ చేసెను. అప్పుడు పద్మావతికిఁ గల్గుసంతోష మేమని చెప్పను ! వర్ణింపనలవి కాదు. ఆమె నవయౌవనాలంకృత. ఆప్రతాపరాయుఁడు యౌవనారంభదశ యందుండెను. మానవాకారముఁ బొంది భూమికి దిగివచ్చిన మన్మథుఁడు; ప్రతాపాదిసద్గుణముల కాటపట్టు. ఉత్తమక్షత్రియ వంశసంభూతుఁడు; తనవలెనే యవ్యాజప్రేమతోఁ దన్నువరించినవాఁడు. పద్మావతి యాతని బడవనుగాఁ జేసికొని యిహ సుఖసముద్రమున స్వేచ్ఛగా విహారింప నువ్విళ్లూరుచుండెను, గాని, దైవికముగా దుస్సహమారుతము విజృంభించి యా పడవ నేమూలకో తఱిమి వైచెను. అతనిఁ గన్నులతోఁ జూచి యానందించుభాగ్యమైన లేక పోయెను. ఈనూతనప్రియ వియోగ మామె కెంత దుర్భరమో వర్ణింప నెవ్వరు శక్తులు? ఇపుడామెకు మాతృవియోగముకంటెఁ బ్రియవిరహము వేమడువు లధికముగాఁ జూపట్టసాగెను. ఆవిరహము కొండవలెఁ దుర్భరమై క్రమక్రమముగా నామె నడఁగఁ ద్రొక్కుచుండెను. తనకష్టసుఖములు చెప్పుకొందమన్నను నెవ్వరును లేరైరి. దుఃఖమా కన్నులు తొలకరిమేఘములవలెఁ గుంభవృష్టి గురియించుచుండెను. ఎంత యేడ్చిన నేమిలాభము ? ఆర్పువారా ?

తీర్చువారా! ఓదార్చువారా? అప్పు డాయువతీలలామ యిట్లు విలపింపఁదొడంగెను. "హాదైవమా! మాకష్టములకు అంతెయైనఁ గరఁగును గదా? నీగుండె గరఁగ కున్న దేమి? మాపైఁ బంతము పట్టితివా? అబలలమై చిరకాలదుఃఖవిశీర్ణహృదయల మై యున్న మాతోనా పంతము? శత్రువులకుఁ జిక్కించితివి; దుస్సహమాతృవియోగము గల్గించితివి; ఈఁదఁ దరముకాని నూతనప్రియవిరహాంబుధిలో ముంచితివి. ఇంతకంటె నీవు చేసెడి దేమికలదు? అయ్యో! తల్లీ! నన్నుఁ గూర్చి నీయుల్ల మెంత తల్లడిల్లుచున్నదో? నామీఁద నపారప్రేమ ముంచితివి; ఈప్రేమానుబంధము పాశతుల్యమై నిన్ను బంధింప నెంత శ్రమ పడుచుంటివో? ఈపాపిష్ఠదైవము కంటికి మనమే కనిపించితిమి కాఁబోలును. హాతల్లీ! ఇఁక నెన్నఁడైన మనము కలిసికొని హాయి గాంచు భాగ్యము పట్టునా? నావలననే కదా నీకింతటి కష్టము వచ్చినది? అమ్మా! యిట్టి దురదృష్టవంతురాలి నెందులకుఁ గంటివి? నన్నుఁగని పెంచి పెద్దగాఁ జేసి విద్వాంసురాలినిగా నొనర్చిన నీకు నావలన నెట్టిసత్ఫలము లభించెనో చూడుము. హా ప్రాణప్రియా! నీసౌందర్యము నెట్లు మఱతును? నీమృదు సంభాషణ మెట్లు విస్మరింతును? అక్కటా! ఈదురదృష్టవంతురా లెన్నఁడైన నీవదనారవిందసౌందర్యమును దనివిదీఱఁ జూడఁ గల్గునా? ఎప్పటికైన నీపాపాత్మురాలికి భవదీయపవిత్ర పాదపద్మసేవజేసి పవిత్రత గాంచి సుఖించుపుణ్యము లభించునా? అయ్యో! పాపము! మాదురదృష్టము క్రూరనక్రము వలె నిన్నుఁ గూడ నీదుఃఖసముద్రములోని కాకర్షించి విడి

చెనే! అకటా! ఎంతకష్టము! వల్లభా! నీవియోగభారము నెట్లు సహింపఁగలుగుదును?" అని యిట్లు తనలోఁ దాను నానావిధముల నామె విలపించుచుండఁగా, నెవ్వరో స్త్రీపురుషులు సంభాషించుచున్నమాట లామెచెవులకు వినవచ్చెను.

"చంపావతీ నీ కెప్పుడుఁ దొందరయే! ఒకమాఱయిన నిబ్బరముగా నిలిచి ముచ్చటఁ దీఱునట్లు మాటలాడవు కదా! నీసౌందర్యమునకుఁ జిక్కియే నీకు దాసానుదాసుఁడ నగుచున్నాను; నీవు కోరినట్లు చేయుచున్నాను. అయినను నీకు దయ లేదు." అని కారాగృహాధికారి పల్కెను.

పద్మావతి యది విని, "అహాహా! ఇదెంతయు వింతగా నున్నది. ఇచ్చటివారంఱును గామాంధులవలెఁ దోఁచుచున్నారు.

ఈ కారాధ్యక్షుఁడు మాకాహారాదులు తెచ్చి యిచ్చు చంపావతితో సరసమాడుచున్నాఁడు! ప్రభువు, మంత్రులు, సేవకులు నందఱు నొక్కవిధముగానే యున్నారు. ఆహా! ఎంత కండకావరము! అయిన నిది యేమి సమాధానము చెప్పునో చూచెదను" అని వినుచుండెను.

"ఓయీ! నన్నూరక నిందింతువేమి? నేను రెండుపూఁటలును వీరి కాహారాదులను దెచ్చియిచ్చుచు నాకాలమంతయు నిచ్చటనే పుచ్చుచున్నాను. ఇంకెంతసే పుండుమందువు? నేను దలయమ్ముకొన్నదానను గాని విచ్చలవిడిగా విహరించుదానను గాను." అని చంపావతి ప్రత్యుత్తరమిచ్చెను."

'సరి సరి, తెలిసినది. సానురాగమగు సంభాషణమే. దాసీజనమున కిట్టివారందఱును బతులే యౌదురు. పోనిమ్ము,

ఆగొడవ నాకెందుకు? ఏమైనను జంపావతి మాకుఁ జేయుచున్న యుపకారము శ్లాఘనీయము. వీరిసంభాషణ మింకెట్లుగా నుండునో! వింటును," అని పద్మావతి వినుచుండెను.

'సుందరీ! మంచిమాటలతోఁ గార్యము నెఱవేర్చుకొను చాతుర్యము నీకున్నట్లు వేఱొకరికి లేదు.'

"ఓయీ! నీముఖస్తుతులకేమి? కాని నేనొక ప్రశ్నమడుగుదును, బ్రత్యుత్తరమిమ్ము," అని దాసి మందహాసపూర్వకముగాఁ బల్కెను.

ఆ మందహాసము వాని హృదయోత్పలమునకుం జంద్రికాసక్తృశ మయ్యెను. ఇఁక దాని యానందమునకు హద్దులేదు. "అదిగో, అదిగో, ఆ నీమందహాసమే మమ్ము నీకు దాసులుగా నొనర్చుచున్నది? ఆహా! ఎంత సొగసు, ఎంత వింత! అదియే మమ్ము మోహాసముద్రమున ముంచుచున్నది. అడుగుము చెప్పెదను. కాని మన ప్రసంగ మెవ్వరికిని దెలియఁగూడదు" అని వాఁడు పల్కెను

"బ్రహ్మకుఁ దెలియనీయను. అడుగుదునా?"

"అడుగుము."

"ఈ యువతీమణుల నిట్లు హింసపఱచుట యెంత కాలము?"

"ఇఁక నెంతోకాల మక్కఱలేదు; కొలఁది కాలములో నీకష్టము దీఱును లెమ్ము!"

"నాకేమి కష్టము?"

"కాదా! రెండు పూఁటలు నాహారపదార్థములు సిద్ధపఱచి తెచ్చుట మాటలతో నగునా?

"మాయమ్మ యీపరదేసుల నెంతో ప్రేమించి చాలినంత సొమ్ము నొసంగి పరోపకారము చేయుచుండ నేనీపాటియుపకారము చేయఁజాలనా? ఇఁకఁ గొలఁది దినములలోఁ దీఱునంటివి, యెట్లు తీఱును?'

"భర్తలతో సుఖముగాఁ గాఁపురము చేయుదురు."

"భర్తలనఁగా?"

"క్రొత్తభర్తలతో."

"వారంగీకరించినారా క్రొత్తభర్తలను జేకొనుటకు?"

"అబ్బో! నీరెక్కడ? అంగీకరించు టెక్కడ? చింతచచ్చినను బుల్లచావలేదు. మొన్న మాప్రభువు వచ్చి పిల్లతో మాటాడ యత్నింపఁ దూలఁ గసరినది; అనరానిమాట లన్నది. అంతటి వానిస్నేనును గడగడలాడఁ జొచ్చెను."

"ఇట్టివాఁ డెట్లు పిల్లను జేరఁదీసికొని సుఖించును?"

"అట్లనకుము మొదటస్త్రీలట్లే యుందురు; పరిచయమైన కొలఁది వారే మన్నింతురు. ఇంతేకాక యాపిల్ల చెఱలో నున్న యాపురుషు నెంతో ప్రేమించియున్నది. అతనిమీఁది యనురాగము నశించునట్లు చేసినచో నాపిల్ల తనంత తానే వచ్చి మాప్రభువును వరించును."

"ఆపురుషుపై ననురాగమును నశింపఁజేయుట యెట్లు?"

"వాని నిక్కడలేకుండఁ జేసినచో అనురాగము తఱిగిపోవును."

"ఇక్కడ ననఁగా?"

"ఈ లోకమున"

"అయ్యో! అయ్యో! ఏమిచేయుదురు?"

"ఏమి చేసినట్టయిన నీలోకమును విడుచును?"

"ప్రాణములు దీయుదురా?"

"అవును."

"అక్కటా! అట్టి సౌందర్యనిధిని; నట్టిపరాక్రమ నిలయమును, నిష్కారణముగా మంటిపా లొనర్చుటయే?"

"నిష్కారణముగా ననుచున్నా వేమి?"

"మఱి కారణ మేమి?"

"చెప్పితిని గాదా. ఈ పురుషు డున్నంతకాలము పిల్ల మాప్రభువును బుద్ధిపూర్వకముగా వరింపదని: అట్లని మా వాఁడెన్నేనంతకాలము సుఖము చెలుచ్చుకొనును?"

"ఆపురుషునిఁ జంపనేల? దూరముగాఁ దఱిమివేయఁ గూడదా?"

"అమ్మయ్యో! అతఁడెక్కడ! అగ్గిపిడుగు. బంధవిముక్తుఁడైన యూరకుండువాఁడు కాఁడు; మరల నీకాంతను సంపాదించుటకుఁ బ్రయత్నము సలుపును. కనుక నీవన్నది యుక్తము గాదు. ఇంతేకాదు; మూరహీంమున కీతనియందెంతో కోపమున్నది."

"ఎందుచేత?"

"పాప మాపురుషుఁడు మూరహీంమును జావఁగొట్టెను. ఆకసి యిప్పుడు రహీంము తీర్చుకొనును."

"ఎప్పు డీకార్యముఁ జరుగును?"

"రేపు రాత్రి?"

"మీరహీంమధికారి యయ్యెనుగదా! రాత్రి రహస్యముగాఁ జంపనేల?"

"అట్లు చేయకపోయిన కొంప మునుఁగదా ? ఈపురములోఁ జాలమంది మాప్రభువునకు విరోధులు కలరు. నేఁడీ ఘోరకృత్యమును వారెఱిఁగినచోఁ జక్రవర్తిసన్నిధికి మోసెదరు! అందుచే నొరులకుఁ దెలియకుండ నీకార్యమొనర్ప యత్నములు జరుగుచున్నవి!

"ఆతనివధించువా రెవ్వరు!"

"ఎవ్వనికి వానిపై నిండుకోపమున్నదో, వాఁడు"

"రహీమా !"

"అవును."

"ఎక్కడఁ జంపుదురు!"

"అదే యిప్పటికి నిర్దిష్టము కాలేదు."

"సరియే: నేఁబోయివచ్చెదను."

"బాగు ! బాగు ! ఇందులకా నాచేత రహస్యములన్నియుఁ బ్రేలించితివి ? ఎప్పుడు నన్ను దయఁ జూచుట"

"సాయంకాలము మరల వచ్చెదను లెమ్ము" అని చంపావతి కొంచెము నడువసాగెను.

ఆకారాగృహాధికారి, "నిలువుము నిలువుము" అని కొంగు పట్టుకొనఁ బోయెను.

"ఛీ ! నన్ను ముట్టుకొనకుము," అని దాసి కన్నులెఱ్ఱఁ జేసి జూచెను. కారాగృహాధికారి గడగడ లాడఁజొచ్చెను. ఇంతలోఁ జంపావతి మందహాస మంకురింపఁ జేసెను. దానివలన వానికిఁ గొంతధైర్యము గల్గినది. అప్పు డామె యతనిఁ జూచి, ఓయీ ! అంత తొందరపడెదవేమి ? సమయాసమయములు వలదా?" అని పలికెను.

"మ తెప్పుడు?"

"ఓయీ ! అది చెప్పెదను. కాని ముందుగా నీవొకయు పకారము చేయవలెను."

"ఏమది?"—

"ఈపురమున నొకదుష్టుఁడు నన్ననవరతమును బాధించు చున్నాఁడు. వానిం బెండ్లాడినఁ గాని నా ప్రాణములు నిల్చు నట్లు కనఁబడదు."

"ఎవఁడా దురాత్ముఁడు ? రహస్యముగాఁ దీసికొనివత్తు వేని వానిపనిపట్టించెదను.

"అవలీలఁ దీసికొని వత్తును."

"ఎచ్చటికిఁ దీసికొనివత్తువు ?"

"ఈపురమున కవ్వలిప్రక్కనున్న పాడుదేవాలయ మునకు."

"నాకిక్కడ పనియో?"

"ఈపని నెవ్వరైనఁ జూడవచ్చును. ఆపని నీవు తప్పక నెఱవేర్చవలెను ?"

వాఁడు కొంచె మాలోచించి, "మంచిదట్లే చేయవ చ్చును" అనెను.

"నేను మరల వచ్చెదను" అని చెప్పి చంపావతి వెడలి పోయెను. వానిచూపు లామెను జాలదూరము సాగనంపినవి. ఈకారాగృహాధికారి యొకహిందువు. వీఁడు జారుఁడు. వీని ...మహాప్రగల్భ. ఈతనిచెడుగుల నిదివఱ కొకటి రెండు పర్యాయములు కనిపెట్టి తూలనాడినది. భార్యకు వీఁడు మిక్కిలి భయపడుచుండును. వెనుక భార్యను బ్రతిమాలి

కొని తన యపరాధమును సైఁపుమని ప్రార్థించెను. ఆమె సహించి, "యింకమీఁద నిట్టిపనులు చేయుదువేని నేమిచేసె దనో చూడు," మని ఖండితముగాఁ జెప్పెను. దానికి వాఁడు సమ్మతించి తన ప్రవర్తనమును జక్కఁ జేసికొనెను. కాని చంపావతిని జూచి యిపుడు మరల కామాంధుఁడు కాఁ జొచ్చెను.

చదువరులారా! పద్మావతి మీఁదిప్రసంగము విన్నప్పు డామె కెంతదుఃఖ ముదయించెనో? తన ప్రాణ ప్రియుని రహీము చంపునని విన్నప్పటినుండియు నామె తన జీవముపై నిరాశ చేసికొనెను; తన ప్రియుని మరణ వార్త వినకుండఁగనే చావవలెనని నిశ్చయించు కొనెను. ఇప్పు డామెకు వెనుకటంత దుఃఖములేదు. ఆమె మాతృప్రేమను ద్రెంపుకొనెను; ఇహలోకసుఖములఁ దిరస్కరించెను? తన శరీరముపైఁ గూడ నాశ మానెను. ఇఁక నామెకుఁ జచ్చుటకుఁ బూర్వము ప్రియునిజూడవలెనను కోర్కదప్ప మఱేమియు లేదు.

# విలారామ

## 13-వ యధ్యాయము

### ప్రతాపునిదురవస్థ

గీ. "నిక్కముంబతిభక్తిచే-నెగడుచున్న
యింతిఁ బతితోడ నెడబాప-నెవరితరము
ఇచటఁ గుటిలులు నెడబాపి-రేని సాధ్వి
చచ్చి స్వర్గంబునను నిజ-స్వామిఁ గూడు.

శోకవృక్షమునకుఁ బ్రేమ బీజము. ప్రేమ కారణము శోకము కార్యము. కారణముండు చోటనే కార్యముండును; కారణము లేనిచోటఁ గార్యముండదు. కాన బ్రేమలేనిచో శోకము సంభవింపదు. శోకము త్యజించువారు మునుముందుగాఁ బ్రేమము దొలఁగింప వలయును. ఈసూత్రార్థమును గ్రహించియే యోగులు దారసుతాదులందును గృహదేహాదులందును గల ప్రేమానుబంధము ఛేదించి దుఃఖమననేమో యెఱుంగక సుఖింతురు. సంసారి యిట్లు కాక దారసుతాదుల బ్రేమను బెంచుకొని తద్వియోగము గల్గునపుడు శోకము పాలగును. వాఁడు సుఖమన నేమో యెఱుఁగనే యెఱుఁగఁడు. సంసారసాగరమున నోలలాడునపుడు దారసుతాదుల కూడిక వలన సుఖమించుక సంభవించెనేని నది సుఖాభాసము కాని వాస్తవ సుఖము కాదు. ఎట్లాలోచించినను బ్రేమలేనివాఁడే సుఖవంతుఁడు; ప్రేమలేనివాఁడే భాగ్యవంతుఁడు. చదువరులారా! చూడుఁడు పాపము!! ఆప్రతాపరాయుఁ డించు

మించుగా నిరువది వత్సరముల ప్రాయమువాఁడు. కనిపెంచిన తల్లిదండ్రులు సజీవులై సకలోపచారములు చేయుచు గంటిని ఱెప్పవిధమునఁ గాచుచుండిరి. ఛత్రసాలమహారాజతనిఁ గుమారునివలెఁ బ్రేమించుచుండెను. ఇప్పటి కతఁడు సంసారసాగరము పారము నైనఁ జూచియుండలేదు. కష్టమెట్లుండునో శోక మెట్లుండునో యెఱుఁగ నేయెఱుఁగఁడు. దానికిఁ గారణ మాతఁడు ప్రేమబీజము నెచ్చటను బాఁతక పోవుటయే. మాతాపితలందు నెలకొల్పినను తద్వియోగదుఃఖము సంభవింపలేదు. అట్టి ప్రతాపరాయునకు సుఖానుభవమే కాని దుఃఖమేమో దుఃఖానుభవ మెట్లుండునో యెట్లు తెలియును ? కాని యతఁడు పద్మావతిని జూచి తదీయ సద్గుణములకును, సౌందర్యమునకును, జిక్కి ప్రేమించెను. అతనికిఁ బద్మావతితో స్వల్పకాల సహవాసమే యబ్బినను ప్రేమ చిరకాల సహవాసజనిత ప్రేమవలెఁ బరిపూర్ణత నొందెను. ఈప్రేమ కోపాదులవలెఁ బూర్వకర్మ వాసనల ననుసరించి వచ్చుటంజేసి మనమునందది యడఁగియుండి సమయమున నుద్రేకించును. కావున నావీరుని ప్రేమ పద్మావతిపైఁ బూర్ణముగా నెలకొనెను. నెలకొన్న స్వల్పకాలములోనే తద్వియోగదుఃఖ మతఁడనుభవింపవలసి వచ్చెను. దుఃఖమనుభవింప నతని కిదే ప్రారంభము. నూతనప్రియావియోగమునకుఁ దోడు కారాగృహవాసము ! ఈ రెండును దుస్సహములే. అయిన నతఁడు ధీరోదాత్తుఁ డౌటచే నెట్లో సహించెను. కారామందిర మధ్యమునఁ గూర్చుండి యతఁడు తన వృత్తాంతమును స్మరించుకొనఁగా, స్మృతిదర్పణమున సమస్తమును బ్రతిబింబించెను.

కి నవ్వువచ్చెను. తురకలతో బుందేలులకు జరిగిన యుద్ధములను దలంచుకొనఁగానే యావీరునిశరీరమంతయుఁ బులకరించెను; బాహువు లుప్పొంగెను; ఆయుద్ధములఁ దాను జూపిన పరాక్రమాదులు తనకే యచ్చెరువు గల్గింపఁజొచ్చెను. రాఁబోవు యుద్ధమును, దానికి సలుపుప్రయత్నములును, ఛత్రసాలుఁడును ప్రాణనాథస్వామియుఁ జేయుచున్న యూహాపోహలును దలంపునకు వచ్చెను. "అయ్యో! ఆమహానీయులతోఁ గలసి మెలసి వర్తించుభాగ్యము నాకు లేదు కాఁబోలును; ఆ మహాయుద్ధమున దేశమునకై పోరి ప్రతాపాదులను వెల్లడించి యపారకీర్తి గాంచుపుణ్యము నాకు లేదు కాఁబోలు" నని యతఁడు మరల విచారింపజొచ్చెను. తరువాతఁ దాను మధురానగరమునకు వచ్చుటయు, శాంతను రక్షించుటయుఁ, బద్మావతిని బ్రేమించుటయు, నామె తన్నుఁ బ్రేమించుటయు మనంబునఁ దోఁచెను. ఆ పద్మావతి సౌందర్యము, శృంగార

విలాసములు, సరసమృదుభాషణములు, నతఁడు దలంచుకొని ధైర్యము నిలుపఁజాలక పోయెను.

"అయ్యో! ప్రియురాలా! నీయుదారగుణములను మఱచుటెట్లు? మందహాససుందరవదనారవిందమును జూడకుండ నిల్లెంతకాల ముండఁగలను? అకటకటా! ఇట్టి మహాదుఃఖము కల్గించుటకే దైవము మనకంత శీఘ్రముగా సంఘటించెఁ గాఁబోలును. అయ్యో! అయ్యో! నాప్రాణము పోవునని నాకుఁ జింతలేదు, కాని జగద్విఖ్యాతములగు పరాక్రమాది గుణములచే విరాజితుఁడనయ్యు, నిర్మలకీర్తి నార్జింపక, దేశసేవచేయక, శత్రుసంహార మొనర్చి జయముగొని రాజభక్తి చూపక, రాజగౌరవంబు వడయక, నిష్కారణముగా, ముదుసలిముండవలె మూలఁబడి కాలము వ్యర్థముచేయుటకు వగచుచున్నాను. ఎప్పటికైన నిందుండి విముక్తిగల్గునా? ఎట్లు గల్గును? ఈ దూరదేశమునఁ బడియున్న మా వృత్తాంతము మచ్చటివారికిఁ దెలియు టెట్లు? తెలిసినను వచ్చి విడిపింప నెవ్వరు సమర్థులు? కేశవసింగిందులకు సమర్థుఁడైనను నిచటికి వచ్చు టెట్లు? ఆతఁ డిచ్చటికిఁ బ్రత్యక్షముగావచ్చిన నౌరంగజేబునకుఁ జిక్కవలసి వచ్చునేమో యనియే కదా నన్నుఁ బుత్తెంచిరి? అకటా! ఎంత పొరబడితిని? ఎంత ప్రమాదపడితిని? ఊరక దలి వచ్చితిమి; ఇఁక మన కపాయము రాదని ప్రమత్తుఁడ నైతిని; నిద్రించితిని. లేనిచో శత్రువుల యాటలు సాగునా? అయ్యో! ఎంత కష్టము! ఈ యపాయమును నా యంతట నేనే తెచ్చుకొంటిని," అని యతఁడు తలపోయుచుండ రాత్రి చాలభాగ మతిక్రమించెను. నిద్రింపవలయు

నని యతఁడు కన్నులు మూసికొనెను. మనస్సు బాహ్యవ్యాపారములనుండి మరలని యప్పుడు నిద్రకై యెన్ని ప్రయత్నములుచేసిన నేమి ప్రయోజనము. అప్పుడతని గది తలుపు చప్పుడయ్యెను. తలుపు చక్కఁగా బంధింపఁబడినదో లేదో యని పరీక్షించుటకుఁ గారాగృహాధికారి తట్టియుండునని యతఁ డూరకుండెను; కన్నులు తెఱవక యట్లే శయనించి యుండెను. ఎవ్వరో వచ్చినట్లడుగుల చప్పుడు వినవచ్చెను. ఇప్పు డతఁడు కన్నులు విప్పిచూచెను. గాని యేమి లాభము? ఆమందిరము గాఢాంధకారబంధురమై యుండెను. ఇంతలో నెవ్వరో వచ్చి యతనిపాదములు పట్టుకొనిరి. అతఁడు త్రుల్లిపడి "ఎవ్వ"రని ప్రశ్నించెను. "అదృష్టహీనయగు పద్మావతి" యని బదులు వచ్చెను. తోడనే యతఁడులేచి చేతులుచాఁచి తడవుచు "పద్మావతియా! నా ప్రియురాలగు పద్మావతియా" అని సోత్కంఠముగాఁ బలుకసాగెను. అతని మాటలకుఁ బ్రత్యుత్తరము లేదు. ఆ పద్మావతి యావీరునిపాదపద్మములపై తనముఖముంచి గట్టిగాఁ బట్టుకొనెను. ఆమె యేమి చేయుచున్నదో యాచీఁకటిలో నతనికి మొదట బోధపడ లేదు. కాని వెచ్చని బాష్పధారాప్రవాహ మతనిపాదములఁ దడుపుటచే నామె దుఃఖించుచున్నదని యతఁడు తెలిసికొని, యత్యాదరముతో లేవఁదీసి యామెను దనతొడపైఁ గూర్చుండఁ బెట్టుకొనెను. ఆ సుందరి తన బాహువల్లరి నతని మెడకుఁ జుట్టెను. ప్రతాపరాయుఁ డామె కన్నీటిని దుడుచుచు "సుందరీ, విలపించెదవేల? కష్టములు స్థిరములుగావు. మనకీ స్నేహసౌఖ్య మబ్బునని కలయందైనఁ దలంచితిమా? దైవము

మనకుఁ దెలియకుండఁగనే కష్టసుఖములు గూర్చుచుండును. మన కిందుండి కొలఁదిదినములలో విముక్తి గల్గును. దుఃఖము విడువుము." అని యోదార్చెను. అతని వచనములు విన్న కొలఁది నామె దుఃఖము హెచ్చుచుండెను. తాము విముక్తులగుట యసంభావనీయమేయని సిద్ధాంతము చేసికొన్నను బ్రతాపరాయుఁ డామె దుఃఖముఁ దొలఁగింపవలెనని యిట్లు పలికెను. అంతియ కాని మఱునాఁటితోఁ దనయాయువు పూర్తియగునని యతఁ డెఱుఁగఁడు. మరల మరల నోదార్చుచు, "ఓ ప్రేయసీ! మనపూర్వపుణ్యవశమున నిప్పుడాకస్మికముగా సంభవించిన మనసమాగమమున కానందించుటకు బదులుగా దుఃఖింతువేల?" యని యతఁ డామెచుబుకమును నిమురుచుఁ బలికెను.

పద్మావతి శోకోద్రేకమును గొంత యడంచుకొని విన్న వృత్తాంతమంతయు విన్నవించి దుఃఖము నాఁపఁ జాలక బోరున నేడ్వఁ జొచ్చెను. కన్నీరు కాల్వలు గట్టుచుండెను. అందువలనఁ బర్వతరాజును ధిక్కరించు ధైర్యము కలవాఁడైనను నతని చిత్తము చలింపఁ దొడగెను. కంఠస్వరము బాష్పముచే స్తంభితమయ్యెను.

"నాథా! మీవంటి యుత్తమపురుషుఁడు లభించెను గదా యని యెంతో సంతసించుచుంటిని. ఎంతోకాలము మీతోఁ గలిసి సుఖింతు ననుకొంటిని. ఎంతోకాలము మీపాదపద్మసేవాభాగ్యము లభించునని నిశ్చయించుకొని ఎంతో కాలము మిమ్మూఁతగాఁ గొని సంసారసాగరమున నిరపా

యముగా సుఖముగావిహరింతుననుకొంటిని. లోకమున నుత్తమ దాంపత్యమనగా మనదే యని మురియనుంటిని. స్వదేశముచేరి మీకనుకూలముగా వర్తించి సత్కీర్తి గాంచవలెనని కొండంతాస వెట్టుకొంటిని. అయ్యో! క్రూరదైవ మానాసంతోషమును నాగర్వమును నామనోరథములను మంటగలిపివేసెను. ఇఁక నాకు గతియేది? మీరు లేనియప్పు డీ జీవనమేల? ఈసౌందర్యమేల?" అని పద్మావతి మిక్కుటముగా విలపింప నారంభించెను. ఈపలుకులు విన్నతోడనే యతి కష్టముతోఁ జిక్కఁబట్టిన రాజకుమారుని ధైర్యము మరలఁ జెల్లాచెదరయ్యె. అయినను జ్ఞానబలముచే విచారమును దొలఁగించుకొని; "సుందరీ! ఈ విచార మేల? వీనిని విడిచి నాప్రశ్నముల కుత్తరము లిమ్ము" అని యతఁడు పలికెను.

పద్మావతి కొంచెము శాంతించి "నాథా! అడుగుఁడు" అని పల్కెను. వారిరువు రిట్లు భాషించిరి:—

"సుందరీ! రేపు నామరణము నిశ్చయమా?"

"ఈదీనురాలిమరణముతోఁ గూడ"

"మనము తప్పించుకొని పోవుట కుపాయ మేమియు లేదా?"

"నాకేమియుఁ గానరాలేదు."

"ఇప్పు డెట్లు వచ్చితివి?"

"ఈకారాగృహాధికారికి లంచమిచ్చి"

"మనవిడుదల కీలంచము సాధనము గాదా?"

"నాగదిలోనుండి యిచ్చటికి రానిచ్చుటకే వాఁడు సామాన్యముగా నొప్పుకొనలేదు."

"మీజనని యెంత కుందుచున్నదో చూచితివా?"

"చూడలేదు."

"ఎందులకుఁ బోలేదు?"

"ఆమెగుండె పగులఁగొట్టి చంపనిష్టములేక"

"అదేమి ? అట్లనుచున్నావు?"

"మనయిర్వురి మరణవార్త విని జీవించునా?"

"ఇక్కడి కేల వచ్చితివి?"

"సహగమనమునకును మీయాజ్ఞవడయుటకు, మఱియుఁ గడసారి మీపాదధూళి నాశిరమునఁ దాల్చిపవిత్రనగుటకు."

"సహగమనము నీకెట్లు కుదురును? ఆదురాత్ములు చావ నిత్తురా ?"

"ఆక్రూరు లేమిచేయఁగలరు ? ఇదిగో చూడుఁడు," అని గుప్తముగా నుంచుకొన్న యొకకత్తిని జూపెను. ఆరాజకుమారుఁ డాశ్చర్యముచెంది "సుందరీ! నాతోఁ జచ్చి మీ తలిదండ్రులకు దుఃఖము కల్గించుట న్యాయమా ?" అని యనెను.

"నేను బ్రదికి యుండిన నింతకంటె దుఃఖము కల్గింతును" అని యామె దృఢముగాఁ బల్కెను. ఆయువతి ధైర్యసాహసముల కతఁ డచ్చెరువు పడెను. ఇంతలోఁ గారాగృహాధికారి వచ్చి త్వరచేసెను. "నాథా! ఇట నేనుండ వలనుపడదు. ఇదే కడపటి దర్శనము. పరలోకముననే మనము మరలఁ గలిసికొందుము. ఒకసారి మీపాదములు నాశిరమున మోపుఁడు. దయయుంచుఁడని పల్కి యట్లుచేసి పద్మావతి వెడల నిశ్చయించెను. ప్రతాపరాయుఁడు మరలఁ దుఃఖాంబుధిలో మునిగెను. పోవు

చున్నయామె చేయిపట్టుకొని, "సుందరీ! నాకడపటివాక్యము వినుము. నామరణవార్త స్పష్టముగా విన్నతర్వాతగాని నీవు మృతినొంద యత్నింపవలదు. అట్లు చేయుదునని నాచేతిలోఁ జేయి వేయుము." అని పలికెను.

"నాథా! అదెందులకు?" అని పద్మావతి ప్రశ్నించెను.

"యువతీమణీ! దైవవశమున నాచావు తప్పిపోయినచో నీవియోగమును భరించుట కష్టము. నీనిమిత్తము నేజీవనము వదలవలెను. అట్లయిన నిష్కారణముగా మనంతట మనమే చచ్చినవార మగుదుము" అని యతఁడు పల్కెను.

"నాథా! అంతయదృష్టము పట్టునా? మన యదృష్టమిూ యాపదను దప్పింపఁ జాలినదని నాకు నమ్మకము లేదు. అయిన మిూయనుమతి చొప్పుననే వర్తింతును," అని యామె పల్కి చేతిలోఁ జేయివేసి యతని వీడ్కొని పోయెను.

ప్రతాపరాయఁడు పద్మావతి యుత్తమగుణములకు మిక్కిలి మెచ్చుకొనెను. అట్టియుత్తమురాలితోఁ గలిసి చిరకాలము సుఖించుభాగ్యము తనకు లేనియందుల కెంతయో విచారించెను. తర్వాత నాఁడాకస్మికముగాఁ దనకు రానున్న మహాపదకు డెందమునఁ గుందసాగెను. ప్రాణముల విడువ నాతని కంత విచారములేదు. కాని మహావీరుఁడయ్యు, సత్తమక్షత్రియకులసంభూతుఁ డయ్యుఁ బరాక్రమాదిసద్గుణభాసమానుఁ డయ్యు వీరపురుషోచితమరణము పొందలేకుంజేసి యతనికి దురంతచింత గల్గుచుండెను.

# దిలారామ

## 14-వ యధ్యాయము

### రహీము పురాధికారము

గీ. "చీఁకటనఁ జర్మ చక్షువు-లేకయున్న
నరయజ్ఞానాక్షిగలదు; కా-మాంధుఁడైన
వానికుభయంబు నుండదు-వాఁడు స్త్రీల
మర్మము దెలిసికొనలేఁడు-మాసిపోవు."

ఇప్పటికి రహీముమనోరథ మీడేఱెను; గుండె గూటఁబడెను. ఇంతకు ముందు దిలారామ తనకిల్లాలగునో కాదో యని చేఁప కొట్టుకొన్నట్లు కొట్టుకొనుచు వాఁడు దురంత సంతాపమున వేఁగుచుండెను గదా? రహీమును బెండ్లాడుదునని దిలారామ పంపిన యుత్తరమును హానస్సేను ఢిల్లీకిఁ బోవునపుడు రహీమున కిచ్చెను. అది వాఁడు చదువుకొని నిర్భరానందభరితుఁ డయ్యెను. వెనుకటి సంతాపము మాయమైనది. ఇఁక వానిసంతోష మిట్టిదని యెవ్వరు చెప్పఁగలరు. ఢిల్లీ సామ్రాజ్యలక్ష్మి లభించినను దాదృశ సంతోషము పొడమదని నాతలంపు. వాస్తవమే; మన్మథసామ్రాజ్యలక్ష్మియగు దిలారామవలె, శత్రుకంటకవిదీర్యమాణ మగు ఢిల్లీసామ్రాజ్యలక్ష్మి సుఖింపఁ జేయంగలదా? సంతసింపఁజేయఁ గలదా? రహీము నడిగినచో ఢిల్లీసామ్రాజ్యము సౌందర్యమహితురాలగు దిలారామగోరునకైనను జాలదని చెప్పకమానఁడు.

ఒక్క రహీమే కాదు; దిలారామను జూచినమానవుఁ డెవఁ డట్లు తలంపఁడు? దిలారామ యౌవనారంభదశయం దున్నది; నిరుపమాన సౌందర్యరసము యౌవన విలాసములతోఁ గూడ నంగములఁ దొలఁకాడుచుండెను; ధనవంతురాలు ఇట్టి యువతిని బరిగ్రహింప నెవని కారాటముండదు? ఎవ్వఁ డందులకై ప్రయత్నింపఁడు? ప్రయత్నము విఫలమైనచో నెవని మానసము చింతానలముగాదు? రహీమందులకై చెప్ప రాని కష్టములు పడెను గదా? ఆ కష్టములు వానికొక్కొ కప్పుడు విరక్తిని గల్గించుచుండెడివి. పడరాని కష్టములు పడియుఁ, బ్రాణాపాయకరమగు నాయుధఘాతములు చెం దియు, సరకుగొనక మోసపుచ్చి పద్మావతిని దెచ్చి హుస్సేనున కర్పించుట దిలారామను బెండ్లాడఁ దలఁచియే కదా? అయి నను దనకార్యము నెఱవేఱుటచే వెనుకటి కష్టము లన్నియు మఱి కష్టములనిపింపలేదు. కొన్ని గాయము లింకను బాగుగా మానక బాధ గల్గించుచునే యుండెను. అవియన్నియు నతని కిప్పుడు గానరాలేదు. "నా స్నేహితుఁడు హుస్సేను ఢిల్లినుండి యెప్పుడు వచ్చునో యెప్పుడు దిలారామను నాకిచ్చి పెండ్లి యొనర్చునో," అని యతఁ డూట లూరుచుండెను. ఇప్పు డతఁడు పురాధికార మవలంబించి తత్సంబంధములగు వ్యవహార ములను జక్కఁబెట్టుచుండెను గదా? తన శత్రువగు ప్రతాప రాయునిఁ జంపుటయు నట్టివ్యవహారములలోనిదే. లోకు లకుఁ దెలియకుండ వానినిఁ జంపుట యెట్లోయని పరిపరి విధములఁ దలపోయ, వానికిఁ దుద కుపాయ మేదో తట్టినది. జాము రాత్రి యగునప్పటికిఁ దన స్నేహితుల రండని యు త

రువుచేసి, యొకమాఱు దిలారామను జూడవలెనని వాఁడు లేచెను. తానీయధికారము పూనినతర్వాత నామెను వాఁ డొకసారియుఁ జూడలేదు. లోపలికిఁబోయి యద్దముఁ జూచు కొనఁగా వానికి ముఖము వికృతముగాఁ గన్పట్టెను. చంద్రునందుఁ గళంకమువలెనే ముఖమందున్న గాయము సౌందర్య విలోపికాదని మనసు సమాధానముచేసికొని, యమూల్యము లగు వస్త్రాలంకారములఁ దాల్చి, కేల నొక విలాసదండము పూని, వాఁడు మందమంద గమనముతోఁ దిలారామ సౌధ మున కరిగెను. ఇతఁడు పోవునప్పటి కామె చంపావతితో నేమేమో సంభాషించుచుండెను. రహీమునల్లంతదూరముననే చూచి యాయిర్వురును సంభాషణము నిల్పివేసి, అతని కుచిత మర్యాదలు సల్పిరి. ఇదివఱ కెన్నఁడును వానికంత గౌరవము జరుగలేదు. వాఁడధికారానందభరితుఁడై తనపై నూతనముగాఁ గలిగిన యనురాగమే యా గౌరవమునకు హేతువని తలంచుచు నాసనాసీనుఁ డయ్యెను. చంపావతీ దిలారాములు నిలువఁ బడిరి. అపుడు చంపావతి, యిట్లు భాషించె.

"పురుషవర్యా! మీరిచ్చటికి వచ్చి చాలకాల మయ్యెను. రాకుండుటకుఁ గతమేమి?"

"మునుపటివలెఁ గాదు. పురాధికారభార మంతయు నాపైఁబడినది. ఆవ్యవహారములలో మునిఁగియుండుటచే వీలు చిక్కలేదు."

"ఇప్పుడీ నూతనాధికారము వచ్చినది; కాని యెంతకుఁ బూర్వమో?"

"ఈ గాయములు బాధించుచుండుటచే రాలేక పోతిని."

"అయ్యో! అడుగ మఱచితిని. ఈగాయము లెప్పుడు తగిలినవి?"

"నామిత్రుని నిమిత్తము పద్మావతిని దెచ్చుటకుఁ బోయి నప్పుడు?"

"ఎవరిట్లు కొట్టిరి? అకారాగారములోనున్న పురుషుఁడా?"

"అవును; ఆ దురాత్ముఁడే."

"సుందరమైన మీముఖమును గాయపఱచి, వికృతముగాఁ జేసినందుల కిప్పుడాపురుషునిపై మాకుఁ బట్టరాని కోపమువచ్చుచున్నది. వానికిఁ దగినశిక్ష చేయక పోతిరా?"

"అదెంతసేపు? ఈరాత్రి వానిపైఁగల నాకసినంతయును దీర్చుకొందును."

"ఎట్లు."

"కత్తిచే వానికంఠమును గోసి."

"అమ్మయ్యో! మీరే యాపనిచేయుదురా?"

"అవును; అప్పటికిఁ గాని నాకోపము దీఱదు"

"ఈమాట విన్నతోడనే మాగుండె లదరుచున్నవి."

"కారణమేమి?"

"మీరెంత యధికారులైనను బరుల కీఘోరకృత్యము తెలిసినచో మీకాపద సంభవించిన మాచెల్లెలు బ్రదుకు టెట్లు?"

రహీము మందహాసము చేయుచు, "భయములేదు, బ్రహ్మకైనను దెలియకుండ నీపని నొనర్తును."

"హుస్సేనుగా రిందుల కంగీకరించిరా?"

"మొదటఁ జక్రవర్తివలన మాటవచ్చునేమో యని జంకెను. కాని ప్రతాపుడుండఁ బద్మావతి తనకుఁ జిక్కదేమో యని తుదకంగీకరించెను."

"ఆవీరుఁడు మహాపరాక్రమశాలివలె నున్నాఁడు. మీ రొక్కరే యుండినఁ బ్రమాదించునేమో? స్నేహితులను గూడఁదోడుగా నుంచుకొండు."

"ఆభయము లేదు. వానికాలు సేతులు త్రాళ్లతో గట్టిగా బంధింపఁబడును. అప్పుడు వాఁడేమి చేయఁగలఁడు?"

"ఆమొండెముల నేమిచేయుదురు?

"మనతోఁటలో నున్న పాడునూతిలోఁ బాఱవేసెదను"

"ఈపని యెచ్చట జరుగును?"

"ఆపాడు నూతియొద్దనే?"

"మేము వచ్చిచూడ వలనుపడునా?"

"వలనుపడదు; ఆసమయమున నాస్నేహితులనుగూడ జెంత నుండనీయను."

"నామాటకేమి? చూడ వేడుకపడుచున్నది, దిలారామను దీసికొని పొండు."

"అయ్యో! ఆ చీఁకటిలో నీమె భయపడకుండ నుండఁ గలదా! ఆ తోఁట మహారణ్యమువలె భయంకరముగా నున్నదే."



"అవుఁగాక! ధైర్యశాలులు మీరుండఁగా నీమెకేమి భయము?"

రహీము దిలారామ మొగముపై చూపులుపఱపి, "సుందరీ! చూడవలెనని యున్నదా? నాధైర్యసాహసములు ప్రత్యక్షముగాఁ గనుఁగొనవలె ననియున్నదా? నీకోర్కి దీర్పుటకంటె నాకుఁ గావలసిన దేమున్నది. అనుమతించితిని; నీవు రావచ్చును," అని పలికెను.

రహీమిామాటలు పల్కుచున్నపుడు దిలారామ మోమున మందహాస మంకురించెను. అది త్రపామిళితమై మనోహరముగాఁ జూపట్టెను. ఆమె వదనమును బ్రక్కకుఁ ద్రిప్పుకొని, "మిక్కిలి సంతసించితిని," అని పలికెను.

"యువతీమణీ, ఆసమయమునకు వచ్చి నిన్నుఁ గొని పోవుదును; సిద్ధముగా నుండుము." అని రహీము లేచెను.

"మీరంత శ్రమపడనేల? ఆస్థలము మాచంపావతి యెఱుఁగును. వచ్చి నన్నక్కడ దిగవిడిచి మరలిపోవును." అని యామె సమాధానము చెప్పెను.

# దిలారామ

## 15-వ యధ్యాయము

### ప్రతాపుని విముక్తి

గీ. "పౌరుషము వ్యర్థమగును దైవంబుతోడు
గనక, యదిమూర్ఖుఁ డెఱుఁగక-కడఁగి పురుష
కారమును జూపుఁ,గృతకృత్యుఁ-గాఁ దనునెంచు
దైవమొసరించు వేఱువి-ధముగఁ దుదకు."

రాత్రి సార్థయామ మతిక్రమించెను. అంధకారము గాఢముగా నలమెను. ప్రకృతియంతయు నిస్తబ్ధత వహించి యుండెను. ప్రజలు నిద్రాణులై శయ్యాతలములను జేరిరి.

రహీము భుజించి తత్సమయానుకూలవేషము ధరించు చుండెను. ఇంతలో వానిహితులు వచ్చి దర్శించిరి. అతఁడు వారిని నిలువ నీయలేదు. వారితో నేమో రహస్యముగాఁ జెప్పి పంపివేసెను. రహీము వేషము ముగియఁగానే భయంకర కరవాలమును దాల్చి నిర్భయుఁడై యిల్లు వెడలివచ్చెను.

వాని మందిరమునకు గంతవ్యస్థానమగుతోఁట యెంతో దూరము లేదు. రహీము మందగమనముతో నాకూపసమీపమునకు నడువసాగెను. అప్పుడు వాని మనోదర్పణమున సాయంసమయమున వర్తిల్లిన వృత్తాంతము ప్రతిబింబించెను. అప్పటి దిలారామచేష్టాదులను వాఁడు మనసార స్మరించుకొనెను. దిలారామ నాఁడు తొంటివలె విచ్చలవిడిగా మాటా

డ లేదు. మితముగా సంభాషించెను. వానికదియే యధికానం
దమునుగూర్చెను. వాఁడిట్లు తలపోయఁ జొచ్చెను. "ఆహా!
నేఁడు దిలారామ చూపులు వెనుకటివలె స్వేచ్ఛగా నాపైఁ బ్రస
రింపలేదు. అయిన నవియే నాకింపు గొలిపెను. అయ్యారే!
త్రపాభరమున మందములయి చాటుచాటునవచ్చి నాపైఁబడిన
యామె మనోహరవీక్షణముల నెంతని వర్ణింపఁగలను? ప్రౌఢ
కామినీస్వేచ్ఛావలోకనములు వీనిముం దెందులకుఁ బనికి
వచ్చును? వివాహముగాక పూర్వము ప్రియురాలిసందర్శన
మెంతహాయి గొలుపుచున్నది! సామాన్యముగా మహమ్మదీయుల
కీసౌఖ్య   శశవిషాణప్రాయము. వివాహము నిశ్చితమైన
పిమ్మట వధూవరులు పరస్పరమును జూచుకొనఁ గూడదఁట!
ఈతుచ్ఛమహమ్మదీయాచారమును వదలి నాకు హాయిగల్గించి
నందులకు దిలారాము నెంతేనియు మెచ్చవచ్చును," అని తలం
చుకొనుచు వాఁడానాతిని జేరెను. అప్పటికతనిమిత్రులు ప్రతా
పుని దృఢముగా బంధించి తెచ్చి యతనికై నిరీక్షించియుండిరి.
రహీము ప్రతాపునిబంధనములు దృఢముగా నున్నవో లేవో
యని చేతితోఁ బట్టిచూచెను. అతని స్నేహితు లతని కంటెను
బుద్ధిమంతులు. సామాన్య రజ్జువులతో బంధించినఁ బ్రతాపుఁడు
త్రెంపుకొనునేమోయని దృఢపాశములచే బంధించిరి. రహీము
వారిని జూచి మీరిఁకఁ బోవచ్చునని పలికెను."

"మేమున్న నేమిప్రమాదము? ఈదురాత్ముని చావు
కన్నులారఁ గాంచి యానందింప నిమ్ము." అని మిత్రులలో
నొకఁడు పలికెను.

"నాప్రియురాలు దిలారాము యిచ్చటికి వచ్చును. మీరుండిన సిగ్గుపడును." అని రహీమనెను. వారు మాటాడక వెడలి పోయిరి. అప్పుడు రహీము ప్రతాపరాయునితో, "ఓరీ తుచ్ఛా! నాకొనర్చిన యపకారమునకుఁ బ్రతిఫల మిప్పుడే యనుభవింపుము." అని పలికెను. ప్రతాపరాయునకుఁ బట్టరాని కోపమువచ్చెను. అయినను పాప మేమిచేయును ? కాలుసేతు లాడవు. ఆసమయమున నోరుమాత్రమే స్వాధీనమై యుండెను. "ఓరీ ! నీచా! తురుష్కాధమా ! నీపాప మెప్పటి కైనను బండక మానదు. నిష్కారణముగా నన్ను బాధించుచున్నావు. క్రూర కరవాములచే నీసంధిబంధముల ఛేదించి నీమాంసమును నక్కలకును, గుక్కలకును వైచినను నాకోపము దీఱదు. నీవిట్లు నీచముగాఁ గాక ఖడ్గపాణివై భండన మొనర్చి నన్నుఁ జంప నెంతువేని నాతలంచిన పనిని నెఱవేర్చుకొనియుందును" అని ప్రతాపరాయుఁడు సక్రోధముగాఁ బల్కెను. రహీము క్రోధాగ్నిజ్వాలకీమాటలు గుగ్గిలసదృశము లయ్యెను. వాఁడు కత్తితో నొక్క వ్రేటున నతని నఱుక నెంచెను గాని యింతలో దిలారామ మెల్లమెల్లగా నటకు వచ్చుటచే నామెను మన్నించుటలో నీక్రోధము కొంచెము శాంతించెను. "సుందరీ ! నీనిమిత్తమే చూచుచున్నాను. వీని కాఱుకూతలు నామానసము నెరియించుచున్నవి. ఇదిగో! ఱంపముతోఁ గోసినట్లితని కంఠనాళమును గోసెదను. చూచి సంతసింపుము," అని పల్కి కత్తి నతనికుత్తుకపైఁ జేర్చెను.

"ఉండు ముండుము, ఆతఁడేదో ధ్యానించు కొనుచున్నట్లున్నది. అట్టి సమయమునఁ జంపరాదు. ఒక్కనిముస

మాఁగుము," అని దిలారామ యనెను. ప్రియురాలిమాట కెదురు చెప్పలేక రహీము తన కత్తిని లాగుకొని నూతిగట్టు నానుకొని నిలిచియుండెను. దిలారామ యతని ప్రక్కను నిలువఁబడెను. ప్రతాపరాయుఁ డెదురుగా వానికి సమీపముగా నిలిచి నిమీలితనేత్రుఁడై పరమేశ్వరుని ధ్యానించుచుండెను. రహీము ప్రతాపరాయుని దుర్గుణముల వర్ణించి చెప్పుచుండెను. ఆసమయమున ఘల్లుమను చప్పు డయ్యెను. తోడనే "హా!" యను నార్తస్వరము వినవచ్చెను. అవెంటనే గుభేలుమను ధ్వని వ్యాపించెను. దిలారామ యది చూచి యాశ్చర్యముచేతనో సంతోషాతిశయముచేతనో కాని స్తంభాకృతి వహించెను. పరమేశ్వరధ్యానమే కాఁబోలును ఖడ్గమై ప్రతాపుని కాలిబంధనముల ఛేదించెను. ఇట్లు ఛేదించిన దొక స్త్రీ. ఇంకను జేతిబంధనము లట్లే యుండెను. ఇంతలో నతని వెనుకనుండి యాయువతి వచ్చి యతని హస్తబంధనములఁ గూడ ఖండించి వైచెను. ఆయువతీమణి యెవ్వరో చీఁకటిలోఁ బ్రతాపుఁడు గుఱుతింప లేకపోయెను. అత్యాశ్చర్యభరితుఁడై "అబలలారా! మీ రెవ్వరో మీవృత్తాంత మేదో చెప్పినన్నానందపరితుని జేయుఁ," డని యతఁ డడిగెను.

కాని వారతని కేమియుఁ జెప్పలేదు. వారతనితోఁ గూడఁ గొంచెము దూరమరిగి యక్కడ నిలిచిరి. ప్రతాపునితోఁ గూడ దిలారామ యొక మార్గమునఁ బోయెను. చంపావతి యొక్క తెయు వేఱొక మార్గమునఁ బోయెను.

# చిలారామ

## 16-వ యధ్యాయము

### — మోసము —

శ్లో. "కామాతురాణాం న భయం నలజ్జా."

వధించుటకై తురకలు ప్రతాపరాయుని బంధించికొని పోవుట పద్మావతి కన్నులారఁ గాంచెను. దుఃఖము దావానలముభంగి నడరి శరీరలతను దహింపఁ జొచ్చెను. ఆసంతాపమామెకు మహాభర మనిపించెను. మానసము దుఃఖాకులమైనపుడు సమస్త మసహ్యముగాఁ జూపట్టునుగదా? ఇంతకు ముందెంతో సంతోషము గల్గించు ప్రకృతిసౌందర్య మిపుడామెకు దుఃఖజనకమై యుండెను. సమస్తవస్తువులపైని రోఁత జనించెను. ప్రాణ మామెకుఁ గొండంత బరువుగఁ దోఁచుచుండెను. శరీరముపై విరక్తి యుదయించెను. ఆమహాపురుషుని గౌరవమునకుఁ బాత్రమగు నాశరీరముతో, నతఁడు లేకపోవుటం జేసి నరకప్రాయమైన నీలోకమున జీవింప నామె కిష్టములేదు. ఆమెకిక లోకయాత్ర వెనుభూతమువలెఁ గన్పట్టసాగెను. వెనుకటి యాపదలలో దుఃఖ సముద్రమును దరింప నౌకాసదృశులైన తల్లి తత్పతి విరహార్ణవమును దాఁటింపఁ జాలిన సాధనము కాదని యామె యెఱుంగునుఁ గావునఁ దల్లిసాయ మపేక్షింపలేదు. పతితోఁ గూడఁ బ్రాణములు విడిచి పరలోకమునకేగి యట భర్తృసాంగత్యము వడయుట

దుఃఖసాగరములు దాఁటఁ దగినసాధనమని యామె నిశ్చయించెను ; తన శరీరసౌందర్యము వ్యర్థమగుటకుఁ జింతించెను ; పతిలేని యీలోకమునఁ దాదృశ సుందరశరీరము నుంచుట దన కవమానకరమని తలపోసెను. తన సుందరశరీర మనుభవింపఁ జాలిన యుత్తమపురుషుఁడు ప్రతాపరాయుఁడు లేనియపుడది వ్యర్థమని యామె యుద్దేశము, వ్యర్థపదార్థమును బోషించి భూదేవతకు బరువు గల్గింప నామె మనస్సొప్పలేదు. పతివ్రతకు భర్తదేలోకము కావునఁ దానిఁక దేహమును విసర్జించి ప్రియుని గలియఁ బరలోకమునకుఁ బోవ నిశ్చయించుకొనెను. ప్రియుని పాదపద్మములఁ దన హృదయపీఠమున నుంచెను; మానసికారాధన మొనర్చెను : పొడిచికొని జీవమును విడువనెంచి కత్తిని దీసికొనెను; తదీయ నిశితాగ్రమును గుండెపై నానించెను. ఇఁక శరీరమును దూసికొని పోవునట్లు దానిని గట్టిగా నొక్క యత్నించెను. ఇంతలో నంతరాత్మ యేదో చెప్పుచున్నట్లయ్యెను. పద్మావతి యదియేమో యని జాగరూకతతో వినెను. "పతివ్రతపతివచనము నుల్లంఘింపరా," దని యంతరాత్మబోధ. పద్మావతి వివేకవంతురాలు ; వెనుక పతి పలికినవచనమును స్మరించుకొనెను;కత్తిని యథాస్థానమున నుంచెను. కారాగృహాధికారి నడిగి తన భర్త వృత్తాంతమును దెలిసికొననెంచి ద్వారము చెంతకు వచ్చి నలుగడలు పరికించెను. వాఁడిప్పుడు కొంచెము దూరముననున్న సింహద్వారముచెంత నిల్వఁబడి యెవ్వరినిమిత్తమో తదేకదృష్టితోఁ జూచుచుండెను. వాఁడు తనచెంతకు వచ్చునేమోయని తలంచి పద్మావతి యట్లే కొంతసేపు నిలువఁబడెను. కాని వాఁడీవంకఁ జూడనైనఁ జూడలేదు.

పద్మావతి యూరకుండక వాని నొకటి రెండు పర్యాయములు పిలిచెను; వాఁడందులకుఁ బ్రత్యుత్తర మేమియుఁ బలుకలేదు. కారాగ్యాంతరాసక్తుఁడైనవాని కది వినిపించెనో లేదో! అంతట నొక యువతీమణి సత్వరగమనమున నచ్చటి కేతెంచెను. ఆమెను జూచి వాఁ డధికానందభరితుఁడై "సుందరీ! ఏమిచేసి తివి ? ఏమిచేసితివి ?" అని యాత్రముతో నడిగెను.

ఆవచ్చినయువతి చదువరులకుఁ జిరపరిచిత యగు చంపావతి.

"ఓయీ ! సర్వము సన్నద్ధమైనది. ఇఁక నీవేగుటయే తరవాయి." అని చంపావతి చెప్పెను.

"వాఁ డొంటిగా నున్నాఁడా ? లేక యెవరైన దోడు న్నారా?"

"లేదు; వాఁడొంటిగానే యున్నాఁడు."

"సరే పోయెదను. కాని రహీము వచ్చునేమో యని భయపడుచున్నాను."

"నీవందులకు జంకవలదు. రహీమిఁక వచ్చుటెక్కడ? వాఁడిప్పుడు దిలారామనలలోఁ జిక్కియున్నాఁడు."

"రహీము నామె వరించినదా?"

"అవును" అని చంపావతి తలయూఁపెను.

"సత్యమే ?"

"ముమ్మాటికిని?"

"ఏమిటి సత్యము ?"

"పిచ్చివానివలె నడిగెదవేమి ? రహీమునకుఁ గాఁదగిన దేదో యదియగుట."

"ఆహా! ఎంత యదృష్టము; అక్లే నాపై! నీకెప్పుడు?" అని మందహాసముచేసి యూరకుండెను.

"ఓయీ! సందేహమేల? నీవు వేగమరిగి వచ్చితివేని రహీమునకువలె నీకును దగిన కార్యము సంభవించును."

వాఁడు సంతోషముతో, "ఎప్పుడు?" అనెను.

"ఎప్పుడో యేల? ఈదినముననే."

"నిశ్చయమే కదా?"

"సందేహమేల? కార్యావసానమున నీకే తెలియును."

"మంచిది, అడుగ మఱచితిని. ప్రతాపరాయుని గతి యేమైనది?"

"ఏమి కావలయునో యదే యైనది."

"అనఁగా నాకర్థము కాలేదు."

"నీకెంతని చెప్పవలయును? సుఖ మనుభవించు ౦౦డెను."

"స్వర్గసుఖమా?"

"అది చాలదు. అంతకంటె నెక్కువదే."

"అబ్బా! రహీము పట్టినపట్టు వదలఁడు."

"అవును, అంతేకాదు. దానికిఁదగిన ఫలమును గూడ ౦ంటనే పొందకమానఁడు."

"సత్యము వచించితివి," అని వాఁడనెను.

ఈసంభాషణము పద్మావతి వినెను. కాని యదియా మెకుఁ జక్కఁగా నర్థము కాలేదు. చంపావతి దన చెంతకు వచ్చినచో నడిగి తెలిసికోవలెనని తలంచి యచ్చట నిలిచి యుండెను.

చంపావతి వానిఁ జూచి, "ఇఁకఁ దడవేల? వేగముగాఁ బోయిరమ్ము" అనెను.

"భటులు రాఁగానే వెళ్ళెదను."

"ఎంతసేపటికి వత్తురు?"

"ఒకటి, రెండుగడియలలో వత్తురు."

"అంతసేపుండినఁ గార్యము చెడును."

"మఱి కర్తవ్యమేమి?"

చంపావతి కొంచెము యోజించి యిట్లనియె. "ఓయీ నీవు వచ్చునందాక నేనిచ్చటఁ గాఁపుందును. ఇక్కడఁ జెడిపోవు కార్యమేమియు లేదు. రహీము వచ్చునన్న భయ మావంతయును లేదు. వీరు తప్పించుకొని పోవుదురేమో యని సందేహము వలదు. ప్రతాపరాయఁ డిచ్చటనున్న నొకవేళ నట్లు సంశయం పడినఁ బడవచ్చును. ఇపుడిక నాభయముకూడ లేదుగదా ? పాపము! వీరబలలు, గతిలేనివారు, దుస్సహదుఃఖపీడితలు. వీరేమిచేయుదురు? నేను గాపుండినఁ జాలును. నీవు సందేహము విడువుము పోయి నాకోర్కి దీర్పుము. నీవు తగినఫల మనుభవింపుము."

కారాగారాధిపతి యావచనములను విని, యామె చెప్పినదే యుక్తముగా నున్నదని భావించెను. ఇంత తర్వాలోఁ దనకచ్చటఁ జెడిపోవునదేమియుఁ గానరాలేదు. యుక్తియుక్తముగానున్న యామెవచనమును గ్రహించి యప్పుడరుగనిచోఁ దనపై నామెకుఁ గోపమువచ్చునని వాఁడు శంకించెను. ఆచంపావతి యంతపట్టుదలగలదని వానికి బాగుగాఁ దెలియును. అందుచే వాఁడిక మాఱుచెప్పఁ దలఁచుకొలేదు. వెంటనే

వాఁడు లోపలి కరిగి గదుల తాళపు చెవులను మొలను బెట్టు కొని ఖడ్గపాణియై చంపావతిని జూచి, "సుందరీ! పోయి వచ్చెదను. నావచ్చునందాఁక నిచటనుందువా?"

"తప్పక యుందును; పోయిరమ్ము. తలుపులు బంధించి తివి కాఁబోలును. తాళపుఁజెవు లెక్కడ?"

"ఇదిగో నాయొద్దనే యున్నవి," అని వాఁడు చూపెను.

"ఏదీ ఇటుతెమ్ము" అని చంపావతిచేయిచాఁచెను."

"ఇవి నీకెందులకు? నీవెక్కడనైనఁ బాఱవైచినచో మాటవచ్చును. ఇంతేకాదు; వానిని బరుల కీయరాదని మా ప్రభువు శాసనము." అని చెప్పుచు వాఁడు దాళముల మొల నిడికొనియెను.

చంపావతి వానిని దేఱపాఱఁజూచి, "ఆఁ ఏమీ! వానిని బెఱవారిచేతి కీఁగూడదా? అవును; నేను బెఱదా నను, నాకెట్లిచ్చెదవు?" అని పలికి గిరుక్కునఁ దిరిగి నడచిపోఁ జొచ్చెను. వాఁడెంత పిలిచినను నాసుందరి పలుకలేదు. తనపై నామెకుఁ గోపము వచ్చినదని గ్రహించి వాఁడు పర్విడి చేతులు చాఁచి యడ్డగించుకొనెను. చంపావతి కన్నుల నిప్పులు రాల్చుచు "ఛీ! నన్నడ్డగింపకుము. నీవెవఁడవు? నేనెవతెను?"అని తప్పించు కొన యత్నించెను.

కాని వాఁడామెను బోనీలేదు. "చెలియా ఇంత మాత్ర మునకే కోపపడవలెనా? నన్ను గ్రహింపుము," అని వాఁడు బతిమాలఁ జొచ్చెను.

చంపావతి వానిఁ దీవ్రముగాఁ జూచుచు, "ఓయీ?! నీపై నాకుఁ గోపమేల? ఒకవేళవచ్చినను నీకుఁ బోయెడి దేమి

నాతో నీకెట్టి సంబంధమును లేదు. విశ్వాసహీనలమగు మాతో నీవు చెలిమి చేసినఁ జెడిపోదువు. నన్నడ్డగింపకుము పోయెదను," అని నిష్ఠురముగాఁ బలికెను.

"యువతీ! నిందింపకుము. కోపముడుగుము, నన్ను భేద దృష్టితోఁ జూడుము.

"అదెట్లు సరిపడును? నేను బరులలోఁ జేరినదానను. నావంటిపరు లిట్టి రాత్రిసమయమున నిచ్చటికి వచ్చిన మీ ప్రభు వెంత కోపించునో? నన్నుఁ బోనిమ్ము." అని చంపావతి పోవఁ బ్రయత్నించెను.

"లలనామణీ! క్షమింపుము. తప్పుబలికితిని, నీవెన్నడును బెఱదానవు కావు; నాయర్ధాంగివి; పొరపడితిని, క్షమింపుము."

"అనవలసిన దేదో యని యిప్పుడీ నక్కవినయము లెం దులకు? నీయిచ్చకములు చాలింపుము. నేను విశ్వాసార్హు రాలను గాను; నీచెలిమి కర్హురాలనుగాను; నన్నుఁ బోనిమ్ము."

"అట్లని యెవ్వరన్నారు?"

"ఎవరందురు? నీవే."

"నే నట్లంటినా?"

"వేఱే యనవలెనా ? నీమాట కర్థమేమి? తాళపుఁజెవు లుంచుకొనుటకే నేఁడగని యపుడు నీస్నేహమున కెట్లు తగు దును? వారికి వీరెంతో వీరికి వారు నంతేయని యందు రెఱుం గుదువా ?

వాఁడది విని తనదే తప్పని తెలిసికొని, "సుందరీ! నాతప్పు మన్నింపుము. ఈ తాళపుఁజెవులు గైకొని యిచ్చట

నుండుము నేను బోయి వచ్చెదను," అని పలికి యీాయఁ బోయెను.

"ఓయీా! నీస్వభావము తెలిసికొనవలెనని యడిగితిని. కాని నాకు వానితోఁ బనియేమి?" అని యామె వానిఁ బుచ్చుకొనలేదు.

"అట్లకాదు. నీవు దీనిని నిండు మనంబుతోఁ బుచ్చుకొనకపోయినచో నీకోపము చల్లారదని యట్లే; పుచ్చుకొనుము, నన్ను సంతసింపఁ జేయుము," అని వాఁడు వాని నీఁబోయెను.

చంపావతి మందహాసముతో వానిదీసికొని, "వేగముగాఁ బోయిరమ్ము. నీరాకకై యిచ్చటనే ప్రతీక్షించుచుందును," అని పల్కి యతనిబంపి యచటఁ గూర్చుండెను.

కారాగృహాధికారి యటఁ గదలి ఖడ్గపాణియై యాపాడు దేవాలయము చెంతకుఁ బోవుచుండెను. రాత్రి యప్పటికి రెండుజాము లతిక్రమించెను. చీఁకటి విస్తారముగా నల్గడల వ్యాపించి యుండెను. ప్రపంచమంతయు నిశ్శబ్దముగా నుండెను. వాఁడు నిర్భయముగా దేవాలయము ప్రవేశించెను. వానికేదో సంభాషణము వినవచ్చెను దానివలన లోపల నిర్వురున్నారని తలంచి కొంచెము జంకి నిలువఁబడి "చంపావతి యసత్యమాడినదా? లేక నేను భ్రమపడుచున్నానా?" అని వాఁడు యోజించుచుండెను.

"రమ్ము రమ్ము. నీవు కామాతురుఁడవు. 'కామాతురాణాం నభయం నలజ్జా' అని యందురు వినలేదా" అని లోపలనున్న వారు పలికిరి.

ఆకంఠస్వర మతనికిఁ జిరపరిచితమైనది. గారుడమంత్రాక్షరములు సర్పమునువలె వాని నాయక్షరములు బంధించినవి; ఒడలు వడఁక నారంభించెను. మఱి యడుగుదీసి యడుగు పెట్ట లేదు; మాఱుమాట పలుక లేదు. ఇంతలో నిర్వురు యువతులు లోపలినుండి యతని చెంతకు వచ్చి నిల్చిరి. వాఁడేదో చెప్ప నెంచుకొనెను. గాని యది వినక వారిలో నొకయువతి కోప ముతో "ఏండ్లు గడచిన కొలఁది బుద్ధిమంతుఁడు కావలెను. అంతియకాని పశుప్రాయుఁడై వర్తింపఁ గూడదు. ఇట్లు కామాంధులై వర్తించినవారిగతి యేమయ్యెనో తెలియునా?" అని పలికెను.

"ప్రాణేశ్వరీ! నావలనఁ దప్పేమియు లేదు. ఇచ్చట నెవ్వరో దురాత్ము లున్నారని శిక్షింపవచ్చితిని." అని పలికెను.

వీఁడు జారుఁడై యిదివఱకు రెండు పర్యాయములు దెబ్బలుతినెను. చంపావతి వీనికి బుద్ధిచెప్పింప నెంచి వానిమోసపుచ్చి యిచ్చటికిఁ బంపినది. చంపావతి వానిభార్యతో వాని దుర్నయమును జెప్పెను? కాని యామె తనపెనిమిటికి బుద్ధివచ్చినదని యనుకొని నమ్మలేదు. వాఁడు బహుకామాంధుఁడై యున్నాఁడనియు, నేఁటిరాత్రి కొలువు వదలి యూరి వెలుపలనున్న పాడుదేవాలయమునకు వచ్చును జూడుమనియుఁ జంపావతి జెప్పెను. అదివిని యామె తన స్నేహితురాలితోఁ గూడ వచ్చుటకుఁ బోయి చూచెదనని నమ్మఁ బలికి యట్లే చేసినది. అందుచే నాయిల్లాలు కోపము పట్టఁజాలక; "ఛీ! పురుషులకు సిగ్గులేదు. తప్పుపనిచేసియు నొప్పుకొనక యసత్యము లాడెదరు? నీకిదివఱకైన శిక్షచాలదా? నీవా చంపావతిని ప్రేమించి

బలాత్కరించుచున్నావా, లేదా? నీకింకెప్పుడు బుద్ధివచ్చును? ఆమె యుత్తమురాలుగాన నాతోఁ జెప్పి యింతతో సరిపుచ్చినది. వేఱొకనితోఁ జెప్పి చావఁ జంపిన నేమి జేయుదువు? ఇఁక నీమొగముఁ జూడ గూడదు" అని నిందించి సత్వరముగా వెడలిపోయెను.

వానికి బొందెలోఁ బ్రాణములు లేవు. వెంటనే పోయి యామెను బతిమాలఁ గొననిచో మఱునాఁడు భోజనము సున్న. వాఁడు భార్యకు భయపడునట్లు మృత్యువునకైనను భయపడఁడనిన నతిశయోక్తిగాదు. చంపావతి మోసపుచ్చినదని వానికప్పుడు బోధపడెను. వెంటనే పోయి చంపావతికిఁ దగిన శిక్ష చేసి తాళపుఁజెవులు పుచ్చుకొని తనభటుల నచ్చటఁ గాఁపుంచి యింటికరిగి భార్యను వేడికొని ప్రసన్నురాలినిగాఁ జేసికొన నిశ్చయించి సరభసముగా వాఁడు కారాగృహమునకుఁ బోయెను.

# ధి లా రా మ

## 17-వ యధ్యాయము

౹ రామాలాలు భట్టాచార్యుఁడు ౹

శ్లో. "ప్రథమవయసి తం తోయమల్పం స్మరంతః
శిరసినిహితభారా నారికేళా నరాణాం
ఉదకమమృతకల్పం దద్యురాజీవితాంతం
నహి కృతముపకారం సాధవో విస్మరంతి."

భర్తృహరి.

వివిధములగు పుష్పసంతతులను మాలగాఁ గూర్చు సూత్రమువంటిది మతము. అది పెక్కండ్ర నొక్కటిగాఁ జేయు శక్తిగలది. వర్ణమందును, బరిమాణమందును వివిధములుగాఁ గానవచ్చుచున్నను సూత్రము పుష్పముల నన్నింటి నొకటిగాఁ జేర్చి యపూర్వశోభను దెచ్చుచున్నది. అట్లేమతము గూడ వర్ణముచేతను, ఉత్తమాధమ మధ్యమత్వముచేతను, భిన్నులయినను జనులను సంఘీభవింపఁజేసి వారికొక యపూర్వ శక్తిని గల్గించుచున్నది. ప్రజల కైకీభావము గల్గించి ఘన కార్యములనైన సులభముగా నెఱవేర్పఁ జాలిన యపూర్వ శక్తిని గల్గించుననియే కాఁబోలు మనపూర్వులు మతములను స్థాపించిరి. ఇట్లు ప్రజాభివృద్ధి కేర్పడినమతములు క్రమక్రముగాఁ బరస్పర కలహకారణములై ప్రజావినాశకములు కాఁజొచ్చెను. ఒక మతమువారు కేవలము స్వమతాభినివిష్ట మానసులై తత్త్వమును గ్రహింపక యితరమతములను దద

వలంబులను నిందించి ద్వేషించి వాగ్వివాదము సల్పి యంతతో సరిపుచ్చక యొండొరులం గొట్టుకొని జీవనములను గూడ వదలుచుండిరి. అందువలనఁ బెక్కుమతములకు నిలయమైన మన భరతఖండము పూర్వము గలహంబుతో నిండి భయంకరముగా నుండెను. బౌద్ధము, అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము, మహామ్మదీయము మొదలగు మతములు కాల క్రమమునఁ బ్రబలినప్పుడు తత్తన్మతావలంబు లొకరిమీఁద నొకరు ద్వేషించి యొండొరుల కపాయము గల్గించుకొన్నట్లు చరిత్రలవలన స్పష్టమగుచున్నది. తత్తన్మతాచార్యులు స్వస్వమతాభివృద్ధికై పాటుపడి వాగ్వివాదముల మాత్రమే సల్పుచుండిరి. కాని రాజు లిందులకై పూనుకొన్నప్పుడు ఘోరవివాదములు సంభవించి ప్రజలప్రాణములఁ గొనుచుండెడివి. ఈపట్ల నించుమించుగా సర్వమతములవారును సమానులే. అందు మహామ్మదీయులు వహించినంత క్రూరత్వము తక్కినవా రవలంబింపలేదని చెప్పవచ్చును. స్వమతాభివృద్ధికై క్రౌర్యమూనిన తురుష్కచక్రవర్తులు పెక్కుర గలరు. వారిలో నెల్ల స్వమతమం దెక్కుడభినివేశము గలిగి హిందువుల నందఱను మహామ్మదీయులనుగాఁ జేయ నిశ్చయించి తన్మతమును స్వీకరింప బలాత్కరించుచు, దానిఁజేకొనని వారివలన జిజియా పన్ను రాఁబట్టుచు, నాపన్నీయనివారల నిర్దయత్వమున నాపన్నులగాఁ జేయుచుఁ, బ్రజల కసౌఖ్యము గల్గించి తనసౌఖ్యము గల్గించుకొని తుదకు సామ్రాజ్యమును వికలముగాఁ జేసికొన్న యౌరంగజేబు ప్రథమగణ్యుఁడు. మతద్వేషము సామ్రాజ్యభంజకమని తెలసికొని రాజనీతివిశారదుఁడగు నక్బరు సార్వభౌముఁడు జిజియా

పన్నుఁ దీసివేసెను. ఔరంగజేబు రాజ్యభారము వహించినతోడనే యాపన్నును విధించి హిందువులవలన నతికఠినముగా రాఁబట్టుచుండెను. తనపాలనకు లోఁబడని చిత్తూరు మహారాష్ట్రము మొదలగు మండలములలోఁ దప్పఁ దక్కినచోట్ల దాని నిరాటంకముగా నతఁడు రాఁబట్టుచుండెను. హిందువులు మూలుగుచు ముక్కుచుఁ బన్నైన నిచ్చుకొనుచుండిరి. కాని తన్మతమును స్వీకరింప నొల్లకుండిరి. బుందేలుఖండమున మహోశపురమను నొక గ్రామముగలదు. అది రాజధానికి దూరముగాఁ గొండల నడుమ నున్నది. అది ధనవంతులకు నివాసస్థలమైనను మనోసౌధంబులుగాని, సుందరమందిరములు గాని యందు లేవు. ఆయూరివారి నాశ్రయించి జీవనము గడపు నొక బంగాళీ బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు సకలశాస్త్రపండితుఁడు. అతని మొదటి నామము రామలాలని మాత్రమే కాని పండితుఁడయిన పిమ్మట "భట్టాచార్య," యను బిరుదపదము వహించి యతఁడు రామలాలు భట్టాచార్యుఁడని పిలువఁ బడుచుండెను. అతనికి ధనసంపద లేదుకాని పుత్త్రసంపద గలదు. అతఁ డన్నివిధములచేతను గుచేలున కీడు వచ్చుచుండెను. ఆతఁడుదయముననే లేచి నిత్యకృత్యములు దీర్చికొని, భగవద్గీతా సప్తశతులఁ బారాయణము చేసికాని యెంతపని యున్నను నిల్లుకదలఁడు. అతఁడు దైవభక్తుఁడు; అసమానబుద్ధిబలమును దేహబలమునుగలవాఁడు. అతని శరీరము స్థూలోన్నతము; బాహువు లర్గళములవలె దృఢములై దీర్ఘములై యుండెను. అతఁడన్నిటియందు సమర్థుఁడైనను నదృష్టము లేమి

జేసి కాఁబోలును నేపూఁటకాపూట భోజనపదార్థములు సంపాదించుకొనవలసి యుండెను. అతఁ డొకనాఁడు నిత్యకృత్యములు దీర్చికొని భోజనపదార్థములు కొనితెచ్చుకొనుటకై గ్రామాంతరమున కేగెను. తొలినాఁటి పదార్థములు లేకపోవుటచే మరల తెచ్చిన పదార్థములు వంటచేసినం గాని పిల్లల కన్నము లేదు. పిల్లలలోఁ బెద్దవా రభ్యాసవశమున నాఁకటిచిచ్చువకోర్చుచుండిరి కాని చిన్నపిల్లలుల్లంబునఁ దల్లడిల్లి గొల్లున నేడ్చుచుండిరి. ఆయిల్లాలు సాధ్వీమణి; శాంత స్వభావముగలది. ఆమె పిల్లల యేడ్పునకు విసువొందక యలుగక కొట్టక తిట్టక మంచిమాటల నోదార్చుచు భర్తయాగమనమునకుఁ బ్రతీక్షించుచుండెను. అంతటఁ గాలభటులవలె భయంకరాకారులగు మహామ్మదీయు లామందిరంబు పిఱింది కరుదెంచిరి. వారు దీర్ఘకాయులు, స్తంభములవంటి బాహువులు గలవారు, గాలించి చూచినను వారిముఖములందుఁ గరుణారసము చూపట్టదు. కాటుక కంటె నల్లనివై నాభీతలము నొరయుచున్న గడ్డములు వారి దీర్ఘకఠోరకాయములకు దోడయి చూపఱకు వెఱపు గొలుపుచుండెను. వారి నేత్రముల రక్తకాంతుల నీనుచు వారి క్రూరస్వభావమును లోకులకుఁ జాటుచుండెను. ఇట్లు వచ్చిన మహామ్మదీయులను జూచి పిల్ల లేడ్పు చాలించి గృహము సొచ్చి మూలమూలల డాఁగిరి. ఆమహామ్మదీయులం జూచి బ్రాహ్మణియుఁ లోని కేగెను. అంత వారిలో నొకఁడు గుమ్మము దగ్గఱకుఁ బోయి చేతులతో దారబందపుఁ గమ్ముల నానుకొని

"ఏమయ్యా! బాపనయ్యా! ఇంటిలో నేమిచేయు చున్నావు?" అని కేక వేసె.

"వారింటలే," రనియాబ్రాహ్మణి మెల్లగా ననెను. మహా మ్మదీయుఁడు కోపముతో "ఎప్పుడు వచ్చినను లేరు లేరనియే చెప్పుదువు; ఈభూమిలోనే లేఁడాయేమి? ఈ మొండి బాప నయ్యకు సిగ్గులేదేమిః? రెండేండ్లనుండి పన్నియలేదు. అం దుకు శక్తిలేనిచో మహమ్మదీయమతమును స్వీకరింప రాదా?" అని గట్టిగాఁ బలికెను.

ఆపలుకు లాబ్రాహ్మణి చెవులకు శూలఘాతముల వడు వున సోఁకెను. క్రోధాగ్నిహోత్రము ప్రజ్వలింపఁ జొచ్చెను. దానికిఁ దగిన సమాధాన మీయఁదలంచియు శాంతించి, "అయ్యా! కొంచెము సేపుందురేని వారు వచ్చి మీపని చక్కఁ జేయుదురు. ఇంతమాత్రమునకుఁ గోపించి దుస్సహవాక్యము లాడనేల?" అని యామె ప్రత్యుత్తర మిచ్చెను.

ఆపలుకులకు వాఁడు మఱింత కోపించి "ఓసీ! లుచ్ఛా! ఏమనుచున్నావు? నావాక్యములు నీకుఁ గష్ట మనిపించుచు న్నవియా? నేనెవఁడనో యెఱుంగుదువా?" అని సగర్వముగాఁ బల్కెను.

అట్టి దుష్టునితోఁ బ్రసంగించుట యనుచితమని యాయి ల్లాలు, "మీ రెవ్వరైననేమి? అధిక ప్రసంగము వలన లాభము లే," దని ఫళ్లునఁ జెంపపెట్టిబెట్టినట్లు కవాటము బంధించి లోపలి కరిగెను. తోడనే మహమ్మదీయుఁడు కోపావిష్టు డగు దుష్టోరగము చాడ్పున రోజుచు నాయవమానము

లేక కాలితో నాకవాటమున నాల్గుతన్నులు తన్నెను? కవాటము విఱిగిపడెను. ఆధ్వని విని యిరుగు పొరుగులవారు వచ్చిరి. క్షణకాలములో నూరిజనులందఱును వచ్చి మూఁగిరి. వారిలో నొకరిద్దఱు; "యజమాను డింటలేనియప్పుడు వారిని బిల్లలను బాధించుట న్యాయముగా" దని యా తురుష్కునికి బోధింపసాగిరి, కాని యవి వాని క్రోధాగ్ని కింధనసదృశములు కాఁజొచ్చెను. వాఁడులోనికేగి, "ఇది నీయిల్లుకాదు. మాకీ వలసిన పన్నుకై దీని స్వాధీనము చేసికొన్నాము. వెంటనే దీనివిడిచి పొమ్ము. పోవేని యేమిచేసెదనో చూడు," మని గంభీరనాదములతోఁ బలికెను. అది విని యాకాంత స్వాంతమున దుఃఖించుచు మాఱుమాటాడక పిల్లలతో నిల్లువిడిచి పొరుగువారిపంచ నిలిచెను. పిల్లలు భయముచేతను సూర్యాతపముచేతను, నాఁకటిచేతను బీడితులై గోల్లున నేడ్చుచుండిరి. ఆ గ్రామస్థు లాయిల్లాలిదురవస్థం జూచి దుస్సహకోపపరీతులై యాదుష్టుల దిష్టాంత మొందింప వలయునని నిశ్చయించిరి. కాని యాదుష్కాలమునఁ దమ సాహసము తమ్ము నాపన్నులగాఁ జేయునేమో యని సందేహించి యూరకుండిరి. వారి కా బ్రాహ్మణకుటుంబమునం దెంతో గౌరవము గలదు. ఐననేమి చేయఁగలరు? వారిలోఁ గొందఱు మహమ్మదీయులం జేరి, "యింత క్రౌర్యము తగదు. వారి నింటికి రానిం," డని వాగ్వివాదము సలుపుచుండిరి. ఆతురక లాయింటి యరుఁగుపైఁ గూర్చుండి కఠినహృదయులై యనేక దురుక్తులతో హిందువులను నిందించుచుఁ బరిహాసము చేయుచుండిరి. అప్పటికిభానుమంతుఁడు నాల్గవవంతు గగనయాత్రను

సల్పెను. ఎండ తీవ్రముగా నుండెను. ఇదివఱకు బైటనుండి చూచుచున్న యాయూరివారు వేడిమి కోర్వలేక చెట్లనీడలను నిండ్ల పంచలను జేరి చూచుచుండిరి. తురకల హృదయములు కరఁగునేమో యని యాయూరివారు పరిపరివిధముల బతిమాలఁ జొచ్చిరి. కాని వారి దీనాలాపము పాషాణ హృదయముల ద్రవింపఁ జేయలేకపోయెను. ఇట్లుండ దూరమునుండి "టకీ టకీ టకీ," అను నినాదములు విన వచ్చెను. అదివిని వారు నలుదెసలఁ బరికించిరి. చూపుమేర దూరమున నెఱ్ఱనిపరాగము గానవచ్చుచుండెను. చక్కఁగా నిదానించి చూడఁగా వారి కానినాదములును ధూళులును దప్ప మఱేమియు గోచరముగాలేదు. దానింగూర్చి వారు పలువిధముల నూహింపఁజొచ్చిరి; ఏమేమో మాటాడనారంభించిరి. వారిమాటలు వారినోట నుండగనే యుత్తుంగ తురంగముల నెక్కిన పదుగు రాశ్వికు లచ్చటికి వచ్చిరి. వారిలో నొకఁడు సముస్తరాజలక్షణలక్షితుఁడై వింశతిహాయనప్రాయుండై యుండెను. ఆజను లతనిఁ జూచినతోడనే తమప్రభువగు ఛత్రసాలుఁడని యెఱింగి యానంద కందళితహృదయులై నమస్కరించి నిలువఁబడిరి. ఆమహారాజు వారినాదరించి విశ్రాంతికై తన హయము నాతరుచ్ఛాయ నిలువఁబెట్టెను. తక్కిన రౌతులు నట్లేచేసిరి. అది చూచి యచ్చటి వాగందఱు నమ్మహారాజును రౌతులను జుట్టిముట్టి భయభక్తులతో నిల్చియుండిరి. మహమ్మదీయులు మాత్ర మాగృహవేదికపైఁ గూర్చుండియుండిరి. అప్పు డమ్మహీపతి జనులచ్చటఁ బ్రోవయియుంటకుఁ గారణ మడుగ వా రాబ్రాహ్మణకుటుంబపు

స్థితియు మహమ్మదీయుల క్రౌర్యమును సాంతముగా విన్న వించిరి. ఆమాట లతని చెవులకు ములుకులవలెఁ దవిలెను. అతని కన్నులు చింతనిప్పులవలె నెఱ్ఱనై విస్ఫులింగములఁ గురి యుచుండెను; లలాటము కుటిలభ్రూకుటిచే భయము గొల్ప సాగెను ; చండాతపమున నెఱ్ఱవడిన యాతని ముఖము క్రోధోద్రేకమున ద్విగుణితశోణాంశుపరీతమై ప్రళయార్క బింబమువలె దుస్సహమై చూపట్టసాగెను. ఆయన తనరాతుల వీక్షింపఁగా, వారందఱొక్కపరి గుఱ్ఱముల దిగి బద్ధాంజ లులై యాజ్ఞ కెదురుచూచుచుండిరి. కనుసన్న చేసినఁ జాలును ఆమహమ్మదీయులనేకాక లోకమునంతయు నొక్కపెట్టున దం డించి వచ్చుటకు సిద్ధముగానున్నట్లు వారు కన్పట్టసాగిరి. ఛత్ర సాలుఁ డాకోపోద్రేకమును గొంచెమడంచి మహమ్మదీయులను బిల్వఁబంచెను. మొదట వా రతనియాజ్ఞను నిరసించి, మరల యేదో యోజించుకొని గర్వాంధులై చుక్కలు చూచుచు వచ్చి నిలువఁబడిరి. అప్పుడా రాజచంద్రుఁ డిట్లనియెను.

'ఆయింటివారి నెందులకు బాధించుచున్నారు?''

'చక్రవర్తి శాసనముంబట్టి'

"ప్రజల బాధింపుఁడని చక్రవర్తి శాసించెనా?"

'అవును. పన్నీయనిచో.''

'పన్నెందుల కీయవలయును?''

'మహమ్మదీయులు కానందుచే''

ఆధరణీపతి యిఁక గోపము నిలుపలేక గంభీరస్వర ముతో, "ఓరీమూర్ఖా! మీసార్వభౌమునికి మతిపోయినది. కావుననే యిట్టిపిచ్చిబుద్ధులు పుట్టుచున్నవి. ప్రజల బాధించు

తుచ్ఛునికి చక్రవర్తిత్వమేల ? కాఁపునా ? ఇదే నావాక్యము వినుఁడు. ఇదిమొదలు మా బుందేలుఖండమున నీపన్ను రాఁబట్టఁ దిరుగుదురేని మీప్రాణములు మీకుఁ దక్కవు. పొండు; మీసార్వభౌమునితోఁ జెప్పికొనుఁడు." అని పలికెను.

ఆమహామ్మదీయుఁ డూరకుండక, "చక్రవర్తి గౌరవము పాటించి మాట్లాడుఁడు. తెలివి తెచ్చుకొనుఁడు ; చక్రవర్తిని నిందించువారు,——" అని యేదో చెప్పుచుండ నారాజసింహ మోర్వఁజాలక పరిచరుల వైపుఁ జూచెను. తోడనే వారాతురకలఁ గట్టిగా మర్దించి పెఱిచికట్టిరి. ఇంతలో నాయూరి ప్రజలు పిడికిటి పోట్లచేతను గఱ్ఱదెబ్బల చేతను దమకసినెల్ల దీర్చుకొని వారల గడ్డములను మీసములను దీయించి సున్నపుబొట్లను బెట్టి గాడిదల నెక్కించి యూరేగించి పూర్ణపరాభవము గావించి దేశమునుండి వెడలఁగొట్టిరి. ఆభూకాంతుఁడు పిమ్మట నొక భటునిఁ బిలిచి యికమీఁద జిజియాపన్నియవలసిన యవసరములేదని యూరూరఁ జాటింప నానతి యిచ్చి పంపివేసెను. ప్రజలు తమ ప్రభువు ధైర్యసాహసములకుఁ గడుంగడు ముద మందిరి. ఆరాజసత్తముఁడా బ్రాహ్మణికి నమస్కరించి గౌరవించి కొంతధన మిచ్చి పిల్లలతో నిల్లుచేరుమని పంపి భటులతో నిజపురమున కరిగెను. ఇచ్చటివా రతని దీనవాత్సల్యమును గృపాతిశయమును వినయ సౌశీల్యాదులను గీర్తించుచుఁ దమతమ నెలవులకుఁ బోయిరి.

ఆబ్రాహ్మణియుఁ బిల్లలతో నిల్లుచేరి మ్లేచ్ఛులు ముట్టినందున మైలపడిన గృహమును శుద్ధిచేసికొని భోజన

పదార్థములు కొనితెచ్చి వండి పిల్లలకుఁబెట్టి పతిరాక కెదురు చూచుచుండెను. భానుఁడు నభోమండలమధ్యమున విరాజిల్లు చుండెను. రామలాలు వస్తు సామగ్రితో నింటికివచ్చి యావద్వృత్తాంతమును విని నిశ్చేష్టితుఁడై ఆరాజచంద్రుఁడు చూపిన కృపారసమున కధికానందము చెందెను. కాని యది విన్నప్పటినుండియు నతని మనస్సు పరిపరివిధములఁ బోసాగెను;మనస్సు వికార విపరీతమయి స్వస్థతను గాంచలేకుండెను. స్నానముచేసి యతఁడు జపమునకుఁ గూర్చుండెను. కన్నులు మూసి గోముఖిలోఁ జేతినుంచి యేదో మంత్రమును జపింపసాగెను. గాని యేమి జపించుచుండెనో యెంతలెక్కయైన దో తెలియలేదు. చిత్తము పాదరసమువలెఁ జలించుచుండ నిఁక జపా దెట్లు? అది చాలించి భోజనమునకుఁ గూర్చుండెను. తాను దినుచున్న దేమియో యతనికిఁ దెలియరాలేదు. ఒకవస్తువు గావలసియుండ వేఱొకవస్తు వడుగుచుండెను. భార్య వడ్డించిన పిమ్మట, ఇదెందుల? కని భార్యవైపు చూచుచుండెను. భార్య యతని వైఖరి నుపలక్షించి ఇట్లు భాషించెను.

భా.—మతిపోయినట్లు వర్తించుచున్నారేమి?

రా.— చెప్పలేనియంత యప్పులపాలయినపుడు దాని దీర్చు నందాఁక మతిపోయినట్లే యుండునుగదా?

భా.—మనకప్పు లేదే?

రా. ఆమె మొగము వంకఁ జూచి, లేకేమి? యీనాఁడీన మా రాజచంద్రుఁడు తీర్పలేని యంత మహోపకార ఋణ

బద్ధునిఁజేసి పోయెను. అది తీర్చునందాఁక నాకు నిద్దుర పట్టదు.

భా.—అతఁడు సర్వసంపన్నుఁడైన మహారాజు; మనము నిఱు పేదలము. మన మాతని యుపకారమునకుఁ బ్రత్యుపకార మేమి చేయఁగలము ?

రా. ప్రత్యుపకారము చేయవలెనన బీదతనము దాని నడ్డగింపఁగలదా ?

భా.—మఱెట్లు ?

రా.—భగవంతుఁడు నాకు ధనాదు లీయకపోయినను దేహ బుద్ధిబలముల నిచ్చినాఁడు ?

భా.—అవును ; ఏమిచేయుదురు ?

రా.—ఖడ్గపాణినై దేశస్వాతంత్ర్యమునకై మహమ్మదీయులతో యుద్ధము సల్పి మహారాజునకుఁ దోడ్పడియెదను.

-(త్రుళ్లిపడి) ఆఁ, ఏమీ ! ఆయుధము దాల్చి యుద్ధము చేయుదురా ! అకటా ! ఎంత ప్రమాదము బ్రాహ్మణ వంశసంభూతునికి జపాదులుతప్ప క్రూరమగు క్షత్త్రధర్మము విహితము కాదే? కులధర్మము విడుచుటపాడియా?

రా.—సుందరీ ! దుష్టశిక్షణంబుచేసి దేశోద్ధరణము గావించు నపుడు గులధర్మంబువిడిచినను దోషము లేదు. అవసరమును బట్టి పరధర్మ మాచరించిన నాచరింపనగును. ఇట్లుచేసిన వా రెందఱో కలరు ? పరశురాముఁడు భార్గవవంశ జుఁడే ! నేనును దద్వంశజాతుఁడనే. పరశురామునికి వలె

నాకిప్పుడు క్షాత్రతేజ మావిర్భవించుచున్నది. నేనిపుడు పెఱధర్మ మాచరించిన తప్పేమి? ద్రోణాచార్యుఁడు కృపాచార్యుఁడు మొదలగువా రందఱును బ్రాహ్మణులే. భారతయుద్ధమున వారేమిచేసిరో యెఱుఁగుదువా?

భార్య యింకనేమియుఁ బ్రత్యుత్తర మీలేకపోయెను.

# దిలారాము

## 18-వ యధ్యాయము

### బుందేలుఖండచరిత్రము

క. "విదళింప నఱుకు సింగపు
గోదమయు మద మలినగండ-కుంజరముల పై
నిది బలశాలికి సైజము
గద తేజోనిధికి వయసు కారణమగునే."

మధ్యహిందూస్థానములోనికొంతభాగమునకు బుందేలు ఖండ మనిపేరు. అది యమునానదికి దక్షిణముగా నున్నది. అందలి సంస్థానములలో రీవా; పన్నా; మొదలగునవి ప్రధానములు. అందచ్చటచ్చట వజ్రపుగనులును, నినుప గనులును గలవు. ఆదేశము కొండలతో నిండియుండుటచే సమమట్టముగా నుండదు. అందున్నకొండలలోను వింధ్య పర్వత పంక్తిలోను బుట్టిననదులు కొన్ని యాదేశమును దడుపుచు గంగా యమునా నదులలోఁ గలియుచున్నవి.

మొదట గోండులనువా రీదేశమున నివసించి రాజ్యము స్థాపించి రనియుఁ దొమ్మిదవ శతాబ్దమునఁ బుందేలు రాజ పుత్త్రుఁడు వారిని జయించి దక్షిణమునకుఁ దఱిమెననియు నాగోండులు దక్షిణమునకుఁ జరిగి గోండ్వానా, లేక గడా మండలము నాఁబడు దేశము నాక్రమించుకొని రనియుఁ బుక్కిటి కథలవలన దెలియవచ్చుచున్నది. ఆబుందేలు రాజ

పుత్త్రునిపేరు చంద్రవర్మ. అతఁడు రాజ్యమును నిరపాయముగా నేలుచు నజీఘరు మొదలగు దుర్గములను గట్టించి ప్రఖ్యాతి గాంచెను. అతని యనంతరపువారిపేరులు తెలియరాలేదు. చంద్రవర్మ కిరువదవ పురుషుఁడై పెరమాళదేవుఁ డనువాఁడు రాజ్యభార మూనినట్లు తెలియవచ్చుచున్నది. అతఁడచ్చట నిర పాయముగాఁ బాలించుచుండఁ గ్రీస్తుశకము 1183-వ సంవత్స రమున ఢిల్లీపురాధినేత పృథ్వీరాజతని గెలిచి తనకు సామంతు నిగాఁ జేసికొనెను. పృథ్వీరాజు స్థానేశ్వరయుద్ధమునఁ గూలిన యనంతరము గొంతకాల మీదేశము మరల స్వతంత్ర మయ్యెను. కాని క్రీ. శ. 1196-వ వత్సరమునఁ గుతుబుదీను దండువెడలి మహమ్మద్ బిఖ్త్యార్ ఖిల్జీయను వాని సాయమునఁ గాల్పి కాలింజరు, మొదలగు దుర్గముల మొకట జయించి పిమ్మట నాదేశమెల్ల నాక్రమించుకొనెను. పెరమాళ దేవుతో నావంశ మంతరించెను. పిమ్మటఁ బదునాల్గవ శతాబ్దాంతమున ఘూర్వారు రాజపుత్రులు మహమ్మదీయులను బాఱదోలి యాదే శము స్వాధీనము చేసికొనిరి. ఈరాజులు రాజపుత్త్ర స్థానమున నున్న బుందీ సంస్థానాధిపతులవంశములోనివా రనియు, నాబుందీరాజులచే జయింపఁబడిన భాగముగనుక దీనికి బుందేలు ఖండ మనుపేరు వచ్చినదనియు కొందఱ యభిప్రాయము. ఈఘూర్వారు రాజపుత్త్రులు "మౌవ" నుపురమును గొంతకాల మును మహోనీ పురమును గొంతకాలమును రాజధానిగాఁ జేసికొని పాలించిరి. అనంతరము వారిసంతతివాఁడగు రాజా రుద్రప్రతాపుఁడు బుందేలు ఖండమునకు రాజయి క్రీ. శ. 1531.వ సంవత్సరమున "ఆర్చా" పురమును నిర్మించి రాజధా

నిగాఁ జేసికొనెను. ఆకాలమున యమునానదికి దక్షిణమున నున్న దేశాధీశ్వరులలో నీబుందేలురాజులు మిక్కిలి సమర్థులై యుండిరి. అందుచే నది చిరకాలము స్వతంత్రమై యుండెను. కాని రాజనీతినిపుణుఁడైన యక్బరు తన నేర్పుబలిమిచే నాదేశమును మొగలు సామ్రాజ్యమునకు లోఁబడునట్లు చేసెను. అది మొదలు కొన్నివత్సరము లది పారతంత్ర్యమందే యుండెను. షాజహాను చక్రవర్తిగా నున్నపుడు చంపతరాయుఁడను ధైర్యశాలి బుందేలుఖండమును బాలించుచుండెను. అతఁడు సామంతప్రభువుల సాయమున మహమ్మదీయప్రభుత్వమును ధిక్కరించి స్వతంత్రుఁడయ్యెను. షాజహానతనితో యుద్ధము లొనర్చి యోడించియునదిలేక సంధిగావించుకొని కొంతభూభాగము నతనికి బహుమతిగా నొసఁగుటయే కాక సైన్యమునఁ బెద్దయధికారము గూడ నొసంగెను. అది మొదలు చంపతరాయుఁడు మొగల్ సైన్యమున మహోద్యోగియైయుండి షాజహాను ననంతరమున సామ్రాజ్యము నిమిత్తము దారాకు నౌరంగజేబునకు జరిగిన ఘోరసంగ్రామమున నౌరంగజేబుపక్ష మవలంబించి జయించి యతనిఁ జక్రవర్తినిగాఁ జేసెను. అయిన నాచక్రవర్తి యా యుపకారమును దలంపక కృతఘ్నుఁడై చంపతరాయునిఁ బరాభవించెను. పరాక్రమనిధియైన యామహీజాని దాని నోర్వఁజాలక దుర్భరకోపోద్దీపితుఁడై చక్రవర్తితో ఘోరసమరము గావించి 164-వ వత్సరమున భౌతికదేహమును జాలించెను. అప్పటి కాతనికిఁ బదునాలుగేండ్ల ప్రాయముగల యొక కుమారుఁడు గలడు. అతని నామము ఛత్రసాలుఁ

డుందురు. అతఁడు వయస్సునఁ జిన్నవాఁడైనను ధైర్యస్థైర్య శౌర్యసాహసాదులచేఁ దండ్రిని మించుచుండెను. అతనికి రాజ్య భారము వహించినది మొదలు మహమ్మదీయులపైఁ గసిదీర్చు కొనుటెట్లోయన్న చింతతప్ప వేఱొకటిలేదు. ఔరంగజేబు దురాత్ముఁడై తనతండ్రి నన్యాయముగాఁ బరాభవించెనను కోపాగ్ని హృదయమున సర్వకాలములందు నతనికి రవులుఁ జొచ్చెను. ఆపై నౌరంగజేబు హిందూమహానాయకుల పట్ల నొనర్చు దుండగములు వాని కింధనసదృశము లయ్యెను. పిమ్మటఁ జక్రవర్తి దుష్ప్రవర్తన మెల్లపుడు నతని శ్రవణపథ మునఁ బడుచు మహామారుతసదృశమై కోపాగ్నిని మండింప జొచ్చెను. తదీయాగ్నితాపమును సహింపలేక యెట్టియిక్కట్టు రానున్నను దనరాజ్యమునకు మహమ్మదీయ సంబంధము లేకుండఁ జేయవలెనని ఛత్రసాలుఁడు నిశ్చయించెను. అతఁ డొకనాఁడు సభచేసి స్వదేశ ప్రభువులకుఁ దన యభిప్రాయ మును దెలిపెను. ఛత్రసాలుఁడు గంభీరవచనములతో స్వాతం త్ర్యాభిలాషను గూర్చి యుపన్యసించునపుడు వారలకు గల్గిన యానంద మింతంతని చెప్పలేము. ఆసమయమున వీరవరుల శరీరములు రోమాంచకంచుకితములై యుప్పొంగఁజొచ్చెను; చేతులు గత్తిపిళ్లతో సరసము లాడఁదొడఁగెను; నోళ్లు సమర సముత్సాహసూచకము లగుధ్వనులు సేయనారంభించెను. బుందేలులు మహాశూరులు; యుద్ధప్రియులు; గౌరవాభి లాషులు; సాహసైకచక్రవర్తులు; అవసరము వచ్చినపుడు ప్రాణ ములఁ దృణప్రాయముగాఁ జూచు నుదారపురుషులు. ఇట్టివీ

రులు సింహకిశోరముఁవంటి తమ భూపాలాంకూరము ముద్దు నోటినుండి సమరసముత్సాహకరములును, స్వాతంత్ర్యాభిలాషకములు నగుగంభీరవచనములు వెలువడునప్పు డెంతసంతోషభరితులయిరో చెప్ప నేల? వారందఱతనికి నమస్కరించి యవసరముండినచో మాతృదేశ సేవనార్థము స్వార్జిత ధనములతోఁగూడఁ దమ శిరఃకమలముల సంతోషపూర్వకముగా నర్పింతుమని యొక్కపెట్టునఁ బలికిరి. వారుక్రియావసరమున నంతటి సాహసవంతు లగుదురని ఛత్రసాలుఁ డెఱుంగును; కావున వెంటనే మహమ్మదీయ ప్రభుత్వమును ధిక్కరించి స్వతంత్రుఁడై రాజ్యము సేయఁజొచ్చెను.

చక్రవర్తియగు నౌరంగజేబు దివిని మండిపడి యాబుందేలుల గర్వమడంచి రావలయునని మహాసైన్యములను పంపెను. మహమ్మదీయ బుందేలులకు ఘోరయుద్ధములు జరిగినవి. వానినన్నింటిలోను బుందేలులే విజయమందిరి. దానితో ఛత్రసాలుని స్వాతంత్ర్యము దేశమున నెలకొన్నది. కాని యది స్థిరముగా నుండవలెనుగదా? తనకుఁగల్గిన మహాపరాభవమును సైపఁజాలకచక్రవర్తిమహాసైన్యసముద్రముతో వెడలివచ్చి బుందేలుఖండము నడుగంట ముంచివేయ సిద్ధముగా నున్నాఁడన్న కింవదంతి దేశమునవ్యాపించెను. దానివలనఁ బెక్కురకు భయ మంకురించెను. బుందేలు వీరులుకూడ దమ ప్రభుని ధైర్యసాహసాదులు చూచినప్పు డెంతటి శత్రువులనైన నవలీల జయింపఁ గల్గుదుమని తలంచుకొనుచుండిరి. కాని చక్రవర్తి రాజనీతిని నూ యోపాయ

ములను నపారసైన్యమును నానావిధాయుధజాలమును దలంచు కొన్నప్పుడు డోలాందోళితమనస్కులు కాకపోలేదు. అయినను వారు వెనుకంజ వేయఁ దలచుకోలేదు. వారు తమ ప్రభువును సుక్షేత్రమున వర్ధిల్లిన రసాలవాలముతోఁ బోల్చుకొనుచుండిరి. తమమహాపరాక్రమమునఁ రాఁబోవు ఘోరసంగ్రామమును గెల్వఁగల్గినచో మహమ్మదీయ ప్రభుమార్తాండ సంతాపముపాలు గాక నిజరాజరసాలమునీడఁ జేరి యమృతకల్పములగు తదీయ ఫలము లనుభవించి సుఖంచుటకును, లేనిచో సమరమునఁ దుచ్ఛశరీరములను విడిచి స్వర్గమున సుఖించుటకును గృతనిశ్చయులయిరి. ఇఁక ఛత్రసాలుని గనుఁగొందము. తానా యల్పవయస్కుఁడు. చేకొనిన రాజ్యమూ నిష్కంటకముగాక బుద్ధి ప్రతాపవిశేషములచేఁ బరిపాలనీయము. చేయు ప్రయత్నమా, పేరు మాత్రముననే యెట్టివారి గుండియల నైన నవియింపఁ జాలు నౌరంగజేబుతో యుద్ధమొనర్చుట. ఇట్టి సమయముల నెంతటివారికైన జంకుపుట్టక మానదు గదా ? ఇంతియకాక తన ప్రజలను దనరాజ్యము దనజాతిహితములను రక్షింపవలసిన భారమతఁడు వహించియుండెను.

ఇట్టి విషమకార్యములు ప్రాప్తించినను ఛత్రసాలుని చిత్తము సంచలింపక సాగరమధ్యమున నున్న మహాశైలమును బోలియుండెను. ఉత్తుంగతరంగములు విజృంభించి కొండను దాఁకును. విఱిగిపోవును. వానివలన బర్వతమున కేమి యుపద్రవము? అట్లే దృఢతరమయిన ఛత్రసాలుని చిత్తము నీవిషమకార్యాదు లేమిచేయఁగలవు? అది సుంతేనియుఁ జలింపలేదు. దుర్భర కార్యములు తటస్థమగుచున్న కొలఁది నతని

మానసము మఱింత ధైర్యముతోను మఱింత ప్రోత్సాహము తోను మఱింత నిర్విచారముతోను బూర్ణమగుచుండె. అతఁడు సర్వకాలములం దప్రమత్తుఁడై రాజకీయ వ్యవహారములు స్వయముగాఁ జూచుకొనుచుండెను; మహాసైన్యములఁ గూర్చుచుండెను. దుర్గములను బాగు చేయించుచుండెను.

# శిలారామ

## 19-వ యధ్యాయము

### పురాణశ్రవణము

శ్లో. "విజేతవ్యా లంకా చరణతరణీయో జలనిధి
ర్విపక్షః పౌలస్త్యో రణభువి సహాయాశ్చ కపయః
పదాతిర్మర్త్యోసౌ సకలమవధీద్రాక్షసకులం
క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణైః."

బుందేలుఖండమున శిలావతియను నొకనది గలదు. అది యిప్పుడు కెన్నని పిలువఁబడుచున్నది. అది వింధ్యపర్వత పంక్తిలోఁ నుద్భవించి యుత్తరముగాఁ బ్రవహించి యమునా నదిలోఁ గలియుచున్నది. అది యేటవాలుగానుండు భూతలమునఁ బాఱుటచేఁ బాములను దెగప్రేయునంత వేగమున నొప్పుచున్నది. తదుభయతీరములును నిమ్నోన్నతములై కొన్ని చోట్ల జిన్నచిన్నగుట్టలుగలవై యుండుటచేఁ దదీయజలము సస్యాదులకుపయోగింపక పోయినను దత్తీరస్థులస్నానపానముల కుపయోగింపక పోలేదు. నదీగర్భము పాషాణమయమై యుండుటచేఁ జిన్నపడవలైనను నడయాడ వీలులేదు. ఆతీరమునఁగల గుట్టలలో నొకటి కొంచె మున్నతమై యుపరిభాగమున సమతలముగా నుండెను దానిపై నెవ్వరో పూర్వు లొకయాలయమును గట్టించి సీతాలక్ష్మణ సహితమైన శ్రీరామవిగ్రహమును బ్రతిష్ఠచేసిరి. జనులు సులభముగా నెక్కుటకు నదిమొదలుకొని

దేవాలయపర్యంతమును మెట్లమర్చఁబడినవి. ఆదేవాలయమున కుత్తరముగాఁ గొన్నిగదులును స్వామికల్యాణమండపమును గట్టఁబడినవి. అవి చిరకాలముక్రిందటనే నిర్మితములైనను నూతనముగాఁ గట్టఁబడినట్లు లొప్పులు గులుకుచుండెను. ఆప్రాంతములు ఘాతుక మృగసంకులములును నరణ్యములచే నావృతము లగుటంజేసి పూజకులట నుండ భయపడి యాగుట్టకు దిగువనున్న గ్రామమున నివసించుచుందురు; ఉదయసాయంకాలములం దచ్చటకేగి స్వామి కర్చనాదులు సల్పి దిగి వచ్చుచుందురు. వారట్లుచేసినను వైరాగ్యవంతులగుటఁ గాఁబోలును యోగీశ్వరులు మాత్ర మహర్నిశము లట నివసించుచుందురు. మనకథాకాలమునఁ బ్రాణనాథస్వామి యనునొకయోగిసత్తముఁ డుండెను. లోకమున రాజద్రోహముచేసి తద్భయముచేఁ గొందఱును, దారసుతాదులపై నాకస్మికముగా వచ్చిన కోపమునఁ గొందఱును, కుటుంబభరణముకై చేసిన యప్పులు దీర్పలేక కొందఱును సన్యాసులుగాను యోగులుగాను మాఱుచుందురు. ప్రాణనాథుఁ డట్టివాఁడు కాఁడు. అతఁడు సకలశాస్త్రములును జదివి తజ్జన్యజ్ఞానముచే సంసార మసారమని యెంచి విరాగియై సాధువృత్తిచేఁ గాలము గడపుచుండెను. అతని వయస్సిరువది వత్సరముల మించియుండెను. నరసిన దీర్ఘ జటా కలాపమును గడ్డమును మీసమును నతఁడు వృద్ధుఁడని చాటుచున్నను దేహము పాటవమును వదలక వయఃపరిపూర్ణుఁడని తెలుపక పోలేదు. అతనికిఁ [illegible]్రలు గలరు. రాజాధిరాజులుగూడ నొక్కొకప్పు డతనివలన హితబోధల నందుదురు. చపంతరాయుఁ డతని

దైవముగా భావించి మహాగౌరవముచేసి యతని దయకుఁ బాత్రుఁడై ముఖ్యశిష్యుఁడయ్యెను. ఛత్రసాలుఁడు నదేవిధమున నతని గురువునుగా భావించి తన యాఁఅవప్రాణముగఁ జూచు కొనుచుండెను. ఆయోగి యెప్పుడును గాలము వ్యర్థముగాఁ బుచ్చఁడు: ఒకమాటు తపమాచరించును; ఒకసమయము శిష్యులకు జ్ఞానోపదేశము చేయును; మఱొకప్పుడు పుణ్యప్రదాయకములగు భారత రామాయణాది గ్రంథములఁ బఠించును; అట్లు పఠించునపుడు శ్రోత లర్థము చెప్పఁడని వేఁడ మహాసంతసముతో నతఁ డందలి విశేషముల విప్పి చెప్పును. ఒకనాఁ డతఁడు భారతమును జదువుచుండెను; శిష్యులు చుట్టును బరివేష్టి వినుచుండిరి నాఁడు చదువుచున్న భాగము విరాటపర్వములోని యుత్తరగోగ్రహణము. అర్జునుఁ డుత్తరుని సారథిగాఁ జేసికొని జమ్మిం జేరి యాయుధములఁ దాల్చి కౌరవ వ్యూహమును సమీపించు సమయము వచ్చినది. అతఁడును మహానంద పరవశుఁడై చదివి వ్యాసభగవానుని యభిప్రాయంబులను దెల్లముగాఁ దెల్పుచుండెను. శ్రోతలు తదేకచిత్తులై వినుచుండిరి. ఇంతలో నలువురు పురుషు లచ్చటి కేతెంచిరి. శిష్యులటుసూచి పరివారసహితుఁడైన ఛత్రసాల మహారాజని తెలిసికొని తోడనే లేచి గౌరవముచేసిరి. రాజును సహచరులు నాస్వామికి నమస్కరించి యాశీర్వచనములు వడసి కూర్చుండిరి. తక్కినవారును దమస్థానముల నలంకరించిరి. రాజువచ్చుటవలనఁ బ్రాణనాథుఁడు గ్రంథపఠనము నిల్పి తమ యానందమునకు భంగము గల్గించునేమోయని ప్రజలు భయపడఁ జొచ్చిరి. కాని యతఁ డట్లు చేయలేదు ప్రాణనాథుఁడు

రాజుంజూచి, "మహీపాలా! తగిన సమయమునకు వచ్చితివి. ఈకథాభాగము నీవు తప్పక వినవలసినది," అని పొచ్చరించెను. రాజు సంతోషపూర్వకముగా నామోదించెను. దానితోఁ దక్కినవారి గుండెలు గొట్టుకొనుట మాని పురాణపఠనము మరల నారంభమయ్యెను. నాఁడు తగిన శ్రోత లుండుటచే స్వామి మహోత్సాహ మవలంబించెను అతనికి సంగీతశాస్త్రమునఁగూడఁ బొండిలి గలదు. అతనికంఠము మృదుమధురమైనది. అతఁడు కథాభాగము ననుసరించి రాగములు మార్చుచుండెను. ఆసమయమున సభ్యుల నయనమధుకరములు యోగి వదనారవిందమునఁ బ్రసరించుచుండెను. తదీయవదనకమల నిస్రుతంబగు వచనమకరందమును గ్రోవి మైమఱచిన విధమున నందుండి కదలలేదు. సభ్యులు తన్మయులై యర్జునుఁడొంటిగాఁగౌరవసేనావారముతోఁబోరుసల్పు నున్నాఁడని విని యేమి యుపద్రవము వచ్చునోయని భయపుండసాగిరి. వారిమనస్సులన్నియు నర్జునునిపక్ష మవలంబించెను. దుర్యోధనుపక్షముచు ద్వేషించెను. కావున నర్జునుని నిశాతబాణ పరంపర శత్రువులఁ జీకాకు చేసెనన్నపు డానందమును గౌరవుల నారాచము లర్జును శరీరమును దూసికొని పోయెనని విన్నపుడు విచారమును బొందుట తప్పదుగదా! యుద్ధము ప్రారంభమయ్యెను. స్వామి యాపట్టునకు దగినట్లు, శ్రీరాగ మాలాపించెను. ఆమహాత్ముఁ డింపుగాఁ జదివి యర్థము చెప్పునప్పుడు వినువారికచ్చట యుద్ధము జరిగినట్లే తోఁచుచుండెను, వీరుల సింహనాదములును హయహేషలును, మాతంగ బృంహితములును రథనేమిధ్వానములును ధనుష్టంకారములును వారికి వినిపించు

చున్నట్లేయుండెను; శస్త్రాస్త్రములకాంతివిశేషములువారికన్నుల మిఱుమిట్లు గొలుపుచున్నట్లే యుండెను; అర్జునునిశరఘాతములఁ ద్రెళ్లి నేలకొఱఁగుచున్న సైనికనికాయముల కాయములు గానవచ్చుచున్నట్లే యుండెను; రక్తప్రవాహపూరితమగు యుద్ధభూమి వారిహృదయదర్పణములఁ బ్రతిఫలింపసాగెను; దాని వలన భయమధికమగుచుండెను. రణరంగమున వీరశయనమందు చున్నవారి హాహాకారములు చెవులకు సోకుచున్నట్లే యుండెను; మాంసభక్షణాసక్తములై యంబరమున నెగురుచున్న కాక కంకాదిపక్షి విశేషములును జంబుకాది మృగములును నట్టిటు విహరించుచున్నట్లే తోఁచుచుండెను; అర్జునునిచే విముక్తములగు గోవులు మత్స్యపురాభిముఖములై తోఁక లెత్తి యంబాయని యఱచుచుఁ బర్వెత్తుచున్నట్లే గోచరింపసాగెను. తమతమ సైన్యములతోఁగూడ భారతవీరు లర్జునుని ప్రతాపాతిశయమున కోర్వఁజాలక సమ్మోహనాస్త్ర మూర్ఛితులై నేలకొఱఁగుచున్నట్లు పొడకట్టుచునే యుండెను. తన్మయత్వమున సభాసదులు కౌరవవీరులవలె మైమఱచి యుండిరి అది యుద్ధమో పురాణశ్రవణమో వారికిఁ దెలియలేదు. ఉత్తరుఁడు రథంబుడిగి ఖడ్గపాణియై పోయి చెల్లెలి కోర్కెఁ దీర్పఁ గౌరవ వీరుల యుష్ణీషచేలాంచలములు గోసినట్లైవరైన నవసరమును బట్టి సభాసదుల యుత్తరీయాంచలములు గోసికొని పోయినఁ బోవచ్చును. ఆయుత్తరుఁడు సమ్మోహనాస్త్రప్రభావ మెఱిఁగి మేల్కని యున్న భీష్మునిచెంతకేగలేక పోయెనఁట! అట్లే యిటఁ గథాశ్రవణము చేయుచున్నను తక్కినవారివలెఁ దన్మయత్వ

ముందని ఛత్రసాలుని మాత్ర మెవరును సమీపింపలేరని చెప్ప వచ్చును. దీనివలన ఛత్రసాలుఁడు రసానుభవి కాఁడని నాయభి ప్రాయముకాదు. అతఁ డాయాపట్టుల నాయారసముల ననుభవించుచుఁ గేవలము మానసమును వానిలో మగ్నము చేయక యాకథవలన నీతిని గ్రహించుచుండెను. ఈపురాణశ్రవణ మాతని కెంతో ధైర్యమును గల్గించెను. అల్పసేనాసమేతుఁ డగు తాని క రాఁబోవుసంగ్రామమున మహాసేనా ుఁ డగు నౌరంగజేబుతోఁ బోరిన జయమబ్బునో లేదోయని యతని కప్పటప్పటఁ గొంచెము సందియ మంకురించెడిది. అది దీనివలన బూర్తిగా నశించెను. అతని హృదయ మానందకందళిత మయ్యెను. అతఁ డేమేమో యోజించుచు యోగి మొగము వంకఁ జూచుచుండెను. అర్జునుని జయలక్ష్మి వరించినతోడనే నాఁటికి గ్రంథపఠనము నిల్పి ప్రాణనాథుఁడు స్వస్తి చెప్పచుండెను. నిద్రనుండి మేల్కనినట్లు సభాసదులు బాహ్యజ్ఞానమును బడసి నాఁడు తమ కానందము గల్గించిన యాయోగీశ్వరుని ప్రభావమును గొండాడసాగిరి. ఆస్వామి పాండిత్యము గాండీవి ప్రతాపమువలె నిరుపమానమైనదని ఛత్రసాలుఁడును నుతించెను. మఱియు నిట్లనియె.

"స్వామీ! నేఁడు సుదినము. మీపురాణశ్రవణము వలన నపూర్వమగు నీతిని గ్రహింపఁగల్గితిని. దానివలన హృదయము ధైర్యపూరితమైనది, సందేహము నివర్తించినది."

ప్రాణనాథుఁడు మహారాజు గ్రహించిన నీతియేమో యవలీలఁ దెలిసికొనెను. "మహారాజా! నీవట్టియంశమును గ్రహింతువనియే మొదట నిన్ను ొచ్చరించితిని. ఎంతటి

ఘనకార్యములనైన నిర్వహించుకొనుటకు ధైర్యోత్సాహ ములు ప్రధానములు గాని సైన్యముల యధికత్వాల్పత్వములు కావు" అని యతఁడు పలికెను.

ఆవచనములు ఛత్రసాలున కానందము గొల్పినవి. అతని వదనము మందహాసభాసుర మయ్యెను. తనచూపుల నా యోగివదనమున నిల్పి "అయ్యా ; నాపైనున్న మీవాత్స ల్యము గణనీయమైనది. మీహితబోధయే నాకు వేయిసైన్య ములపెట్టై యిదివఱకుఁ జక్రవర్తితోఁ జేసిన యుద్ధములను గెల్పించినది ; రాఁబోవు మహాసంగ్రామమునఁ గూడ గెల్పింప నున్నది. ఇఁక దానికి మహానుభావులరగు మీయాశీర్వచన మును దోడ్పాటు చేయుఁడు" అని రాజు ప్రార్థించెను.

"రాజేంద్రా, నీధైర్యోత్సాహములే నిన్నుఁ దావృశ విజయలక్ష్మీపమేతునిగాఁ జేసినవి. చేయుచున్నవి. మాహిత బోధ యెంత ? మా యాశీర్వచనబల మెంత ? ఇవి వట్టినికంబ ములు. నీవు మహాత్ముఁడవు. మహాత్ములు తమ సత్యముచేతనే యెల్ల కార్యముల సాధించుకొందురు. వారికి సాధనములతోఁ బనిలేదు. అట్లే నీకార్యసిద్ధికి నీసత్వమే ముఖ్యము ; నీకు సైన్యాదులతోఁ గాని మాహితబోధాదులతోఁగాని ప్రయో జనము లేదు. అయినను నీవు సత్పురుషుఁడవుగానఁ బరుల సద్గుణలేశములను గొండంతలుగాఁజేసి పొగడుదువు. రాజ కుమారా ! ఇట్టి సద్గుణపుంజమవగు నిన్నెవ్వరు మెచ్చరు ? ఎవరు దీవింపరు ? నీవన్ని విధముల శివాజీ మహారాజున కెన యగుదువు." అని యోగీశ్వరుఁడు పలికెను.

"మహాత్మా ! అతఁ డెక్కడ ? నేనెక్కడ ? అతఁ డొక యద్వితీయపురుషుఁడు. నేనొక పర్యాయ మామహాపురుషుని భీమనదీతీరమున సందర్శించితిని. అతని యుదారగుణముల నేమని వర్ణింతును ? ఆధైర్యము, ఆసమరసముత్సాహము, ఆ స్వాతంత్ర్యప్రీతి, ఆ ధర్మాస__ ఆగాంభీర్యము, ఆ వాక్చమత్కారము, ఆప్రజానురంజకత్వము వందనీయములే గదా ? మహమ్మదీయనిరసనము గావించి దేశస్వాతంత్ర్యము నెలకొల్పవలయునని యుపదేశించి యతఁడు నాకీ మహాఖడ్గము నిచ్చెను. ఆతని యుపదేశమును మీాహితోక్తులును యుద్ధ సమయముల నాకీకత్తికంటె నెక్కుడుగాఁ దోడగుచున్నవి. స్వామీా, చెప్పమఱచితిని, ఆ శివాజీ మహారాజు నేను జక్ర వర్తితోఁ జేసిన సమరములకు సంతసించి రాఁబోవు సంగ్రా మమున నాకుఁ బ్రోత్సాహము గల్గింపఁ దన సేనానాయకుఁ డగు నీ మురారిపంతును సహాయునిగాఁ బంపించెను,'' అని యతని యౌదార్యమును మెచ్చుచు ఛత్రసాలుఁడు దనతో వచ్చిన మురారిపంతును జూపెను.

ఆయోగి యతనిఁ జూచి సంతోషపూర్వకముగా సంభాషించి రాజుదిక్కు మొగంబై "కుమారా, రాఁబోవు యుద్ధమునకు నీవు దగిన ప్రయత్నములు చేయవలసి యుండు ను;" అని పలికెను.

"యోగీంద్రా, నేనెల్లప్పుడు నాయత్నమునే సలుపు చున్నాను. నా హితమునుగోరు బంధువులనెల్ల రప్పించితిని. నా పినతండ్రి కేశవసింహుఁడు నాకొంతకు వచ్చెను. అతఁ డద్వితీయ పరాక్రమశాలి. ఈసమయమున నతని తోడ్పాటు

నా కెంతయో ధైర్యమును గొలుపుచున్నది. మన ప్రతాపుఁడతని కుటుంబము నిచ్చుటకుఁ గొనివచ్చెను. వారిని నిరపాయముగాఁ దీసికొనివచ్చుట ప్రతాపునికి మిక్కిలిదుర్భరమనిపించెనఁట! అతని కుటుంబ మిచ్చుటికి వచ్చుటచే నా కమితానందము గల్గెను. నాకది రాజ్యస్వాతంత్ర్య మిచ్చుటకంటెఁ గూడ నెక్కుడనిపించుచున్నది." అని యతనితోఁ గొంతసేపు ముచ్చటించి వెడలి పోయెను.

# దిలారామ

## 20-వ యధ్యాయము

### పరాత్పరుఁడు - రామలాలు

"మహిని మాయావి మిక్కిలి-మంచిమాట
లాడి ప్రజలను నమ్మించి-కీడు చేయుఁ
గనుక ధీశక్తిఁ గుజనస-జ్జనుల భేద
మరయ కెల్లర నమ్మ న-ర్హంబుగాదు."

బుందేలు ఖండములో నించుమించుగా సాబాలు పర్వతమయము. మహారణ్యములతో నిండియుండు ఆయరణ్యములు పెక్కు క్రోసులదూరము నావరించి చూపఱకు భయము గొలుపును. అవి భీకర జంతు సంతానములకు నిలయములు. వానిలో నాదేశపుఁ బడమటియెల్లగా నున్న యడవి మిక్కిలి పెద్దది. దానిలో నలఁగిన మార్గములు పెక్కు లున్నవి. వానిలోఁ గొన్ని ఢిల్లీ మొదలగు పురములకుఁ బోవును ; కొన్ని ధనురాకారముగా వంగి యాదేశములోనే యున్న కొన్ని గ్రామములకుఁ బోవును. మిక్కిలి పరిచయమున్నవారు దప్పఁ దక్కినవార లాయడవి ప్రవేశించి బైట బడుదురనుట కల్ల! మార్గములు కొన్ని కొంతదూరము సరిగాఁ బోయి యచ్చటఁ బలుచీలిక లగును. అక్కడ గంతవ్యమగు మార్గమేదో సరిగాఁ దెలిసికొనకుండఁ బోయినచో నొకచోటి కరుగవలసినవారు వేఱొక చోటికిఁ బోదురు. ఒకప్పుడు

పోయిపోయి తిరిగి బయలుదేరినచోటికే వచ్చుటయుం గలదు. పద్మవ్యూహమువలె నాయడవి చిక్కుదారి గలదై సామాన్య పథికుల సిలుగులం బెట్టుచుండును. ఆకారణమున నందుం బడి పోవువారు వానిని బాగుగా నెఱింగిన యాదేశస్థుల సాయము పడసి పోవుచుందురు. పవటిపూఁటయందే భ్రాంతిగల్గించు నామార్గములు రాత్రులం దెట్లుండునో యెవ్వరు చెప్పఁగలరు? అయిన నాదేశవాసులు కార్యావసరమును బట్టి రాత్రులుగూడ నందుం బయనము చేయుదురు.

ఒకనాఁటి రాత్రి యిరువురు పురుషు లాయరణ్యమునం బడి యెచ్చటనుండియో వచ్చుచుండిరి. వారిరువురును ప్రౌఢ వయస్కులు; బలిష్ఠులు, దీర్ఘకాయులు, దండాద్యాయుధ పాణులు. వారి నిర్భయగమనము నాలోచింపఁగా వారాయ రణ్యమునకుం జిరపరిచితులని తోఁచును. అది చీఁకటి సమ యము. వారరణ్య మధ్యమునకు వచ్చి నిశ్శబ్దముగా నడుచు చుండిరి. అప్పుడు వారికి మనుష్య సంభాషణము వినవచ్చెను. అది విని వారు నిలువఁబడిరి. ఆమాటలు క్రమక్రమముగా వారికి దగ్గఱగా వినవచ్చుచుండెను.

"దారి తప్పిపోతిమని మొదటనే చెప్పితిని. చూడుఁడు, ఇది క్రమక్రమముగా రాజధానికే పోవుచున్నది. మీసర్వ జ్ఞత్వమే మనల నింత శ్రమపఱచుచున్నది," అని యొకఁడనెను.

"పోనిండు, ఉదయమగువఱ కిచ్చట నుందము. వెలు తురు రాఁగానే పోవచ్చును. సవారి నిక్కడ దింపుఁడు," అని మఱియొకఁ డనెను.

"అంతవఱ కిచ్చట నుండిన మన ప్రయాసము వ్యర్థమగును. ప్రమాదము సంభవించును. కావున నెట్లో మార్గమునకీ తెల్లవారునప్పటి కీదేశము కడచిపోవలెను." అని వారి యజమానుఁడనెను. వారిట్లు చిక్కులు పడుచుండిరి. మన యిర్వురు బాటసారులలో నొకఁడు రెండవవానిని జూచి, "మిత్రమా, మార్గస్థు లెవ్వరో దారి దెలియక చిక్కులు పడుచున్నట్లున్నది. పోయి కనుఁగొందము రమ్ము" అని పల్కెను.

"ఓయీ! వీరిచర్య నాలోచింప మనకంటెను మిక్కిలి నిర్భయులవలెఁ జూపట్టుచున్నారు. లేనిచో నిట్టి సమయమున నీయరణ్యమునఁ బ్రయాణము చేయ సాహసింతురా? పదపోయి చూతము," అని రెండవవాఁ డనెను.

మాటలను బట్టి వారిరువురును మెల్లమెల్లగా నచ్చటికరిగిరి. వీరరుగు నప్పటికి వారొకచో సవారీని దింపి చుట్టును నిలువఁబడి యుండిరి. ఈయిరువురను జూచి యానూతన పాంథులు దొంగలగా భావించి కళవళ పడుచుండిరి.

వారి తొట్రుపాటును జూచి యాయిర్వురలో నొకఁడు వారితో, "ఓయీ, మీరు భయపడకుఁడు. మేము దొంగలము కాము. మీ కేమియు ద్రోహముచేయరాలేదు. కార్యవశమున మే మీమార్గమునఁ బోవుచు దారి తప్పి మీరు బాధపడుచున్నట్లు మీమాటలవలన విని మీకు దారిదెల్పుటకై వచ్చితిమి. తెల్లవాఱినదాఁక నిచ్చటనుండిన ప్రమాదము వాటిల్లునని యనుకొనుచున్నారు. ఆవచ్చెడిప్రమాద మేమి? మీవృత్తాంతము వినిపింపుఁడు" అని పలికెను.

వారందుఒకు సంతసించి, "అయ్యా, కాన్పూరులోనున్న యొకధనసంపన్నుని సేవకులము. గోండ్వానా నుండి వచ్చు చున్నాము. మా ప్రభునిభార్య దుస్సహ రోగపీడితయై చావ సిద్ధముగా నున్నది. ఈసవారీలో నున్న దామెయే. సత్వరముగాఁ గొని రావలయునని మాకాజ్ఞాపించి మా ప్రభువు మాపురమున కేగెను. త్వరగాఁ బోయి మందిప్పించిన జీవించునేమోయని యిట్లు ప్రయాసమనక పయనము చేయుచున్నాము. ఇచ్చటఁ దడసిన నామెకుఁ బ్రమాదము వచ్చునేమో యని భయపడు చున్నాము, దయయుంచి దారిఁ జూపుడు," అని పలికిరి. మొదటివా రదివిని సదయులై కాన్పూరువారిని జూచి "ఓయీ! ఈమార్గమును దప్పకుండ బోయినచోఁ గొంతదూరమున నొక గ్రామము కనఁబడును. అచ్చటికిఁ బోయి యొక మనుష్యుని సాయమునుబడయుఁడు. మీరు సులభముగా నీ యడవి దాఁటగలరు," అని చెప్పి యొకదారి చూపిరి.

అది విని కాన్పూరువారు సంతసించి పోవుటకు సవారీ నెత్తఁ బోయిరి ఇంతలో సవారీలోనుండి మూలుగెక్కువగా వినఁబడసాగెను. అయినను వారది వినిపించుకొనక నడువఁ జొచ్చిరి. మనబాటసారులలో నొకఁడు వారి యజమానునిఁ జూచి "అయ్యా; నేను ఘనవైద్యుఁడను. ఆమెకుఁగల రోగమేమో నిదానించి మందిచ్చెదను. ఒక గడియ నిలువరాదా?" అని పలికెను.

"మధ్య మార్గమున మందియ్య వలదని మా ప్రభువు చెప్పెను. తమకా శ్రమమెందుకు? దయ యుంచుఁడు. పోయెదము."

"చూడుము. ఆమూలుగు హెచ్చుచున్నది. ఎంత శ్రమపడుచున్నదో? నామందారోగమును హెచ్చింపదు; తగ్గించును నిలిపి యీమందిమ్ము."

"ఆమెకు ఘోషా పద్ధతి గలదు. మనమెట్లు చూడ వచ్చును? చూడకుండ రోగమెట్లు పోల్పవచ్చును? అది తెలియ కుండ మందువేసిన లాభమేమి? ఇఁక నన్నాఁపకుము."

"ఆమెనుజూడ నవసరములేదు. పైనుండియే లక్షణము లడిగి తెలిసికొని మందిచ్చెదను."

"మీకా శ్రమ యెందుకు?" అని కాన్పూరివారు పర్వెడఁ జొచ్చిరి.

ఈ మన మొదటి బాటసారి రెండవవానిఁ జూచి "ఓయీ! వీరిచర్య నాకచ్చెరువు గొల్పుచున్నది. మరణదశలో నున్నవారిని బ్రదికింపఁ బాటుపడుదురు; మందుకై కన్నవారి నెల్ల బతిమాలుకొందురు. అంతియకాని మందిచ్చెదమన్నపుడు వద్దన్నవా రుందురా! ఆలోచింప వీరు కఠినహృదయులవలెఁ జూపట్టుచున్నారు," అని యనెను.

"నిజమే; ఇంతేకాదు. వీరివచనము లసందర్భముగా నున్నవి, పోల్చితివా? మహాధనసంపన్నుని భార్యను ఘోషా పద్ధతి గలదానిని, దుస్సహ జ్వరపీడిత, నీయరణ్య మార్గముల నాఁడుతోడు లేకుండఁ బంపుట కెట్టి కఠినచిత్తులైనను దల్లి దండ్రు లంగీకరింతురా? భర్త యిట్లాజ్ఞాపించునా? వీరిని

గూర్చి నామనస్సు సందేహించుచున్నది," అని రెండవవాఁడు పల్కెను.

"నాకును సందేహము లేకపోలేదు. ఆతొందరపాటు చూడ దొంగలేమో యను భ్రాంతి గల్గించుచున్నది. ఇప్పుడేమి చేయుదము?"

"పిల్చిచూతము. నిల్చిన సరియే; లేనిచో నిర్బంధించి వారి తత్త్వమరసి వదలుదము."

అని వారు గూడఁబల్కికొని; పోవుచున్న వారిని బిలువఁజొచ్చిరి. కాని మాఱుపలుకు లేదు, నిలువఁబడుటయు లేదు. ఆయరణ్యమునఁ బ్రతినినాదము పుట్టునట్లు మనబాటసారులు సుగ్రీవు బొబ్బలఁ బెట్టనారంభించిరి. అరణ్యమైనఁ బ్రతిచెప్పినది కాని చనుచున్నవారు మాఱుపలుకలేదు. వీరు పిల్చుచున్న కొలఁది వారు పరువెత్తుచుండిరి. ఇఁక మనబాటసారు లచ్చట నిలువలేదు; ఆయుధపాణులై యొక్క పరువున వారిని సమీపించిరి. చేతులతో సవారీపట్టుకొని, "నిలువుఁడు నిలువుఁడు," అని నిర్బంధించిరి.

"ఎందులకు మమ్ము నిర్బంధించితిరి?" అని రోషముతో రెండవ తెగవా రడిగిరి.

"మేము పిల్చినఁ బర్వెత్తెద రేల? మీరనుమానపురుషులవలెఁ జూపట్టుచున్నారు. మీతత్త్వము చెప్పనిచోఁ బోనీము," అని మొదటివా రనిరి.

అని వీరు సంభాషించు సమయమున లోపలినుం మూలుగు మఱింత గట్టిగా వినవచ్చెను.

అంత రెండవ తెగవారి యజమానుఁడు సమీపిం· "మీఁరు దొంగలవలెనున్నారు. మిమ్ముఁ బట్టుకొని రాజున కప్ గించెదము; చూడుఁ," డని పల్కెను.

"నీవేమన్నను సరియే. మేమీసవారీని బరీక్షింపకుండ వదలము."

"అయ్యో! మీకిట్టి దుష్టబుద్ధి పుట్టుచున్నదేమి లోపలనున్న యుత్తమస్త్రీ గౌరవము చెఱుపనున్నారా? ఛీ! దురాత్ములారా! పతివ్రతలఁ జెఱచినవారు పూర్వ మేమైరో యెఱుఁగుదురా?

"మాకానీతు లన్నియుఁ దెలియును. దీనిలోనున్న యువతిని మాతల్లిగా భావించుచున్నాము. ఆపత్సమయమున ఘోషాపద్ధతి యేమి? మేమామెను జూచి నమస్కరించి తగిన మందిచ్చి పంపివేసెద" మని మన మొదటి బాటసారులు తలుపులు తెఱవఁ బ్రయత్నించిరి. ఆయజమానుఁ డడ్డగించెను. బాటసారులు త్రోసివేసిరి. వాఁడాయవమానము సైఁపఁజాలక తనవారిని బురికొల్పి ఖడ్గపాణియై సవారికడ్డుగా నిలువఁబడెను. సంఖ్యయం దెక్కుడుగానున్న తమ సంరంభము చూచి వారు పాఱిపోవుదురని యభిప్రాయపడెను కాని వారట్లు చేయలేదు. ఆయిర్వురు నాయుధములఁ దాల్చి ప్రళయకాల రుద్రులవలె భయంకరులై ప్రతిపక్షుల నెదుర్కొనిరి. తళతళమను వారి కత్తికాంతులు చీఁకట్లను దఱుముచుండెను. ఖణేల్ ఖణేలుమని

ఖడ్గములు రాపాడి యగ్నికణముల రాల్చుచుండెను. ఒక్క నిముసములో పైవారిలో నిరువురిశిరములు మనబాటసారుల కరవాలముల కెరయయ్యెను. అది చూచి రెండవ తెగవారు యుద్ధముచేయక పర్విడఁ జొచ్చిరి మనబాటసారులు వెంబడించిరి కాని యడవి దుప్పులవలెఁ దుముకుచుండుఁ బర్వెత్తుచున్నవారిని గలిసికొనలేక పోయిరి. వెనుకకు మరలి వారు సవారీ తలుపుతీసిరి. చీఁకటిచే నందున్నవా రెవ్వరో తెలియలేదు. పరస్త్రీ స్పర్శనమును వారు చేయఁ జాలక మెల్లగా ఖడ్గముతో లోనున్నయామె బంధనముల ఛేదింపఁ బోయిరి. వారి కాచేతులును గాళ్లు నలంకారహీనములై పురుషావయవములవలె గన్పట్టెను. ఇఁక వారు సంకోచింపక లోని యతనిని బంధవిముక్తునిజేసిరి. తోడనే లోపలనున్న పురుషుఁడు తనచేతితో నోటిలోని గుడ్డలను లాగికొని, "పరాత్పరా! నేఁటికి బ్రదికితి," నని బయటికి వచ్చెను. వారతనిఁ జూచి యాశ్చర్య పడిరి. కంఠస్వరముచే నానవాలుపట్టి, "స్వామీ! మీకే యిట్టి దురవస్థ సంభవించినదా? యోగీంద్రా! మీ రేరీతి యీదురాత్ములకుఁ జిక్కితిరి?" అని వారిరువురు నతని పాదములపైఁ బడిరి.

ఆ ప్రాణనాథుఁడును మాటలవలన వారిని గుర్తించి "ఓయీ! పరాత్పరా! నీవా! నిజముగా నన్ను రక్షించు నీవు పరాత్పరుఁడవనియే యెంచుచున్నాను. ఇతఁ డెవ్వఁడు?" అని సమీపించిచూచి, "ఓయీ! నీవా! రామలాలు భట్టాచార్యా! నేఁడు మీ రెంత యుపకార మొనర్చితిరి? మీ ఋణ మెప్పటికిని దీర్చుకోలేను," అని పొగడ నారంభించెను.

"యోగీంద్రా! మీశిష్యుల కిది విహితకృత్యము. ఇది యుపకారముగాదు. మేము మీకుశిష్యులమైయుండియు మీకుఁ గ్రూరులవలన నపాయము రాకుండఁ గాపాడలేక పోతిమి. ఛీ ఛీ! ఇంక మాబ్రదు కెందుకు? స్వామీ, ఈ దురాత్ములవలన మీకేమియు గాయములు సంభవింప లేదు గదా?" అని శిష్యు లాత్రముతో నడిగిరి.

"లేదు, లేదు."

"ఈదుష్టులు మిమ్మెందుఁకు బంధించిరి? అకటా! ఎంతకష్టము! ఎంత ప్రమాదము! ఈవృత్తాంతము మాకు వినిపింపుఁడు."

"దుష్టులకు సజ్జనుల బాధించుటయే ముఖ్యకార్యము. విచారింపకుఁడు. ఈవృత్తాంతము తరువాతఁ జెప్పెదను. మన యాలయమునకుఁ బోవుదము రండు," అని యోగీంద్రుఁడు ముందు నడువఁజొచ్చెను. వారిరువురును నాయోగీంద్రుని వెంబడించిరి.

# దిలారామ

## 21-వ యధ్యాయము

### ఔరంగజేబు

శ్లో. "ఆశాయా యే దాసా స్తే దాసాస్సర్వలోకస్య
ఆశా యేషాం దాసీ తేషాం దాసాయతే లోకః."

ఆశ పాశమువంటిది. కావుననే పండితులు దాని నాశాపాశమందురు. పాశమువలెనే యాశమానవులబంధించి లోఁబఱచుకొనును. అట్లైనను మానవుఁడు కేవల మాశారహితుఁడై యుండరాదు; అట్లున్నచో వాఁడభివృద్ధి గాంచలేఁడు. పేరాశగలవాఁడు చెడును. కావుననే పండితు లాశను దమకు లోఁబఱచుకొనియుందురు. కాని తామెన్నఁడును దాని కధీనులుగారు. దానికి విధేయుఁడు గానియపుఁడే మానవుఁడు సుఖంచును. పుణ్యముల సంపాదించును; గౌరవ మలవఱచి కొనును కీర్తి నార్జించుకొనును. దాని కధీనుఁడైనచో నానా పాపమార్గములఁ ద్రొక్కును; పలుబన్నము లనుభవించును; కులమర్యాదను విడుచును. యుక్తాయుక్తవివేకమును గోల్పోవును; సుఖహీనుఁడగును. పెక్కేల? ఆశాపిశాచగ్రస్తుఁడగువాఁ డిహపరములు రెండింటికిని వెలియగునననిన నది యతిశయోక్తిగాదు.

ఔరంగజేబు చక్రవర్తి మిక్కిలి ధైర్యశాలి; నిరుపమాన ప్రతిభాశోభితుఁడు; విద్యాగరిష్ఠుఁడు; రాజనీతివిశా

రఘుఁడు; ఇవి యాతనియందున్న సద్గుణములు. దుర్గుణముల నెంచిన నెన్నియో కలవు. వానిలోఁ గౌటిల్యము దురాశయును నవి ప్రధానములు. వానికౌటిల్య మెందఱ రాజపుత్త్రుల ప్రాణములు దీసినదో చరిత్రాభిజ్ఞుల కెల్లఁ దెల్లంబే. వాని రాజ్యతృష్ణాపిశాచము దృఢముగా నావహించెను; తోడనే వాని యుక్తాయుక్తవివేకము నశించెను. ఎన్నియో పాపమార్గములు వాఁడు ద్రొక్కెను. సోదరుఁడగు దారానోడించి యవమానించి నిష్కృపతోఁ జంపెను. రెండవ సోదరుఁడగు షుజాను నానావిధముల బాధించి పరదేశములకుఁ బాఱఁదోలెను. తన తమ్ముఁడగు మురాదునిఁ గారాగృహాబద్ధుని జేసి చంపించెను. దైవసమానుఁడును, నిజజనకుఁడునగు షాజహానును జెఱలోనుంచి తుదముట్టించెను. ఆహా! రాజ్యతృష్ణ నెందఱ బాంధవులఁ జంపినదో చూడుఁడు. ఆత్మబంధువులగు జనకాదులే నిశాతకరవాలమున కెరయగుచుండఁ దక్కినవారి సంగతి చెప్పనేల? ఈకారణముననే ప్రజలతనిని విశ్వసింపరైరి. కావున నతఁడెంత యత్నించినను బ్రజానురంజకత్వమును సంపాదింపలేకపోయెను. ప్రజలకును బ్రభువునకుఁ బరస్పరానురాగము లేనిచో వారలకు సుఖ మెట్టులొదవును? అతఁడు సుఖింపలేకపోయెను. అతఁడు నిజబుద్ధివిశేషమెల్ల వినియోగించి రాత్రిందివములు కష్టపడియు సామ్రాజ్య మభివర్ధింపలేమి కిదియొక ప్రబలకారణము. రెండవది హిందూమతనిరసనము. అది మొగల్సామ్రాజ్యమహీరుహమునకుఁ జీడపుర్వై తుదకు మూలనాశముగావించి కూర్చినది. అతఁడు హిందూమతమును నిర

సించుటచేఁ బెక్కురు ప్రబల శత్రువు లైరి. అందుచే నతఁ డఖండసామ్రాజ్యలక్ష్మీధురంధరుఁ డైనను దదీయ చిత్తమున కెల్లప్పుడును సంతాపమే కాని సంతోషము లభించినది కాదు.

అతని జీవితకాలమెల్ల యుద్ధములతో నిండియుండెను. ఎచ్చటఁ జూచినను గలహములే. ఎచ్చటఁ జూచినను దిరుగు బాటులే. ఒక మూల మహారాష్ట్రు లెదిరించి పోరి చక్రవర్తి సైన్యముల నోడించుచుండిరి; ఒకవంకఁ జిత్తూరు రాణాలు కత్తికట్టి ప్రతిఘటించి యతని సైన్యములతోఁ బోరాడుచుండిరి. మధ్యహిందూస్థానమున ఛత్రసాలుఁడు స్వతంత్రుఁడై పోరు చుండెను. పెక్కుచోట్ల సమరము చేయవలసియుంటచే నెంత సైన్యమైనను జాలకుండెను; ఎంత ధనమైనను జాలకుండెను. ఒకవేళ ధనప్రాణములు వ్యయమైనను జయమబ్బినఁ గష్టమని పింపదు; కాని యట్లు జరుగలేదు. తఱుచుగా నన్నిచోట్ల నప జయమే సంభవించుచుండెను. ఒకప్పుడు జయమబ్బి కొంతదేశము స్వాధీనమైనను నది చిరకాలము నిలువకుండెను. ఇందుచేఁ జక్రవర్తిచిత్తము విచారాకుల మగుచుండెను. మఱియు నప జయము సంభవించుకొలఁది నతని చిత్తమునఁ గ్రోధము ప్రజ్వ లింపసాగెను. ఛత్రసాలునిచర్య లతని కోపాగ్నిజ్వాల కాజ్య ధార లయ్యెను. ఛత్రసాలుఁడు చక్రవర్తిసేవకుల నవమానించి పంపెను; నాల్గు పర్యాయములు నలువురు సేనానాయకులను సైన్యములతోఁ బంపినను వారినోడించి వెనుకకుఁ దఱిమెను. తనహృదయమునకు శల్యమువంటి ఛత్రసాలునిఁ దుదముట్టిం చినఁ గాని తనకుఁ దన రాజ్యమునకును, సుఖ మలవడనేరదని చక్రవర్తి నిశ్చయించెను; తత్కార్యమును నిర్వహించుకొ

సహార్ని శంబులు తలపోయఁజొచ్చెను, దానికొక మహాసైన్యము సమకూర్పవలసి యుండెను; కాని యెట్లు సమకూర్చుటో తెలియ కుండెను. అతని కపారమైన సైన్యములు కలవు. కాని వానిలో నొకటియైనను విశ్రాంతిపడసి యుండలేదు. అవి యెల్లప్పు డును శత్రువులతోఁ బోరాడుచునే యుండెను. బంగాళవంగ ఘూర్జర ప్రభృతులగు దేశములందు మఱికొన్ని సైన్యము లుండెను. అవి యాయాదేశములకు రక్షక సైన్యములుగా నుండెను. వానిలో నొకదానిని రప్పించినచో నచ్చటి ప్రజలు వెంటనే తిరుగఁబడక మానరు. అందుచే నెచ్చట నున్న సైన్య మచ్చటనుంచక తీఱినది కాదు.

చక్రవర్తి యది యాలోచించి ఛత్రసాలుని మదమడంపఁ జాలిన యొక క్రొత్తసైన్యము గూర్పనెంచి యందు నిమిత్త మొకనాఁడు సభ చేసెను. ఆసభకు సామంతప్రభువులును, మిత్రు లును, ఉద్యోగులును, పురాధిపతులును వచ్చియుండిరి. నాఁడు మధురాపురపాలకుఁడగు హంస్సేను ఢిల్లీ కరుగుట యిందులకే. సభాస్థలమంతయుఁ బ్రజలచే నిండిపోయెను. మహావాయువుచేఁ దరంగితమైన సముద్రమువలె నాసభ ఘోషించుచుండెను. కొంత సేపటికిఁ జక్రవర్తి యుక్తపరివారసహితుఁడై సభామండప మును బ్రవేశించెను. సభ్యులందఱును లేచి సలాములుచేసి తమ తమయాసనములచెంత నిలువఁబడిరి. చక్రవర్తిసింహాసనాసీనుఁడు కాఁగా సభ్యులును గూర్చుండి యందఱును సార్వభౌముని మోమును దదేకదృష్టితోఁ జూచుచుండిరి. నాఁడతఁడు మిక్కిలి యుగ్రుఁడై యుండెను. నేత్రము లరుణితములై యుండెను; లలా

టము భ్రుకుటీకుటిలమై యుండెను; ఆసమయమున నతని యాకారమందలికును భయము గొలుపుచుండెను. కొందఱది చూడలేక తమ దృష్టులను బ్రక్కకు మలపుకొనిరి. సభనిశ్శబ్దముగా నుండెను. చక్రవర్తి సభను గలయఁ గనుఁగొని, "నాయన్నము దిని నావలన నానావిధముల గౌరవము వడయుచు మహావీరులమని విఱ్ఱవీఁగు నాయుద్యోగులలో ఛత్రసాలుని మదమడఁచి నాహృదయమున కానందము గూర్పఁజాలువాఁడొక్కఁడైనను లేకపోయెనుకదా!" అని నిస్పృహుఁడై పలికెను.

అది వినినతోడనే సభ్యులగుండెలు జల్లుమనియెను: శరీరములు గంపింపఁ దొడఁగెను. చక్రవర్తినోట నట్టి దీనాలాపములు వెలువడినందులకు వారు మనములలోఁ గుందసాగిరి; ఒకరిమొగ మొకరు చూచుకొనఁ జొచ్చిరి. కాని యొక్కండును లేవలేదు: ఛత్రసాలుని మదమడఁచి వచ్చెదనని చెప్ప సాహసింపలేదు. ఆబుందేలు లసాధ్యులని యందఱు నెఱుఁగుదురు; వారిని జయించివచ్చుట యసాధ్యమని కూడ నందఱు నెఱుఁగుదురు; ఒకవేళ నెవఁడైనను సాహసించిపోయి బుందేలులచేఁ బరాజితుఁడై వచ్చినచోఁ జక్రవర్తి వానిఁ దప్పక సంహరింపక మానఁడనియు నెఱుంగుదురు. అంతకుఁ బూర్వము బుందేలులపై కరిగి పరాజితుఁడై వచ్చిన షేక్ అన్వర్ ఖానునకుఁ జక్రవర్తియొనర్చిన పరాభవము వారందఱి హృదయముల లోను జాగరితమై యుండెను. అందుచే వారు లేచి ప్రత్యుత్తర మొసఁగక యేమేమో తలపోయుచుండిరి.

కొంతవడి కొకపురుషుఁడు లేచి నిలువఁబడి చక్రవర్తికి సలాముచేసెను. అతనిపేరు మీర్జాసదరుద్దీను. అతఁడు మాయోపాయములందుఁ జతురుఁడు "ఓహిందూసార్వభౌమా! నేనరిగి ఛత్రసాలుని రూపుమాపి వచ్చెదను. సెలవిండు" అని యతఁడు పలికెను.

చక్రవర్తి సంతుష్టాంతరంగుఁ డయ్యెను. అతని సాహసకృత్యము కొంతయెఱుఁగును. ఆతని నెక్కుడుగా గౌరవించెను. మరల సభ్యులనుజూచి, "ఇచ్చటికి వచ్చిన పురాధిపతులును సామంతులును బ్రయత్నించి యచిరకాలములోనే నాకుఁ గొంతసైన్యము పంపవలయు"నని చక్రవర్తి నుడివెను.

అతని నోటిమాట నోటనుండగానే మధురాపురపాలకుఁడు హుస్సేను లేచి చక్రవర్తికి నమస్కరించి, సార్వభౌమా! నేను దమసెలవు చొప్పున సైన్యమును గూర్చి పంపుటయేకాక నేను గూడఁ బోయి సేనానాయకునకుఁ దోడ్పడి బుందేలుల సంహారమునకుఁ గడంగెదను." అని గంభీరుఁడై పలికెను.

ఆవచనములకుఁ జక్రవర్తి మిగుల సంతసించి, "ఓయీ! సార్వభౌమునియందును సామ్రాజ్యమునందును నీకుఁ గల భక్తికి మిక్కిలి యానందించితిని. మీతండ్రివలె నీవును మాకు గౌరవింపఁదగినవాఁడవు. నీ కుపసేనానాయకపదవి నొసంగితిని." అని పలికి యతని గౌరవించెను. తక్కిన పురాధిపతులును సామంతులును సైనికులను బంపెదమని వక్కాణించిరి. చక్రవర్తి సంతుష్టుఁడై యొకదినము గడువేర్పఱచి నాఁటి కండ

ఱును సైన్యములను బంపవలయునని శాసించెను. వారంద ఱందులకు సమ్మతించి చక్రవర్తి యనుమతివడసి పోయిరి. అనుకొన్ననాఁటి కొకమహాసైన్యము కూడెను. దానికిఁ గొన్ని రహస్యములను దెలిపి బుందేలఖండముపైకి జక్రవర్తి పంపెను,

# ఢిలారామ

## 22-వ యధ్యాయము

### ఛత్రసాలుని విచారము

గీ. "సాధుహృదయంబు నవనీత-సమము పరుల
కష్టములు గాంచి తనకుఁదాఁ-గరగుచుండు."

"యౌవనము సామాన్యముగా మానవులహృదయములఁ గలఁగించును. దానికిఁదోడు సంపదలు కూడ సంభవించి నచో నెట్టియోగ్యునినైనఁ జెడుత్రోవలఁ ద్రొక్కింపక మానదు. ఆపై మనుజునకు ప్రభుత్వముగూడ నలవడినచో నింకఁ జెప్ప నేల?" అని పండితులందురు. కాని ఛత్రసాలునియెడ నీపలుకు వమ్మయినది. యౌవనారంభదశయందున్నను మహాసంపన్నుఁ డైనను ప్రాభవధురంధరుఁ డైనను నతనిమానసము కేవలము సన్మార్గగామియై యుండెను. మహారాజైనను గూలివాని విధమునఁ బాటుపడువాఁడే కాని యొండ కన్నెఱుఁగక యంతఃపురమున స్త్రీజనమధ్యమున వర్తించుచు భోగాసక్తుఁడై తమ ప్రజలను దమ రాజ్యమును దుదకుఁ దమ్మునుగూడ మఱచిపోవు సామాన్యరాజులను బోలువాఁడు కాఁడు. ఇదివఱకతఁడు పరతంత్రమైన రాజ్యమును స్వతంత్రమునుగాఁ జేసి చక్రవర్తిని ఢీకొనియున్నాఁడు. కొలఁది దినములలో మహాసంగ్రామ మొకటి సంభవింపనున్నది. అట్టి సమయమున నతఁడెంత చుఱుకుగాఁ బని చేయుచుండెనో చెప్పవలయునా? అతఁడు రాజ

శీయవ్యవహారములు తనంత తానే చూచుకొనుచు మంత్రితో నాలోచించుచు నప్రమత్తుఁడై జరుపుచుండెను. నిజదేశసీమాంతమునఁ గట్టఁబడుచున్న యొక దుర్గమును బరీక్షించుటకై యరుణోదయసమయమునఁ దన తురగమెక్కి యతఁ డొకనాఁడు పోవ నారంభించెను, నలువురువీరులు హయారూఢులై యాయుధపాణులై యతని వెంబడించిరి. సూర్యుఁ డప్పుడే యుదయగిరి రాజకిరీటమై పద్మరాగకాంతులవలెఁ దనయరుణకాంతులను లోకమునఁ బ్రసరింపఁజేయుచుండెను. ఛత్రసాలుఁడల్లంత దూరముననే వారిని గుర్తించి తటాలున హయము నవతరించి యెదురుగాఁ బోయి బద్ధాంజలియై వారికి నమస్కరించెను. వారందఱచ్చట నిలువఁబడిరి ? అపుడు "ఓస్వామీ ! జపతపముల కనుకూలమగు కాలమును వృథా చేసి యీఘోరారణ్యము నుండి వెడలి వచ్చుచున్నారేమి ! మీవంటి తపస్సంపన్నులు మా దేశమున నుండుటచేతనే మాకు జయము కలుగుచున్నది. ఇఁక మీరట్టివాని విడువఁగూడదు" అని మహారాజు వినయమున విన్నవించుకొనెను.

పరాత్పరరామలాలులు యోగివదనమును జూడసాగిరి. ఏమి ప్రత్యుత్తరమిచ్చునో యని కాఁబోలు వారియభిప్రాయము. "మహారాజా ! ఇది కలికాలముకదా ! దానికిఁదోడు నిరంకుశమైన మహమ్మదీయ ప్రభుత్వము. ఇట్లుండ మావంటి సాధుజనుల జపతపము లెక్కడ ? సానుకూలముగా యథాకాలమున నాచరితములగు టెక్కడ ; మేమును గత్తిపట్టికొని ప్రాణములు గాచుకోవలసిన దుష్కాలము వచ్చిన"దని యోగీంద్రుఁడనియెను. ఈమాట లనుచున్నప్పుడు యోగినేత్ర

ములు నిప్పులను గుప్పలుగాఁగురియఁజొచ్చెను. అదివిన్నప్పుడు పరాత్పర రామలాలుల శరీరములు దట్టముగాఁ బులకరింప సాగెను. ఆపట్టున ఛత్రసాలునకు వచ్చినకోపమునకు మేర లేదు: కన్నులు చింతనిప్పు లయ్యెను. మహమ్మదీయ ప్రభుత్వ మని ప్రాణనాథుని నోట వెలువడునప్పు డతనిముఖము భ్రూకుటికుటిలమై భయంకరముగాఁ జూపట్టసాగెను. పరిచితులైన వారుగూడ నాముఖమై ఖరిని జూడలేక వదనములను బెడఁకు ద్రిప్పు కొనిరి. అప్పుడు ఛత్రసాలుఁడు, "యోగీంద్రా! ఏమేమీ! మీనోటనుండి యిట్టి దీనాలాపములు వెడలనేల? ఈరాజ్యము తమసేవకుఁడగు ఛత్రసాలునిది కాని మహమ్మదీయులది కాదు. దీనియం దధర్మము నెలకొనుచున్నచో వానిఁ బరిశీలించి నశింపఁజేయుపని ఛత్రసాలునిది కాని తురకలది కాదు. ఈఛత్రసాలుని దక్షిణకరమున నున్న కుటిల కరవాల మధర్మపరులఁ జూచి సహింపఁ జాలదు. మహాత్ములగు మీవంటి సాధువుల రక్షింపలేనిచో నీ నాచేతికరవాల మేల? మీకపరాధము గావించి నాకత్తికిఁ గుత్తుక లర్పింపనున్న దుష్టు లెవ్వరో తెలియఁ జెప్పుఁ," డని గంభీరస్వరముతో ననెను.

"కుమారా! శాంతింపుము. నీవెంతకైన సమర్థుఁడవే, కాని చెట్టువేయఁగానే ఫలముల నీఁజాలునా! అది చక్కఁగాఁ బెరిఁగి ఫలించునంతవఱకుఁ బ్రతీక్షించియుండుట యుక్తము గాదా?" అని యోగి పలికెను.

"సాధువర్యా! మీరన్నది సత్యమే. సామాన్య వృక్షము వేసిన వెంటనే ఫలమీఁజాలదు. కాని యీఛత్రసాల మహీజ

మట్టిదికాదు. తత్కాలమందే ఫలించు సంతటి యపూర్వ శక్తిగలది. కావున సంశయింపక మీకపరాధ మొనరించిన దుష్టులెవ్వలో యెట్టియపరాధ మొనర్చిరో తెలుపు” డని ప్రార్థించెను. ప్రాణనాథుఁ డది వినుచు నాలుగడుగులు నడచి యచ్చట నొకచెట్టుక్రిందఁ గూర్చుండెను. ఆమహారాజు తన కభిముఖముగా నాసీనుఁ డయ్యెను. తక్కినవారు వారిని బరివేష్టించి యుపవేశించిరి. ఏమిచెప్పునోవినుటకు వీనుల ఱిక్కించి యాయోగీంద్రుని వదనమునఁ జూడ్కులు నిలిపి వేచియుండిరి. అపుఁడు యోగి రాజును జూచి “మహీనాథా! నిన్న రాత్రి తోంటియట్లు నాగదిలోనే సమాధి నవలంబించి యుంటిని. ఆసమయమున దుష్టులెవ్వరో వచ్చి నన్ను బంధించిరి. గాఢ సమాధిలో నుంటచే వారు వచ్చి బంధించినంతదాఁక నేనెఱుఁగనే యెఱుఁగను. నోటగుడ్డలు గ్రుక్కుటచే నితరులఁ బిల్చుటకైనను వీలైనదికాదు. ఆదుష్టులు నన్ను సవారీలోఁ బెట్టి తలుపులువేసి యీ యరణ్యమార్గమునఁ బరువెత్తసాగిరి. త్రోవలో నెవ్వరైనఁ దారసించి సవారీలోవా రెవ్వరని యడిగిన నాదురాత్ములు రోగపీడితురాలగు నొకధనవంతుని యిల్లాలని చెప్పుచుండిరి. ఇతరులు సమీపించినప్పుడు నేను మఱింత గట్టిగా మూలుగఁ జొచ్చితినిగాని యేమియుఁ బ్రయోజనము గల్గలేదు. ఇఁక నేను బ్రాణములపై నాశ వదలుకొంటిని. ఇంతలోఁ బరాత్పర రామలాలు లెదురైరి. కంఠధ్వని నాకు స్పష్టముగా వినరాని యందున వీరినిగుర్తింప లేకపోతిని. అయినను మూలుగు మానలేదు. మొదట వీరుగూడ సంశయింపక యాదుష్టులను వదలి వేసిరి. కాని పిమ్మట వారిని వంచకు

లనుగాఁ గ్రహించివచ్చి వారిని జావఁగొట్టి నన్ను విడిపించిరి,” అని చెప్పెను.

ఛత్రసాలుఁ డదివిని పరాత్పర రామలాలులకు నమస్కరించి, “అయ్యలారా! నాయారవప్రాణమగు ప్రాణనాథుని రక్షించి నాకు మహోపకార మొనర్చితిరి. మీఋణము నేను దీర్చుకోఁ జాలను. ఆసమయమున మీరాయరణ్యమున కెందులకై పోయితిరి? చెప్పి యానందము గావింపుఁ” డన వారిలోఁ బరాత్పరుఁ డిట్లనియె.

“దేవా! ఔరంగజేబు సేవకులు గూఢవేషములతో మనదేశమునఁ దిరుగుచున్నారు. వారిని వెదకి పట్టుకొనుటకై నేను నీరామలాలును బ్రతిరాత్రియు దేశాటనము చేయుచున్నాము. వారు కానరాలేదు. ఈయరణ్యమున కావలనున్న గ్రామమున నెవ్వరో క్రొత్తవారు విడిసియున్నట్లు విని నిన్న నాల్గుగడియల రాత్రి కచ్చటికిఁ బోతిమి. పరిశీలించి చూచితిమి. వారు మేమనుకొన్నవారు కారు. ఈయరణ్య మార్గమున మేము మరలివచ్చుచుండ నాదుష్టులు దారసిల్లిరి. తరువాతికథ మీకు స్వామిగారే తెలిపిరి,” అని యతఁడు విన్నవించెను.

ఆమహీజాని యదివిని, “ఆదురాత్ములెవ్వరై యుందురు?” అని ప్రశ్నించెను.

“సందేహమేల? వారు చక్రవర్తి సేవకులే. వారు గాకోకమాజు దుర్గాపురమునఁ గానవచ్చిరి. ఈదేశమునకు చ్చుచున్నట్టు గూడఁ దెలిసినది” అని పరాత్పరుఁ డనెను.

"పరాత్పరుఁడు చెప్పినది సత్యము. వారి ప్రసంగము వలనఁ జక్రవర్తిసేవకులనియే నేను నిశ్చయించుకొంటిని," అని ప్రాణనాథుఁ డనియెను.

"చక్రవర్తితో విరోధము వహించిన నాకపకారముచేయవలెను. గాని యాదుష్టు లేపాపమెఱుఁగని యీతాపసోత్తముని బాధించుటచే నామనము మిక్కిలి పరితపించుచున్నది," అని మహారాజనెను.

"ఈ యోగిసత్తముఁడు రాజకీయ వ్యవహారములలో మీకుఁ దోడ్పడుచున్నట్లు చక్రవర్తి విని యిట్లు చేయించియుండునేమో?" అని వెనుక నున్నమురారిపంతు పల్కెను.

"ఆదురాత్ములను బట్టుకొనుట యెట్లు?" అని పరాత్పరునిఁ జూచి రాజడిగెను.

"మహారాజా! అది కష్టముగానే యున్నది చక్రవర్తి సేవకులలో నొకఁడు మహావంచకుఁడున్నాఁడు. అతఁడు వెనుక నాకు సన్యాసి వేషమునఁ గానవచ్చెను. వాఁడీదేశమున నిప్పుడేవేషముతో నున్నాఁడో తెలియకున్నది. అయినను మేము కొలఁది దినములలో వాని జాడలు దీసెదము." అని పరాత్పరుఁ డనెను.

"రాజేంద్రా! వెనుక మామహారాష్ట్ర దేశ మనుభవించిన దుర్దశ యేమనిచెప్పుదును? చక్రవర్తి సేవకులు సన్యాసులుగాను, గోసాయీలుగాను, యోగులుగాను, వర్తకులుగాను మాఱి మాదేశముఁజొచ్చి పలుబాములు పెట్టిరి. ఎప్పటివార్త యప్పుడే ఢిల్లీకి మోచుకొనిపోవుచుండిరి. వారిని గని

పెట్టి శిక్షించినంత వఱకును మాకు జయము దుర్ఘటమైనది,' అని మురారిపంతు పలికెను.

"సత్యమే అట్టి దుష్టుల మొదట శిక్షించి మన రహస్యములు గాపాడుకొనకున్న శత్రువులను గెల్చుట యసాధ్యమే. వారిజాడ లరయుటకు దగినవారిని నియోగింపవలయును,' అని రాజనెను.

"మన పఠాత్సర రామలాలు లీపనికిఁ బూనుకొన్న నవలీల నెఱవేర్తురు. వీరిరువురు సుపాయశాలులు, బలిష్ఠులు, రాజభక్తి నిధానములు," అని ప్రాణనాథుఁడు వారిని శ్లాఘించెను.

మహారాజందులకు సంతసించి, "అట్లయినమాకు సర్వము సమకూడినట్లే. వీరిరాజభక్తి యద్వితీయమైనది. ఎంతయో ప్రభుభక్తి లేకున్న లోకసంబంధముతోఁ బనిలేని యీపఠాత్సరుఁడు నాకుఁదోడుపడునా? కులధర్మాదులను విడిచి కేవల దేశభక్తి పూరితుఁడై యీ రామలాలు సాత్యకి ధర్మరాజునకువలెఁ దనంతటఁ దానే వచ్చి నాకు దోడుసూపుట యతని యద్వితీయ భక్తిని దెలుపుచున్నది," అని వారిని శ్లాఘించెను.

అనంతరము మహారాజు యోగినిచూచి "యోగీంద్రా! ఇఁక మీరు రామదేవాలయమున నుండుట నామతముకాదు. మాకోటలో నివసించి తప మొనర్చుకొనుఁడు. మీకు సకల సదుపాయములను జేయించెదను. నారాజ్యమును గూర్చి నాకడలులేదు. కాని మీవంటి సాధువర్యులకు నామూలమున నాపదలు సంభవించునేమో యని యడలుచున్నాను.

పేమయినను సహింపఁగలను గాని సాధుసంతాపమున కోర్వఁ జాలను. దయయుంచి నాప్రార్థన మంగీకరింపుఁడు," అని ప్రార్థించెను. అదివిని చుట్టునున్నవారందఱు నేకగ్రీవముగా నదే యుత్తమమని పలికిరి.

ప్రాణనాథస్వామి ఛత్రసాలునిభక్తికెంతేనియు మెచ్చుకొని, "రాజకుమారా, నీవచనము యుక్తముగానున్నది. సాధ్యమయినంతవఱకు సాధువు దుర్జనులనుండి తప్పించుకొనుట మంచిది. అట్లే చేసెదను. నీయోగ్యత నాకు మిక్కిలి యానందము గొల్పినది. నీవంటి యుత్తమపురుషున కేపమయమున నెవ్వరు తోడు నూపరు? నీకు నేను యుద్ధమునఁ దోడ్పడలేను, గాని నీకు జయము గల్గింప భగవంతునిగూర్చి తపంబు చేయుచు నీకోటలోనుండెదను" అని పలికెను.

రాజందులకు ముద మంది, "మహాత్మా! అదే మాకుఁ గావలసినది! తపోబలమున కేబలమును సాటిగాదు. మాకు జయమబ్బుటకు మీవంటి మహాత్ములు పరమేశ్వరారాధనము సలుపుచున్నచో జయము కరతలామలకమే," అని పలికెను.

# దిలారాము

## 23-వ యధ్యాయము

### మొగలు సేనాధిపతి

గీ. "వంచకుండు సుబుద్ధి-సమంచితుండు
వంచితుండైనఁ బరులచేఁ-వాఁడొకప్పు
డుత్తరక్షణమందు వే-ఱొక్కరీతి
వేసమునుబూను, బరులను-మోసపుచ్చు."

రాత్రియే తెంచెను. తామసీభామ విరియవిప్పిన నెఱికురులలోయనఁ జీఁకట్లు రోదసీకుహరమున వ్యాపించెను. ఆకాశమనెడి మల్లెపొదను బూచిన పూవులోయనఁ జుక్కముత్తములు విరాజిలుచుండెను. ప్రకృతియంతయు శాంతి వహించియుండెను. చల్లని మలయమారుతములు ప్రసరించుచుండుటచే నాసమయము మిక్కిలి సుఖకరముగా నుండెను. అప్పుడు నలువురు పురుషులు బుందేలుఖండారణ్యమునఁ బడి నడుచుచుండిరి. వారిలో నొకఁడు యజమానుఁడును దక్కిన వారు సేవకులును నని తెలిసికొనవచ్చును. వారు మిక్కిలి సరసముగాఁ బోవుచుండిరి. వారట్లు నడచి యరణ్యముల దాఁటిరి; నదుల నతిక్రమించిరి; చిన్న చిన్న గుట్టలను మీఁటిరి. బుందేలదేశపు టెల్లలను గూడ దాఁటిరి.

అనంతరము వారొక మైలుదూరము పోఁగాఁ గలకల ధ్వని వారికి వినవచ్చెను. వారందులకు శంకితచిత్తులు కాక

ముందునకు నడచుచునే యుండిరి. తమముందట నొక మహా సైన్యము గానవచ్చెను. అయినను వారు భయపడక సేనా నివేశమును జొచ్చిరి. వారిని జూచి, సేనానాయకు డగు మీర్జా నదరుదీ నాడానూతనపురుషులను దన శిబిరమునకుఁ గొని పోయి వారల కుచితాసనము నర్పించెను. సేనాపతియును వారి కభిముఖముగాఁ గూర్చుండి, "ఓయీ! రామనాథా! మీరీదేశమున సుఖులై యున్నారుగదా? చక్రవర్తి విమ్మిచ్చు టకిఁ బంపి చిరకాలమైనది కాఁబోలును. మీప్రయత్నములు సఫలము లయినవా?" అని యడిగెను.

"సేనాధ్యక్షా! సుఖుల మైయున్నాము. చాలవఱకుఁ గృతకృత్యులమైతిమని చెప్పుటకు సంతసించుచున్నాను," అని రామనాథుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

ఛత్రసాలుని ప్రయత్నము లెట్లున్నవి?"

"ఈపర్యాయము సమరసన్నాహము లెక్కుడుగాఁ జేసెను, చేయుచుండెను. యుద్ధముచేసి యతని గెల్చుట కష్ట మనియే నాతలంపు"

"అవును; అది నాకుఁ దెలియును. ముందుగా మా యోపాయములచే శత్రువులను సగము చంపి పిమ్మట వలసి నచోఁ బోరాటమునకు మొనయవలయును."

"చక్రవర్తి యభిప్రాయము గూడ నదియే. అందులకే గదా, నన్నుముందుగా నిచ్చుటకిఁ బంపెను?'

నీవిచ్చుటకి వచ్చినవృత్తాంతమును దెలిపి సంతసింపఁ జేయుమా."

"సేనాధిపా! నేను చక్రవర్తి యనుమతి చొప్పున సన్న్యాసివేషముతో నీదేశమునకు బయలుదేఱితిని. మేము దుర్గాపురమున నుండఁగా నొకమాయావి వచ్చి తన వచన రచనలచే మమ్ము వంచించి మారహస్యములను దెలిసికొనెను."

"అతఁడెవ్వఁడు? మన శత్రుకోటిలోనివాఁడా యేమి?"

"అవును."

"వానిపేరేమి?"

"పరాత్పరుఁడు."

"చక్రవర్తి యత్నము నెట్లు ఫలింపఁజేసితివి?"

"వేఱొక యుపాయముచే."

"అదేమి?"

రామనాథుఁడతనితో నేమో చెప్పెను. సేనానాయకుఁడమితానందమునొంది "వహ్వారే! రామనాథా! రామనాథా! ఎంతపనిచేసితివి! అయారే! నీబుద్ధిచాతుర్యమును మెచ్చవచ్చును. కుటిలోపాయములందు నీవు చక్రవర్తినిగూడ మించుచున్నావు. సెబాస్! భళా! నీచాతుర్యము నిరుపమానమైనది." అని రామనాథుని బొగడ నారంభించెను.

"చక్రవర్తికీనాయుపాయము తెలియలేదు, కాఁబోలును."

"లేదు, తెలిసినచో నిన్నేనుఁగునెక్కించి యూరేగింపక మానునా? ఈవేషముతో నున్ననిన్ను వారు గుర్తింపలేక పోయిరి కాఁబోలు."

'వారితరమా! వారుగాదు, బ్రహ్మయైనఁ దెలిసికో లేఁడని నమ్ముము."

'రాత్వరుఁడు నిన్నుఁ జూచెఁ గాఁబోలు. వాఁడైన గుఱితింపలేక పోయెనా?"

వాఁడు నన్ను రాత్రిసమయమునఁ జూచెను. ఎట్లు పోల్పఁగలఁడు?'

"ప్రాణనాథస్వామికిఁ దగినశిక్ష చేయించితివఁటగాదా?"

'ఆదుష్టుని జీవములతోఁగొనిపోయి చక్రవర్తి కప్ప ింపనెంచి సర్వము సన్నిద్ధము చేసితిని గాని దైవవశమున ఫలమయ్యెను

"ఎటు?"

'ఆపరాత్వరుఁడు మధ్యమార్గమున దైవికముగాఁ గారసిల్లెను. వానివలన సర్వము భంగమైనది!"

"అయ్యో! ఎంతపని విఫలమైనది! ఆపరాత్వరుని శిక్షింప యత్నింపలేక పోతివా?"

"అది సాగుట కష్టసాధ్యము. వాఁడు మిక్కిలి యసా ధ్యుఁడు. వానిమాటకేమి కాని ముఖ్యముగా ఛత్రసాలునికిఁ దగినశిక్ష చేయవలయును"

'అది ముఖ్యకార్యమే కాని ముందు మనముచేయవలసిన పనియేమి?"

'ఏమియు వలదు. మనము దేశము ప్రవేశించు దారిలో నొకదుర్గ మున్నది. దాని నిపుడు ప్రతాపరాయుఁడనువాఁడు రక్షించుచున్నాఁడు. ఎట్లయినను ముందుగా దానిని మాయో పాయమున స్వాధీనము గావించుకొనవలెను. అట్టి దృఢా

శ్రయమొకటి మనకు లభించెనేని బుందేలుఖండ మవలీల వశము చేసికొనఁగలము."

"దాని మట్టుపెట్టి పరాక్రమమునఁ దీసికొనలేమా ?"

"మనతరముగాదు."

"మఱి యుపాయమేమి ?"

"రేపటి రాత్రి వచ్చి దానికిఁ దగిన యుపాయమును వక్కాణించెదను."

"మంచిది, ఛత్రసాలుని ముందుగాఁ నవకాశము లేదా?"

"లేకేమి చాలినంత యవకాశ మున్నది. వాఁడు నాచేతిలో నిమిడి యున్నాఁడు. చంపుట యెంతపని? కాని ముందుగా వానినట్లు చేయవలెనని లేదు. వానిని జీవముతోఁ గొనిపోయి చక్రవర్తికిఁ గానుక యీవలెనని యున్నది.

"అప్పుడు గదా నాబుద్ధిచాతుర్యము చక్రవర్తికి మెప్పు గొలుపును? తఱివేచి యందులకుఁ బ్రయత్నించెదను. అది కొనసాగదని తోఁచినప్పుడు నాకత్తి కెరచేసెదను. చాల రాత్రియైనది, నేఁటికిఁ బోయెదను."

"మంచిది, పోయిరమ్ము. బహుజాగరూకుఁడవై యుండుము. చక్రవర్తి యెదుట నాచేసినప్రతిజ్ఞ నెఱవేర్పకుండ ఢిల్లీకిఁ బోవుట పొసఁగదు. జయమును వరింపకుండఁ జక్రవర్తి మొగము చూడఁ జాల"నని సేనాధిపతి పరిపరివిధములఁ జెప్ప సాగెను.

"నీవంతగాఁ జెప్పవలక్క-అలేదు. ఈపర్యాయము గూడ మనము జయమందలేనిచో నిఁక మన బ్రదుకెందుకు? సర్వము నేను సమకూర్చెదను. నీవు నిమిత్తమాత్రమై యుండినఁ జాలును," అని బోధించి రామనాథుఁడు లేచెను. వాని యను చరుఁడును వానిని వెంబడించెను.

# దిలారామ

## 24 -వ యధ్యాయము

### నూతనదుర్గము పద్మావతీ ప్రతాపము

శ్లో. "పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవచక్రవాళం
నాభ్యర్థితో జలధరోపి జలందదాతి
సంతః స్వయం పరహితేషు కృతాభియోగాః."

ఛత్రసాలుఁడు బహు జాగరూకుఁడు, మహాబుద్ధిమంతుఁడు. అతనిబుద్ధికి లోకానుభవశాలియు రాజనీతివిశారదుఁడునగు ప్రాణనాథుని యాలోచనములు తోడగుచుండెను. యుద్ధకార్యము లప్రమత్తతతో నెఱవేర్పఁ బడుచుండెను. కావుననే యారాజచంద్రున కెప్పుడు నపజయము గలుగ లేదు. జయలక్ష్మీకటాక్షవీక్షణముల కతఁడు పాత్రుఁడయ్యెను. జయలక్ష్మి యతని కలఁకూలనాయిక చందమున వర్తించుచుండెను. ఇంచుమించుగా బుందేలఖండమంతయు నతనికి స్వాధీనమయ్యెను. తనదేశమున నున్న మహమ్మదీయప్రభువు లందఱును లోఁబడి కప్పము గట్టుచుండిరి. ప్రజలు నానావిధములఁ నుతించుచుండిరి. తాదృశావస్థలో నెట్టివాఁడైన గర్వము వహింపకపోఁడు, కాని ఛత్రసాలునకది యావంతయు నంట లేదు. సేవకులు మొదలుకొని మంత్రుల పఱకుఁగల యెల్లరిని నతఁడు గాఢముగాఁ బ్రేమించుచుండెను. వారందఱు నతని

న దేవిధమునఁ బ్రేమించుచుండిరి. చేసిన యుద్ధమందెల్లఁ దనకే జయమబ్బినను దాను దాని నమ్మి నిర్భయముగా వర్తింపలేదు. ఎట్లు నిర్భయముగా నుండఁగలఁడు ? ప్రబలునితోడి వైరము సామాన్యముగాఁ బోవునా? అందులో నౌరంగజేబుతోఁ గలహించుట పులితోటి చెరలాటమని యతఁడెఱుంగును. అందుచే నతఁ డేమఱియుండ లేదు ; సర్వదా యుద్ధప్రయత్నములు చేయుచునే యుండెను. మురారిపంతువలన మహారాష్ట్రయుద్ధవిశేషములు విని చిత్తము నుత్సాహపూర్ణముగాఁ జేయుచునే యుండెను; "ఇఁక యుద్ధావసరముండదు. సైన్యములఁ గూర్పనక్కఱలే," దని పలువురు పలువిధముల ఘోషించుచున్నను నతఁడది వినక తనపని తానొనర్చుచునే యుండెను; తన దేశమునఁగల దుర్గముల బాగుచేయించుచునే యుండెను ; తలఁచిన చోట నూతనదుర్గములఁ గట్టించుచునే యుండెను ; చక్రవర్తి చరిత్రమును జారులవలనఁ దెలిసికొనుచునే యుండెను. కేవలము చారులనుబంపి యూరకుండ లేదు. రాజనీతివిశారదు లయిన పరాత్పర ప్రాణనాథులను గూడ ఢిల్లీకిఁ బంపి యతఁడు శత్రురహస్యములఁ దెప్పించెను. ఇట్లన్నివిధముల పాటువడి వైరులధిక్కరింపఁజాలిన బలము సంపాదించి సంతసమబ్బునట్లు గౌరవించినఁ గాని జయలక్ష్మి తనపైఁ బూర్ణానురాగము వహింపదని యతనికిఁ దెలియును. అప్పటికిని వహించునో వహింపదో చెప్పలేము. జయలక్ష్మి వారాంగన వంటిది. వారాంగన ధనాభిలాషిణి ; జాతిసౌందర్యాదులతోఁ బనిలేదు. జయలక్ష్మి బలాభిలాషిణి ; తక్కిన గుణాదులను గోరదు. వారాంగన పురుషునం దవ్యాజానురాగ మంచి

వర్తించునట్లు గనఁబడును; కాని యదికల్ల. ఆయనురాగ మట్లుఁడుట తనప్రేమించినవానికంటె నధిక ధనవంతుఁడు కంటఁబడనియంతసేపే! అట్లే జయలక్ష్మి యెంతో యనురాగమున వర్తించుచున్నను దదనురాగము మహాబలుఁడు చూపట్టని యంతసేపు మాత్రమే నిలుచును; తదుత్తర క్షణమున విపరీతమే! ఇట్టి సూక్ష్మసంగతులను ఛత్రసాలుఁడు గ్రహించినట్లు వేఱొకఁడు గ్రహింపఁజాలఁడు.

ఇదివఱకుఁ దన కోటమి గల్గుటచేఁ జక్రవర్తి యుగ్రుఁడై మృత్యువునకైన వెఱపుగొలుపు మహాసైన్యము నొకదానిని బంపనున్నాఁడని కింవదంతి వ్యాపించినను, జక్రవర్తి బుందేలుఖండము నొక్కట మ్రింగఁ దలఁచియున్నాఁడని జను లనుకొనుచున్నను ఛత్రసాలుఁడు వానిని సరకుగొనలేదు; తన ప్రయత్నము దాను వదలలేదు. పై దేశములనుండి తనదేశములోనికి వచ్చుటకుఁ గొన్ని మార్గములు గలవు. వానినన్నింటిని నతఁడు నిర్బంధించెను; తగినవీరుల నాయాస్థలములకుఁ బంపి జాగరూకతతో రక్షింపవలయునని యాజ్ఞాపించెను. ఏమఱుపాటుచే గాని తమశక్తిలేఁది పోరాడ యొడలు దాఁచుకొని కాని తమ రక్షించుమార్గములను వైరులపాలు సేసినవారు మరణదండనమున కర్హులని ఛత్రసాలుఁడు శాసనముచు బ్రకటించెను. దానికందఱు నామోదించిరి. బుందేలుఖండమునకు వాయవ్యభాగమున నొకబాట గలదు. అది ఢిల్లీప్రాంతము నుండి బుందేలుఖండములోఁబడి గోండ్వానా, యొరిస్సా, మొదలగు దేశములకుఁ బోవును. ఆమార్గము బుందేలుఖండ సీమాంతమునఁ బర్వతములచే నావృతమై నిలుకటముగా

నుండును. ఆదారిని రక్షింప నొక దుర్గమును గట్టించి యతఁడు వీరాధివీరుఁడైన ప్రతాపరాయు నందుంచి యతనికిఁ గొంత సైన్యమును గూడఁ దోడిచ్చెను. ప్రతాపరాయుఁ డటనుండి దానిని కంటిని ఱెప్పవలెనుఁ గాచుచుండెను. రాజశాసన మతిదారుణము. దానికి మిత్రుఁడును శత్రుఁడును నొక్కటియే. త న్నుల్లంఘించినవారిని మొదలంట నాశముచేయును. అందు చేతఁ బ్రతాపరాయుఁడు దానికి విధేయుఁడై యుండకతీరదు. అతఁ డహర్నిశంబు లప్రమత్తతతోఁ దద్రక్షణభారమువహించి యుండెను. ఈనడుమ ప్రతాపుఁడు పద్మావతిని బరిణయ మయ్యెను. వీరల కన్యోన్యానురాగ మధికము. ఒకరి నొకరు విడిచియుండుట మిక్కిలి దుస్తరముగానుండెను. అయినను బ్రతాపరాయుఁ డెట్లోసైఁచి పద్మావతిని రాజధానిలోఁ దల్లి చెంత విడిచి నూతన దుర్గమునకుఁ బోవయత్నించెను. పద్మావతి యందుల కంగీకరింపక యతనితోఁ గూడఁ దన్నుఁ గొనిపోవ లయునని నిర్బంధింపఁగా నావీరుఁ డా ప్రార్థనము నిరాకరింప లేక పోయెను. అదియు నించుమించుగా రాజశాసనమువలెఁ దనకు దుర్లంఘుమయ్యెను. ఆమె కన్నీటిబిందువులు రాజశాసన ముకంటె నెక్కుడుగా హృదయమును బగిలింప నారంభిం చెను. పద్మావతితోఁ గూడఁ దనచిత్తమును రాజధాని యం దుంచి తానా నూతనదుర్గమున జడపదార్థమువలె నుఁడి రాజ కార్యము చెఱిచి చెడుటకంటె నామెనుఁగూడఁ దనతోఁ గొని పోవుటయే యుచితమైన ట్లతనికిఁ దోఁచెను. కావునఁ బద్మావతి గూడ నానూతనదుర్గమున రాత్రిం దివములందుఁ బతికి సాయ పడుచుండెను; పతినిద్రించినపుడు తాను మేల్కొని సైనికులు

దుర్గరక్షణమున జాగరూకులై యున్నారో లేదో చూచు చుండెను. చక్రవర్తి సైన్యము వచ్చి తమదేశపుటెల్లలలో విడిసి రని విన్నప్పటి నుండియుఁ బ్రతాపుఁడు మఱింత యప్రమత్తత వహించెను. తనయనుమతి లేకుండ నొరులు దుర్గమును బ్రవే శింపరాదని శాసించెను; రాత్రులందు మేల్కని పలుమాఱు దుర్గము నలుప్రక్కలకునుబోయి యచ్చటిరక్షకులను హెచ్చ రించుచుండెను. పద్మావతిగూడఁ బురుషవేషము దాల్చి ఖడ్గపా ణియై పతికి సహాయురాలగుచుండెను. అందువలనఁ బ్రతాపరా యునకుఁ దద్రక్షణమంతకష్ట మనిపింపలేదు. ఒకనాఁడు వారిర్వు రును దుర్గముచుట్టివచ్చి సౌధాగ్రమున నుపవిష్టులైరి. మలయ మారుతమును జంద్రికాప్రసారమును వారిహృదయములకానం దముగొలుపుచుండెను. ఏమేమో కొంతసేపు ప్రసంగించుకొనిరి. ఆప్రసంగవశమున మధురాపురవృత్తాంతము జ్ఞప్తికి వచ్చెను. పద్మావతి యప్పటికష్టములను దలంచుకొనెను; ఇప్పటి సుఖము దలంచుకొనెను. ఆయజ్ఞాతవాస దినముల నెట్లు పుచ్చగలిగెనో యామెకుఁ దెలియలేదు.

"నాథా, కష్టపడి సుఖింపవచ్చును గాని సుఖపడి కష్టిం చుట దుర్ఘటముసుమీ!"

"కాదా? చీఁకటిలోనుండి వెలుతురు లోనికిఁ బోవుట సులభముకాని దానికి విపరీతముగా వర్తించుట కష్టమే"

"ఆయజ్ఞాతవాసదినములు తలఁచుకొన్న నిపుడును గుండె బ్రద్దలగుచున్నది."

"నిజమే, మీరాశిథిలగృహములలో నెట్లు కాలమును గడపితిరో నాకాశ్చర్యముగానే యున్నది. దానికేమి! కారాగృహనివాసమో?"

"అదియు నట్టిదే. కారాగృహమున మన మందఱమును గలిసి యున్నంతకాలమును నాకుఁ గష్టమనిపింప లేదు. కాని వేఱుచేసిన పిమ్మట నాకీ యజ్ఞాతవాసముకంటెను దుర్భరమనిపించినది."

"ఆయువతీమణులు తప్పించుటం జేసి మనము సురక్షితముగా నిచ్చటికి రాఁగల్గితిమి."

"వల్లభా! సత్యము సత్యము. ఆయువతులు మనకుఁ జేసిన సాయ మమేయముగదా? వారికి బ్రత్యుపకార మేమియుఁ జేయఁజాలమికి మిక్కిలి విచారించుచున్నాను."

"అవును, నేను వారియుపకారమును శ్లాఘించి మీ కేమి ప్రత్యుపకారము చేయవలయునో కోరుఁడని యంటిని కాని వారేమియుఁ గోర లేదు"

"మఱేమనిరి?"

"నీవు ఉపకారము చేయుట కవకాశమే లేదా? తరువాతఁ జేయవచ్చును. మీరు త్వరగా నీపురమువిడిచి పొండని తొందరపెట్టిరి. మఱేమియు ననలేక వెడలి వచ్చితిని."

"ప్రియా, నిన్నువధింప రహీము గొనిపోయినపిమ్మట నేను జావ సిద్ధముగనుంటిని. కారాగృహాధికారి నడిగితిని, గాని నీవృత్తాంతము చెప్ప లేదు. ఇంతలోఁ జంపావతి వచ్చినది ఆమె తలుపును దీసి త్వరగాఁ దనతో రమ్మనెను. ఇదేమో యని నేనును మా యమ్మయు నచ్చెరువంది యామెను వెంబ

డించితిమి. తరువాత నీసందర్శనము మాకు లభించెను. వారి చర్య మాకింద్రజాలమువలెఁ జూపట్టెను. వారి సాహసకృత్యమును దలంచిన నిప్పటికి నాశ్చర్య ముద్రేకించుచునే యున్నది. అట్టి యుత్తమరాంద్రతో నొకక్షణమైనను సంభాషించుభాగ్యము లభింపమికి విచారించుచున్నాను."

"నీవన్నది సత్యమే; అవకాశము సుంతేనియుఁ జిక్కలేదు. మనము వేఱొక్కగడియ నచ్చట నుందుమేని యింత సులభముగా నీబుందేలుఖండము చేరలేక పోవుదుము. అందుల కే వారు మనలను ద్వరచేసిరి. సుందరీ! నీవు పోల్చితివో లేదో కాని వారిరువురయందును రాజపుత్రస్త్రీల గుణములు చూపట్టుచున్నవి. ఆవిషయమును వారిసాహసములు మిక్కిలి దృఢీకరించుచున్నవి."

"నాథా, సత్యమే, వారివేషములు మాత్రమే మహమ్మదీయములు; చర్య లట్టివి కావు. ఆక్షత్రియాంగనలకుఁగాక వేఱొకజాతిస్త్రీల కంతసాహస సౌందర్యము లుండుట యరుదు. ఆవిషయమై నాకును గొంచె మనుమానము లేక పోలేదు కాని వారు మనకొనర్చిన మహోపకారమునకు మనము తుదకు గృతజ్ఞతాసూచక వందనములనైన నర్పింపఁ జాలక పోతిమి ఈవిచారము నన్ను బాధించుచున్నది."

"ఏమి చేయుదుము? నిలువఁబడుటకైన నవకాశము చాలినది కాదు."

అంతటఁ బ్రతాపుఁ డాప్రసంగము విడిచి మఱియొక మాఱు దుర్గమును జొట్టివచ్చుటకు లేచెను.

# దిలారామ

## 25-వ యధ్యాయము

### ఒక వియోగి

శ్లో. "జీవత్సు తాతపాదేషు
నవే దారపరిగ్రహే
మాతృభిశ్చింత్యమానానాం
తే హి నో దివసా గతాః."

భవభూతి.

బుందేలుఖండమున కాల్పీపురము రాజధాని. దానికిఁ గొంత దూరమునఁ గాల్పియను నొకదుర్గము గలదు. అది నూతననిర్మితము కాదు. తొమ్మిదవ శతాబ్దమున నాదేశమును బాలించిన చందేలురాజులు నిర్మించిరి. అందొక మహేశ్వరాలయము కలదు. అదియుఁ దత్ప్రభువులచేత నిర్మింపఁబడినదే. ఆరెండును నిర్మితములై మన కథాకాలమునాఁటి కించుమించుగా నెనిమిదిశతాబ్దములు కడచినవి. అయినను గాలము వానిని సుంతేనియుఁ జెఱుపఁజాలక పోయెను. కుతుబుద్దీను దండెత్తివచ్చి యాదుర్గము స్వాధీనము గావించుకొన్నపుడు కొందఱు తురకలు నిరంకుశులై యందుఁజొచ్చి ప్రాకారాదులకుఁ గొంతకీడు వాటించిరి. కాని యాదేవుని మహామహిమచేతనో, కాక యది యసాధ్యముగుటచేతనో గర్భాలయమున కేమియు హాని గలుగలేదు. అందుచే గర్భాలయము సుస్థిరముగా భద్రముగానుండి పూర్వుల శిల్పకళాచాతుర్య మిప్పటివారికి

బోధించుచుండెను. కొంతకాలమున కాయూరిధనికులు చాల నంత ధనమును వెచ్చించి తురకలవలన శిథిలములగు ప్రాకారాదులను గట్టించిరి. కావున నాదేవమందిరము ప్రాకారాది విభాసమానమై ధవళకాంతుల నీనుచుఁ జూపఱకన్నులకు విందొనర్చుచుండెను. అందు వెలసియున్న దేవుఁ డెక్కుడు మహిమ గలవాఁడని యాపురజనుల నమ్మకము. ఆదేవుని భక్తితోఁ గొల్చిన నిర్ధనులు ధనవంతులును, రోగులు నిరోగులును, గార్యార్థులు సఫలీకృతకార్యులును నగుదురఁట! వేయేల? నిశ్చల మనస్సుతోఁ గొల్చినవారితలంపు లెట్టి వైనను నా యీశ్వరుఁడు తప్పక తీర్చుచుండునని వారిదృఢవిశ్వాసము. ఏదో కోర్కి లేని మానవుఁ డెవఁడుండును? తమ కోర్కులఁ దీర్చుకోవలెనని ప్రయత్నింపనివా రెవ్వరుందురు? అందువలనఁ బ్రతి దినంబునను జనులు మందలు మందలుగా వచ్చి యాస్వామిని దర్శించి తత్సన్నిధిని గొంతసేపు మెలఁగి వెడలి పోవుచుందురు. జనులరాకపోకలచే నది సాయంసమయము మొదలు జామున్నర రాత్రియగు వఱకును మిక్కిలి సమ్మర్దముగల్గి కిటకిట లాడుచుండును. ఒకనాటి నిశాముఖమునఁ బ్రజలు తమవాడుకచొప్పున దేవాలయము సొచ్చిరి; కొందఱు దేవునిమహిమ నుతించుచుండిరి. కొందఱు భగవన్నామములఁ గీర్తించుచుండిరి; కొందఱు చేమోడ్చి నొసటఘటించి భక్తిపరవశులై స్తంభాకృతి దాల్చి బాహ్యప్రపంచమును మఱచుచుండిరి; కొందఱాడుచుండిరి; కొందఱు పాడుచుండిరి; కొందఱొక్కచోఁ గూర్చుండి యీశ్వర లీలా గాథలను జెప్పుకొనుచుండిరి; కొందఱు దేవతా ప్రసాదము నిమిత్తము బూజకులతో వాదించుచుండిరి ; కొం

దటు వర్తకులు తమ వ్యవహారములఁ గూర్చి ముచ్చటించు కొనుచుండిరి; యౌవనవంతు లచ్చటికి వచ్చి యువతీమణులను, లేనిపోని మిషలు కల్పించుకొని చూచి యానందించుచుండిరి. ఇట్లుండ రాత్రి యామమాత్ర మతిక్రమించెను. ప్రజలు క్రమ క్రమముగానటుగదలి తమతమ సదనముల కరిగిరి. కొంత సేపటి కర్చకులు గూడ గర్భాలయకవాటములను బంధించి వెడలి పోయిరి. ఆదేవాలయము నిస్తరంగమగు సముద్రము వలె నిశ్శబ్దముగా నుండెను. వీథి గుమ్మముదాఁక వెడలిపోయిన యొక పురుషుఁడు మరలి రానిచో నది యప్పుడు నిర్జనమైనదని కూడఁ జెప్పవచ్చును. ఆపురుషుఁడు లోపలి కరిగి కల్యాణ మం డపమునఁ గూర్చుండెను. ఇతర గ్రామవాస్తవ్యుఁ డగుటచేతనో, యా యూరివాఁడయ్యు సొంతగృహము లేనివాఁ డౌటచే తనో, నిజగృహముండినను, యింటికంటె నదే మిక్కిలి మనో హరమై సౌఖ్యకరమై యున్నట్లూహించుటచేతనో, వాఁడు తక్కిన వారివలె నాప్రదేశము కదలిపోలేదు. వాఁడు పైవస్త్ర మును గ్రిందఁబఱచుకొని వెలికిల శయనించి సుందర చంద్రబిం బమును గన్నులారఁ గాంచుచుండెను. ఆప్రదేశము నిర్జనము స్నిగ్ధశిలామయ మగుటచే మనోహరము. మీఁదు మిక్కిలి చంద్రకాంతిసంతానకలితము. మలయమారుతములకుఁ దావ లము. ఇవి యానందదాయకములే; సౌఖ్యకరములే; అయిన నాపురుషునకట్లు కాలేదు; విపరీత ఫలమొసంగెను. అతని మాన సము వికారపరీతమయ్యె; వేఁడినిట్టూర్పులుఁ వెడలెను. తన

పూర్వవృత్తము మనోదర్పణమునం బ్రతిఫలించె; కన్నులనుండి బాష్పకణము లురలెను. అతఁడిట్లు తలపోయనారంభించె. "హా ప్రేయసీ! హామనోవల్లభా! హా సౌందర్యవలంబా! నీసౌందర్య మెట్లు మఱతును? అయ్యో! విధి కఠినాత్ముఁడు; మన సౌఖ్య మాతనికిఁ గనుగుట్టెను!

ఆహా! అవెంత మంచిదినములు! ఎంత సౌఖ్యదాయకములు? మాజనకుఁడు మహోద్యోగియై కావలసినంత ధనమార్జించుచుండెను గదా? మాజనని నన్నతిప్రేమతోఁ జూచుచు నిష్టపదార్థముల సమకూర్చుచుండెను గదా? నీవు నవయౌవన విలాసాంచితవై, సౌందర్యమహితవై శృంగారలీలలచే నా హృదయంబును దనియించుచు దినముల నర్ధనిమేషములుగాఁ జేయుచుంటివి కదా? అప్పటి నాసౌఖ్యమున కేమిలోపము? ఇఁక నీ జన్మమునఁ దాదృశదినములు,— వీనిని,— ఈ దురదృష్టవంతునకు,— ఈ దైవప్రతికూలునకు సంభవింప నేరవు. సుందరీ! నీగుణములు దృఢపాశములై నాచిత్తమును బంధించినవి. ఆబంధనములను విప్పుకొనఁ జాలను; నిన్ను మఱవఁ జాలను. నీవియోగసాగరము నీదఁజాలను; అక్కటక్కటా! ఎంతకష్టము! ఓసి! యమునానదీ! నీవు పుణ్యదాయిని వందురు; అది యసత్యమసత్యమని నేను జాటి చెప్పఁగలను. నీవు కఠినాత్మవు; నీవు యమసహోదరివట! నిశ్చయముగా నాపాలిట నీవు యమసహోదరివే! ముద్దులు మూటగట్టు నాభార్యను,—నా ప్రియురాలిని,—నా ప్రాణప్రియను, నీపొట్టఁ బెట్టుకొంటివి. అయ్యో! ఎంతపని! ఎంత పని! ప్రేయసీ! యాచిన్నపడవపైఁ గూర్చుండి యా మహా

నదిని దరింప నేలసాహసించితిమి ? నాఁడు పయనింపనిచో నీకష్టము రాకపోవు నేమో ? ఓ పాపదైవమా ! నా ప్రియురాలితోఁగూడ నదిలో ముంచియు నన్ను సజీవునిగా నేలచేసితివి ? ఆపదలన్నియు నొక్కమాఱె చుట్టుకొనవలెనా ? జనకా ! దురాత్ముఁడగు నౌరంగజేబు నిన్నప్పుడే ఖండింపవలెనా ? నీ విరహామును సైఁపఁజాలక నాతల్లియు సోదరియు అప్పుడే మృతినొందవలెనా ? ఇందఱ చావు లొక్కమాఱే సంభవింపవలెనా ? ఇందఱ చావులను వినియు నీ మందభాగ్యుఁడు ఱాతిగుండెరై జీవించియున్నాఁడు ! ఆచోరుల ఖడ్గములు వీని ప్రాణములు దీయలేక పోయినవి; ఆబాటసారుల కరవాలములైన నీకఠినాత్ముఁ జంపలేక పోయినవి. ఆహా! దైవమా! ఇఁక నేమి చేయుదును?" అని తలపోయుచు నతఁడు గేకవేసి దుఃఖాతిశయమున మూర్ఛితుఁ డయ్యెనో లేక నిద్రాగతుఁ డయ్యెనో కాని చేష్టలుదక్కియుండెను. తాదృశ దుఃఖాకులుఁ డైనప్పుడు నిద్రవట్టునా ? ఆలోచింప దుఃఖమూర్ఛితుఁ డయ్యెననియే నిశ్చయింపవచ్చును. ఇంతలో దీర్ఘకాయు డగు నొకపురుషుఁ డాదేవాలయము చొచ్చెను. వాని జటాకలాపము మేని పశ్చాద్భాగమును గప్పియుండెను; చేతిలో బలిష్ఠమగు నొకదండ ముండెను. వాఁడు గుడిచుట్టు దిరిగి కల్యాణమండపమును జేరి, పడియున్న పురుషునిఁజూచి, మోము వానిమోముచెంతకుఁ జేర్చి పరిశీలించెను ; అతఁడెవఁడో బోధపడలేదు. దూరముగాఁబోయి యా దీర్ఘకాయుఁడొకచోఁ గూర్చుండెను. కొంతసేపటికి వేఱొక పురుషుఁడు

దండపాణియై మెల్ల మెల్ల నచ్చటికి వచ్చెను. వారిరువురు నిట్లు సంభాషించిరి.

"మిత్రమా! రాములాలూ! ఏమైనది. శత్రువులజాడ యేమియుఁ దెలియరాలేదా?"

"పరాత్పరా; లేదు. నా ప్రయాసము వ్యర్థమైనది. చెప్పుటకు సిగ్గుపడుచున్నాను నీవును నావలె వ్యర్థప్రయాస మొందితివి కాఁబోలు?"

"ఇంచుమించుగా నట్లే! ఇంకను మఱికొన్ని చోట్లు గలవు. వానిని బరిశీలింపవలెను. నీవు నానిమిత్తము ప్రతీక్షించుచుందువేమో యని త్వరగా వచ్చితిని. ఇది మిగులఁ జిత్రముగానున్నది! ఎంత ప్రయత్నము చేసినను శత్రువులజాడలు తెలిసికొలేక పోవుచున్నాము."

"అవును; వారిందున్నారో లేదో?"

"అట్లనకుము. తప్పక యున్నారు. ఈదేశమునఁ ద్రిమ్మరుచున్నారు. నిశ్చయము. ఆవచ్చినవాఁడు మహామాయావి. వాఁడేవేషముతో నెచ్చట నున్నాఁడో?"

"ఎచ్చట నున్నను వారిజాడలు తెలిసి కొని తీరవలెను; లేనిచో నీ జన్మమున ఛత్రసాలుని మొగముచూచుట పట్టిది."

"నానిశ్చయమదియే. ఈ గ్రామాదులలో లేనిచో నిఁక నరణ్యములు గూడ గాలింతము. ఎట్టయిన వారిజాడలుతీసి తీరవలెను."

"ఇఁక నాలస్యమేల? లెమ్ము పోవుదము," అని రాములాలు లేచెను. పరాత్పరుఁడుగూడ లేచెను. పడియున్న

పురుషునిజూచి పరాత్పరుఁడు "ఈపురుషుఁ డెవ్వఁడో యిచ్చట శయనించి యున్నాఁడు. కారణ మేమయి యుండునో?" అని యనెను.

"ఈ ప్రదేశము సౌఖ్యప్రద మగుటచే నీయూరివాఁ డెవ్వఁడో యిచ్చట శయనించి యుండును." అని రామలాలనెను.

వారిరువురు నచ్చట నిలువఁబడి యాపురుషునివంక జూచుచుండిరి. ఇంతలోఁ జంద్రకాంతులచేతను మలయ మారుత ప్రసారముచేతను వాఁడు గొంచెము లేచి "అయ్యో! శ్యామలా! శ్యామలా! యెంతపని చేసితివి! నీవియోగభార మెట్లు మోయుదురు? హాజనకా! హాజననీ! హాసోదరీ!" అని పల్కి యూరకుండెను.

పరాత్పరుఁ డేమో యోజించుచుండెను. రామలాలతనిఁ జూచి "ఓయీ! వీఁడు భార్యావియోగపీడితుఁ డయిన యొక బాటసారి. వీనితో మనకుఁ బ్రయోజన మేమున్నది. రమ్ము, పోయి తక్కిన స్థలముల వెదకుదము," అని పలికెను. పరాత్పరుఁ డందులకు సమాధానము చెప్పక, "ఉండుముండుము. ఇంకను వీఁడేమైనఁ గలవరించునేమో" అని యతని వారించెను. ఇరువురును జాగ్రత్తతో వినుచుండిరి. వాఁడే మియుఁ గలవరింపలేదు. పరాత్పరుఁడు రామలాలుతో "మిత్రమా! వీనివచనములు విన్నప్పటినుండియు నాచిత్తము నానా సందేహములకు గుఱి యగుచున్నది. దైవవశమున నేననుకొన్నట్లు జరిగినచో నొక మహాకార్యమును నెఱవేర్చిన వార మగుదుము. ఈహితకార్యము రాజు కార్యముకం

ఱెను గొప్పది," అని లేచి యాపురుషునిచెంత కేగి వానిముఖ మును మరలఁ బరిశీలించెను. చంద్రకిరణములు మిక్కుటముగా వాని ముఖమున బ్రసరించుచుండెను. అయినను సందేహము తీర్చునంత వెలుతురు లేదు. పరాత్పరుఁ డంతతో నూరకుండక దేవాలయ ద్వారము చెంత వెలుఁగుచున్న దీపమును గొనివచ్చి వానిముఖమును బరీక్షించెను. గడ్డము చేతను, మీసముచేతను నావృతమైన వానిముఖ మాతని సందియమును దీర్పఁజాలక పోయెను. అతఁడు దీపమును యథాస్థానమును జేర్చి వచ్చెను. రామలాలున కిదేమియు బోధపడలేదు. "నీవెందుల కిట్లు పరిశీలించుచున్నావు? నీయాలోచనము నీస్నేహితునకుఁ దెలిపి సంతసింపఁ జేయుము." అని రామలాలడిగెను.

"ఓయీ! కేశవసింగునకు శ్యామలయను కోడలును, శివసింగను కుమారుఁడును గలరు. వారు ప్రమాదవశమున యమునానదిలో మునిఁగిపోయిరి. వీఁడు శ్యామలా! శ్యామలా! యని కలవరించుటచే నొకవేళ శివసింగై యుండునా? యని సందేహించుచున్నాను. వీనినిజూచి చిరకాలమగుటచే నానవాలు పట్టలేకున్నాను," అని పరాత్పరుఁడు తన యాలోచనమును జెప్పెను.

"ఏమో! నదిలోఁ బడినను దైవకృపచే నొడ్డుచేరి బ్రదికిన బ్రదుకవచ్చును. అట్లు బ్రదికినవా రెందఱు లేరు. వీఁడు మేల్కొనిన పిమ్మట వీని వృత్తాంతము గనుఁగొందము. కొంచెముసేపు నిలువుము" అని పల్కెను. ఆయిరువురు మరల

నిశ్శబ్దముగా నుండిరి. కొంతవడికి మేల్కాంచెను. కన్నులు విచ్చిచూచెను. అతని శాదీర్ఘకాయులు యమదూతల వడువున గానవచ్చిరి. వారు దండపాణులై తనయొద్ద నిలిచి యుండుటకు హేతువేమో యని యతఁడు తలపోయఁ జొచ్చెను. వారియాకారములు భయంకరములై యుండుట చేత వానిహృదయము చలింప నారంభించెను. అయిన నాపురుషుఁడు ధైర్యము వదలలేదు. వారొకవేళఁ గ్రౌర్యమునకు దొరకొన్నచో శక్తికొలఁది పోరాడి జయమో యపజయమో కాంచుటకు నిశ్చయించి మెల్లగాఁ దన ప్రక్కనున్నకత్తిని జేతి కందించుకొనెను. మున్ముందుగా సామ ముప యోగింపవలెనని, "ఎవ్వరా నిలువఁబడినవారు? ఇంత రాత్రిసమయమున నిచ్చటికి వచ్చుటకుఁ గారణమేమి?" అని యతఁడడిగెను.

"ఓయీ! మేము పరదేసులము. మేమొకపనికై యీ దుర్గమునకు వచ్చి శయనింప నిది యోగ్యమైన స్థలమని యెంచి యిచ్చటికి కరుదెంచితిమి. నీవును మావలెనే విదేశవాసివా యేమి? లేనిచో నీనిర్జన ప్రదేశమున నీకఠోరశిలావేదికపై నేల శయనింతువు? నీవృత్తాంతముచెప్పి చెవులపండువు లొనర్పుము," అని వారిలోఁ బరాత్పరుఁ డనెను.

వారివచనములు రసాయనమువలె మధురములై యుండెను; అయినను నవి యతనికి విశ్వాసము గొలుపలేక పోయినవి. "ఇట్లు మృదుమధురముగా సంభాషించుట మాయావుల లక్షణము. వీరి నింతమాత్రమున సాధువులని నమ్మఁ జనదు. నాయిప్పటి వృత్తాంతము నుగప్పిపుచ్చి పూర్వవృత్తాంతము

నుడివెదను," అని తలంచి వారిని జూచి యాపురుషుఁడు "అయ్యా! విచారకరమగు నావృత్తాంతము నేలయడిగెదరు? మీరు మహానుభావులవలెఁ జూపట్టుచున్నారు; మీకోర్కి త్రోసిపుచ్చరాదు. దిఙ్మాత్రము చెప్పెదను. నేనొక రాజపుత్రుఁడను. అనదను. దైవవశమునఁ జుట్టముల నందఱిఁ గోల్పోయి దిక్కులేక, నిలువనీడలేక దేశముల పాలయి నానాకష్టములఁ బడయుచుంటిని. ఇఁక నావృత్తము ద్రవ్వి నన్ను దుఃఖసాగరమున ముంపకుఁ," డని పలికి యూరకుండెను.

పరాత్పరుఁ డతనివచనములు విని యానందవిచారములకు గుఱియయ్యెను. చిరకాలముక్రిందట నాకర్ణితమై సంస్కారవశమున నతని హృదయకుహరమున నిమిడియున్న శివసింగుకంఠధ్వని కది సాటివచ్చుచుండెను. అది పరిశీలించి త్వరగాఁ జెంతకుఁ బోయి వానిచేయి పట్టుకొని, "నాయనా! నీవు కేశవసింహుని కుమారుఁడవా? యేమి? చెప్పు చెప్పు" అని యాత్రముతో నడిగెను.

"అయ్యా! అవును ఈదురదృష్టవంతుఁ డతని కుమారుఁడే! కాని మీ రెవ్వరు? చనిపోయిన మాతండ్రికి మీరేమగుదురు?" అని శివసింగు ప్రశ్నించెను.

"ఓయీ! మేము కేశవసింగు మిత్రులము. మీతండ్రి జీవించియున్నాఁడు. ఆతనికుటుంబ మీయూర నేయున్నది," అని పరాత్పరుఁడు కౌఁగిలించుకొనెను.

"ఏమేమీ! నాతలిదండ్రులు జీవించియున్నారా? సత్యమే? సత్యమే? ఈభాగ్యహీనున కంతటియదృష్టమా!

ఎచ్చటనున్నారో చెప్పుడు" అని శివసింగు తన యానందమును వెలిపుచ్చెను.

వారదివిని సంతసించి "సీతలిదండ్రులచెంతకుఁ గొనిపోయెదము రమ్ము." అని వానితోఁ గలిసి పోయిరి.

# దిలారామ

## 26-వ యధ్యాయము

**ఒక వేషధారి**

శ్లో. "నానారూపధరో దుష్ట
స్స్వధాన్యంచితుమిచ్ఛతి
సమ్యగ్విచార్య ప్రాజ్ఞస్తం
దూరతః పరివర్జయేత్."

పరులు బుద్ధిపూర్వకముగా నిచ్చినవస్తువులను బరిగ్రహించుటయే ప్రతిగ్రహమగును గాని యాచించి బలాత్కరించి పుచ్చుకొనుట, కాదు. ప్రతిగ్రహము బ్రాహ్మణునకు విహితములగు షట్కర్మములలో నొకటి. తపస్స్వాధ్యాయాది సత్కర్మములందే సర్వదా కాలముఁ బుచ్చు బ్రాహ్మణులకు దేహపోషణార్థ మాహారాదులను సంపాదింప నవకాశము చాలదని పూర్వులు వారికది విహితకృత్యముగాఁ గల్పించి యుందురు. అది సదుద్దేశముతోనే కల్పింపఁబడియున్నను గాలక్రమమున నియమరహిత మయ్యెను. వదాన్యులు చాలినంత పదార్థమీయమిం జేసియో బ్రాహ్మణులు దురాశాపరులగుటం జేసియో కాని కొంతకాలమునకు వదాన్యుల బలాత్కరించి యాచించి వస్తుసంపాదనము చేయుటయును బ్రతిగ్రహమే యయ్యెను. మఱికొంత కాలమున కది యొక వృత్తిగా నేర్పడి బ్రాహ్మణేతరులందుఁ గూడ వ్యాపింపఁ

జొచ్చెను. చాలినంత యవకాశమును, దేహపాటవమునుగల వారు గూడ నొడలువంచి పనిచేసి జీవనమును సంపాదింపక సోమరిపోతులై యాచకులై వర్తింపఁ దొడఁగిరి. క్రమముగా యాచకులు [illegible]రి; వదాన్యులు తగ్గిరి. అందుచే మఱికొందఱును దాతలనుగాఁ జేయవలసివచ్చెను. కానియెట్లు చేయుట? ఆలోచింప లోకమున వదాన్యులలోఁ బెక్కు తరగతులవారున్నారు. కొందఱు సన్మతులై భూతదయాపరులై యొసంగుదురు; కొందఱు కీర్తివచ్చునని యొసంగుదురు; కొందఱు పుణ్యమపేక్షించి యిత్తురు; కొందఱు పరులతోఁ బోటీగొనుట కిత్తురు; కొందఱు ప్రతిఫలమును గోరియొసంగుదురు; కొందఱు యాచకులు దెచ్చిన విచిత్రవస్తువులను గాంచి యొసంగుదురు. ఇన్ని తరగతులలోను సద్బుద్ధితో దానముచేయువారిసంఖ్య మిక్కిలి తక్కువ; తక్కినవారి సంఖ్య హెచ్చు. కావున లోకమున వస్తుసంపాదనము చేయవలసినవారు దాతల సంతసింపఁజేయు వేషములనో, భాషలనో నేర్పవలసియుండెను; లేదా వారికాశ్చర్యము గొలుపు వస్తువులనైన సంపాదింపవలసి యుండెను. కావుననే యిప్పటివారు నానావేషభాషాధురీణు లగుచున్నారు. వేషభాష గలవారికే చాలినంత ధనము లభించుచున్నది; తక్కినవారికి లేదు. ఆవేషధారులు దేహపోషణమునకుఁ జాలినంత ద్రవ్యము లబ్ధమైనను సంతృప్తులు గారు; దురాశాపరులై లక్షాధికారు లగుచున్నారు; కోటీశ్వరు లగుచున్నారు. అయినను వారు యాచకవృత్తి విడువరు. ఒకపుడు దాతలకంటె యాచకులే ధనవంతులై యుండుట కలదు. మఱియు నిప్పటి

దానమునకుఁ బాత్రాపాత్రవిచక్షణము లేదు. వికలాంగులై యాహారము సంపాదింపలేక యాఁకటిచిచ్చుచే మలమల మాఁడువారిని దాతలు గసరి కొట్టుదురు; ధనవంతులై ముప్పూట మెక్కుచు దుంగలవలెఁ దెగబలిసి సోమరులైయున్న ముష్కరు లేదేని చాతుర్యము చూపిన నెంతో సంతసించి వారి నెంతయు నాదరించి వారుకోరిన వస్తువులను సమకూర్తురు. చదువరులారా! నియతమైన ప్రతిగ్రహ మెట్లెట్లు పరిణమించి నదో చూడుఁడు.

బుందేలుఖండమున మూవను నొకపురము గలదు. దానికి సమీపమున మదనపురమను నొక గ్రామము గలదు. అది మదనసాగరమను మహాతటాకపుఁ బూర్వోత్తరతీరములం దున్నది. బుందేలుఖండమును బాలించిన చందేలు రాజులలో నొకఁడగు మదనవర్మయనువాఁ డాతీరమున నా గ్రామమును గట్టించెనట. మన ప్రతాపరాయుఁడు నివసించియున్న నూతనదుర్గము దీనిఁగలసియే యుండెను. ఆయూరఁ బెక్కండ్రు ధనికులు గలరు. ఒకనాఁడు బీదవాండ్రు క్షుద్బాధ సహింపలేక ధనికుల యిండ్లకుఁ బోయి గొంతు పగులున ట్లఱచిరి; దానివలనఁ గంఠశోషము తప్పఁ బ్రయోజనము లేక పోయినది. వారు ప్రాణము విసివి నారాయణ స్మరణముచేసికొని వెడలి పోయిరి. తదుత్తరక్షణముననే యొక బిచ్చగాఁడు వచ్చెను; వాఁడు కొంచెము పొడవరి. ఉక్కు తునుకలవంటి బాహువులును, గండపట్టిన స్థూలశరీరమును జూడ వాని కెప్పుడు నాహారలోపమున్నట్లు కానరాదు. వాఁడేదో వింత వింత పాటలు పాడుచు నొక ధనికుని గుమ్మములో నిలువఁ

బడి, చుట్టియున్న పటము నొకదానిని విప్పి యచ్చటివారికిఁ జూపెను. ఆపట మెంతో మనోహరముగా నుండెను. అందుఁ గాశీక్షేత్రము చిత్రింపఁబడెను; విశ్వేశ్వరుని యాలయ మొప్పులు గులుకుచుండెను. తీర్థయాత్రకై వచ్చినజనములు గూడ నందున్నారు! కొందఱు ఫలాదులను గొనుచుండిరి; కొందఱు తమతోవచ్చినవారి కచ్చటివింతలను జూపుచుండిరి; కొందఱు నేలపై సాగిలఁబడి విశ్వేశ్వరునకు నమస్కరించుచుండిరి. కొంద ఱాలయమున కెదుటఁ గూర్చుండి రుద్రాక్షమాలాధారులై జపించుచుండిరి. దాని ప్రక్కనే గంగానది చిత్రింపఁబడెను; గంగ యుత్తుంగతరంగములతోఁ బ్రవహించుచుండెను. కొందఱు తానము లాడుచుండిరి; కొందఱు విప్రోత్తములు సంకల్పము చెప్పుచుండిరి; కొందఱు నీటి కాసులకై పర్వెత్తుచుండిరి. కొందఱు తైర్థికులం దీఁతాడుచుండిరి. ఆనదిలో నొకమూలఁ గొన్ని పడవలు చిత్రింపఁబడెను. వానిలో నావికులు గూర్చుండి తెడ్లనువేసి నడుపుచుండిరి. గంగాతరంగములలో విహరించుచున్న చేపలుకూడ నందుఁ జేర్పఁబడినవి. కాశీపురవీథులును మహోన్నతములగు సౌధములును మిక్కిలి మనోహరముగా నుండెను. పెక్కు దేవాలయము లందుఁ గానవచ్చుచుండెను. ఈచిత్రపటమును జూచుటకు, స్వల్పకాలములోఁ బిల్లలును వృద్ధులును స్త్రీలును వచ్చిమూఁగిరి. విశ్వేశ్వరాలయ మేదనియొకఁడును, మణికర్ణిక యెక్కడనున్నదని యొకఁడును, వ్యాసకాశి యెచ్చట నున్నదని వేఱొకఁడును, హనుమద్ఘట్ట మేదియని యింకొకఁడును, హరిశ్చంద్రుని యంగడియేదని మఱొకఁడును, నిట్లు

పలువిధముల నడుగసాగిరి; అడిగి తెలిసికొని కొందఱు తక్కిన వారికిఁ జూపఁజొచ్చిరి. కొంద ఱాయాస్థలములను జూచి చేతులుమోడ్చి నమస్కరించుచుండిరి. కాశీనగరమును జూచి వచ్చిన తైర్థికులు కొందఱచ్చటఁ గూర్చుండి తమ కాశీయాత్రా విధానము నుపన్యసించుచుండిరి. కొంతసేపుంచి వాఁడు పటము చుట్టివేసి బిచ్చము పెట్టుఁడని యడిగెను. ప్రేక్షకులు చేరల కొలఁది బియ్యము తెచ్చి వానిపాత్రలోఁ బోయసాగిరి. చిన్నపిల్లలు చాటుచాటున బియ్యము గొనివచ్చి వానికిచ్చి మరల మరలఁ బటమును జూచుచుండిరి. అప్పటికిని దనివి దీఱక కొందఱు బాలురు వాని వెంబడించిరి. కొందఱు స్త్రీలు వానిని దమయింటికి రప్పించుకొని యాచిత్రమును జూచుచుండిరి. అచిరకాలములోనే వానిపాత్రము నిండినది. ఆతండులములను మూటగట్టి నాలుగిండ్లు తిరుగునప్పటికి పాత్రము మరల నిండినది. వాఁడట్లే నడచి యాదుర్గముచెంత వోయెను. ఈచిత్రమునుంజూచిన పరిచారిక యొకతె పర్వు పర్వున నొగర్చుకొనుచుఁ బోయి పద్మావతికి విన్నవించెను. సామాన్యముగా నిట్టివేడుకలు చూడ స్త్రీలు మిక్కిలి కుతూహల పడుచుందురు. పద్మావతి వాని రప్పించెను. కాశీనగరమును స్వయముగాఁ జూచి యానందించుపున్నెము లేని వారు తాదృశ చిత్రపటములను జూచినఁ గొంతేని పుణ్య మబ్బక పోదని యామె యభిప్రాయము. ఆమె యాపటమున కెదురుగాఁ గూర్చుండెను. పరిచారిక లామెను బరివేష్టించి వంగినిలిచి యందలిచిత్రములను వీక్షించుచుండిరి. వారంద ఱును తదేకధ్యానముతో నుండిరి. ప్రతాపరాయుఁడు వచ్చి

వారివెనుక నిల్చెను. కాని వారది యెఱుఁగనే యెఱుఁగరు. కొంత సేపటికిఁ బద్మావతికి విసువెత్తెను. వంగిచూచుచుండుటచే నడుము నొచ్చినది. అందుచే నాసనమున వెనుకకుఁ జేరఁ బడఁగా నామెకు భర్త గనఁబడెను. సరభసముగా నాసనము నుండి లేచి యామె యతనిచెంత కరిగెను. పరిచారికల కింకను దనివి తీఱమిచేఁ జూచుచుండిరి. పద్మావతి యిట్లుసంభాషించెను.

"నాథా! మీరువచ్చి యెంతసేపైనది? వీక్షణకుతూహలతచే నొడలు మఱచి తెలిసికోలేకపోతిని. క్షమింపుఁడు."

"ఆచూచెడిదేమి?"

"కాశీపటము చిత్రకారుఁ డెవ్వఁడో మిక్కిలి యందముగాఁ జిత్రించినాఁడు." అని పద్మావతి యాతని మోము వీక్షించెను. అది తొంటియట్లు మందహాస విలసితమై చూపట్టలేదు. అతనిచేత నొక యుత్తరముగూడఁ నుండెను. ఆచిహ్నముఁలఁ జూడ నామెచిత్తము తత్తరపడఁజొచ్చెను. ప్రాణేశ్వరునిఁ జూచి "వల్లభా! అదేమి? నేఁడు మీముఖలక్షణములు వేఱువిధముగానున్నది. వింతలేమియు లేవుగదా" అని యామె యడిగెను.

"దుఃఖదాయకమగు నపాయమేదియు లేదు?" అని యతఁడు బదులు చెప్పెను.

"అదేమి యట్లనుచున్నారు? అపాయ మేదయిన సంభవించినదా యేమి? అదేమో చెప్పుఁడు," అని యామె తొందరచేసెను. పద్మావతి చిన్నప్పటినుండియుఁ బలుకష్టములనుభవించి విసిగినదగుటచే నపాయశబ్దము చెవిని బడునప్పుడెల్లఁ దుల్లిపడు చుండును.

"సుందరీ! మఱేమియును లేదు. మీాజనని రోగపీడితయైన దఁట. కాని ప్రస్తుతమున స్వస్థచిత్తయై యున్నదఁట! నిన్నొక సారిఁజూడ వేడుకపడుచున్నదఁట! మీాజనకుఁడీసంగతులను జేర్చి యీా యుత్తరము వ్రాసినాఁడు. అని చెప్పి యతఁ డుత్త రము చేతికిచ్చెను. పద్మావతి చదువుకొనెను; ఆమూలా గ్రము చదువునప్పటికిఁ గన్నులు బాష్పపూరితము లయ్యెను. ఆయుత్తరము మడిచి పట్టుకొని గద్గదస్వరముతో, "వల్లభా! అదెట్టి ముహూర్తమున జనించినదోకాని మాతల్లి జీవమున కెప్పుడును సుఖము లేదుగదా! ఎప్పుడును గష్టము లే;అకటకటా! దానికి వచ్చినకష్టములు లోకమున మఱెవ్వరికి రావు. మొన్న మొన్నటివఱకుఁ బలుకష్టములపాలయి యిప్పుడేదోనలువురలో ముసలిది సుఖించుచున్నదని సంతోషించుచుండ నీగండమెట్లు దాపరించినదోచూడుఁడు.అది యహర్నిశంబు సంతానచింతచేఁ గుళ్లి కుళ్లి చచ్చి సగమైయున్నది. ఆమీాఁద నీరోగములు నిలువ నీకున్నవి. ఇఁక నదియెంతో కాలము జీవింపదు. నన్నుఁ దల్లి లేని పిల్లనుగాఁ జేసిపోవును," అని పద్మావతి యేడువఁ జొచ్చెను.

అదివఱకుఁ జిత్రపటమును వీక్షించుచున్న పరిచారిక లందఱీవంకకు మరలి తమ యజమానురాలి మాటలు విని దుఃఖింప నారంభించిరి. వారి దురవస్థను జూచి బిచ్చగాఁడా పటము నచ్చటనే విడిచి వారియొద్దకుఁ బోయి యొకమూల నిలువఁబడి విచారింపసాగెను. అప్పుడు ప్రతాపుఁ డామె నోదార్ప నిట్లనియె.

"హృదయేశ్వరీ! ఏల దుఃఖించెదవు? దుఃఖించునంతటి యుపద్రవ మేదియు రాలేదు. ప్రస్తుతముస్వస్థురాలై యున్న

దఁట ! విచారింపకుము. మానవులు కష్టము లనుభవింపని వారెవ్వరున్నారు ? కష్టసుఖములు పర్యాయమున వచ్చు చుండును. అయినను మీతల్లి యనుభవించినన్ని మహాపదలను వేఱొకతె యనుభవింపలేదనుట నిశ్చయమే. అయ్యో ! మధు రానగరమున నామె పడిన కష్టములు భగవంతునికే తెలియ వలెను." అని యతఁడు చెప్పుచుండఁ బద్మావతి వెనుకటి దిన ములు స్మరించుకొనెను. అందు ముఖ్యముగాఁ దల్లి జ్వర పీడితయై దేహమును మఱచి నిండ్రించినపుడు తానసహాయు రాలై యనుభవించినకష్టదినములు తలంపునకువచ్చి గుండె జల్లు మనెను. ప్రతాపుఁడు మరల,

"సుందరీ ! అట్టి కష్టము లింకెప్పుడు నెవ్వరికిని రావు. వాని మఱచి పొమ్ము. మీతల్లి జ్వర పీడితయైనను నీవిప్పుడు వెనుకటి యంత శ్రమచెంద నవసరములేదు. అప్పుడు నీవా క్కార్తుకవు ; అజ్ఞాతవాసమును గడుపుచుంటివి. ఇప్పుడు నీకేమి కొఱఁత ! మీతల్లి కేమికొఱఁత ! మీజనకుఁడు దేశమున నుండుటచే నీయాపద నవలీల తరింపఁ జేయఁగలఁడు. భయ పడకుము ; విచారింపకుము," అని ధైర్యము గొల్పెను.

పద్మావతి కొంచెము ధైర్యమవలంబించి భర్తం జూచి, నాథా ! సత్యము వచించితిరి. వెనుక నాయాపదలలో ధైర్యముగొలుపువారైనను, దుదకు మాటాడువారైనను లేకపోయిరి. కాని యిపుడు నాకేమి లోపము ? మీ రత్యాదరమునఁ జూచి యిట్టి ధైర్యవచనములు పల్కుచుండ నిండఱు పరిచారికలు నాకెఁ జేదోడు వాదోడై యుండ, మా జనకుఁడు రోగమునకుఁ దగినమందిచ్చి యామె కుపచార

ములు చేయుచుండ నాకేమి విచారము! అయినను నొకసారి నచ్చటి కరిగి యామెను సందర్శించి వచ్చువఱకు నాస్వాంతము నిశ్చింతమై యుండఁజాలదు. నాకిందుల కనుజ్ఞ యొసఁగ వేఁడెదను," అని వినయపూర్వకముగా నడిగెను.

ప్రతాపరాయునకుఁ బద్మావతి నెడఁబాసి యుండుటకు మనస్సొప్పలేదు. తదీయ సంభాషణా పరిచర్యాదులచే నతని చిత్తము సర్వకాల సర్వావస్థలందును దదాయత్తముగాఁ జొచ్చెను. ఇంతేకాక రాత్రిసమయమున దుర్గరక్షణమునందామె చూపుచున్న తోడింతంతన వీలులేదు. తత్సహాయతచే రాత్రి సంచార మతనికిఁ గష్టమనిపింపలేదు. ఆసుందరి యరిగి నచోఁ దానొంటిగా దుర్గరక్షణభారము వహించుట మహా దుర్భరమని తలపోసి ప్రియురాలిని జూచి, "ప్రేయసీ! మీజననిప్రస్తుతమున సుఖవంతురాలై యున్నదికదా? నీవు వెడల వలయునా?" అని యతఁడనెను. ఆయువతి యేమియుఁ బలుకక చూపు క్రిందికిఁ బఱపి చెక్కిటచేయి సేర్చి కాలిబొటనవ్రేలితో నేల గీయుచుండెను. ఆవీరుఁడామెస్థితిని బట్టి హృదయము గ్రహించి ముఖ్యముగా జననిని జూడవలె నన్న తలంపామె కున్నట్లు నిశ్చయించెను. ఇంతలోఁ బరిచారికాబృందములో గుసగుసలు వినవచ్చెను. ఆసమయమునఁ బద్మావతి నంపకుండుట యనుచితమనియుఁ గఠినత్వమనియు వారు పలుకుచున్నట్లతనికిఁ దోఁచెను.

"యువతీలలామా! విచారింతువేల? తప్పక పోయి రమ్ము. నీసాయము లేకుండ నీదుర్గము నెట్లు రక్షింపఁగలుదునో

తెలియకున్నది. సాధ్యమైనంత శీఘ్రకాలములో మరలి రమ్ము,” అని ప్రతాపుఁడు పలికెను.

పద్మావతి యతనిఁ జూచి, “నాథా యిచ్చటి కార్య మెంత దుర్భరమైనదో యెఱుఁగనిదాననుగాను. మాతల్లిని జూచి యిచ్చటిస్థితిని దెల్పి యొకటి రెండు దినములలోఁ దప్పక వత్తును.”

“అది కష్టసాధ్యము. మీతల్లి నిన్నంత వేగముగా వదలునని తోఁచదు. ఆమె వాత్సల్యమట్టిది.”

“అగుఁగాక. ఆమెను సమ్మతింపఁజేసి రెండవ దినము సాయంకాలమునకు మరలి వచ్చెదను, చూడుఁడు” అని పద్మావతి యనెను.

ఆ రాజకుమారుఁ డందుల కంగీకరించెను. వీరందఱీప్రసంగమున మునిఁగినవారగుటచే బిచ్చగాని సమాచారమును మఱచిపోయిరి. విచారకరమగు నావార్తను వినుటకాఁబోలును, వాఁడేమియుఁ దొందరపెట్టలేదు. పద్మావతీప్రతాపు లేదో ప్రసంగించుకొనుచు నాచోటు గదలిపోయిరి. ఆబిచ్చగానికి బిచ్చమువేసి పంపి పరిచారిక లాదంపతుల ననుసరించి పోయిరి.

# విలాసరామ

## 27-వ యధ్యాయము

### శివసింగు

గీ. "జీవు లీశ్వరుఁడాడుపా-చికలు సుమ్ము
వాని నెడపుట గలుపుట-వానిలీల
దాన దారసుతాదిబాం-ధవుల కెల్లఁ
కలుగు యోగవియోగముల్-క్రమముగాను."

శాంత కష్టములు గట్టెక్కినవి. ఆమె కుమారికతోడను, నల్లునితోడను స్వదేశముఁ జేరెను. ఛత్రసాలుఁడామె నెంతో గౌరవించి దివ్యభవనము నొకదాని నొసంగెను; దాసీజనము నిచ్చెను; వలయు పదార్థజాలము పంపించుచుండెను. కేశవసింహుని సందర్శనము ప్రతిదినము నామెకు లభించుచుండెను. క్రూరకర్ముల కామె భయపడవలసిన యవసరమిఁక లేదు. తన మానమును దానే కాచుకొనవలసిన భారము గూడ లేదు. ఆమె ప్రతిదిన మేదోయొకసమయమున ఛత్రసాలుని యంతఃపురమునకుఁ బోయి మహారాజ్ఞితోఁ గొంతసేపు ముచ్చటించి వచ్చుటగలదు; కావున నామెకు సుఖకాలక్షేపమగుచుండెను. ఇప్పుడామె సుఖవంతురాలని చెప్పవలసినదే కాని యామె జీవమునకు సుఖము లేదు. ఆమెకుఁ గుమారియగు పద్మావతియం దెక్కుడు ప్రేమ. ప్రేమాస్పదయగు కూఁతు నిపు డెడఁబాసి యుండవలసి వచ్చెను. ఆవియోగ

మా మెకు మహాభరమనిపించుచుండెను. కాదా ? కన్నకూఁతు నెడబాసి యుండు టెవ్వరికిఁ గష్టమనిపింపదు ? ఇంతేకాక శాంతా పద్మావతులు లోకములోని తల్లిబిడ్డలవంటివారు కారు. వీరి పరస్పర ప్రేమము నిరుపమానము. పల్లెత్తుమాట యైన నొకరినొక రాడుకొని యెఱుఁగరు. వారొకప్పుడు నొకరి యెడ నొకరు విపరీతహృదయులు కాలేదు. మఱియు నజ్ఞాత వాసములో వారిరువురును సర్వకాలములందును గూడియుం డుటచే, వారి ప్రేమానుబంధము మఱింత దృఢమైనది. పద్మావతి క్రమక్రమముగా భర్తృప్రేమ కధీనురాలై తద ధీనచిత్తయగుటచేఁ దల్లినెడఁబాసి యుండుట యామెకంతగాఁ గష్ట మనిపింపలేదు. కాని శాంత కట్లుకాదు. ఆమె కన్నసంతా నములో జీవించియున్నది పద్మావతి యొక్కతెయే. ఆమెయపత్య ప్రేమ వేఱొకనియందు సంక్రమించుట కవకాశము లేదు. పద్మావతియందున్న యామెప్రేమ కంతరాయము లేదు. అందుచే నామెకుఁ బుత్త్రీవిరహ మెట్లుండునో యోజింపుఁడు. ఇంతేకాదు, పుత్త్రశోకము కష్టములలో నెల్ల మొదటిది. దాని భరించు టెట్టివారికైనను దుర్భరము. జనకుఁడొకఁడు పుత్త్ర శోకసాగరమును దరించినఁ దరింపఁగలఁడు. కాని జనని యట్లు చేయఁజాలదు. ఆమె పుత్త్రశోకమును దొలఁగించుకొనలేదు. ఎట్లయినఁ గన్నకడుపుగదా ? ఏరీతి శాంతినొందఁగలదు ? జ్ఞానబలముననో, ధైర్యబలముననో పుత్త్రశోకము నొక్కింత యడఁగించుకొని ధైర్యము దాల్చినను నది చిరకాలముండ నేరదు. ఎట్లుండఁ గలదు ? తనతోడి యువతీమణుల తనయులు కంటఁబడినప్పు డామెశోక మతివేలమై యుద్రేకింపక మా

సునా ? దాని సాఁగికొంట మహాదుర్భరము. పాపము ! శాంత కొకప్రక్కఁ బుత్త్రశోకము ; రెండవ ప్రక్కఁ గుమారికా వియోగము. ఈరెండును దావానలములవలె దరికొని స్వాంతము నుడికించుచుండ నామెకు సుఖమెట్లబ్బును ? చిత్త మిట్లు దుఃఖాకులమైనపు డెట్టిసౌధములున్న నేమి ? ఎంతధన ముండిననేమి ? ఎంత దాసీజన మున్న నేమి ? ఎన్నిభోగ్య పదార్థములున్న నేమి ? ఎంత గౌరవము వడయుచున్ననేమి ? మానవులకు సుఖము లభింపనేరదు. కావున శాంతకును సుఖ మనకుచు జాల దూరము. ఆలలనారత్న మొకనాఁటి రాత్రి యొక యాసనముపైఁ గూర్చుండి తనభర్తరాకకు నిరీక్షించు చుండెను. దాసీజనము చుట్టును బరివేష్టించి యుండిరి. వారేదో కొంతసేపు లోకవృత్తాంతములను గూర్చి ముచ్చటించుకొనిరి. అవి సమాప్తిచెందెను. ఇంకను భర్తరాలేదు. పిమ్మట దాసీజనము కోర్కిప్రకార మామె మధురాపుర వృత్తాంతము చెప్పనారంభించెను. ఆశాంత చిక్కిలి మాట నేర్పరి. ఆపై విద్వాంసురాలు. ఆమె చెప్పునపు డాయాపట్టుల భయానక కరుణాద్భుతరసములు వెల్లివిరియఁ జొచ్చెను. చెలి కత్తె లధికాతురతతో వినుచుండిరి. కొంత సేపటికదియు ముగి సెను. కాని కేశవసిం గింకను రాలేదు. శాంత మరల నేదో ప్రసంగ మారంభించెను. చెలికత్తెలకది మధురాపుర వృత్తాంతమువిన్న పిమ్మట' నీరసముగాఁ జూపట్టెను. శాంత గౌరవము నాలోచించి వినుచుండిరి. కాని కథాగౌరవమును బట్టికాదు. నిద్రాభారముచే వారికన్నులు మూఁతవడఁ జొచ్చెను. వారు క్రమముగా నేలకొఱగి నిద్రింపఁ దొడఁగిరి. అది కనిపెట్టి

శాంత ప్రసంగమునుండి విరమించి ఆకసమువంకఁ జూచెను. నక్షత్రములు మిలమిల లాడుచు గగనయాత్ర సల్పుచుండెను. చంద్రుఁడు నభోమధ్యవర్తి యయ్యెను. అది చూచి శాంత రెండవ యామము ముగియుచున్నట్లు గ్రహించి తలవాకిటికి వచ్చి నలువలంకులు చూచెను. మనుష్యసంచార మెచ్చటను గానరాలేదు. నాఁటికిఁ దనభర్త రాఁడని నిశ్చయించుకొని యామె లోపలికిఁ బోయి శయనించెను. గాని గాఢముగా నిద్రపట్టలేదు. కొంతసేపటి కెవ్వరో వీథితలుపు తట్టినట్లయి నది. దాసియొకతె మేల్కాని తలుపు దీసెను. అంతట లోని కిద్దరు పురుషులు ప్రవేశించిరి. వారిలోఁ గేశవసిం గానంద ముపట్టఁజాలక "శాంతా! శాంతా! నేఁడొకశుభవార్త గొని వచ్చితిని అట్టిశుభము మనకీజన్మమధ్యమున లభించునని తలంప లేదు" అని సత్వరముగా లోనికిఁ బోయెను. శాంత యది విని తటాలున శయ్యదిగి నాథుని సమీపించి, "వల్లభా! అట్టి శుభవార్త యేమి?" అని యడిగెను.

"మన కుమారుఁడు, మనకుమారుఁడు వచ్చినాఁడు" అని కేశవసింగు నిర్భరానందముతోఁ బలికెను.

"నాథా! సత్యమే! సత్యమే! మన కుమారుఁడా? మన యదృష్టమున బ్రదికియున్నాఁడా? ఇది నిశ్చయమే? నేనంత యదృష్టవతినా? ఏఁడీ? ఏఁడీ? వచ్చినాఁడా? ఇచ్చటికే వచ్చెనా?" అని శాంత యత్యాతురతతోఁ బల్కెను.

అంతట శివసింగు వడివడి తల్లిపాదములపైఁబడి, "తల్లీ! నిన్నిజన్మమునఁ జూతు ననుకొనలేదు," అని పెద్దపెట్టున నేడువ నారంభించెను. ఇఁక శాంత హృదయవికారముల

వర్ణింప నలవి కాదు. ఆనందముచేతనో దుఃఖముచేతనో కన్నీరు కాలువలు గట్టి ప్రవహింపఁదొడఁగెను. నిజముగా నట్టి ప్రియము సంభవించినపు డానంద ముదయించునో దుఃఖ ముదయించునో నిర్ణయించుట కష్టము. ప్రియవస్తువు లభించుటచే నానందము పొడమవచ్చును; చిరకాలమునుండి యెడబాసియున్న ప్రియవస్తు వాకస్మికముగాఁ గంటఁబడుటచే దుఃఖముగూడ నుదయింపవచ్చును. వానితో నాశ్చర్యముగూడఁ బుట్టియుండును. అయినను నాకాలముననున్న భావములలో దుఃఖమే ప్రబల మనవచ్చును. అదిసత్యమే ఆనందాశ్చర్యములు తత్కాల సంభూతములు; దుఃఖమట్లు కాక మనంబునఁ జిరకాలమునుండి నెలకొని యుండ యొక్కపరి నిపుడు విజృంభించును. ఈ దుఃఖాతిశయమున దక్కినభావము లావృతము లగును. కావున కాంతదుఃఖ ముద్రేకించెను. "నానాయనా! నన్నుఁ గన్నతండ్రీ! నాముద్దుకుఱ్ఱా! జీవించియున్నావా? మా యదృష్టము మిక్కిలి మంచిది," అని కుమారునిఁ గౌఁగిలించుకొని యామె బోరున నేడువనారంభించెను. కొంతసేపటికి వారిదుఃఖము కొంచెము దిగుముఖమునకు వచ్చెను. ఆనందాశ్చర్యములిపుడు క్రమక్రమముగాఁ బ్రబలి దుఃఖము నడుగంటఁ జేసెను. తల్లి కుమారుని లేవఁదీసి కూర్చుండఁ బెట్టెను. అతని వీఁపుమీఁద చేయివేసి తట్టుచు, "తండ్రీ! ఇంతకాలముదాఁక నెచ్చటనుంటివి? నీవెట్లు బ్రదికితివి? నీభార్య శ్యామల యేమయినది? నీవృత్తాంతము వివరముగాఁ జెప్పుము," అని యామె యుత్కం...తో నడిగెను.

"తల్లీ! నావృత్తము చెప్పెదను వినుము. మేమా నాఁడు పడవెక్కి యమునానది దరించుచుంటిమి! పడవ కొంతదూరము సరిగానే నడచినది. కాని మాదురదృష్ట వశమున సుడిగాలి యొక్కపెట్టున వచ్చి పడవను దలక్రిందుగాఁ జేసెను. అందఱమును నదిలోఁ బడితిమి. పెఱవారి వృత్తాంతము నాకేమియుఁ దెలియదు. నాఁడు ప్రవాహ మతిశయించి వచ్చుటచే నాయీఁతనేర్పు నన్ను దీరమునకుఁ జేర్పలేక పోయెను. ఇంతలో నేనొక సుడిలోఁ బడితిని పిమ్మట నావృత్తాంతము నాకుఁ దెలియలేదు. ధార్మికుఁడయిన యొకజాలరి నన్ను దన పడవపైఁ గూర్చుండఁ బెట్టుకొని కాచుచుండఁగాఁ గన్నువిచ్చితిని. ఆజాలరి ప్రవాహమునుండి నన్నుఁదీసి రక్షించెనఁట! కొంతసేపటికి నాకు మాటాడుశక్తి వచ్చెను. ఆజాలరి నన్నుఁగూర్చి యడిగెను. నావృత్తాంతమును నేను జెప్పితిని. అతఁడు కరుణాళుఁడై తనయింటికిఁ గొనిపోయి యాదరింపఁగా కొంచెము స్వస్థుడనగుచుంటిని, కాని నాదురదృష్టమునఁదీవ్ర రోగము నన్నావహించెను. ఒడలు స్వాధీనము కాలేదు. మంచము పట్టితిని. జిహ్వాదోషించెను. మీకు వార్తనంప వలయునని జాలరికి సంజ్ఞచేసితిని. అతఁడు గ్రహింపలేక పోయెను. అయినను నాజాలరి దయాళువై తగిన యౌషధము నిప్పించెను. కొన్ని దినముల కాయౌషధబలమున రోగము తఱిఁగి నాలుక స్వాధీనమయ్యెను. అప్పుడు మీకు వార్తనంపవలయునని యతని కోరితిని గాని యతఁడు, "కొలఁది దినములలో నీవే పోవచ్చును," అని చెప్పెను. ఆయుపకారిచేసిన మహోపకారములవలనఁ గ్రమముగా నారోగ్యవంతుఁడనైతిని. నాకు

నడువ శక్తిగలుగునప్పటి కించుమించుగా రెండు మాసములు గడచెను. నాయొంటనున్న నగలను గొన్నింటి నాజాలరికి బహుమతిగా నొసఁగి సంతసింపఁజేసి మిమ్ముఁ జేర ఢిల్లీకి బయలుదేఱితిని. నేను గాలినడకను గొన్ని దినములకు ఢిల్లీ చేరి మనమునివసించియున్న మందిరమున కరిగితిని. అందెవ్వరో తురకలు కాఁపురమున్నారు. మిమ్ముగూర్చి వారిని నడిగితిని. ఔరంగజేబు చక్రవర్తి రాజద్రోహాపరాధము మోపి మాజనకునిఁ జంపించెననియు, నారాత్రియే నాసోదరియు నీవును బలాత్కారముగా మృతినొందితిరనియు, వారు చెప్పిరి. మఱి కొందఱు పరిచితుల నడుగఁగా వారునట్లే తెలిపిరి. అదివినుటతోడనే నాగుండెలో ఱాయిపడెను; దుఃఖ మనివార్యమై యావహించెను. క్రమముగాఁదొలఁగించుకొంటిని. వైరాగ్యమూని తీర్థయాత్రల సేవింప నేగితిని. అది మొదలు మొన్నటి వఱకును దీర్థముల సేవించుచునే యుంటిని. ఎన్నియో తీర్థములఁ జూచితిని. నేనొకనాఁడు మధురాపుర ప్రాంత వనమునఁబడి రాత్రి సమయమునఁ బోవలసివచ్చెను. కొందఱు దొంగలు నన్నెదిరించిరి. నేనూరకుండక వారితోఁ బోరాడఁ జొచ్చితిని. వారార్గురు. నేనొక్కడను. వారాయుధపాణులు, నేను నిరాయుధుఁడను. అయినను జంకక ధైర్యముతో నొకనిచేతిలోని ఖడ్గమును లాగికొని వారితో యుద్ధమునకు దొరకొంటిని, కాని ప్రయోజనము లేక పోయెను. వారు నన్నుఁ గ్రిందఁబడఁ ద్రోచి నాకుత్తుకను ఖండింపనుండిరి. అప్పుడు నేను గేకలిడితిని. అదివిని యిర్వురు గోసాయీలు నాపాలిటి భాగ్యదేవతలవలె వచ్చి వారిని జావఁగొట్టి నన్నుఁ గాచిరి. పిమ్మట వారు నాయందు దయాళువు

లయి నన్నొక పల్లికిఁ జేర్చి నాగాయములకు మందిచ్చిపోయిరి. అని కుమారుఁడు చెప్పుచుండ నతని కడ్డమువచ్చి కేశవసింగు యిట్లనియె.

"ఏమీ! నాఁడు మధురాపురీప్రాంతమునఁ జోరు లకుఁ జిక్కినవాఁడవు నీవా? ఎంతపని! నిన్ను బ్రతికించిన వాఁడను నేనే! నీవృత్తాంతమప్పుడే యడిగినచోఁ దరువాతఁ గష్ట ములు పడకయుందువుకదా? ఆహా! దైవమా! నీమాయ యెంత దుర్నివారమైనది? అక్కటా! కుమారా! నిన్నుబట్టు కొన్న చోరులు రహీము మొదలగు క్రూరులు సుమా! అపుడు మేము రానిచో నాకఠినాత్ములు నిన్నుఁ దప్పక తుదముట్టించి యుందురు," అని పల్కుచుండ శాంత యతనిఁజూచి, "రహీ మా! రహీమా! అక్కటా! వాఁ డెంత క్రూరుఁడు; ఎట్టి ద్రోహి? ఆదురాత్మునివలననే మధురాపురమున మేముపడ రాని బన్నములు పడితిమి. అయిననేమి! మన ప్రతాపరా యుఁడు వానికిఁ దగిన శిక్షగావించెను." అని యామె రహీము దుష్టకార్యములు వర్ణించెను.

ఈవృత్తాంతము శివసింగు విని యత్యాశ్చర్యమగ్నుఁడై "జనకా! నాఁడు రక్షించినవాఁడవు నీవా?" అని యడిగెను.

"అవును, నేనును బ్రాణనాథస్వామియు ఢిల్లీనుండి వచ్చుచు నిన్నుఁ గాచితిమి?" అని కేశవసింగనెను.

అదివిని శివసింగు తండ్రినిజూచి మీవృత్తాంతము జెప్పు మనియడిగెను. అప్పుడతఁడిట్లనియె."కుమారా, మీరు యమున లోఁ బడ వెక్కిన రెండు దినములవఱకును మిమ్ముగూర్చి మాకను మానమే లేకపోయెను. తీర్థయాత్రలను సలిపి భార్యాసహితుఁ

డవై వత్తువనియే నమ్మియుంటిమి. పిమ్మట మీరెక్కినపడవ మునిఁగిపోయినట్టును బెక్కురు మృతినొందినట్టును దెలియవచ్చెను. మిమ్ముఁగూర్చి యెంతయు దుఃఖించితిమి. ఇట్లు భవద్వియోగదుఃఖపీడితులై కష్టమునఁ గాలము పుచ్చుచుంటిమి. కాని దైవమంతటితో నూరకుండలేదు. చక్రవర్తి నాకుఁజేయుచున్న గౌరవాదులనుజూచి మహమ్మదీయు లోర్వలేక నాతో విరోధమూని యున్నారని నీవెఱిఁగియే యున్నావు. ఆతురకలు చక్రవర్తితో కేశవసింహుఁడు చిత్తూరువారితో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచున్నాఁడనిచెప్పి కొన్ని మాయాపత్రములను జూపిరి. ఔరంగజేబదినమ్మి నాసర్వస్వమును హరించి నన్నుఁ గారాబద్ధుని జేసెను. కాని మిత్రుల సాయముచే నెట్లో తప్పించుకొని బయటఁ బడితిని. అది చక్రవర్తికిఁ దెలిసెను. అతఁడు క్రుద్ధుఁడై "కనఁబడిన తత్క్షణమున నే కేశవసింహుని ఖండింపవలయు," నని శాసించెను. అదివిని నేను నానావేషధారినై తిరుగుచుంటిని. ఢిల్లీలోనుండిన నీతల్లిని, నీసోదరిని జక్రవర్తి బాధించునేమో యని యెంచి యొకనాఁటి నిశాసమయమున నొరులకుఁ దెలియకుండ వారినిదెచ్చి మధురాపురమున శిథిలగృహములలో నివసింపఁ జేసితిని. మొన్నటి వఱకును వీరచ్చటనే యుండిరి. మన బంధువును, నీదేశాధిపతియునగు ఛత్రసాలుఁడు చక్రవర్తి పాలనమును ధిక్కరించి స్వతంత్రుఁడయ్యెను. అది తెలిసికొని స్వస్థలమగు నీదేశమున నుండుట క్షేమకరమనియెంచి యిఁక నిచ్చటనుండ నిశ్చయించితిని. ఛత్రసాలుఁడు మిక్కిలి మంచివాఁడు. నన్నెంతయు గౌరవించుచున్నాఁడు. మధురానగరమునఁ బలుబాముల బడు

చున్న నీజననీ సోదరుల నిచ్చటికి రప్పించి మిక్కిలి గౌరవించెను. నేఁడు మాయదృష్టమువలన నిన్నుఁ గాంచుభాగ్యము గల్గె," నని చెప్పుచుండ శివసింగచ్చిరువంది యిట్లనియె.

"జనకా, ఢిల్లీపురవాస్తవ్యులు మీరు మృతినొందినట్లు చెప్పిరేల?"

"అందులకుఁ గారణము లేకపోలేదు. చక్రవర్తి బహు కుటిలుఁడు. ఇదివఱకుఁ బెక్కురు రాజపుత్రులను గారాబద్ధులఁ గావించి, వారిని రహస్యముగాఁజంపించి జనులు తన్నునిందింప కుండుటకై, కారాగారబద్ధులు తప్పించుకొని పాఱిపోయిరని ప్రథపుట్టించుట చక్రవర్తినైజము. అతనిస్వభావమునుజక్కఁగా నెఱిఁగినవారగుటచేఁ బ్రజలు నావిషయమైకూడ నట్లే తలంప వచ్చును. నీజననీసోదరులు రహస్యముగా నాయూరు కదలి వచ్చుటచేతను వారివృత్తాంతము ప్రజల కగమ్య మగుట చేతను వారు మృతినొందిరని తలంచియుందురు.!"

"జనకా! నీవు మాఱువేషమున ఢిల్లి. కెందులకరిగితివి?"

"రాజకార్యార్థము. ఛత్రసాలునితో యుద్ధముచేసి చక్రవర్తి యిదివఱకు నాల్గుపర్యాయము లోడిపోయెను. మరల యుద్ధముచేయ నున్నాఁడో లేదో తెలిసికొనుటకై మేము పోయియుంటిమి. అటనుండి వచ్చునప్పుడే నిన్నుఁ గాచితిమి."

"మాసోదరి యెచ్చట నున్నది?"

"ప్రతాపరాయుఁడను వీరపురుషుని బెండ్లాడి యత నితో నూతనదుర్గమునఁ గాఁపురము చేయుచున్నది.'

ఇట్లు వారు భాషించుచుండ శాంత కుమారునిఁ జూచి, "నాయనా! శ్యాములవృత్త మేమియుఁ దెలియ లేదా?" అని ప్రశ్నించెను.

"లేదు," అని యతఁడు దుఃఖముతోఁ బలికెను.

అదివిని శాంత గుణవంతురాలగు కోడలినిఁగూర్చి దుఃఖించి తరువాతి వృత్తాంతము చెప్పుమని కుమారు నడిగెను. అతఁడు చెప్పఁబోవుచుండఁగాఁ గోడి కూసెను. కేశవసింగు నాటికా ప్రసంగమును నిలుపుచేసి శాంతతోఁ జెప్పి కుమారునితో నెచ్చటికో పోయెను.

# దిలారామ

## 28-వ యధ్యాయము

దిలారామ ప్రతాపుఁడు.

శ్లో. "భ్రూచాతుర్యాత్కుంచితాక్షాః కటాక్షాః
స్నిగ్ధావాచో లజ్జితాన్తైశ్చవ హాసాః
లీలామందం ప్రస్థితం చ స్థితం చ
స్త్రీణామేతద్భూషణం చాయుధం చ."

ప్రకృతిసామర్థ్య మమేయము. దాని సౌందర్యము వర్ణనాతీతము. దానిపను లత్యద్భుతములు. దురూహములు. సామాన్యముగా మానవసృష్టపదార్థములే చూపఱకు వింత గొలుపుచుండును. అఘటితఘటనాసమర్థమగు ప్రకృతి సృజించెడి పదార్థము లెట్లుండునో చెప్పవలయునా? కృత్రిమ సౌందర్యముకంటెఁ బ్రకృతిసౌందర్య మెంతో రమణీయము. తత్సౌందర్యము ప్రపంచమందంతటను నెలకొనియున్నను నది కొన్నిచోట్ల మానవసంబంధముచే సంకీర్ణమై హాయిగొలుపఁజాలదు. తాదృశ ప్రకృతిసౌందర్యమును గన్నులారఁ గాంచవలెనన స్వయముత్పన్నములగు పర్వతములను సరోవరములను నదులను సముద్రములను జూడవలయును. వానియందున్న సౌందర్యము కేవలమకృత్రిమము, ఆనందదాయకము.

ప్రకృతిసౌందర్య నిధానములగు సరోవరములు బుందేలుఖండమునఁ బెక్కులు గలవు. వానిలో మదనపురమునకు

సమీపముగా నున్న సరోవరమొకటి ప్రధానమైనది. దాని పడమటి తీరమున నూతనదుర్గ ముండెను. దానిపూర్వోత్తర తటముల మదనపుర ముండెను. దక్షిణతీర మరణ్యములచే నావృతమై యుండెను. ఆ యరణ్యములలో నుండి పెక్కులు సెలయేళ్లు ప్రవహించి తత్సరోజలమును వర్ధించుచుండును. నవదుర్గమునకును సరోవరమునకును నడుమ నొక పూఁదోట గలదు. అందు నానావిధములగు పూ మొక్కలును, బూపుఁ దీగలును, బండ్ల చెట్లును గలవు అవి నూతనప్రతిష్ఠితముగాదు. చిరకాలము నాఁటిది. ఆ యూరిధనికుఁ డెవ్వఁడో దానిఁ బ్రతిష్ఠించెనఁట! మానవవర్ధితములగు తరులతాదులకు నిలయమై యాయారామము కన్నులపండువు లొనర్చుచుండెను. కాని దాని సౌందర్య మాసరోవరమున స్వయముత్పన్నములై ప్రకాశించు పద్మాదులయందమున కెంతయుఁ దీసికట్టే యని చెప్పఁగలను. ఆ యారామాధిపతియును నతని హితులును వచ్చి యందువిహరించు నభ్యాసము కలదు. కాని పద్మావతీ ప్రతాపు లాదుర్గమున నివసించి యాపుష్పవనమున విహరించు చున్నప్పటినుండియుఁ దదీయగౌరవమున నచ్చటికిఁ బోమానిరి.

పద్మావతి తల్లిని జూడనేగి రెండు దినము లయ్యెను. ఆమె పెట్టిన యవధి దాఁటి పోయినను నామె మరలి రాలేదు. అందుచేఁ బ్రతాపునిహృదయ మాందోళనము చెందసాగెను. ఆ రెండు దినములును రెండు మహాయుగములవలె నతనికిఁ జూపట్టెను. దుర్గరక్షణము గూడ మిక్కిలి భరమనిపించెను. ఆ రెండు దినములును నాతఁడు దుర్గము దాఁటిపోలేదు. అతని కాదుర్గము చెఱవలెఁ గన్పించెను. ఒకమాఱతఁడు వనవిహారము

సల్పిరావలెనని తలంచి యొక్కఁడును సాయంసమయమున బయలుదేఱి కొంతసేపు పూఁదోటలో విహారించి సరోవరతీర మునఁ గూర్చుండెను. ముందుగా నతనిచూపులు తరంగము లపైఁ బ్రసరించెను. ఆతరంగములు మారుతముచే సముద్ధూత ములై యున్నతములై వచ్చివచ్చి యొడ్డునఁ గొట్టుకొని చెదరి పోవుచుండెను. కొంతసేపు తదేకదృష్టితో వాని రాకపోకల నతఁడు బరిశీలింప నారంభించెను. అదృష్టవశమున లోకమున నున్నతిఁ గాంచి తుదకాపదలపాలయి రూపుమాయు మాన వుల స్థితుల కవి సాటివచ్చుచుండెను. ఇంతలో నాచెంతనున్న సుందరారవిందము లతనిదృష్టుల నాకర్షించెను. వాని యంద మును దనివిదీఱ నతఁడు చూచుచు వానిజన్మమెంతో ధన్య మని పొగడఁ దొడఁగెను, కాని సూర్యుఁడపరాంబుధిని సమీ పించుటంజేసి వానియందము నిలువక క్రమక్రమముగాఁ దఱుఁగఁ జొచ్చెను. ఆతామరగుంపులపైఁ దుమ్మెదలు ఝుం కారము సలుపుచు నిట్టటు దిరుగులాడుచుండెను. మద్యపాన మున మైమఱచి వెఱ్ఱిగు వెఱ్ఱిగుపాటలుపాడు సురాపాయుల నవి విడంబించుచుండెను. తామరపాకులచాటునఁ బొంచి నిలిచి మౌనవ్రత మవలంబించి మోసపుచ్చి తమ్ము సమీ పించిన జలచరములను ముక్కున నొడిసిపట్టి గుటుక్కున మ్రింగుచున్న కొంగలు మోసకాండ్ర ననుకరించుచుండెను. ఆసమయమున గండుచేప యొకటి తరంగములలో నెగసిపడి తనధవళకాంతుల నల్గడల వ్యాపింపఁజేసెను. ఆకాంతులు పద్మావతి తళుకుబెళుకు చూపులఁ బోలుటచే నతని హృద

యము గళుకుమనెను. అతఁడు వేఱొకవంక దృష్టిసారించెను. జతలు గట్టి జలక్రీడలాడుచున్న చక్రచక్రాంగ సారసాది పక్షి విశేషము లతని కనులపండువు లొనర్చెను. దాని వలన నతని హృదయము చలింపఁ జొచ్చెను. మలయమారుతము పద్మపరాగపుంజమును దాల్చి ప్రసరింపఁ జొచ్చెను. దాని నతఁ డనుభవించి సహింపలేకపోయెను. "ఛీ! యిట్టిమనోహర స్థలముల వియోగులు విహరింపరాదు." అని తలంచి యతఁడు మరలి దుర్గమునకుఁ బోవ సిద్ధముగా నుండెను.

అప్పటికిఁ గొంచెము చీఁకట్లు వ్యాపించెను. అయినను పడమటి దిక్కుంకను సాంధ్యరాగమును బూర్తిగా విడువలేదు. అతని కేదో చప్పుడు వినవచ్చెను. అదేమో కనుఁగొనవలెనని వెనుకకుఁ దిరిగి చూడఁగా నతని కొక సుందరీమణి పొడ సూపెను. ఆమె సౌందర్యము వర్ణనాతీతమై యుండెను. ఆమె ప్రాయము పదునెనిమిది వత్సరములు. ఆయువతి పట్టుగా గరా కట్టుకొనెను. సరిగంచుకండువా వలెవాటు వేసికొనెను. పొరవంటి యొకపట్టువస్త్రము ను మేలిముసుఁగిడెను. ఆమె యప్పటికి రాఁగానే యవకుంఠనమును జార్చివైచెను. తదీయవదన మప్పుడే మేఘావరణముఁ బాసిన చంద్రబింబమువలె నుండెను. ఆలలన సుందరముఖమును జూచి యతఁడు విభ్రాంతుఁడయ్యెను. మఱియొకమాఱా సుందరిని దేఱఁబాఱచూచెను. ఆచూపులలో నాయువతి చూపులు మిశ్రీభావము నొందెను. తోడనే యతని హృదయము దడదడ గొట్టుకొనఁ జొచ్చెను. ఆరూప మతనికిఁ బరిచితమైనట్లు లేదు. పరాంగనను సానురాగతతోఁ జూచుటపాపమని యతఁడు తనచూపులను బ్రక్కకు

రులపెను. గాని యవి యతనికి లొంగలేదు. మరలఁ జూడవలె
నని యతఁడావంకకుఁ దిరిగెను. ఆమె సుందరాకారముపైఁ
జూపులు విచ్చలవిడిగాఁ బ్రసరింపఁజొచ్చెను. తోడనే యతనికి
జెప్పనలవికాని మదనవికార ముదయించెను. ధీరోదాత్తుఁ డగు
టచే నావికారమును గొంచెమడంచుకొని యామెఁజూచి
పరాంగన లిట్టిసమయమున బురుషులున్నచోటికి రావచ్చునా?"
అని యతఁడు ప్రశ్నించెను.

'నేను బరాంగననుగాను. అవివాహితను," అని బదులు
వచ్చెను.

'అవుఁగాక నీవెవతెవు? ఇచ్చటికెందులకు వచ్చితివి?'
అని కొంచెము గంభీరుఁడై ప్రతాపుఁ డనెను.

ఆవచనము లామెకుఁ గోపమును గల్గించెను. అందుల
కామె సమాధానము చెప్పక, "ఆహా! లోకముస్థితి యిట్లుం
డునుగదా? లోకమంతయు మాయామయము. అవసరము గడ
చిన పిదపఁ గృతఘ్ను .గువా రీలోకమున నెందఱో కలరు.
పరోపకారశీలు రనియు సు తమగుణవిశాలు లనియు ఖ్యాతి
వడసిన రాజపుత్రులలోఁ గూడఁ గృతఘ్నులుండుట మిక్కిలి
శోచనీయము;" అని పలికి యాస్త్రీ యూరకుండెను.

ప్రతాపున కావచనము లర్థముకాలేదు. ఆమెనుజూచి,
సుందరీ, నాయడిగినదానికి సమాధానమీయక వృథాగా
రాజపుత్రుల నిందింతువేల?" అని యతఁ డడిగెను.

"అది నిందించుట గాదు; వాస్తవకథనము."

"ఆఁ ఏమీ! రాజపుత్రులలోఁ గృతఘ్ను లున్నారా?

"అవును. నిశ్చయముగా."

"నీ వెఱుఁగుదువా?"

"ఎఱుఁగుదును."

"నీవు స్పష్టముగాఁ జూచితివా? ఒరులు చెప్పినవింటివా?"

"నేను స్పష్టముగాఁ జూచితిని."

"ఎక్కడ?"

"ఇక్కడనే."

"ఇక్కడనేయనగా?"

"ఈ ప్రదేశమున! నీసరోవర తీరమున."

"వాఁడెవ్వఁడు?"

"నీవే."

"నేను కృతఘ్నుఁడనా?"

"ముమ్మాటికిని."

"ఆలోచించుకొనుము. మఱచి వేఱొకని నన్నుగా భావించుచున్నావేమో? స్మరించుకొనుము."

"నాకింకను నంత మైమఱపు లేదు. చక్కఁగా స్మరించుకొనియే పల్కుచున్నాను."

"నన్నెఱుఁగుదువా?"

"ఎఱుఁగుదును."

"నాపేరు?"

"ప్రతాపరాయుఁడు."

ఆవీరుఁ డదివిని యాశ్చర్యమగ్నుఁ డయ్యెను. పలుసారు లామెవంకఁ జూచెను. కాని యామె యెవ్వ రైయో గ్రహింపలేకపోయెను. మనస్సు పరిపరి విధములఁ బోవసాగెను. అతని

కదియంతయు నింద్రజాలమువలెఁ జూపట్టెను. అయినను గొంచెము ధైర్యమువహించి, "సుందరీ! నీవాజ్ఞారాచములచే వృథాగా నన్నేందులకు బాధించెదవు? నీపేరెవ్వరు? నీనివాసస్థలమెచ్చట?" అని యతఁ డడిగెను.

"నాపేరు దిలారాము, మానివాసము మధురాపురము" అనిచెప్పి యామె నీలోత్పలమాలికల నీసడించు దనవీక్షణ నతనిపైఁ బఱపెను.

అతఁడు వానికిఁ దాళఁజాలకపోయెను. సంచలించుచున్న మనస్సును దృఢపఱచుకొని, "ఆ ఏమీ! నీవు దిలారామువా? అయ్యో! యువతీ! నిన్నుఁ బోల్పలేక పోయినందులకు క్షమింపుము. ఇదివఱకు నిన్నొక్కపర్యాయము మాత్రమే చూచితిని. ఆయొక్కమాత్రైనను రాత్రి సమయమునఁ జూచితిని. అప్పుడైనను బ్రయాణత్వరచేఁ గన్నులారఁ గాంచలేదు. నిన్ను గుర్తింపలేమి కదియే కారణము. కాని కృతఘ్నతకాదు. సాధువాదినీ! మధురానగరమున, నానిశీథసమయమున ఆగాఢతిమిరములో, ఆ పాడు నూతియొద్ద నాకాకస్మికముగాఁ బ్రత్యక్షమై, ప్రాణదానమొసంగినదిలారామునుగూర్చి కృతజ్ఞతారూపభావము నామనమున నర్కప్రకాశమువలె దేదీప్యమానమై జాగరితమైయుండగా నేనామె నెట్లు మఱవఁ గలను? నీవు చేసిన యుపకారము నిప్పుడే కాదు; ఈజన్మముననే కాదు; వేయిజన్మముల కయినను మఱవనని త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నాను. సుందరీ! నీవు మహమ్మదీయకులజవుకాదా?" అని అతఁ డడిగెను.

"కాను"

"ఆఁ ఏమీ! నీవు హామీదుఖానునాత్మజవు కావా?"

"ఆత్మజను గాను, పెంపుడు కుమారిని,"

"మఱి నీవుపుట్టిన వంశమేమి?"

"క్షత్రియవంశము."

ప్రతాపుఁడదివిని యత్యాశ్చర్యము చెందెను. "యువతీ! నీవు క్షత్రియవంశజవా? నీ సద్గుణాదులను దలంచుకొని యట్లే యనుకొంటిని, హామీదు నిన్నెప్పుడు పెంచుకొనెను?" అని యతఁడు ప్రశ్నించెను.

"రాజకుమారా! నాదురదృష్టవశమున నేనైదేండ్ల ప్రాయపుదాననై యున్నప్పుడు హామీదు చేతఁబడితిని. అప్పటి నుండియు నతఁడు నన్నుఁ బుత్రికనుగాఁ జూచుకొనెను." అని యామె బదులు చెప్పెను.

"సుందరీ! నీవు మధురాపురమును విడిచి వచ్చితివేల?"

"ఆ పురాధికారికిని, అతని మిత్రులకును మహాపరాధము చేసి యందుండఁగలనా? ఉండినను జీవములు నిలుచునా?" అని పలికి దిలారాము తనవృత్తాంతము నంతయును జెప్పి, "ఆర్యా! నేనసహాయనైయున్నాను. నాకుఁ జంపావతి తప్పవేఱె దిక్కు లేదు. నా బ్రదుకంతయు దుఃఖమయముగానున్నది," అని పలుకుచు నామె బోరున నేడ్వఁజొచ్చెను. ఆఁడువారి హృదయము లక్క వంటిది. ఇతరసమయములందు లక్క కఠినమైయుండును. ఏమాత్రపు సెగసోఁకినను మెత్తనయి ద్రవించును. అట్లే స్త్రీ చిత్తము కఠినమయ్యును గష్టము దాఁకిన మాత్రముననే నీరయి కన్నులనుండి నిర్గమించును.

దిలారామ కన్నీరు కాలువలు గట్ట నేడ్చుచుండెను. ప్రతాపుఁ డామె నోదార్చి, "యువతీమణీ! నీవింక విచారింపవలసిన యవసరము లేదు. ఈ ప్రతాపుఁడు నీవు చేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకారము చేయువాఁడు కాని కృతఘ్నుఁ డెంతమాత్రమును గాఁడు, అదిగో, చీఁకట్లు దట్టముగా వ్యాపించెను. చూడు! నీగృహమున కరుగుము. నీవు నీచెలికత్తెతోఁ గూడ వచ్చి మాదుర్గమున నివసించిన నివసింపవచ్చును. రెండుమూఁడు దినములలోఁ బద్మావతి వచ్చును. ఆమె మిమ్మెంతయు గౌరవించును. నీవిప్పటి కరుగుము," అని పలికెను. దిలారాము యతని యనుమతి వడసి వెడలిపోయెను.

ఆయువతి సౌందర్యముం జూచి ప్రతాపుని చిత్తము మాటిమాటికిని గామవివశము కాకపోలేదు. అయినను నతఁడు దాని గప్పిపుచ్చెను. ఆమె వెడలినప్పు డావంకఁ జూచి, "చందనలత యెవరి కనుభవనీయ గాదు? కాని కాలసర్పము దానిఁ బరివేష్టించియున్నది. ఎవఁడు దాని స్వీకరింప సాహసించును?" అని యనుకొని యతఁడు వెడలిపోయెను.

# దిలారామ

## 29-వ యధ్యాయము

— ఛత్రసాలుని జాగరూకత —

శ్లో. "సజ్జనస్య హృదయం నవనీతం
యద్వదంతి కవయ స్తదళీకం
అన్యదేహవిలసత్పరితాపా
త్సజ్జనో ద్రవతి నో నవనీతం."

ఛత్రసాలుఁడు మహాబుద్ధిమంతుఁడు; మహత్తర సంపద్విభాసితుండయ్యు గర్వంబు చెందని యుత్తముఁడు: ధరణీ రాజ్య ధూర్వహుఁడైనను నిద్రాతంద్రాదులకు లొంగని వాఁడు. స్వపరిపాలిత దేశమునఁగల ప్రజలను సుఖముగా న్యాయముగాఁ బాలించుట రాజునకు ముఖ్యధర్మమని యతఁడెఱుంగును. రాజ్యములోని యల్లరులను బందిపోటులను దొంగతనములను జాగరూకతతో వరసి వెంటనే యడఁగింపనిచోఁ బ్రజలు సుఖింపఁ జాలరనియు, సుఖరహితులగు ప్రజలు ప్రభువునందు విరక్తులగుదురనియుఁగూడ నతఁడెఱుఁగును. లింగము గట్టగానే పిడుగు వడిన దన్నట్లు మహమ్మదీయాధి కారము ధిక్కరించి తాను స్వతంత్రుఁడైన వెంటనే యిట్టి దుష్టకార్యములు ప్రబలి ప్రజల భీతులగా నొనర్చినచోఁ దన మనోరథములు చవుటినేలఁబడిన బీజముల వడువున వ్యర్థము లగునని యతఁడు విచారించుచుండును. గావున సామాన్యము లగు

రాజకీయ వ్యవహారములు గూడఁ జక్కఁగ విమర్శించి శ్రద్ధా భక్తులతో నొనర్చుచుండెను; రాజ్యపాలనమునకు మూలము వంటి ప్రజానురాగ మభివర్ధించుకొనెను; ప్రజల కష్టసుఖములఁ దనకష్టసుఖములుగాఁ దలపోయుచుండెను. సామాన్యముగాఁ బ్రజలను గూర్చియుఁ దత్సుఖమునుగూర్చియు నింతపట్టుదలతోఁ బనిచేయు నమ్మహారాజు తన్నుఁ గుమారునిగాఁ బ్రేమించి పండితునిగాను నీతికోవిదునిగాను జేసి సర్వదా తనహితమును గోరుచున్న ప్రాణనాథస్వామి సుఖమును గూర్చి యెంతపట్టు దలవహించునో చెప్పవలయునా? ఆయోగిపుంగవునకు దొంగ లొనర్చినయపకారమును మాటిమాటికిని దలంచికొని యతఁడు ఖిన్నుఁడగుచుండెను; ఆదొంగలు తన శత్రుకోటిలోని వా రనియుఁ, దనకుమిత్రుండైయుండుటచేతనే యోగికట్టి యిక్కట్టు సంప్రాప్తమైనదనియు దానికిఁ దానే మూలమనియు విచారింప సాగెను. ఆసాధు వాయాపదను మఱచి నిశ్చింతముగాఁ దప మొనరించుకొనుచుండెను. తనకు వచ్చిన యాపదను గూర్చి యతనికి విచారమే లేదు. కాని ఛత్రసాలుఁడు మాత్రము మఱవ లేదు. యోగిని సందర్శించునపుడెల్ల వెనుకటియాపద యతని హృదయమునకు శల్యమగుచుండెను. ఆయోగి కపరాధ మొన ర్చిన దురాత్ములఁ బట్టికొని శిక్షింపకున్న నతని విచారశల్య మూడఁ బెఱుకఁబడునట్లు లేదు. వారివృత్తాంతము లరయ నమ్మహారాజు బరాత్పర రామలాలుల నియోగించెను. అంతటితోఁ దృప్తినొందక తన గూఢచారులను గూడఁ బుచ్చెను. కొన్నిదిన ములు పరిశీలించి చారులు తిరిగివచ్చి తమ ప్రయాస వైఫల్య మును దెలిపికొనిరి. కాని యింతవఱకును బరాత్పర రామలా

లులు రాలేదు. ఛత్రసాలుఁ డందుచే విచారించుచు నొక నాఁడు దనచుట్టునున్న పరివారముతో "మహాసాధువును బాధించిన దురాత్ముల జాడలు దీయునంత సామర్థ్యము మన గూఢచారులకు లేకుండుట విచారకరము. పరాత్పర రామలాలులైన నిక్కార్యము సాధింపఁ గల్గినట్లు తోఁపదు. దేశమున ద్రోహకారుల వెదకి పట్టుకొని దండింపనివాని రాచఱికం బేల?" అని విసువుదలతోఁ బలికెను.

"మహారాజా! తమ వచనము సత్యము. ఆదురాత్ములఁ కవశ్యాచరణీయము. పరాత్పరయోగి. మేధాశాలి. రామలాలు వానికెన వచ్చువాఁడే! వారీకార్యమును దప్పక సాధించి తీరుదురు," అని మంత్రి యతనికి ధైర్యము గొలిపెను.

మురారిపం తదివిని తానుగూడఁ దనకుఁ దోఁచినది చెప్పవలెనని నిశ్చయించి, "మహారాజా! ఔరంగజేబు బహుకుటిలుఁడు, మాయోపాయవిశారదుఁడు. వాని యంతఃపుర పరిచారకు లతనిమించినవారు; వారు చక్రవర్తి యనుమతిని యోగులుగాను, గోసాయీలుగాను సన్యాసులుగాను మీఁతి శత్రు దేశములఁ దిరుగుచు నచటి రహస్య వృత్తాంతములను దెలిసికొని చక్రవర్తికిఁ బంపుచుందురు; తెలియకుండ నానా ద్రోహకార్యము లాచరింతురు. నేను మాదేశమునఁ బ్రత్యక్షముగా ననుభవించితిని గాన చెప్పుచున్నాను. మీరు నమ్ముదురో లేదో కాని యాయుద్ధసమయములలో మాదేశము వేషధారులచే నిండిపోయెను. వారిని దేశమునుండి వెడలఁ గొట్టినగాని మారహస్యములు రహస్యములై యుండలేదు; మాకు జయము లభింపలేదు. అకటకటా! ఇచ్చటఁ బ్రాణ

నాథున కొక్కనికే యాపద సంభవించెను గాని యచ్చట నిట్లుగాదు. ఇంచుమించుగాఁ బ్రజలందఱును నానాబాధ లను భవించిరి," అని యుపన్యసించుచుండ మహీపాలుఁ డిట్లనియె.

"నీవన్నది సత్యమే కావచ్చును. వారలు సన్న్యాసులు గానో యోగులుగానో మాఱియుందురు. వారి తత్త్వమరయ కుండ నందఱను బాధించుట సముచితమా? దుర్జనహింసకు దొరకొని సాధుహింపచేసినవార మగుదుము. సాధుహింస మహాపాతకము; సర్వజన ప్రతికూలము. కనుక ముందుగా దుష్టుల జాడలు తీయవలసియున్నది."

"వారి జాడలు వారి ప్రవర్తనముల వలననే తెల్లమగును; వెదకి శ్రమపడవలసిన యవసరము గనఁబడదు."

"ఎట్లు తెల్లమగును?"

"సూక్ష్మబుద్ధితోఁ బరిశీలించినచో."

"నీవు పరిశీలించితివా?"

"ఆఁ."

"చెప్పెదవా?"

"చెప్పిన మీకది పథ్యమగునో కాదో?"

"వాస్తవమైనపు డేల పథ్యముగాదు?"

"ప్రేమానుబంధవశమున."

"ఆసంశయము వలదు చెప్పుము."

"ఆయోగులందు నాకనుమానమున్నది."

ఛత్రపాలుఁడది విని పకపక నవ్వెను. "ఓయీ, ఇదియా నీయనుమానము? ఆ ప్రాణనాథుని వర్తనము నీకుఁ జక్కఁగాఁ దెలియదు. అతఁడొక యవతారపురుషుఁడని

నమ్ముము. అతఁడు మహాతపశ్శాలి. మా దేశమునకును మా రాజ్యమునకును మాకుటుంబమునకును సర్వదా హితము కోరుచున్న నిష్కపటానురాగుఁడు. పెక్కేల? నన్నింతయున్నత పదవికిఁ గొనివచ్చినవాఁ డామహామహుఁడే కదా? కర్కోటకుని వంటి చక్రవర్తితో వైరమూనియు నేను నిరపాయముగా నిదివఱకు జయమందుట యతనిదయారసము వలననే కదా? అతనియందు నీవెప్పుడు నట్టి సందియ మొందకుము,” అని సాధుపుమహిమ నతఁడు వర్ణించెను.

“రాజేంద్రా! ఆమహామహుఁడట్టివాఁడని నేనెఱుఁగుదును. అతనిని ద్రోహియనిచెప్ప నాకు నోరెట్లువచ్చును? అతని శిష్యు లనుమానింపఁ దగినవారు. వారిలోఁ బరాత్పరుఁడు దుష్టుఁడని నమ్ముము,” అని మురారి పలికెను.

“అట్లన వీలులేదు. ఆపరాత్పరుఁడు స్వామికి ముఖ్యశిష్యుఁడు. అనుమానాస్పదులగు వారిని మాస్వామి చేరఁదీయఁడు. అతఁడంత యవివేకిగాఁడు అతఁడును దచ్ఛిష్యులును నాయందును నారాజ్యమందును మిక్కిలి యనురాగము గలవారు. వారిలోఁ బరాత్పరుఁడు నాపాలిటఁ బరాత్పరుఁడే ఆరామలాలు నాకు రామదేవుఁడే. ఆహా! చూడుఁడు. ఆనాఁడు క్రూరుల బారికిఁ జిక్కిన స్వామిని రక్షించి నాకానందము గూర్చినవారు వారేకదా? ఆమహానుభావులలో నొకఁడగు పరాత్పరుని ద్రోహియనుటకు నామనస్సొప్పకున్నది,” అని రాజనెను.

“రాజేంద్రా! మాయావుల యాకార లక్షణము లెట్లుండునో మీ రెఱుఁగరు. క్రూరులబారికిఁ జిక్కిన స్వామిని విడి

పించెనని మీరు మాటిమాటికిఁ బొగడుచున్నారు. ఆపరాత్పరుఁడే ప్రాణనాథుని బంధించికొని పొమ్మని తన వారిని బంచి వారట్లు తీసికొని పోవుచుండఁగాఁ బానెదురుగాఁ బోయి వారిని దఱిమి విడిపించి మీకప్పగించెను. అతఁ డేయభిప్రాయముతో నట్లొనరించెనో మీరు గ్రహింపఁ జాలకున్నారు. అతఁ డాకార్యమొనరించుట మీవిశ్వాసమును సంపాదించుటకే కాని వేఱుకాదు. మహీశా! అతఁ డట్లు చేయనిచో మీరంతగా నతని నమ్ముదురా! ఈదుర్గమున, రాజకీయ రహస్యములకు నిలయమగు నీదుర్గమున, అతనిని విచ్చలవిడిగా సంచరింపనిత్తురా? మీరునమ్మిన నమ్ముఁడు; లేనిచో మానుఁడు. ఆతనివర్తనము మాత్రము జాగ్రత్తతో నరయుఁ"డని యతఁ డనెను.

ఛత్రసాలున కావచనముల వలనఁ గొంచెము సందియ మంకురించెను. కొంచెమాలోచించి "ఆపరాత్పరుఁడు నిక్కపు యోగివలెఁ జూపట్టుఁడు. నిక్కపుయోగియైన మారాజ్యముతో నతఁడు సంబంధము కల్గించుకొనేల? సాధుహృదయుఁ డగుటచే నిర్హేతుకకృపాశ్రయుఁడై నాకుఁ సాయమొనర్పఁ బూనినచో నాఁడు కనఁబడి మంచిమాటలాడి మఱి కానకుండుటకుఁ గారణమేమి?" అని యోజించుకొని, స్వామికిఁ దనసందియమును దెలుపవలెనని నిశ్చయించి, ఛత్రసాలుఁడు పరివారమునకు సెలవిచ్చి యతనిసన్నిధికిఁ బోయి నమస్కరించి యుచితాసనమునఁ గూర్చుండెను. స్వామియుఁ దాఁజదువుచున్న గ్రంథము క్రిందనుంచి, "కుమారా! వింతలేమి?" అని యడిగెను.

"యోగీంద్రా! రాజద్రోహులప్రవృత్తి మింతవఱకును దెలియఁ బడలేదు. చెదపురుగు లింటికప్పునువలె వాండ్రును జాటుచాటులఁ బ్రబలి తెలియకుండగనే నారాజ్యమును గూలఁ ద్రోతురేమోయని భయపడుచున్నాను."

"వలదు; భయపడవలదు. నీవీవిచారమును వహించి యుద్ధసన్నాహవిముఖుఁడవు కాకుము. రాజద్రోహుల నిమిత్తము పరాత్పర రామలాలులు మిగుల శ్రమపడుచున్నారు. స్వల్పకాలములోనే వారు కృతకృత్యు లగుదురు.",

"స్వామీ! పరాత్పరుఁడు విశ్వాసపాత్రుఁ డగునా? ఈనడుమగలిగిన యిడుము కతఁడు," అని పల్కి రాజు యోగివదనమును వీక్షించెను.

స్వామి యతని యభిప్రాయము గ్రహించి "ఏమీ! నేడు క్రొత్తమాటలు వినుచున్నాను. ఇఁకఁ గొన్ని దినములకు నన్ను నగ్లింతువేమో! కుటిలులెవ్వరో నీదయ సంపాదించు కొన లేనిపోనివార్తలు చెప్పుచుందురు. వానిని విందువేని చెడుదువు," అని గంభీరుఁడై పలికెను.

ఛత్రసాలుఁ డతని దైవసమానునిగాఁ జూచుకొనును. ఆసాధువునోట నాపాటి పరుషవచన మిదివఱకెన్నఁడును విన లేదు. దానివలన నతనికి భయముదయించెను. "మురారిపంతీదేశమునకును నిచ్చటి ప్రజలకును క్రొత్తవాఁడు. అందుచే నెవ్వరిప్రవర్తన మెట్లుండునో తెలియక పోవచ్చును," అని యనుకొని స్వామిని జూచి, "మహాత్మా! నాయపరాధమును మన్నింపుఁడు. పరాత్పరుఁడు వాఁడేకాని మఱి కనఁ

బడకపోవుటచే సందేహించి యడిగితిని. మీరు వేఱొకరీతిగాఁ దలంపకుఁడు ?" అని యతఁడు ప్రార్థింపఁ జొచ్చెను.

"ఓయీ! ఆపరాత్పరరామలాలులు రాకపోలేదు. రెండుమూఁడు దినముల కొకపర్యాయము వచ్చి నన్ను దర్శించిపోవుచున్నారు; మిగుల శ్రమపడుచున్నారు; సరియే; దీనికేమి ? శత్రుసైన్యములు వచ్చి యెల్లలలో విడిసెనఁట. తెలియునా ?"

"ఆఁ; తెలిసినది ! కాని వెనుకటివలె యుద్ధము ప్రారంభింపక పోవుటకు కారణమేమైయుండును?"

"వెనుకటి పరాభవములు శత్రువుల హృదయములఁ జలింపఁజేయుచుండును. ఏమాయోపాయముచేతనో కాని ప్రత్యక్షముగా యుద్ధముచేయుతలంపు వారికున్నట్లు తోఁపదు. నీవు జాగరూకుఁడవై యుండుము. నీసేనానాయకులను గఠినముగా శాసింపుము. ఎట్టివారి మాటలనైనను విశ్వసింపకుము. సందియముండిన నాతో నాలోచింపుము." అని యోగి హితముపదేశించెను.

ఛత్రసాలుఁడు దానిని మనమున నిడుకొని యతని యనుమతిని బడసి పోయి సేనాధిపతుల హెచ్చరింతకై యుత్తరములు పంపి జాగరూకుఁడై యుండెను.

# దిలారామ

## ద్వితీయ భాగము

## 1-వ యధ్యాయము

దిలారామ - చంపావతి

శ్లో. "సమ్మోహయంతి మదయంతి విడంబయంతి
నిర్భర్త్సయంతి రమయంతి విషాదయంతి
ఏతాః ప్రవిశ్యసదయం హృదయం నరాణాం
కిం నామవామనయనాన సమాన సమాచరంతి."

ప్రతాపుఁడు మధురాపుర కారాగారమున నున్నపుడు దిలారామ యతనిని దర్శించెను. అతని సుందర రూపమును గనియు తత్సద్గుణములను వినియు మిక్కిలి మోహవివశయై యామె తనయనురాగలతకుఁ బ్రతాపుని దివ్యసుందర రూపము నాశ్రయముగాఁ జేసెను. పెండ్లాడినఁ బ్రతాపునే పెండ్లాడుటకును లేనిచో యావజ్జీవమును బ్రహ్మచారిణియై యుండుటకును నిశ్చయించుకొనెను. ఆమె రహీము ప్రముఖుల రహస్యముల నెప్పటి వప్పుడే తెలిసికొనుచు నానాప్రయాసముల పాలయి చంపావతి సాయము వడసి యామెచేఁ బ్రతాపుని కాలిబంధనముల ఖండింపించి యతనిచే రహీము నూత ద్రోయించెను. శాంతా పద్మావతులనుగూడఁ గారా గృహ

మునుండి తప్పించి యామె తన సౌధమునకుఁ గొనిపోవుట మీ రెఱుఁగుదురు గదా? అచ్చట వారి నొకటి రెండు దినములుంచుకొనవలెనని దిలారాము మొదటఁ దలంచెను కాని యది ప్రమాదకరముగాఁ జూపట్టెను. అందుచే నారాత్రియే శాంతా పద్మావతీ ప్రతాపుల నామె సాగనంపెను. తన యభిప్రాయము తెలుపుటకు నాఁడు యుక్తసమయముగాఁ గనఁబడలేదు. ఆ తెల్లవాఱుజాముననే తానును జంపావతితో బయలుదేఱి బుందేలుఖండమునకుఁ బోయెను.

ప్రతాపరాయుఁడు ఛత్రసాలుని రాజధాని నున్నపుడు దిలారాము చంపావతితోఁ గూడ నచ్చటనే యుండెను గాని ప్రతాపుని సందర్శింపలేదు. తన యభిప్రాయమును వెలిపుచ్చలేదు. ప్రతాపుఁడు పద్మావతీ సహితుఁడై యున్నపుడు పోయి దర్శించినఁ పద్మావతి దన మనోరథమును విఫలము గావించునేమో యని దిలారాము భయము. అనుకూలసమయమునకామె వేచియుండెను. ఇంతటఁ బ్రతాపుఁడు నూతనదుర్గమునకుఁ బోయెను. అప్పుడు చంపావతీ దిలారాములు గూడ నచ్చటికిఁబోయి యాదుర్గమును గలిసియున్న మదనపురమున నివసించియుండిరి. పద్మావతి తల్లినిజూడ నేగినదని తెలిసికొని దిలారాము ప్రతాపునిఁజూడవలెనని రెండుదినము లతఁడువిహారించు పుష్పవనమున కరిగి యా రాకుమారుఁడు రాకుండుటచే విఫల మనోరథయై యింటికి మరలిపోయెను. మూఁడవ నాఁడు ఆమె యతని సందర్శింపఁగల్గెను. తరువాత వృత్తాంతము మా పాఠకులు చదివియున్నారు.

అనురాగము మిక్కిలి బలిష్ఠమైనది. అది యెంతలేని కార్యములనైనఁ జేయించును; ఎట్టి నిర్బంధములనైనను సులభముగాఁ దొలఁగఁ ద్రోయును. నదుల నీదించును. కొండలను దాఁటించును; పరదేశముల నొందించును. పాఠక మహాశయులారా! దిలారామ యనురాగ మెంతలేని కార్యములను చేయించెనో, చేయించునో కనిపెట్టుఁడు. ఒకనాఁడు తనహితురాలగు చంపావతితో నొక్కచోఁ గూర్చుండి;

"చెలీ! నామనోరథము నెఱవేఱునట్లు లేదు. అని దిలారామ నిట్టూర్పు పుచ్చెను."

"ఎట్లు గ్రహించితివి?"

"ఆయనకు నాయం దనురాగ ముదయింపమిచే."

"సుందరీ! వెడఁగుమాటలాడెదవేల? నీ సుందరరూప మెవ్వరి కనురాగ మొదవింపదు?"

"ఇతరుల కొదవించిన నొదవించునేమో కాని యాయన కొదవింపలేదని నా నిశ్చయము."

"అట్లన్న నేనంగీకరింపను. అతఁడు శంకరుఁ డనుకొన్నావా యేమి?"

"చెలీ; ఆయన నిర్వికారతఁజూడ నాకట్లే తోఁచుచున్నది."

"అతఁడు శంకరుఁడైన నీవు పార్వతి వెందులకుఁ గాఁ కూడదు? మొదటఁ గాముని జయించిన యీశ్వరుఁ డేమి చేసెనో తెలియునా? తుదకొకభార్య నర్ధాంగమున నుంచు

కొనెను. మఱియొకతెను. నుత్తమాంగమున నుంచుకొనెను. వెనుకఁ జెప్పిన పురాణగాథలను స్మరించుకొనవలెను."

"ఓసీ! ఎందులకే కనుదుడుపుమాటలు? నా సౌందర్యమునకుఁ గలంగి యాయన నన్నుఁ బ్రేమించువాఁడే యైనచో, నాఁడే యాసరోవరతీరమున, మలయమారుత ప్రసారముగల యాస్థలమున, ఆ విజనప్రదేశమున! భార్యావియోగ పీడితుఁడైన యాకాలముననే నా సుందరరూపముచూచి ప్రేమింపవలసినది. అబ్బబ్బా! యాయన చిత్త మయః పిండముగదా?

"అంతమాత్రమున నిరాశ చేసికొనకుము. అతని చిత్తాయః పిండమునకు నీసౌందర్య లీల లగ్నిజ్వాలలనినానమ్మకము"

"నీవి యసందర్భపు వచనములు. అట్లయినచో నది యేల ద్రవింపలేదు?"

"అమ్మా! అగ్నిశిఖ లొక్కమాటు తాకినంత మాత్రమున నినుపగుండు కరఁగునా? అందులకుఁ గొంతకాలము పట్టును."

ఆది విని దిలారామ యూరకుండెను. చంపావతి యామెనుజూచి, "అమ్మా! రహీం మీదేశమునకు వచ్చెనఁట; తెలియునా?" అని పలికెను.

ఆమె యదరిపడి, "ఆఁ! ఏమీ? రహీమా? ఇచ్చటికి వచ్చెనా? నిశ్చయమా? నాకు నమ్మకములేదు. అగాధమగు నా పాడునూతిలోఁ బడుటెక్కడ; బ్రదికివచ్చుటెక్కడ?" అనెను.

" అట్లనకు ; నాపలుకు సత్యము. రహీముం మాఱు వేషముతో నిన్న మనవీధిని నాకుఁ గనబడినాఁడు. "

" దేశాంతరములకు వచ్చినను నాకు వానిబాధ తప్పదు కాఁబోలును."

" అమ్మా, దుఃఖింపకుము. దేవుఁడేయున్నాఁడు. అప్పటికి తగినయాలోచన వాఁడే తోఁపించును." అని చంపావతి ధైర్యముచెప్పెను.

దిలారాము మఱి మాటాడలేదు. కొండలవంటి యాపదలనైనను దూది పింజలగాఁ జేసి యవలీలఁ దూలింపఁజాలిన చంపావతి బుద్ధి చాతుర్య మామెకుఁ దెలియును.

ఆనాఁటి సాయంసమయమున నొకపురుషుఁడు దిలారాము గృహద్వారమును సమీపించి తలుపుతట్టి పిలిచెను. చంపావతి తలుపుతీసి భయంకరుఁడైన యా పురుషునిఁజూచి కెవ్వున కేకవేసి యేడువ నారంభించెను. ఆ పురుషుఁడు, " ఓ యువతీ ! నన్నుఁ బోల్చితివా ? నేను రహీమును ! మీ పాపఫలము నీకత్తిచే నందించుటకు వచ్చినవాఁడను. వడ్చినను విడువను. " అని తలుపు బంధించెను.

రహీమెట్లు బ్రతికివచ్చెనో వినుఁడు. నూతిలోఁ గూలినవాఁడు దైవవశమున నీటఁబడక నూతి యంచుపట్టుకొని యట్లే నిల్చియుండెను. వాఁడు గానరాకపోవుటచే వానిమిత్రులను మానపడి యా నూతినొద్దకుఁ బోయిరి. రహీమందులో మూలుగుచు జీవచ్ఛవంబువలె నుండుటచూచి వాని వెంటనే దిగి తీసి వానివలన జరిగినదంతయు వినిరి. ప్రతాపుని కాలిబంధనము లెట్లెవ్వరిచేఁ ద్రుంపఁబడినవో వారికి బోధపడలేదు.

వారు కారాగృహాధికారిని శాంతాపద్మావతులఁగూర్చి యడుగఁగా; వాఁడు గుండెబాఁదుకొని యేడ్చుచు చంపావతి చేసిన మాయోపాయములను దెలిపి క్షమింపుఁడని వేఁడుకొనెను. రహీమును, మిత్రులును జక్కఁగా నాలోచించి తుదకుఁ జంపావతీ దిలారామలే యీ మోసమును జేసిపోయిరని నిశ్చయించుకొనిరి. దిలారాము కనఁబడకుండుటచే, నామె ప్రతాపుని మోహించి యతని వెంటఁ జంపావతితోఁగూడ వెల్లి యుండునన్న గట్టి నమ్మకము రహీమునకుఁ గలిగినది. ఎట్లు పొక్కినదోగాని పట్టణములోను నిట్టి ప్రవాదమే ప్రబలెను. ఇంతలో ఢిల్లీనుండి మరలివచ్చిన హుస్సేనీవార్తనువిని నిశ్చేష్టితుఁడయ్యెను. తన సోదరియగు దిలారామ యిట్టి మోసము నాచరించి యెంత క్రొత్తవాని బ్రేమించి యూరు వెడలి పోయెనని విన్నఁపుడు వానికిఁ బొడమిన కోపమునకు మేర లేదు.

చంపావతీ దిలారాములను జంపినఁగాని తన కావిచారము పోవదని వాఁడు నిశ్చయించెను. అందుచేతనే వాఁడు తన స్నేహితుల నందఱను సైనికులగాఁ జేర్చికొని చక్రవర్తి సందర్శనముచేసి యతని యనుమతివడిసి మొగలు సైన్యముతో బుందేలుఖండమునకు వచ్చెను. అచ్చట వారి జాడలు తెలిసికొని రావలయునని హుస్సేను దనసేవకులఁ బంపెను. వారు ప్రతాపుఁ డున్నచోటనే దిలారాము యుండునని నిశ్చయించి మదనపురము చేరి వెదకి సమాచారము యజమానునకు విన్నవించిరి. హుస్సేను సంతసించి రహీమును బిలిచి, "నీకు మహా పకారముచేసిన యీ యువతులను నీవే ఖండించి కసిదీర్చుకొనుట మంచిది. వెనుక దీయకుము. కిక్కురు మనకుండ

నొక్కొక్కవ్రేటుతో నిర్వీరను జంపుము. మా కులమును నిష్కళంకముగాఁ జేయుము. నాకానందముగూర్చు" మని చెప్పెను. రహీము తన కుపకృతి నొనర్చిన వారిచే కనికరింపక దండించు కఠిన హృదయుఁడు, తన కపకారులగు వారియెడల నెట్లు ప్రవర్తించునో చెప్పవలయునా?

రహీము ఖడ్గపాణియై వచ్చుటను జూచినతోడనే చంపావతి చతురుపాయములలో నత్యుత్తమ మగు సామమునఁ దమయాపదను దొలఁగించుకొన నిశ్చయించి యేడుపు మొదలుపెట్టెను. ఆ సుందరి రహీము వచనములువిని, "అన్నా! మా పాపకర్మఫలమును నీ వందింప నక్కఱలేదు. దేవుఁడే యందించియున్నాఁడు. లేనిచో నసహాయలమై, చుట్టములకు దూరమై, దీనురాండ్రమై యీపరదేశమున నిట్లు దుఃఖము లొందుదుమా? నీవు మాయందు దయాళువవై తేని; ఇదిగో నాకంఠము! దీనిని వెంటనే కోసి నన్ను సుఖింపఁజేయుము. పిమ్మట భవద్వియోగానలమునఁ గ్రాగి క్రాగి సగము చచ్చి యున్న నీ ప్రియురాలి కంఠనాళమును దునిమి యామె కష్టములఁ గడతేర్పుము" అని యేడుపు మానకుండెను. వలయు నప్డు డేడ్పు దెచ్చుకొను సామర్థ్య మాడువాండ్రకు మెండు గదా? చంపావతి కన్నులు బాష్పపూరితములై వాని బిందువులతో నిండిన యెఱ్ఱఁదామరలఁ బోలుచుండెను. ఆవచనములు విని యాస్థితి చూడఁగా రహీమునకును గుండె గరఁగఁజొచ్చెను. అయినను గొంచెము గట్టిచేసికొని, "నీ యేడ్పునుచూచి జాలి పడువాఁడను గాను. నాయడిగిన ప్రశ్నముల కుత్తరములిచ్చి

మీా నిర్దోషిత్వమును స్థాపింపుము. మీాయందు నేరము లేనిచో క్షమించెదను;" అని పల్కి వాఁడామెతోఁ నిట్లు సంభాషించెను.

" ఆ నాఁడు ప్రతాపుని కాలిబంధనములఁ గోసినవా రెవ్వరు ?"

వాని హితమును గోరినవారు."

"నా చేసిన రహస్యకృత్యము వారి కెట్లు తెలిసెను ?"

"అది దేవునకే యెఱుక ? నాకుఁ దెలియదు."

"వాని హితులు వచ్చిరని నీ కెట్లు తెలిసెను ?"

"నీవు నూతఁబడినతోడనే వారును బ్రతాపుఁడును గలిసి నిర్దయులయి యా నూతియొద్దనే మా చెలిని బంధించిరి: అందుచేఁ దెలిసికొంటిని."

"ఆమె నెందులకు బంధించిరి ?"

"నీకు సహాయభూతయై వచ్చినందున"

"కారాగృహ బద్ధలగు శాంతాపద్మావతుల నెవ్వరు తప్పించిరి ?"

"ఎవ్వరు తప్పింతురు? వారే."

"నిన్ను బంధించుటకుఁ గారణ మేమి ?"

"కారాగృహమును గాచుచుండుటచే"

"కారాగృహ రక్షకుఁడో ?"

"మనశత్రువులు కొందఱు వచ్చి యీపాడు దేవాలయములో నున్నారని తెలిసినది. దానిఁ దెలియఁజెప్పుటకు నీ చెంతకు వచ్చితిని. నీవప్పుడు కార్యాతురుఁడవయి యున్నావు.

ందుచేఁ గారాగృహాధికారిని బంపి యతనికి బదులుగా నేను
ాచుచుంటిని."

"ఆ కారాగారపతి చంపావతి మోసపుచ్చెనని యేడ్చు
మి?"

"వాఁడట్లూహించుటకుఁ గారణము లేక పోలేదు. వాఁడా దేవాలయమునకుఁ బోయివచ్చునంతలోనే శత్రువులు నన్ను బంధించి యాస్త్రీలను దప్పించుకొనిపోయిరి. వాఁడు పోవునప్పటి కచ్చట శత్రువులు లేకపోవుటచేతను, మగిడి వచ్చునప్పటికి మేము లేకపోవుటచేతను, నే నేదో మోసము చేసితినని వాఁడు తలంచియుండును. నాకును వానికిని మహా స్నేహము. వాని నెందులకు మోసపుత్తును?"

"నీవును దిలారామయు నీయూరికేల వచ్చితిరి?"

"దిలారామను బ్రతాపుఁడే బంధించి తీసికొనివచ్చెను. ఆమెను శత్రువు కొనిపోవుచుండుట జూచి నేను గొట్టుకొనఁగా నాకట్లు వీడిపోయినవి. ఆమె గతి యేమగునో యనుభయమున నేను బ్రతాపాదుల వెంటనంటి వచ్చితిని."

"దిలారామ ప్రతాపులు పరస్పరము ప్రేమించుకొని రఁటే?"

"అదివట్టికల్ల. ప్రతాపుఁడు దిలారామనుఁ బ్రేమించిన మే మీా గృహమున నిట్లు పడియుండనేల? ఆ దుర్గమునందే యుంచుకొని యుండునే?ఇక్కడ నష్టకష్టములను బడుచున్నది, పాకము, ఈ బాధపడలేక మాచెలి సిగ్గువిడిచి వాని నెన్నో విధములఁ బ్రార్థించెను."

"ఏమని?"

"తనబాధ దొలఁగింపుమని."

"వాఁ డంగీకరించెనా?"

"లేదు."

"మఱేమనును?"

"నీవు వారి కప్రియ మొనర్చితివఁట! అందులకుఁ బ్రతిఫలముగాఁ బ్రత్యాపుఁడు నీ కప్రియ మొనర్చునఁట!"

"అదేమి?"

"నీకుఁ బ్రియురాలగు మాచెలిని నీకుఁ జెందకుండఁ జేయుట?"

"మఱేమిచేయును? తాను వరించునా?"

"లేదు లేదు; వేఱొకని దెచ్చి పెండ్లిచేయునఁట?"

"వానికేమి లాభము?"

"నీవు సంతప్తుఁడ వగుటయే."

రహీమది విని మఱి ప్రశ్నింపలేదు. చంపావతి మొదట వేసిన కేకనువిని దిలారాము యచ్చటకి వచ్చి యుండెను. చంపావతీ సంభాషణ చాతుర్య మామెకు ముసిముసి నవ్వు మోమున నంకురింపఁ జేయుచుండెను. చంపావతి రహీమును జూచి, "ఇదిగో, నిశ్చయముగాఁ జెప్పుచున్నాను వినుము. మాచెలివియోగపీడితయై యింతవఱకుదుఃఖార్తయై యుండెను గాని యిప్పుడు నీ సంభాషణము వినుటవలనఁ గొంచెము దుఃఖమువదలి హాసము జేయుచున్నది" అని మరలఁబల్కెను.

రహీం మామె వచనములఁ బరిపరివిధములఁ బరిశీలించి వారి దోషమేమియు లేదని నిశ్చయించెను. తమ యవివేక మును నిందించుకొనెను. వారిని జూచి, "అబలలారా! మేము మోసపోయితిమి. మీరే వారిని దప్పించితిరని నిశ్చయించి నేను మిమ్ముఁ జంపిపోవలెనని వచ్చితిని. దిలారాము ప్రతా పుని వరించినదని విని హుస్సేను మండిపడి యీకార్య మాచ రింప నన్ను నియోగించెను. నేను దొందరపడక పోవుటచే మీ ప్రాణములు దక్కినవి. ఎంతపనిజరుగును?" అని తనలోఁ దాను నొచ్చుకొన నారంభించెను.

చంపావతి వాని పశ్చాత్తాపమును గ్రహించిః "అన్నా దయయుంచి మమ్మిట్లు ఖండింపుము! పరలోకమునకుఁబోయి సుఖించెదము. అంతియకాని యీలోకమునఁ గ్రూరుల బాధ పడఁజాలము" అని పలికెను.

"ఆహా! ఎంతకష్టము? ఎంతకష్టము! ఈ దిలారామ నా ప్రాణము. నీవు తత్తుల్యమవు. నా ప్రాణమును నేనెట్లు దీసికొనఁ గలుగుదును? విసువొంద నవసరములేదు. నాతో రండు. ఇప్పుడే మిమ్ముఁ గొనిపోయెదను. ఎవ్వఁ డడ్డగించి నను నాకత్తిచే ఖండింతును. నాపరాక్రమమును మీరు చూచి సంతసింతురుగాక లెండు, పోవుదము" అని వాఁడు తొందరచేసెను.

చంపావతి యదివిని తన చెలియవైపుచూచి, "అన్నా! నీ పరాక్రమము మే మెఱుఁగమా? నీవు చెప్పవలయునా? మాకింతట రా నున్న యపాయమేమియు లేదు. యుద్ధము

గడచినదాఁక నిచ్చట నుండి శత్రువుల రహస్యములు నీకుఁ జెప్పుచుందుము. నీవప్పటప్పటవచ్చి మాక్షేమ మరసిపోవు చుండుము. ఇది విడిచి మేమెచ్చటికిని బోము.” అని విన్న వించుకొనెను.

రహీమాఁ మాటలు వచనములు యుక్తములని తలపోసెను. దిలారాము యింకను దనయందనురాగము వహించియున్నదని నమ్మెను. కొంతసేపు వారితో సంభాషించి వాఁడు లేచి వారియొద్ద సెలవుగైకొనెను.

చంపావతి వానిఁ జూచి, “అన్నా! మమ్ము మఱవకుమా? అప్పుడప్పుడువచ్చి మాక్షేమ మరయుచుండుమా?” అని మఱిమఱి చెప్పెను. రహీమాఁ మాటలకు సంతసించి “ఎంతమాట! మిమ్మెప్పటికిని మఱవను” అని కదలిపోయెను. దిలారాము యంత వఱకు నిలుపుకొన్న నవ్వంతయు నొక్కపరి వెడలఁబోసెను.

# దిలారామ

## 2-వ యధ్యాయము

### యోగి:—ఒక యువతి

శ్లో. "నూనం హి తేక వివరా విపరీతబోధా
యేనిత్య మాహురబలా ఇతికామినీస్తాః
మాభిర్విలోలతర తారక దృష్టిపాతై
శ్శక్రాదయోపివిజతా స్త్వ బలాః కథంతాః."

కొందఱు స్త్రీలనేత్రము లతిచంచలములు. చూపులతి నిశాతములు, నిరర్గళములు, వారొక్కమాఱు చూపులఁ బ్రసరింపఁజేయుదు రేని యవి నిరాటంకముగాఁ బురుషుల హృదయములఁ జీల్చుకొని లోపలఁ బ్రవేశించును. ప్రవేశించునపుడేమి బాధ నొదవించును? వేఁటకాఁడు మృగయా సాధనములచే మృగముల మోహింపఁజేసి చిక్కించుకొన్నట్లు స్త్రీలుతమ వీక్షణ సాధనములచేఁ బురుషులకు మోహము గల్గించి తమ వశము గావించుకొందురు. ఇందొక విశేషము. మృగయా సాధనము లొక్కొకవేళ నిష్ఫలములైన నగునేమో కాని స్త్రీల వీక్షణ సాధనములు మాత్ర మట్లుకావు. అవి జితేంద్రియులగు యోగీంద్రులనుగూడఁ గలఁగించి పాదాక్రాంతులఁ జేయునన సామాన్యులమాట చెప్పనేల ?

మదనపుర మొక తటాకతీరమున నున్నదని చెప్పితిని. ఆ యూరివారు స్నానపానాదుల కందలి జలము నుపయోగిం-

చుకొందురు. జనులందఱి జలమును సులభముగాఁ దెచ్చుకొను నిమిత్తము గొన్నికొన్నిచోట్ల ఱాతిపలకలతో మెట్లు కట్టఁబడెను. ఆ రేవుల కిరుప్రక్కలను జల్లదనమును నీడను నిచ్చుటకై కొన్ని వృక్షములు వర్ధింపఁబడెను. ఒకనాఁడొక యోగి యా తటాకమున దిగి స్నానమాడి యొడ్డునచేరి, తన కక్షపాలలో నున్న పొడివస్త్రమును గట్టికొని యచ్చట నున్న చెట్టుమూలమున వ్యాఘ్రాజినముమీఁదఁ గూర్చుండి కన్నులుమూసికొని యక్షమాలను ద్రిప్పుచుండెను.

నలుగురు పురుషు లొక్కచోఁ గూడినను నిశ్శబ్దముగా నుండఁగలరు కాని, పదుగురాడు వాం డ్రొక్కచోఁ గూడిన నట్లుండ లేరు. లోక వృత్తాంతములను దెలిసికొనుటకును బరులకుఁ దెలుపుటకును వారికెంతయో కుతూహలము. అందుచే నొరు లడుగకపోయినను బిలిచి వారు తమకుఁ దెలిసినవి చెప్పుదురు, ఒరులకుఁ దెలిసినవి గ్రుచ్చిగ్రుచ్చి యడిగి తెలిసికొందురు. ఇది వారి నైజము. మొదట వారు మెల్లగాఁ బ్రసంగింప నారంభింతురు. ఆ ప్రసంగమున నొక విషయమున నభిప్రాయ భేదములు పుట్టును. దాని నిర్ణయింప వాదింతురు. తుదకుఁ గలహము పెంచుకొందురు; తిట్టుకొందురు. సామాన్యముగానీళ్ల రేవులం దిట్టిస్థితి సంభవించును. మనయోగియున్న రేవునకు స్త్రీలు గుంపులుగుంపులుగా వచ్చి కోలాహలధ్వనులు నలుఁగడలఁ గ్రమ్ముకొనునట్లు సంభాషించుచుండిరి. కొందఱు పోవుచుండిరి. కొందఱు వచ్చుచుండిరి. కొందఱు నీళ్లలో నిలిచి బిందెతో నీరు ముంచుచుఁ బెఱవారితో మాటాడుచుండిరి. వీరి సంభాషణాదులచేఁ దన సమాధికి భంగము గల్గుటఁ గాఁ

బోలు నాయోగి మధ్యమధ్యమునఁ గన్నులువిప్పి యాస్త్రీలను వీక్షింపసాగెను. పూర్వము తనసమాధికి భంగము కల్గించిన మన్మథుని శంకరుఁడు కంటఁజూచి భస్మముచేసెను. అట్లే తన సమాధికి భంగము కల్గించు నాస్త్రీలను భస్మముచేయఁదలంచి కాఁబోలు నా యోగీశ్వరుఁ డట్లు చూచుచుండెను. అతఁ డట్లు కన్నులమూసి తెఱచులోపల నొకయువతీమణి కంటఁబడియెను. ఆమెయంద మతని డెందము నాకర్షించుటచేతనో, లేక యామెయం దతని కధిక కోపముండుటచేతనో, కాని యతఁడు తీసిన తెప్పవేయకుండనే తేఱపాఱ చూచుచుండెను. ఆలోచింప నతని తపంబు ఫలించి యనిమిషత్వంబు సంభవించెఁ గాఁబోలు. ఇంతలో నా యువతియుఁ దన కడకంటిచూపు లతని మోముపై ప్రసరింపఁజేసెను. వారిచూపులు పరస్పర మెదురుసన్నాహమొనర్చెను. ఏకారణముచేతనో యవి మరల వెనుకకు పోయెను. మరల యువతి చూపులు ప్రసరించెను. వాని నిమిత్తము ప్రతీక్షించుచున్న యోగిచూపులుగూడ బయలు వెడలెను. కాని యీమాఱవి యాలలనవాడి చూపుల నెదుర్కొనలేక మరలుటచే యువతీవీక్షణము లతని హృదయమును బగిలించి లోనఁ బ్రవేశించెను. ఇఁక నతనికిఁ దపముపై దృష్టిలేదు. ఎంత మూసికొన్నను గన్నులు మూఁత పడలేదు; ఎంత బలాత్కారము చేసినను మనస్సులొంగలేదు. ఆలలన యచ్చటనుండి కదలిపోవునేమో యన్నవిచారముతప్ప నతనికి నియమభంగమైనదను విచారములేదు. ఒరులు చూచి తనప్రవర్తమునకుఁ గళంకము గల్గింతురన్నభయము పొత్తిగాలేదు. ఏల భయపడును? సంసార సుఖములు తుచ్ఛములని యెంచి సకల సంగములను

బరిత్యజించి జోగులై పుణ్యతీర్థ సేవనముచేసి తమ తపోబలంబున ముక్తికాంతా కటాక్షవీక్షణములకుఁ బాత్రులగు వారు మరల విషయములకులోనై యొక యువతికిఁ జిక్కుదురని యెవ్వరనుకొందురు ? తనతో వచ్చినవారును, దనవెనుక వచ్చిన వారును వెడలి పోయినను నా యువతిమాత్రము కదలి పోక యేదో మిషపన్నుకొని యచ్చటనే యుండెను. కొంత సేపటికి వా రిరువురును దప్ప పరులెవ్వరును లేరు. ఆలలన యతనివంకఁ జూచి యేడ్వఁజొచ్చెను. అది చూచి యాయోగి దయార్ద్ర హృదయుఁడై, "ఓ యువతీ! ఏల యేడ్చెదవు ? నీకు వచ్చిన కష్టమేమి ? చెప్పితివేని నాచేనగు సాయముచేసి కష్టములఁ బాపెదను. యోగి జనులు పరోపకార పారీణులనియు, దీనవత్సలులనియు నీవును వినియే యుందువు" అని పలికెను.

ఆయోగి యట్లభయహస్త మిచ్చుచున్నను నాసుందరి దుఃఖము నుపశమింపఁ జేసికొనవలెననియే ప్రయత్నించెను గాని యది సాధ్యముకాలేదు. మహాప్రవాహమువలెఁ బొంగి పొరలివచ్చుచుండ దాని నిర్బంధింప నెవ్వరు శక్తులు ? కొంత సేపటికా యుద్ధతి తఱిఁగెను. అప్పుఁడామె యోగికి నమస్కరించి, "స్వామీ! మీరు మహానుభావులరు. మీరు యోగ వశమున నెంతటి కార్యములనైన నెఱవేర్పఁగలరు. నే నొక యనాథస్త్రీని. చుట్టములకు దూరమై భర్తృవిహీననై పలు కష్టము లనుభవించుచున్నాను. లోకముపైని, నాదేహముపైని విరక్తిపొడముచున్నది. యోగినినై తిరుగవలెనని యున్నది. నాకీ కష్టములఁ దొలఁగించు మంత్రము నేదేని యుపదేశింతు

లేని సుఖింతును. నన్ను శిష్యురాలినిగాఁ జేసికొనుఁడు. ఇదే నా ప్రార్థనము" అని విన్నవించుకొనెను.

ఆయోగి కవ్వచనము లమృతధారాపాతము లయ్యెను. అట్టి యుత్తమశిష్యురాలు లభించినందులకుఁ గాఁబోలు నతఁడు నిర్భరానందభరితుఁ డయ్యెను. "ఓసుందరీ! నీయెడ మిగుల దయాళుఁడ నైతిని. నీవంటి యనాథలఁ గరుణించుటయే కరుణించుట. నీ కవశ్యము మంత్రోపదేశము చేసెదను. కాని నీవు హిందూసుందరివి కానిచో నే నుపదేశింపనని చెప్పుటకు విచారించుచున్నాను. పర మతస్థుల కుపదేశింపరాదని మా శాస్త్రము ఘోషించుచున్నది. శాస్త్ర విరుద్ధముగాఁ బ్రవర్తింపఁజాలను" అని యతఁడు పలికెను.

"స్వామీ! మీ రట్లు సందియపడ నవసరము లేదు. నేను హిందూస్త్రీని. హేలకై మహమ్మదీయవేషమునూనితిని."

"సత్యమే కదా?"

"ముమ్మాటికి."

"అట్లయిన నా యుపదేశమున కర్హవు. ఈదినము మిక్కిలి మంచిది" అని యోగి యేదో చెప్పఁబోఁగాఁ గొందఱు స్త్రీ లుదకము నిమిత్తము వచ్చుచుండిరి. "నాయందు దమ దయగలదేని యీ సాయంసమయమున నీతటాకపు దక్షిణ తీరమునకు రండు. అప్పుడు వచ్చి మీదర్శనము చేసెదను." అని పల్కి యా యువతి బిందె నెత్తుకొని వెడలి పోయెను. నిర్మలాంతఃకరణులును, విజితేంద్రియులును నగు నట్టి యోగులతో సంభాషించుట కా యువతికి సిగ్గింతేనియు లేదు. కాని

లోకమునకు భయపడవలెను గదా? ఆ యోగి యావః
వంతుఁడు; తానును యువతి సత్యముగా వారెంతసత్ప్రవర్తన
లయినను లోకులుచూచి సందేహింపక మానరు. వారిని నీతి
బాహ్యులగా నెంచకపోరు. వారిచరిత్రములను సకళంకముగా
జేయక విడువరు. కావుననే తన యన్నము దినుచు, దనపుట్టము
కట్టుకొనుచు నున్నను లోకమునకు వెఱవవలెనని పెద్దలం
దురు. అందుచే నా లలన లోకుల కనుమానము గలుగకుండ
వెడలిపోయెను. ఆమె పోయినపిమ్మట నా యోగి నిఁక జపింప
లేదు. కాని యట్టి శిష్యురాలిని విడుచుటకుఁ దపింపఁజొచ్చెను.
వాఁడెట్లో పవలెల్లయుఁ బుచ్చి సాయంకాలమున నా సంకేత
స్థలమును జేరి యచ్చటఁ గూర్చుండి యామెకై నిరీక్షించుచుం
డెను. వాఁడు సందేహింపఁ జొచ్చెను. కాని మఱొక్క
నిమేషమున కా యువతి తప్పక వచ్చి యతనికి నమస్కరించెను.
అతఁడామె భక్తికి మెచ్చుకొని పరమానందభరితుఁ డయ్యెను.
అతఁడు ముందు నడువఁగా నా యువతి యతనిని వెంబడించెను.
ఆ యరణ్యములో వా రొక మనోహరస్థలమున కరిగిరి. ఇఁకఁ
బరులువచ్చి మంత్రోపదేశమునకు భంగముగల్గింతురను భయ
ములేదు. చంద్రుఁడు నభోమండలము నలంకరించి తనయమృత
కిరణములను లోకముపైఁ జల్లుచుండెను. మలయమారుత
ములు ప్రసరించుచుండెను. అతఁ డామెను గొన్ని ప్రశ్నము
లడిగెను. ఆ యువతి వానికిఁ జక్కని సమాధానము లిచ్చెను.
ఆ యువతియు గొన్ని యంశము లడిగెను. అతఁడును బదులు
చెప్పెను. ఆసంభాషణమున వారి యానందము వేలాతీతము
కాఁజొచ్చెను. వారి సంభాషణము విన మా పాఠకులు

కుతూహల పడుచుందురు కాని దానిఁ బూర్తిగాఁ జెప్ప లేము. కొంతవఱకు మాత్రమే తెల్పెదము.

"అది మొదలు నీ వెచ్చట నుంటివి ?"

"మధురా పురమున"

"ఎట్లు జీవనము గడపితివి ?"

"ఒక ధనికులపిల్లకు దాదినై,"

"బ్రదికినపిమ్మట నీ బంధువుల నేల చేరఁబోలేదు ?"

"విధవనై యుత్తమామలకంటఁబడుచు సర్వదా వారిని దుఃఖసాగరమున ముంప నా కిష్టము లేదు. నాకుఁ బుట్టింటివా రెవ్వరును లేరు. ఇఁక నేమి చేయుదును ?"

"మంచి పనిచేసితివి ?"

అటుపిమ్మట మతేమియు వినరాలేదు కాని, కొంత సేపటి కామె యేడువ నారంభించెను. జాలిగుండె గలవాఁడగుటఁ గాఁబోలు నా యోగియు దుఃఖించెను. అతఁడు, "శ్యామలా, శ్యామలా! ఊరకుండుము. గతించినదానికి వగవకుము" అని యోదార్చెను. ... చరిత్రము విన్నప్పు డెవ్వరికి దుఃఖ ముదయింపదు? కొంతవడి కా యోగిసత్తముఁడు మంత్ర ముపదేశించుటకుఁ గాబోలు నామెకుడిచెవియొద్దఁ దన మోము నుంచెను. మంత్రోపదేశమైన వెనుక యోగీంద్రుఁడు లేచెను. ఆ శిష్యురాలిని ... కాతనికి మనస్సొప్ప లేదు. అయినను బెడఁబాసిపోక ... విడిచి పోవునప్పుడు యోగి యామె మొనుజూచి, "సుందరీ! ఇప్పుడు నాతో రారాదా?" అని ప్రశ్నించెను.

"రావలసినదే గాని నన్ను నమ్మినవారిని వంచించి వచ్చుట సముచితముకాదు. కొన్ని పనులున్నవి. వానిని నెఱవేర్చుకొనివచ్చి మిమ్ము సేవించెదను. సంతతమును మిమ్మే దైవముగా భావించుకొందును. నా జన్మము సఫలమగునట్లు మీకుఁ బరిచర్యచేసెదను. ప్రస్తుతమున మీతో రాలేనని చెప్పినందులకు క్షమింపుఁడు. మీరిచ్చట నెంతకాలముందురు?" అని యామె యతని నడిగెను.

"ఇఁక రెండుదినము లుందును."

"అట్లయిన వచ్చి తమ సందర్శనము చేసికొని కృతార్థనగుచుందును?"

"మంచిది. అట్లేచేయుము" అనిపల్కి యోగి వెడలిపోయెను. ఆయువతియుఁ దన యింటికివచ్చెను. ఆ యోగీంద్రుని ప్రభావ మెట్టిదియో కాని యాయువతికి మున్నెన్నడును సంభవింపని యానందము గలిగినది. ఆహా! యోగముల కసాధ్యమగుకార్యము లోకముల నుండదు కదా!

# విలాసము

## ౩౬వ యధ్యాయము

### ప్రమాదము

గీ. "చక్రపరివర్తనమువోలె • జనులకెందు
సౌఖ్యదుఃఖంబు లెడనెడ • సంభవించు
వానిఁ గైకొని యాత్మవిజ్ఞాన మహిమ
బుధులు మోదఖేదంబులు • బొరయ రెందు."

నాఁడు పద్మావతి తల్లిని జూడ రాజధానికిఁ బోయెను. ఈమె పోవునప్పటికి శాంత సుఖముగాఁ గూర్చుండి హితురాంద్రతో సంభాషించుచుండెను. వచ్చిన కూఁతునుజూచి శాంత యానందముతోఁ గౌఁగిలించుకొని కుశలప్రశ్న మడిగెను. ఆమె రోగపీడిత యైనట్లు లేదు. పద్మావతి యాశ్చర్య మగ్నురాలై తల్లినిజూచి,

"అమ్మా! సుఖవంతురాలవై యుండియు నా కట్లు వార్తనెందులకుఁ బంపితివి ?" అని యడిగెను.

"ఎవ్వరు వార్తఁ బంపిరి ? ఏమని పంపిరి ?"

"నీవు దుస్సహరోగార్త వైతివనియు, నన్ను రమ్మనియు మా జనకుఁడు వ్రాసెను."

"అది వట్టికల్ల. నాకు దేహములో జబ్బేమియు లేదు. మీ జనకుఁ డట్లు వ్రాయలేదు."

"మఱెవ్వరు వ్రాయుదురు ?"

"ఎవ్వరో కిట్టని వారు వ్రాసియుందురు. పోనిమ్మిందు వలన మనకు వచ్చిన నష్టము లేదు. ఈ మూలముగానైన నిన్నుఁ జూడఁగల్గితిని" అని సంతోషించి శాంత మరల, "అమ్మాయీ ! నీ సోదరుఁడు శివసింగు బ్రతికియున్నాఁడు. నిన్నుఁజూడ నెంతో కుతూహలుఁడై యున్నాఁడు" అనుచుండఁ బద్మావతి, తల్లితో, "ఏమీ ! మా యన్న బ్రతికియున్నాఁడా ! సత్యమే, సత్యమే? ఇచ్చటికి వచ్చెనా?" అని యాశ్చర్యముతో నడిగెను.

"తనయా! సత్యమే. నీతోఁబరిహాసము లాడుదునా?"

"అమ్మా ! మన మదృష్టవంతురాండ్రము. మావదినె గూడఁ బ్రతికి యున్నదా ?"

"లేదు ; అదేమియు దెలియలేదు. అట్టికోడలు నాకు దక్కు నదృష్టము లేదు" అని శాంత విచారించెను.

"తల్లీ! నేను వచ్చినవేళ మంచిది. నీవు సుఖముగా నున్నావు. ఈ జన్మమధ్యమున వినఁదరము కాని శుభవార్తను వింటిని. నే నిప్పుడే బయలుదేఱి వెళ్లెదను, సెలవిమ్ము."

"ఏమి చిత్రమే ! ఇంటిలో నడుగుపెట్టితివో లేదో యప్పుడే ప్రయాణమా? ఒకటి రెండు పూఁటలుండి వెళ్లుము."

"అట్లు కాదు, నేను వెళ్లకతీరదు. నా ప్రాణనాథునితోఁ దొందరగా వచ్చెదనని నొక్కి చెప్పితిని," అని పద్మావతి యచ్చటి వృత్తాంతమునంతటిని విన్నవించెను.

" మంచిది, అట్లే వెళ్లవచ్చును. నీ సోదరుని జూడకుం డఁగనే వెళ్లెదవా ? "

పద్మావతి యందులకు బదులు చెప్పలేక పోయెను. మృత్యువు నోటిలోఁబడియు సదృష్టవశమున బ్రదికి చిరకాలము బలుబాము లనుభవించి వచ్చిన సోదరునిఁ జూడకుండఁ బోవు టకు నామె మనస్సొప్పలేదు. భర్తృప్రేమచే నొకవేళ నట్లు పోయినచోఁ గఠిన చిత్తురాలనియు, సోదర ప్రేమ విహీనురా లనియు, లోకులు నిందింపక మానరని యామె యెఱుంగును. ఆమె కొంచె మాలోచించి, " అమ్మా ! నా సోదరుఁ డెప్పుడు వచ్చును. ? " అని ప్రశ్నించెను.

" రేపటికి వచ్చు " నని తల్లి బదులుచెప్పెను.

పద్మావతి సోదరునిఁజూచి పోవుట కచ్చట నిలిచి పో యెను. కాని యనుకొన్న ట్లతఁడు రాలేదు. తల్లి నిర్బంధముచే నామె మఱియొకనాఁ డుండెను. శివసింగు నానాఁడును రాలేదు. పద్మావతి మఱియుండఁ దలఁచుకొలేదు. ప్రయాణమైపోవుట కామె సవారీని బోయీలను సిద్ధపఱిచెను. సర్వమును సన్నిద్ధమైనది. ఇంతలో రాణిగారు వార్తనంపిరి. పోకతీరునా ? ఒకమా రామెను సందర్శించి తన యవసరము నెఱిఁగించి రావచ్చునని నిశ్చయించి పద్మావతియంతఃపురమునకుఁ బోయెను. కొంతసే పామెతోఁ బ్రసంగించి పోవుటకు సెలవడిగెను. రాణి యంగీకరింపలేదు. అచ్చట దనకున్న యవసరము పద్మా వతి యేమని చెప్పును ? వా రిరువురును వదినె మఱఁదండ్రగు రుదు. భర్తనువిడిచి యుండలేవా? యనిరాణి పరిహాసముచేసి

బాధించును. అన్ని దినములుండఁ బలియనుమతి లేదని పద్మా వతి విన్నవించుకొనెను. తాను వార్తపంపి యనుజ్ఞావచనము దెప్పించెద నని రాణి బదులుచెప్పెను. ఇఁక బద్మావతి యేమి చేయును ? ప్రతిదినమును బ్రయాణమగు చుండుటచేఁ బ్రతాపునకుఁ డా నుత్తరము వ్రాయుటకూడ లేకపోయెను. రేపో మాపో యనుకొన్న పద్మావతి ప్రయాణ మొక వారమునకుఁ గాని సాగలేదు. ఎట్టకేలకు రాణి, యనుజ్ఞ వడసి యామె యిచ్చిన బహుమానము లంది యింటికివచ్చి, మఱొక మాఱు వచ్చి సోదరునిఁ జూచెదనని తల్లితోఁ జెప్పి యామె నొప్పించి పద్మావతి సవారీలోఁ గూర్చుండెను. అప్పటికి కొంతో ప్రొద్దులేదు. బోయీలు సవారీ నెత్తికొని వీధి గుమ్మము చెంతకువచ్చిరి. ఇంతలో శాంత వడివడివచ్చి సవారీనిసిల్పి పసపు కుంకుమ పుచ్చుకొకుండఁ బుట్టింటినుండి యాఁడు బిడ్డ పోరాదని చెప్పి దాసి తెచ్చినవాని నామెకు నొసంగి జాగ్రత్తతో నుండుమని మఱిమఱి చెప్పెను. బోయీలు మరల పర్విడఁజొచ్చిరి. ఇరువది బారల దూర మేగు నప్పటికి, "నిలువుఁడు నిలువుఁడు నిలువుఁ" డని వెనుకనుండి కేక విన వచ్చెను. బోయీలు విసుఁగుఁగొనుచు నిలిచిరి. ఒకదాసి పర్విడి వచ్చి తల్లి యామెకై చేసిన భక్ష్యముల నిచ్చిపోయెను. ఈయాటంకముల వలన మఱింత ప్రొద్దుపోయెను. రాజధాని కామూతనదుర్గ మైదాలు క్రోసులకంటె నెక్కువ యుండదు. అందుచే రెండుమూడు గడియలరాత్రి కాదుర్గమునకుఁబోగల మను ధైర్యముతో బోయీలు పర్విడుచుండిరి. ఎట్లయిన నేమి? గడియ రాత్రి యగునప్పటికి మదనపురమునకు సమీప

ముగా నున్న యొక యడవిని బ్రవేశించిరి. అందుఁ బదిబారలుఁ దూరము పోఁగాఁ బటపటమని రాళ్లవర్షము గురియసాగెను. బోయీలు ముం దడుగువెట్టలేకపోయిరి. ఫడేల్, ఫడేలుమన్న శబ్దముతో నాఱాళ్లు సవారీమీఁదఁ బడఁజొచ్చెను. అది విని లోపలనున్న పద్మావతి మిక్కిలి భయపడెను. వెంటనే పదఁగురు మనుష్యులు వెనుకనుండి వచ్చి బోయీలను దన్నఁగా వారా సవారీ నచ్చటవిడిచి పాఱిపోయిరి. దొంగలు దాని నెత్తుకొని యడవినిబడి పరువెత్తఁజొచ్చిరి. బోయీలు మఱి వెనుకకుఁ జూడలేదు. ఒక్కపరువున నూతన దుర్గము ప్రవేశించిరి. ప్రతాపరాయుని సందర్శించి పెద్ద యెలుంగుతో సంప్రాప్తమైనయాపదను దెలిపిరి. ప్రతాపు డది విన్నప్పుడు నిశ్చేష్టితుఁ డయ్యె. ఆ వృత్తాంతము పిట్టపిడుగువలె దాఁకినది. అతఁ డచ్చట నేమియు విళంబముచేయక యాయుధములఁదాల్చిబోయీలవెంటఁ బర్వెడెను. అతని మిత్రులు కొందఱాయుధపాణులై యా యడవిలోఁ బ్రవేశించి తామా చోరులను బట్టుకొని బ్రభువు మన్నన పడయవలయుననని యొకరినిమించియొకరు పోఁజొచ్చిరి ఆ యడవులలో నేమార్గ మెచ్చట బాయలై యెక్కడికిఁ బోవునో బుందేలు సైనికులకుఁ జక్కఁగాఁ దెలియును. అందుచే వారు నానామార్గములఁ జెదరిపోయి యరణ్యమును వెదకిరి. వారి కోలాహలధ్వనులు విని యడవి మృగములు భయపడి పాఱఁజొచ్చెను. ఇట్లు నలుదిక్కులందును శత్రుసైనికుల ధ్వనులు వినవచ్చుచుండుటచే నాచోరులెటు వోవుటకును గానడక యా సవారీ నచ్చటఁదింపి మాయమైరి. పద్మావతి యసహాయురాలై వా పోవఁజొచ్చెనుగాని యామె యేడుపా సైనికుల

కలకలధ్వనులలో లీనమైపోయెను. ప్రతాపరాయుఁ డధికమగు శాత్రముతో నల్గడలు పరికించుచు రాఁగా రాఁగా నా సుందరి విలాపము వినఁబడెను. అది విని ప్రియురా లచ్చట నున్నదని యధికానంద భరితుఁడై యతఁ డా వంకకు బర్వెత్తుచుఁ "ప్రాణేశ్వరీ! భయపడకుము. ఇదే నీ వల్లభుఁడు ఖడ్గపాణియై వచ్చుచున్నాఁడని కేక వేసి యొక్క పరువునఁబోయి యామెను సమీపించెను. ఆయిల్లాలు వచ్చిన వల్లభునిగాంచి యుల్లంబున సంతసము పట్టఁజాలక, "నాథా! నా మనోహరా! నా ప్రాణ ప్రియా! వచ్చితిరా! నన్ను రక్షింపవచ్చితిరా!" యని పలుకుచు నెదురుగఁబోయి భర్తను బిగ్గరగాఁ గౌఁగిలించుకొనెను. అతఁడును నయోక్తులచే నామెబెదరును దీర్చి తద్వృత్తాంతము నెల్ల నడిగెను. ఆమె వెళ్లినది మొదలు వచ్చినవఱకును జరిగిన వృత్తాంతమును బూర్ణముగా వినిపించెను. ప్రతాపరాయుఁడు శివసింగు బ్రదికి యున్నాఁడని విని మహానంద భరితుఁడయ్యెను. ఆ యానందము ముందఱ నతని కీయాపద యాపదగాఁ దోఁప లేదు. పద్మావతి కేమియు గాయములు తగులలేదు. వెంటనున్న యాభరణములలో నల్లపూసయైనఁ బోలేదు. ఆచోరు లామె నెత్తుకొని పోవుటకు హేతువేమియో బోధపడలేదు. ఆమె కేదో యపాయము గల్గింపవచ్చిన వారే కాని వారు ధనాశతో వచ్చిన చోరులు కారని ప్రతాపుఁడు నిశ్చయము చేసికొనెను. తానును దనసైనికులును సరభసముగా వచ్చుటచేతనే పద్మావతి సులభముగాఁ దమకు లభించెనని యతఁ డూహించెను. అది సత్యమే. వారట్లు నలుగడల మూఁగివచ్చుటచే శత్రువు

లామె నట డించిబోయిరి; లేనిచోఁ బద్మావతి వారికింక ద్రో
కుట కల్లయే? ఇంతలో సైనికు లొకరినొకరు పిలిచికొనుచు
వచ్చివచ్చి పద్మావతీ ప్రతాపులను గాంచి యధికహర్షమును
బొందిరి. ఇంచుమించుగా దుర్గరక్షక సైనికు లందఱచ్చటికి
వచ్చి యుండిరి. వారినిజూచి, "ఓయీ! నాయనుమతి లేకుండ
మీరంద ఱేల వచ్చితిరి?" అని ప్రతాపుఁడు ప్రశ్నించెను.
తమకు సంభవించిన యాపద వినఁగా నటనుండుటకు మా
మనస్సు లొప్పినవి కావు. ఏమి చేయుదు" మని భటులు పలికిరి.
తాను బిలువక పోయినను నిష్కపట ప్రేమతో వచ్చి సాయ
పడినవారిని బ్రతాపరాయఁ డేమనఁగలఁడు? త్వరగా దుర్గ
మునకు నడువుఁడని యాతఁ డాజ్ఞాపించెను. వారు సత్వరముగా
దుర్గాభిముఖులైరి. ప్రతాపుఁడు పద్మావతితోఁ గూడ సవారిలోఁ
గూర్చుండి బోయీలకు నడువ నాజ్ఞ యొసంగెను. వారు
దాని నెత్తుకొని సంతోష సూచకములగు కేకలిడుచుఁ
బర్వెత్తి నూతన దుర్గమునకు వచ్చుచుండిరి. పద్మావతీ ప్రతా
పులు పరస్పరమును వియోగదినములలో వర్తిల్లిన సంగతు
లను సంతోష పూర్వకముగాఁ జెప్పుకొనుచుండిరి. పద్మావతి,
రాణి చూపిన యవ్యాజప్రేమను వర్ణింపఁగా విని ప్రతాపుఁడు
మిక్కిలి సంతసించెను. ప్రతాపుఁడు చంపావతీ దిలారాములు
మదనపురమునకు వచ్చి తన్ను సందర్శించిరని చెప్పఁగా నా
యువతి పరమానంద భరితురాలై వారు తమ కొనర్చిన యుప
కారమును, వారి సద్గుణములను, వారి యవ్యాజ ప్రేమ
మును గడుంగడు శ్లాఘించి వారిని సగౌరవముగా దుర్గ
మున విడియింపక పోవుట తమ కయుక్తమని భర్తతో నుడి

వెను. ఇట్లు వారిరువురును సంతోషసాగరమున నీదు లాఁ వచ్చుచుండిరి. వారు మదనపురమును సమీపించు నప్పు గొందఱు సైనికులు హాహాకారములు చేయుచు నెదురైరి. అది విని ప్రతాపుఁడు తటాలున సవారీనుండి క్రిందికురికి వారిని జూచి యందులకుఁ గారణ మడిగెను. వారు దుఃఖించుచు మొగల్ సైనికులు వచ్చి మనదుర్గము నాక్రమించుకొనిరని చెప్పిరి ప్రతాపున కావచనములు శూలములవలె గ్రుచ్చుకొనెను. అతఁడు కొంతసేపు మాటాడలేక పోయెను. లోన నున్న పద్మావతి యది విని దుఃఖాతిశయమున మూర్ఛవోయెను. పిమ్మట నతఁడు వానిని జూచి, "మీరా శత్రువులను వారింప లేదా?" అని ప్రశ్నించెను.

"అధిపా? దుర్గమున నున్న సైనికు లందఱు నాయుధములఁదాల్చి తమతో వచ్చిరి. మేము స్వల్ప సంఖ్యాకులము౦టిమి. మిడుతల దండువలె వచ్చి పడుచున్న వైరివీరుల నిలుపఁ జాలక ప్రాణములు దక్కించుకొని వచ్చితిమి. ఇంతలో మన సైనికులువచ్చి చేరిరి. మే మందఱమును గుమిఁగూడి వారిపైఁ బడఁ దలఁచితిమి. కాని కోట బురుజులపైఁ బన్నియుంచిన శతఘ్ను లగ్నివర్షమును గురియుచున్నవి. ప్రాణముల నా యగ్నికి వ్యర్థముగా నర్పింపఁ జాలక మరలితిమి?" అని వారు దీనులై పలికిరి.

ప్రతాపుఁ డది విని తన కాముకత్వమును నిందించుకొనెను; తన ప్రమాదమును దూషించుకొనెను. తన బుద్ధిమాంద్యమును దెగడుకొనెను. నాఁడు తన వివేకమంతయు నష్టమగుట కాశ్చర్యపడెను. తాను దుర్గమునుండి పోవునప్పుడు

వారిని దృఢముగ శాసింపకుండుట తనది పొరపాటని యతఁడు గ్రహించెను. "రాజశాసనము దారుణమైనది. అందులో ఛత్రసాలుని దతి దారుణము. అది యందఱి నొక్కవిధముగాఁ జూచును. నా యపరాధమును బోఁగొట్టుటకు నా ప్రాణము లర్పింపవలసినదే. అచ్చటికిఁబోయి నీచమరణమందుటకంటె శత్రువులతోఁ బోరి వీరమరణమందుట యుత్తమము" అని యతఁడు తన వీరుల నందఱను యుద్ధమునకుఁ బ్రోత్సాహించెను. వారందుల కంగీకరించిరి. ఆ వీరుఁడు పద్మావతినిజూచి,

"సుందరీ! నీవు మీపుట్టింటికిఁ జనుము. నేను వీరితోఁ బోయి శత్రులపైఁ బడెదను. జయించినచో మనమెప్పటి యట్లు కలిసి సుఖింతుము. లేనిచో నీ జన్మమున కిదే నాకడపటి సందర్శనము" అని పలికెను.

పద్మావతి దుఃఖమునుగొంచెమడంచికొని భర్తను గాంచి, మనోవల్లభా! మీరంత సాహసమూని యిప్పుడే యుద్ధమొనర్పఁ బోనెంతురేని మీతో నీసాహసవతిని గూడఁ దీసికొనిపొండు. మిమ్మీపట్ల విడిచి యీమె యెంతమాత్రమును రాజధాని కరుగదు" అని ధైర్యముతోఁ బలికెను.

సైనికు లామె వీరాలాపములు విని యత్యాశ్చర్యము చెందిరి. ప్రతాపుఁ డాలోచింపసాగెను. పద్మావతియుఁ గొంత సేపు యోచించి, "నాథా! నాకుఁ దోఁచినది చెప్పెద నాలింపుఁడు. ఈస్వల్పసైన్యముతోఁ బోరిన మనకు జయ మబ్బుట కష్టము. ప్రాణేశ్వరీప్రాణరక్షణమునకై కోట విడిచితిని కాని యకారణముగాఁ బ్రమత్తులరై విడువలేదు. మహీపాలున కిది

విన్నవించి మఱికొంత సైన్యము నడిగికొని వచ్చి యప్పుడు శత్రునిరసనమును చేయుట సముచితము. ఇప్పుడే సమరము చేసిన మీవంటి మహావీరులు నిష్కారణముగా, నిష్ఫలముగా శత్రువుల శతఘ్నిజ్వాలల పాలగుటతప్ప ప్రయోజనములేదు" అని పలికెను. ఆవిషయము నందఱును గొంత సేపాలోచించి యదే యనుసరణీయమని సిద్ధాంతీకరించిరి.

# దిలారామ

## 4-వ యధ్యాయము

### చంపావతీ—దిలారామలు

శ్లో. "దుర్వృత్త సంగతి రనర్థ పరంపరాయా
హేతుస్సతాంభవతి కిం వచనీయమత్ర
లంకేశ్వరోహరతి దాశరథేః కళత్రం
ప్రాప్నోతి బంధన మసౌకిల సింధురాజః."

చంపావతి సౌందర్యవతియని చెప్పుటకు సందియము లేదు. ఆమె నిండు యౌవనమున విరాజిలుచుండెను. ఈగ్రంథ మును జదివిన వా రామె బుద్ధి చాతుర్యమునకును సమ యజ్ఞతకును, మెచ్చుక పోరు. ఒకనాఁడు నాలుగు గడియల రాత్రివేళ నామెయు దిలారామయు నొకచోఁ గూర్చుండిరి. ప్రసంగ వశంబున దిలారామ యిట్లనియె.

"చంపావతీ! అడుగఁబోయినది నెప్పటికప్పుడే మఱచి పోవుచున్నాను. నీముఖము తొంటియట్లు కాక శరత్కాల పద్మమువలెఁ గాంతి శోభితమై యున్నది. కారణమేమి? అట్టి శుభవార్త యేదైన నున్నచో నీ హితురాలి చెవినివేసి సంత సింపఁజేయఁ దగదా? ఇంతేకాక ప్రతిదినమును సాయంసమయ మునఁ బైకేగుటకుగా యనుమతి కోరుచున్నావు. ఎక్కడి కేగుచున్నావు? చెప్పఁదగినచోఁ జెప్పుము."

నీతోఁ జెప్పఁదగని దేదియుండును ? దానికేమి గాని నీ పరిహాసమునకు సంతసించితిని. అందఱును నీవలెఁ జక్కని వారే యుందురా?"

"చెలీ? నేను బరిహాసము లాడ లేదు. మీఁదు మిక్కిలి నీవే నన్ను దెప్పుచుంటివి ? నిజముగా నీముఖమందు సువాసినీ కళలు దొలఁకాడుచున్నవి. ఏమైనను నీముఖము వెనుకటివలె లేదని నిశ్చయముగాఁ జెప్పఁగలను."

"సుందరీ ! నాముఖమునకు సువాసినీ కళవచ్చినదా?"

"అవును."

"అయినచో నే సువాసినినే"

"అదెట్లు? నీభర్త యమునలోఁబడి మృతి నొందెనని చెప్పితివే? "

" నే నట్లే తలంచితిని. కాని నా యదృష్టవశమున నా వలెనే బ్రదికివచ్చెను."

దిలారామ యానందమును సూచించుచు, "చెలియా ! నేఁడు మిక్కిలి మంచివార్తను విన్నాను. నీభర్త యెచ్చటికి వచ్చెను?"

"అమ్మా! యోగివేషముతో నిచ్చటికే వచ్చెను."

"యోగివేష మేల ధరించెను?"

"ఏదో కార్యమును నెఱవేర్చుకొనుటకఁట! "

"చెలీ! ఆవృత్తాంతము నెల్ల సాంతముగాఁజెప్పుము వినవలెనని మనస్సు వేడుకపడుచున్నది."

"చంపావతి యిట్లు చెప్పెను.

"అమ్మా! మొన్నటిదినము నేను వెనుకటి విధమున నీళ్లకై తటాకమునకుఁ బోతిని. అచ్చట నా ప్రియుఁడు స్నానము చేసి నిత్యకృత్యములు దీర్చుకొన నొకచెట్టు మొదట నాసనాసీనుఁడై యుండెను. అతని యాకారము చూచినతోడనే నాకు సందేహ ముదయించెను. నాపతిని దలంచుకొని యేడ్చితిని. పిమ్మట ధైర్యమువలంబించి యాతని వృత్తము నడుగఁజొచ్చితిని. కాని తత్త్వము బయటఁ బడలేదు. అచ్చటికి స్త్రీలు గుంపులుగుంపులుగా వచ్చుచుండుటచే విశేషముగా మాటాడ నవకాశము లేకపోయెను. ఒక సంకేత మేర్పరిచి యచ్చటికి దయచేయుమని యతనిఁ బ్రార్థించితిని. అతనికి నావలెనే సంశయ ముదయించుటచే సంకేతస్థలమునకుఁ దప్పకవచ్చెను. నేను నచ్చటికిఁ బోయితిని. కొంతసేపు ప్రసంగించితిమి తత్త్వము వెలువడెను. నాకోర్కె లీడేఱెను. నాపుణ్యము పండెను. నాయదృష్టముచే నాపతిని సందర్శింపఁ గల్గితిని" అని తన వృత్తాంతము నెల్ల వినిపించెను.

దిలారామ మిక్కిలి యానందించి, "చెలియా! నీభర్త నిచ్చటికేల కొనివచ్చినావు కావు?" అని యడిగెను.

"అమ్మా! అతఁడు మిక్కిలి కార్యాతురుఁడై యుండెను. ఈపర్యాయము తప్పక తీసుకొనివచ్చెదను."

"మీరు హిందువులలో నేజాతివారు?"

"క్షత్రియులము."

ఆశబ్దము విన్నతోడనే దిలారామహృదయము గళుక్కుమనెను; తాను బరమపవిత్రమగు క్షత్రియవంశమునఁబుట్టియు

క్షత్రియకాంత యనిపించుకొను భాగ్యము లేకపోయెనని మిక్కిలి విచారించెను. చంపావతిని జూచి "చెలియా! నిన్ను క్షత్రియ యువతిగా భావింప లేకపోతిని. నేనెఱుగక యెప్పుడైనను నిన్నుఁ దూలపలికి యుంటినేమో? ఆ నాతప్పు మన్నింపుము. మీ క్షత్రియులు నాకెంతయుఁ బూజనీయులు" అని యామె పలికెను.

"అమ్మా! ఏజాతివారైన నేమి? గుణము ప్రధానము. నిన్నును, నీతల్లినిబోలినవా రేజాతిలోను నుండరని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. సుందరీ! నీవు పిల్లవు; నేను దల్లిని. నీవెప్పుడు నట్టి సంకోచము నొందకుము." అని చంపావతి యనెను.

దిలారాము యాపలుకులను సంతసించి, "నీ పతి లభించినందులకు నేనెంతయు నానందించుచున్నాను. కాని యింకమీఁద నేనసహాయ నగుదునేమో యని విచారించుచున్నాను" అనెను.

"చెలీ! ఆ విచారము విఫలము. నే నుండఁగా నీవసహాయ వెట్లగుదువు? నేనొకవేళ నిన్ను విడువవలసి వచ్చినను నిన్ను నసహాయను జేయకుండఁబోను. ఇది ముమ్మాటికి సత్యము, నమ్ముము."

"చెలియా! ఆకార్య మసాధ్యము."

"ఎందుచేత?"

"ఆవీరునిఁదప్ప వేఱొకని వరింపవలెనని నాకు లేదు. ఆయన నన్ను వరింపఁడు."

"నీవు మరలనురల నాతని సందర్శించితివికదా ? అప్పటి విశేషములేమి? ఆతఁడు గౌరవము చూపుచుండెనా? "

"ఆ! చూపుచుండెను."

"నీసందర్శన మతనికిఁ బ్రీతిజనకముగా నుండెనా ?"

"ఆకార చేష్టాదులవలన నున్నట్లే తోఁచుచున్నది."

"నీవు చేసిన యుపకారమును మఱచెనా?"

"మఱచినట్లు తోఁపదు. దానిని మాటిమాటికి. బొగడుచునే యున్నాఁడు."

"నినుఁ బ్రేమించుచున్నట్లు లేదా?"

"ఉన్నది. కాని యది యుండవలసినట్లు లేదు."

"నీవట్లు సంశయింపకుము. అప్పటప్పటు నీ సుందర రూపమతని కంటఁ బడసితువేని క్రమక్రమ లబ్ధపరిచయమువలన నీకోర్కె తప్పక ఫలించును."

"ఏమో! నాకా నమ్మకము లేదు. నే నిఁక నాయనను జూడఁదలఁచుకోలేను. చూడఁబోయినను నిఁక నీకోర్కెతోఁ బోయి చూడను"

"పోనిమ్ము. నేనెవల్లి నీకార్యము సాధించెదను."

ఇట్లు వారు సంభాషించుసమయమున సూరుఁ గలకల మొదయించెను. వారది విని యదరిపడి బిరాన వీథిలోని కరిగిరి. అచ్చట వారి నడుఁగఁగాఁ బద్మావతికి సంభవించిన యాపదయుఁ బ్రతాపుఁడు పోయి రక్షించుటయుఁ గోట మహామ్మదీయుల పాలగుటయును దెలియవచ్చెను. వారిరువురు నాశ్చర్య

మగ్నులై కొంతసేపు నిశ్చేష్టితులై యుండిరి. పిమ్మట దిలారాము "చెలియా! పాపము. పద్మావతి యదృష్టమును నాయదృష్టము నొక్క రీతిగానే యున్నవి. అనుకూలుఁడగు ప్రియుని జేపట్టి నను నామెకు సుఖములేదు. మహమ్మదీయులవలన బాధ తప్ప లేదు. అయ్యో! అయ్యో! ప్రతాపరాయున కెంత కష్టము వచ్చినది? ఈపరాభయ మిది యెట్లు తప్పించుకొనఁగల్గునో తెలియదు. ఇక నా మనోరథము వ్యర్థమైనదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును" అని పలికెను.

"అమ్మా! ప్రతాపుఁడు లోకమున నుండునో లేదోయను విచారము పొడముచున్నది. ఛత్రసాలుని శాసనము దుర్లంఘము. ఇఁకనాకును ధైర్యములేదు. కాని భగవంతుఁ డంత క్రూరుఁడు కాఁడను నమ్మకమున్నది."

"మన దురదృష్టమేమో కాని యెచ్చటికిఁ బోయినను గష్టములు వెంబడించుచునే యున్నవి. మదనపుర మిప్పుడు మధురా నగరమైనది."

"అదేమి?"

"కాదా, కఠినహృదయులును, దుష్టులునగు రహీము మొదలగువా రిచ్చటనే యుందురుగదా! మాయన్న వాఁడే నను దుర్గాధిపత్యము వహించునుగదా? ఇఁక నేమిలోపము?"

"అతఁడే యధిపతియగునని నమ్ము టెట్లు ?"

"చెలియా! నీకా యనుమానమెందుకు ? రహీము మొదలగువారే ప్రతాపున కాయాపద గల్గించి దుర్గము స్వాధీనము చేసికొనియుందురు. అట్టి మహా సాహసులకుఁ దప్ప

దుర్గాధిపత్యము మఱెవరి కిత్తురు? ఇంతియ కాక మీరాయన్న యుపసేనానాయక పదవిని వహించెనని యెఱుఁగుదువా?"

"అవును. ఎఱుఁగుదును. అందువలన నీకువచ్చిన ప్రమాద మేమి? మీరాయన్న నిన్ననుగ్రహించినట్లు రహీము మొన్నవచ్చి చెప్పిపోయెనుగదా?"

"ఆ దుష్టుఁడనుగ్రహించినందులకే మఱింత విచారించుచున్నాను. ఏమయిన దుష్టసాంగత్యము మనకుఁ దప్పినది కాదు."

"నేనుండ నీకాభయ మెందుకు? ఎందఱు దుష్టులున్నను వారి గర్వమడంచి నీకెట్టి యపాయముఁ బొరయకుండఁ జేసెదను."

దానికి దిలారామ యేమియు బదులు చెప్పలేదు. ప్రభాపురకు సంభవించిన యాపదనుగూర్చి పరిపరివిధములఁ దలంచుకొనుటచే వారి కారాత్రి నిద్రపట్టినదికాదు. సాధు హృదయులు సజ్జనులకు సంప్రాప్తించిన దుఃఖమును జూచి యెట్లు సంహింపఁగలరు? ఎట్లు భుజింపఁగలరు? ఎట్లు నిద్రింపఁగలరు?

# దిలారామ

## 5-వ యధ్యాయము

### ఛత్రసాలుని కోపము

శ్లో. "యదచేతనోఽపి పాదైః
స్పృష్టః ప్రజ్వలతి సవితురినకాంతః
తత్తేజస్వీ పురుషః
పరకృతవికృతిం కథం సహతే."

భర్తృహరి.

మహమ్మదీయులు నూతనదుర్గమును స్వాధీనముగావించుకొనిరన్న వార్త వినవచ్చినప్పుడు రాజధానియంతయు నట్టుడికిన ట్లుడికిపోయెను. రాజధానియే కాదు. బుందేలుఖండమంతయు నని కూడఁ జెప్పవచ్చును. తురకలు ప్రతాపరాయుని వంటి వీరుని జయించిరని వినుటకు జను లాశ్చర్యపడిరి. ఇఁక దేశము మహమ్మదీయుల వాతఁబడుట నిక్కమని భయపడిరి. ఛత్రసాలుని ప్రయత్నమంతయు వ్యర్థమగునేమో యని విచారించిరి. ఇఁక మహమ్మదీయులను గెల్చుట యసాధ్యమని పలుకఁ జొచ్చిరి. తురుష్క సైన్యములు నేఁడో రేపో వచ్చి రాజధానినిగూడ ముట్టడించి సాధించుకొనక పోరని తలంపసాగిరి; ఛత్రసాలుఁ డెంతప్రయత్నించినను దేశమునకు స్వాతంత్ర్యము నిలిచినది కాదని వచింపఁదొడఁగిరి. కొందఱుఁ బ్రతాపుఁ డతి

కాముకుఁడై దేశద్రోహము చేసెనని నిందించిరి; కొందఱు తనప్రేమ కాస్పదురాలైన ధర్మపత్నిని దప్పించుట యావీరు నకు ముఖ్యకార్యమనిరి; కొందఱు దుర్గరక్షణముకంటె ధర్మ పత్నీరక్షణమే యుక్తమనిరి; కొంద ఱొక్క (యువతి నిమిత్తము దేశద్రోహము చేయుట తగదనిరి. ప్రతాపుని కృత్యము కొందఱు న్యాయమనిరి; కొందఱు గాదనిరి. జనులు రెండు కక్షలై తమతమవాదమును నిలుపుకొనుటకై యుక్తులపై యుక్తులు చెప్పుచుండిరి; కంఠములు పగులునట్లు గొంతెత్తి వాదించుచుండిరి. ప్రజలలో నవాంతర యుద్ధములు సంభవించు చుండెను. ఏదేని నొక నూతనాంశము చెవిని బడినప్పుడు ప్రజలు, "మన కెందు?" కని యూరకుండరు. న్యాయాన్యాయ ములఁ బరిశీలింపఁ దొడఁగుదురు. వాదించుకొందురు; సిద్ధాం తము చేయుదురు; ఒకప్పుడు న్యాయాధికారుల విమర్శనములఁ గూడ విమర్శింతురు. వారిచ్చిన తీర్పులనుగూడఁ జర్చించి పై తీర్పుల నిచ్చుచుందురు. ఇది ప్రజల నైసర్గికము.

ఈవార్త క్రమముగా నంతఃపురమునకుఁ బ్రాకెను. ఛత్ర సాలుని కర్ణముల కది శూలమువలెఁ దాఁకెను. అతని హృదయ సముద్రమునఁ గోపరస తరంగము లుద్రేకించెను. మొగ మెఱ్ఱవడియెను; కన్నులు కనకనలాడు చంద్రనిప్పులవలె నుజ్జ్వ లము లయ్యెను. లలాటము భ్రుకుటీ భయంకర మయ్యెను; పెదవు లదరఁ జొచ్చెను. శరీరము కంపింప నారంభించెను. అతఁడు దండతాడితభుజంగమువలె నుగ్రుఁడై మధ్యాహ్న మార్తాం డునివలె దుర్నిరీక్ష్యుఁడై యుండెను. పరిచితులగు వారుగూడ నతని సమీపింప లేకుండిరి. సమీపించినను బలుక వెఱచు

చుండిరి. పెక్కేల! ప్రాణనాథస్వామి కూడ నతనిఁ దరియ వెఱచెనన నతిశయోక్తి కాదు.

ఇదివఱకు ఛత్రసాలుఁడు చక్రవర్తితో నాలుగుసారులు పోరెను. ఆనాల్గింటిలోను దానే జయమందెను. అతని సైనికు లిదివఱ కపజయమన నేమియో యెఱుఁగరు. ఒక మాఱును శత్రువులను హద్దుదాఁటి దేశములోనికి రానీలేదు. ఇట్టుండ వైరులు తనదేశములోనికి వచ్చి యొక దుర్గము నాక్రమించి కొనిరని విన్నప్పుడు ఛత్రసాలుని హృదయ మెట్లుండునో యెవరి కెఱుక? ఎల్లప్పుడును బరాభవము చెందుచున్న వారి కొకవేళఁ బరాభవము సంభవించిన నంతకష్ట మనిపింపదు; తదనుభవము వారి హృదయములకుఁ బరిచిత మగుటచేఁ గొంచెము సహించిన సహింపవచ్చును. కాని యెప్పుడును బరాభవ మెఱుఁగనివాని కేపాటిది సంభవించినను దుస్సహముగానే యుండును. కావునఁ బరాజయశబ్దము వినని యన్నరేంద్రున కది యెంతయో సంతాపము గల్గించెను. మాయోపాయముచే నీదుర్గ మాక్రమించుకొన్నంత మాత్రమున శత్రువులకువచ్చిన గొప్పతనమేమియు లేదు. తనదేశమునకు సంభవించిన యుపద్రవముగూడ లేదు. కాని ప్రతాపుఁడు ప్రమత్తుఁడై కాముకుఁడై యొక్కయువతిఁగావఁ దన యాజ్ఞోల్లంఘనముచేసి కోట శత్రువులను నొప్పించి తన దొరతనము నవమానించినందుకు రాజు సహింపలేకపోయెను. అట్టి రాజద్రోహులను సంహరింపనిచోఁ దన శాసనములు నిరంకుశముగాఁ బ్రవర్తింపవనియు, దానివలనఁ దన ప్రభుత్వశక్తికి లోప మొదవుననియు, దానివలనఁ బ్రజలు నిరంకుశులై స్వేచ్ఛావిహారులై దుష్టకృత్యము

లాచరింతురనియు; నప్పుడు దేశమున ధర్మము నెలకొల్పుట యసాధ్యమనియు నమ్మహారా జెఱుంగును.

ప్రతాపుఁడు తనకు బాంధవుఁడైనను, సహచరుఁడైనను, హితకాంక్షియైనను, దన వీరులలో నగ్రేసరుఁడైనను, దన దేశములోని మహాపురుషులలో నొకఁడైనను, ఛత్రసాలుఁడు మన్నింపఁ దలంచుకోలేదు. అట్టి సమయమునఁ దాదృశవీరుఁ డెదుటఁబడి మాటాడినచో మోమోటమి యుదయింపక మానదని యతనికి దగ్గన మొసఁగలేదు; ప్రతాపుఁ డెన్నియో వార్తలంపుకొనెను. గాని వాని సరకుగొనలేదు. భటులను బిలిచి శాసనపత్రమునిచ్చి ప్రతాపుని దండించిరండని రాజు కఠినముగా శాసించెను. వారు మాఱాడక యతనికి నమస్కరించి పోయిరి.

కొంతసేపటికి మహారాజు కోపము కొంచెము శాంతించెను. ఉద్యోగులును, మంత్రులును, బంధువులును, మెల్ల మెల్లగా నతని సమీపించి యనుమతిపడిసి కూర్చుండిరి. సేవకులువచ్చి యాయాస్థలముల నిలువఁబడిరి. ప్రాణనాథస్వామి కూడవచ్చి యుచిత మర్యాదను బడసి, యాసభయం దున్నతాసనమునఁ గూర్చుండెను. కేశవసింగు మొదలగు బందుగు లొకవంక నుండిరి. మురారిపంతు మొదలగు నుద్యోగులు వేఱొకవంక నుండిరి. కొంతసేపటి కామందిరము ప్రజలచే నిండిపోయెను. ప్రతాపరాయుని నేరమును విమర్శించి యేమి చేయుదురో కనుఁగొనవలెనని వారు వేడుకపడుచుండిరి. అంతియ కాని ఛత్రసాలుఁ డింతకుముందే యతనికి మరణదండనము విధించెనని యెఱుఁగరు. అందఱు నిశ్శబ్దముగానుండిరి. ఏమి

యన్న నేమివచ్చునోయని మాటాడ నెవ్వఁడును సాహసింపఁ లేదు. అందఱును మహారాజుముఖమును వీక్షించుచుండిరి.

అపుడు ఛత్రసాలుఁడు ప్రాణనాథుని జూచి, "నేఁటితో నాయదృష్టదినములు దిరిగిపోయిన ట్లున్నది. లేనిచోఁ బరమాప్తులగు సేనానాయకులు గూడ స్వల్పలాభములను మది నాసించి దేశద్రోహము చేయఁబూనరు? రాజశాసనము నుల్లంఘింపఁ దలంపరు," అని పల్కెను.

"అవును. అది మిక్కిలి విచారకరమే. ప్రతాపరాయఁ డిట్లు ద్రోహముచేయునని తలంపలేదు. అతఁ డంత పిఱికియని యనుకోలేదు. యుద్ధమున మనసైనికు లెందఱు కూలిరి ?"

"లేదు ; యుద్ధమే లేదు. శత్రువులు మాయోపాయమున దుర్గము సాధించుకొనిరి"

"చూచితివా ! నేనన్నమాట సత్యమైనదా ? శత్రువులు మాయోపాయము లుపయోగించుటే కాని యభిముఖులై యుద్ధమొనర్పరు. వారిఁక బుద్ధిబలమునే కాని చతురంగబలమును మనపై నడిపింపరని నేను నాఁడే చెప్పితిని. బహు జాగరూకులై యుండవలయునని నొక్కి వక్కాణించితిని."

"స్వామీ ! సత్యమే. తమరు చెప్పినట్లే చేసితిని. కాని మనవారు మందబుద్ధులై కనుమూసికొని తిరిగిన నే నేమి చేయుదును ?"

"ప్రతాపరాయుని బిలిపించి యడిగిన నేమిచెప్పునో?"

"చెప్పుట కేమున్నది? ప్రాణములు గాచుకొన నేదో చెప్పుకొనును. అతనిఁ బిలువఁ దలఁచుకోలేదు ; అడుగఁ దలఁ

చుకోలేదు. పద్ధతిప్రకార మతనికి మరణదండనము విధించితిని. ఛత్రసాలుఁ జెట్టివారియెడ మహా కఠినహృదయుఁడని తమ రెఱుంగుదురు గదా?" అని రాజు గంభీరుఁడై పలికెను.

ఆవచనములు విన్నప్పుడు స్వామిమోము వెలవెల పోయెను. కేశవసింగు హృదయము విచారపరీత మయ్యెను. ప్రతాపుని హితులందఱును దుఃఖితస్వాంతు లైరి. ప్రజలు నివ్వెఱపడఁ జొచ్చిరి. ప్రతాపరాయుని కట్టి దండనము విధింపఁ బడునని వా రనుకోలేదు. సభ్యు లొకరిమొగమువంక నొకరు చూచుకొనిరి; గుసగుసలాడఁ జొచ్చిరి ఇప్పుడు సభ తరంగిత మగు సాగరము వలెనుఘోషింపసాగెను. వారిని నిశ్శబ్ద ముగా నుంప రాజభటు లెంతో ప్రయత్నించిరి, కాని వారి యత్నము కొనసాగలేదు. అప్పుడు ప్రాణనాథుఁడు లేచి మహా రాజున కభిముఖముగా నిలువఁబడి "మహారాజా!" అని సంబో ధించెను. సభ్యు లొకరినొకరు వారించుకొని నిశ్శబ్దముగా నుండిరి. వారి వీక్షణములన్నియు నా యోగిపుంగవుని ముఖ మున వ్రాలెను; వారి కనుబొమలు లలాటము నాక్రమించెను; వారివీనులు దదేకనిష్ఠతో వినుచుండెను.

"అవును. దేశద్రోహుల కట్టి దండనము విధించుట నాకు సమ్మతమే. కాని యపరాధుల యపరాధ మేమో స్పష్ట ముగాఁ దెలిసికొని దండనము విధించుట ధర్మపద్ధతి. అందుచే నట్లంటిని" అని స్వామి పలికెను.

"స్వామీ! ప్రతాపరాయుని యపరాధము స్పష్ట ముగాఁ గానవచ్చుచుండ నిఁక నతని నడుగవలసిన యవసర

మేమున్నది ? ముంజేతికంకణమున కద్దమేలా ? అతఁడా యువతిని రక్షింపఁ బూనుకొని యిట్టి దేశద్రోహము చేసెను;' అని మహారాజు పలికెను.

మురారిపం తదివిని లేచి ప్రాణనాథుని జూచి, "స్వామీ! మీరు రాజనీతివిశారదులు; లోకానుభవశాలులు. అట్టి మీనోట నిట్టి విరుద్ధవచనములు వెలువడినందులకు విచారించుచున్నాను. ప్రతాపరాయఁడు రాజభక్తిగలవాఁడే కాని యతి కాముకుఁడు. కామాంధుఁడై రాజాజ్ఞను బాటింపక యొక యువతిని, దన ప్రియురాలిని, దన మోహపుటింతిని రక్షింపఁ బోయిన స్వార్థపరుఁడు. అతఁడు నిస్సత్వభావముతో నీ దేశద్రోహ మొనర్చెను. దుర్మార్గులగు మొగలు సైనికులకు మన దేశమునఁ గాలుపెట్ట నవకాశ మీ దేశద్రోహివలనఁ గల్పింపఁబడినది. వారిఁక నూరకుండువారు కారు. వారాదుర్గమును విడిదిగాఁ జేసికొని ముందుగాఁ జుట్టుపట్లనున్న గ్రామములను, పిమ్మట దుర్గములను, దరువాత రాజధానిని స్వాధీనము గావించుకొందురు. ఇది సర్వనాశమునకును మూలమైనట్లున్నది. మా దేశమున మొదట సింహగడదుర్గము మొగలుల కధీనమైనది. దాని సాయమునఁ బనిదుర్గములను వారు సులభముగాఁ బట్టుకొనఁగల్గిరి. మహారాష్ట్రము 'పోయెఁబోయె' నను కింవదంతి వ్యాపించెను. శివాజీ మహాసాహసవంతుఁడు గనుక, నతని సైనికులు యుద్ధములం దాఱితేఱిన మహాబలులు గనుక మరల శత్రువులను బాఱఁదోలి దుర్గములను స్వాధీనము గావించుకొనిరి కాని యితరుల కది సాధ్యమా! ఆకార్యము సాధించునప్పటికి వారికిఁగూడఁ దల ప్రాణము తోఁకకువచ్చెను. శత్రు

వుల కధీనమగు దుర్గమును మరల జయింపవలెనన్న నెంత సైన్యము కావలసియుండును? ఎంతమంది ప్రాణము లెగిరిపోవ లెను? ఎంతమంది రక్తముచేఁ భూతములఁ దృప్తిఁ బొలుపఁ వలెను? ఆలోచింపఁ బ్రతాపుఁడు చేసినది దేశమునకు మహా ...కారి. ఇఁక మొగలులను బలిమిచేఁ దోల నెంత ప్రయాసమో మాలోచింపుఁడు. అప్పటికిని. సాధ్యమో కాదో చెప్పలేము. నూడుండు. గండిపడని యంతసేపును నదీప్రవాహములు గట్టు కు లొంగి వర్తించును. అవకాశ మలవడినచో గట్టునేకాక లోకమునుగూడ నవి స్వరూపనాశము గావించును. అట్లే యవకాశ మీనియంతసేపే మొగలువాహిని మనకు లొంగి వర్తించును: పిమ్మట నెట్టిదగునో యుచ్చరింప నోరాడకున్నది. ఇట్టి మహాద్రోహమునకుఁ గారకుఁడయిన ప్రతాపునకు మరణ దండన మర్హముకాదని నీతికోవిదు లెవ్వరనఁగలరు? అట్టి దేశ ద్రోహముల వెంటనే యడఁగింపనిచో దేశము స్వస్థముగా నుండు టెట్లు? నేఁడు బంధువుఁడని ప్రతాపుని వదలినచోఁ బక్షపాత మనిపింపక మానదు. రాజ్యపాలనాపద్ధతుల కట్టి పక్ష పాతముండుట తగదు. బంధువై, హితుఁడై, సహాయుఁడై వర్తించిన ప్రతాపునిఁ గన్నులారఁ జూచుచు నట్టిశిక్ష విధిం చుట దుర్భరమని తలంచియే యిమ్మహా రాజతనికిఁ దర్శన మొసఁగకుండనే యర్హదండనము విధించెను. ఇఁక నతనిఁ గొని ...చ్చి విమర్శింపవలెనని తమవంటివారు పల్కఁదగినది కాదు అని గంభీరముగా నుపన్యసించెను. అతఁడు ధర్మయుక్తముగా

యుక్తిసమేతముగాఁ, దనమనస్సులో నున్న దున్నట్లు వక్కాణించినందులకు ఛత్రసాలుఁడు మిక్కిలి ప్రీతుఁడయ్యెను. పెక్కుమంది బాగుబాగని శ్లాఘించి ఆదండనము దేశద్రోహి కర్హమే యని సమాధానపడిరి. ఇందుల కేమైనను ప్రాణనాథుఁడు సమాధానము చెప్పునేమోయని సభ్యు లతనివంకఁ జూడసాగిరి. అప్పుడతఁడు రాజుంజూచి, "మహీంద్రా! మురారిపంతు చెప్పినది యుక్తియుక్తము కాదనను. నేను దేశద్రోహికి దండనము విధింపవలదని చెప్పలేను; చెప్పను. నల్వురయెదుట నతని నేరమును స్పష్టపఱచి దండనము విధించినచో జనులింక దొరతనమును నిందింపలేరు. ప్రతాపుఁడు చేసినది న్యాయ్యమని కొంద ఱనుచుండిరి; కాదని కొందఱనుచుండిరి. జనులిట్లు రెండుపక్షములు వహించిరని నాకు స్పష్టముగాఁ దెలియును. ఇందు మొదటిపక్షమువారికిఁ గూడ మనస్సునకుఁ దట్టునట్లు ప్రతాపుని నేరమును విమర్శించి యతనినోటనే యపరాధినని యనిపించినచో జన మప్పుడుదొరతనమును దూషింప నేరరు. అందుచే నతని విమర్శింపవలయునని యంటిని. అట్లు చేయుట ముఖ్యకార్యము. ప్రతాపుని ముఖముచూచిన మోమాట ముదయించునని యెంచి రహస్యముగా దండనము విధించుట తగదు. రాజు సమవర్తియై నిష్పక్షపాతియై వర్తింపవలెను. వ్యవహారము పట్టున మోమోటము గలవాఁడు నిందితుఁడై చెడును. కావున నీవట్టి సంకోచము విడిచి ప్రతాపుని

యపరాధము నతనిచేతనే యొప్పించి దానికిఁ దగిన దండనము విధించుట న్యాయ్యమని నామతము," అని పలికెను.

అదివిని రాజు కొంచె మాలోచించెను. స్వామి యుపదేశమే యుక్తముగా నున్నట్టు తోఁచెను. మురారిపంతు తప్పఁ దక్కిన సభ్యులుగూడ నామతము నంగీకరించిరి. అప్పుడు రాజు ప్రతాపరాయుని సభకుఁ గొనిరా నొకభటునిఁ బంపెను.

# దిలారాము

## 6-వ యధ్యాయము

### ప్రతాపుని ప్రతిజ్ఞ

స్ర. “శేధృష్టా ధార్తరాష్ట్రాః ప్రబలభుజబృహత్తాండవాః పాండవారే
రేనా శ్లైయాస్సకృష్ణాః శృణుత మమవచో యద్వృసీమ్యూర్ధ్వబాహుః
ఏతస్యోత్క్షిప్తబాహో ర్ధ్రుపదనృపసుతా తాపినః పాపినోహం
హంతా హృచ్ఛోణితానాం ప్రభవత యదివస్తత్క్షమేతన్నసాక్షః.”

ప్రతాపరాయుఁడు తా నొనర్చిన యపరాధమును, మహారాజునకుఁ దనయందుండు ననుగ్రహమును బరీక్షించి చూచెను. తనయపరాధముకంటె నతని యనుగ్రహమే కొంచెము బహువుగనున్నట్లతనికిఁ దోఁచెను. దానిచే నతఁడు తన్నుమందలించి క్షమించునేమోయను నాశాలత తదీయహృదయాలవాలమున జనించెను. మహారాజు గౌరవమునకుఁ బాత్రుఁడైన కేశవసింహుఁడు తనకు మామ, ఛత్రసాలునిఁగూడఁ దన యాజ్ఞాబంధనముల బంధించి వర్తింపఁజేయు ప్రాణనాథస్వామికిఁ దానాంతరంగిక శిష్యుఁడు. పురముననున్న మహాపురుషులు పెక్కండ్రు తన్ను మిక్కుటముగ గారవించుచుందురు. వీరందఱును దనప్రాణమును రక్షింపఁ బాటుపడక పోరను నాలోచనము లాశాలతకుఁ దోహదములై నలుదిక్కులఁ బ్రాకింపఁజొచ్చెను. పద్మావతి యూరకుండక రాణిని సమీ–

పించి తనకుఁ బతిభిక్ష పెట్టుమని ప్రార్థించెను. ఆమె జాలిపడి పద్మావతిని గరుణించి భర్తతో జెప్పెదనని నుడివెను. ఎట్టి వాఁడైనఁ బ్రియురాలిమాట నతిక్రమింపలేఁడు గదా! కావున నిందువలనఁ గలిగిన మనోరథ మా లతకుఁ బుష్పసదృశ మయ్యెను. ఇవియన్నియుఁ బద్మావతీ ప్రతాపుల యూహాపోహ లేకాని వాస్తవముగా నెవ్వరును మహారాజునకు విన్నవింప లేదు. వారు చెప్పునపు డూఁకొట్టి విచారించువారే కాని మహారాజుతోఁ బ్రతాపుని యపరాధము మన్నింపవలయునని యొక్కఁడును మనవిచేసిన పాపమునఁ బోలేదు. ప్రతాపుని మరణము దనకుఁ దీరనిదుఃఖమే యైనను కేశవసింహుఁడు తనయల్లుని మన్నింపుమని మహారాజుతోఁ జెప్పఁ దలంచుకో లేదు. అట్లుచెప్పినచో, "కేశవసింగు తనయల్లుని ప్రాణమునే ముఖ్యముగాఁ జూచుకొనెను గాని దేశనష్టమును జూడలేదు" అని లోకులు నోనాడుదురని యతని భయము. రాజనీతి విశారదుఁడైన ప్రాణనాథుఁడు రాజనీతికి విరుద్ధముగా నీవిషయమై మహారాజుతో నెందులకుఁ జెప్పును? తక్కినవారు గూడ ఛత్రసాలు కోపానలకీలలపాలగుటకు నిష్టపడలేదు. రాణియు నతని యుగ్రాకారమును జూచి యుగ్రనరసింహుని లక్ష్మివలె సమీపింపలేకపోయెను. ఆదంపతు లిది యెఱుఁగక కొండంతాశ పెట్టుకొని యుండిరి.

ప్రతాపుఁ డంతతో నూరకుండక తనకు దర్శనమొసంగి తన వృత్తాంతమును సాంతముగా విని యిది ప్రథమాపరాధముగా మన్నింపవలయునని మహీపాలునిఁ బ్రార్థించుచు నొక యుత్తర మంపుకొనెను. దాని కేమి ప్రత్యుత్తరము వచ్చునో

యని యతఁ డింటఁ బ్రతీక్షించియుండెను. అంతట రాజభటు లితనిమందిరమును సమీపించిరి "రాజభటులు వచ్చుచున్నా" రని యెవ్వరో పల్కఁగాఁ బ్రతాపుఁ డాత్రముతో నెదురుగాఁ బోయెను. వా రతనికొక యుత్తరమిచ్చిరి చదువుకొనఁగానే యతనిముఖము వెలవెలపోయెను. పద్మావతి నడివడిగావచ్చి యదేమని యడిగి పుచ్చుకొని దాని నిట్లు చదివెను.

"దేశద్రోహము చేయుటవలన దొరతనముచేఁ బద్ధతి ప్రకారము ప్రతాపరాయునకు మరణదండనము విధింపఁ బడెను," అని చదివి పద్మావతి గాలిదాఁకుడుచేఁ దూలిన లత వలె నేలఁబడి యేడువ నారంభించెను. భటులు ప్రతాపరాయున కెఱ్ఱని వస్త్రములఁ గట్టనిచ్చిరి; ఎఱ్ఱని పువ్వులదండను మెడలో దేసిరి; రక్తచందనము పూసిరి. మృత్యుదేవతను వరింపఁ బోవు పెండ్లికొడుకువలె నతఁడుండెను. ఆవేషము చూచిన తోడనే పద్మావతి గుండెబ్రద్దలుచేసికొని పరుగావచ్చి భర్త పాదముల గౌఁగిలించుకొనెను. ఆమె కేశపాశము వీడ్వడి నేలఁ జీరాడుచుండెను ; తెలిమొగలి రేకువలెఁ దళతళలాడు నామె చెక్కులు దుఃఖాతిశయమున నెఱ్ఱనడిరెను. ముంగురులు చెదరి ముఖమును గప్పెను. కన్నులనుండి బాష్పము జాలువారు చుండెను. ఆసమయమునఁ దద్వదనము శైవాలచ్ఛన్నమై, హిమజలబిందుపూర్ణమై కాంతి దఱిఁగియున్న శోణారవింద మును బోలుచుండెను. ఆయువతి దీనమగు తనవదనమునెత్తి చూపు లతనిమొగముపైఁ బఱపెను. వానియందుఁ దొల్లింటి చులుకుదనము లేదు; ఎంతో ప్రయత్నమునఁగాని యవిపోయిం యతని మొగముపైఁ బ్రసరింపలేదు. దుఃఖ మాపుకోలేక

యాంమె, "హా నాథా! హా ప్రాణప్రియా! నను విడిచి పోవు చున్నావా! మృత్యువును వరింపఁబోవుచున్నావా! అయ్యో దైవమా! మృత్యువును నాకు సవతిగాఁ జేసితివా! అయ్యో! అయ్యో! నాకిఁక దిక్కెది? హా జీవితేశ్వరా! ఆమృత్యువు నకు నీవే కనఁబడితివా? అదృష్టురాలు నిన్నే వరింపవలెనా? హా దైవమా! నీవింత కఠినహృదయుఁడ వేమి? నీ కితఁడేమి యపకారమొనర్చెను? మాసౌఖ్యము నీకుఁ గనుగుట్టైనా! మా సౌందర్యము నీకు మచ్చరమొదవించెనా? మాస్నేహము నీకు వెగటుపుట్టించెనా? ఆహా ఎంతదారుణము! ఎంతకష్టము! అకటా! యీపద్మావతి దురదృష్ట మేమనిచెప్పుదును? ఎప్పుడును గష్టములే. ఎప్పుడును దుఃఖములే; ఛీ! ఛీ! దురదృష్టమా! నాభర్తను మ్రింగినఁగాని నీకుఁ దృప్తిగలుగలేదా? ఇప్పటికిఁ గడుపునిండెనా? పోని మ్మిఁక నీ వీలోకమున స్థిరముగా నుండుము. కటకటా! మనోవల్లభా! నీ వీదురదృష్టవంతురాలి సౌందర్యమున కెందులకుఁ జిక్కితివి? దీని నెందులకుఁ బ్రేమించితివి? ఎందులకు వరించితివి? ఈదుష్టురాలి సంపర్కమున నీ కెన్నఁడును గష్టములేగదా? నాఁడు శత్రువుల కారాగృహమునఁ జిక్కుటకీ పాపాత్మురాలే కారణముగదా? నేఁ డీమరణమునకీ తుచ్ఛురాలే హేతువుగదా?

అయ్యో! మృత్యు వెక్కడనో యున్న దనుకొంటిని? లేదు లేదు; నీపాలిటికి నేనే మృత్యువునైతిని. ఆహా! నా సౌందర్యమున కాశపడి సుఖింప వచ్చితివి; మోసపోతివి. ఈ పాపిని నీప్రాణవాయువుఁ గ్రోలెడి కాలసర్పమని యెఱుఁగక పోతివి. హానాథా! నా కిఁక దిక్కెది? నిన్నువిడిచి నే

నుండఁ జాలను. ఇఁక నేను బ్రదుకఁజాలను. నీతో నన్నుఁ గూడఁ గొనిపొమ్మ"ని యేడ్చియేడ్చి మూర్ఛిల్లెను.

శాంత కుమారిక దుఃఖమును జూచి యామెను గౌఁగిలించుకొని, "అయ్యో కూఁతురా! నీగతి యిట్లు పట్టినదా? వైధవ్య మనుభవింపుమని దైవము నుదుట వ్రాసెనా! ఐదువగా నుండుదువనుకొంటినిగాని యింతలోనే వికృతవౌదువనుకోలేదు. నీపసపు కుంకుమలు పడిపోవునని తలంపలేదు. నవమన్మథునివంటి భర్త దొరకెనని యెంతనో సంతసించితిని. ఆసంతసమంతయు మంటిపాలయ్యెనే కూఁతురా? కడుపునఁ బుట్టిన యాఁడుపిల్లవు నీ వొక్కతెవైనఁ బచ్చగానుండి రాకపోకలు సలుపుచు ముద్దుముచ్చటలఁ దీర్తువనుకొంటిని గాని యిట్లు మూలఁబడి యుండవలసి వచ్చునని యెఱుఁగనే? ఎంతకష్టము! ఎంతకష్టము! ఈదుఃఖసాగరము నెట్లీదఁగలను? ఈ యాపద నెట్లు గడతును? నిన్నుఁ జూచి యెట్లు సహింపఁ గలుగుదును?" అని విలపింప నారంభించెను. తల్లిబిడ్డ లిరువురు నొకరినొకరు పట్టుకొని దుఃఖించుచుండఁగాఁ బ్రతాపుని తల్లివచ్చెను. ఆమె కాలము గడపినది. తదేక పుత్త్రక! ఈ వార్తపిట్టపిడుగువలె నామెను దాఁకెను. ఆమె దుఃఖాతిశయమున మూర్ఛిల్లె. కొంతవడి తెలివితెచ్చుకొని చేతులతో గుండె బాఁదుకొనుచు వడివడివచ్చి కుమారు నాలింగనముచేసికొని, "కొడుకా! కొడుకా! ఓ నాముద్దులకొడుకా! అయ్యో! ఎంతకష్టము సంభవించెనురా! ఓ నాముద్దులన్నా! దైవము కంటికి నీవే పెద్దగా గనిపించితివా? నీ కిట్టి యాపదవచ్చునని తలంపలేదురా కొడుకా? నా నోఁచిననోములన్నియు వ్యర్థము

లగునని యనుకోలేదురా తండ్రీ! ఇంత చిన్నతనములోనే నీకు నూఱేండ్లను నిండునని భావింపలేదురా నాయనా! నీవు వీరుఁడవని కీర్తిచెందుట కెంతో సంతోషించుచుంటినిరా కొడుకా? వీరమాత ననిపించుకొనుట కెంతో మురియుచుంటినిరా తండ్రీ! ఆ నా మురిపమంతయు ముక్కలయ్యె? నీకాయుద్ధ చాతుర్య మబ్బక పోయినను జీవించియుందువేమో కదా? నీవు వీరుఁడవు కాక సామాన్యుఁడవైన నాకడుపు చల్లగా నుందువేమో కదా? కాటికిఁ గాళ్లుచాఁచుకొన్న మమ్ము నీచేతులతోఁ బిడికెడు బుగ్గిచేయుదు వనుకొంటిమిగాని నీగర్భ శోకము గల్గింతు వనుకోలేదురా! హాదైవమా! ఈపుత్ర శోక సాగరము నెట్లు తరింతును? ఎట్లు జీవింతును?" అని యిట్లు విలపింప నారంభించెను. ప్రతాపునితండ్రి మిక్కిలి ముదుసలివాఁడు; ఆతని దుఃఖమున కంతమే లేదు. ఆ ముదుసలుల దుర్దశనుజూచి కంటఁ దడిఁబెట్టనివా రొక్కరును లేరు. ప్రతాపరాయుఁడు ధీరుఁడైనను వారి విలాపవచనములకుఁ గలఁగక పోలేదు. అందులోఁ దనతల్లి యేడ్పు విన్నపుడు దుఃఖభర మోర్వలేక యతఁడు కన్నులనుండి బాష్పబిందువుల రాల్చెను. తల్లి దుఃఖ మొకవంకను, బ్రియురాలి దుఃఖ మొకవంకను నగ్ని జ్వాలలవలె దరికొని తపింపఁజేయుటచేనతని ఱాగుండియ కరఁగి స్రవింపఁజొచ్చెను. పద్మావతి వచనము వినక వెంటనే శత్రువుల నెదుర్కొనఁబోయిన నాకీ నీచమరణము సంభవింపక పోను. వారితోఁ బోరి చచ్చినను నింతకంటె వరమేకదా! యను విచారమే యతని మఱింత దుఃఖితునిగాఁ జేయసాగెను. ఇఁకఁ దానక్కడ నుండుట మరణబాధను మించియుండెను.

అంతకంటెం జావే కొంత సుఖముగా నుండునని తలంచి తన్నుం గొనిపో రాజభటుల నతం డాజ్ఞాపించెను. వారతని వధ్యస్థాన మునకుం గొనిపోవ సిద్ధముగా నుండిరి. ఆసమయమున నొక భటుండు పర్విడివచ్చి రాజాజ్ఞ విన్నవించెను. వారది యేమి కారణమో యని యూహించుచు నతని రాజసభకుం గొని పోయిరి. సభ్యులయెదుటం దన యభిప్రాయముల వెల్లడింప నవకాశము గల్గినందుల కావీరుండు గొంచె మానందము చెందెను. పద్మావతి మొదలగువారుగూడ నది విని యొకవేళ నతని దురదృష్టము తిరుగునేమో యని యాశపడంజొచ్చిరి.

ప్రతాపుం డట్లు పోయి సభామందిరమును బ్రవేశించెను. అతండు మొగమెత్తి నల్వురను జూడలేకపోయెను. కనుఱెప్పలు మీఁది కెగయలేదు. పూర్వమెంతో గౌరవమునందిన సభా మందిరమును నాం డట్లగౌరవముగాం జొచ్చుట యతనికి బహు కష్టముగా నుండెను. భటు లతని రాజునెదుట నిలువంబెట్టిరి. అతండు మహారాజునకును స్వామికిని నమస్కరించినిలువంబడెను.

అతని దుర్దశనుజూచి సభ్యులందఱును విచారాకులు లైరి. ఎంతో కఠినత్వము పూనిన రాజు హృదయముంగూడ గొంచెము చలించెను. లోక సంబంధముతోం బనిలేని ప్రాణ నాథస్వామి మనస్సుంగూడ వికారమొందక పోలేదు. కాని యెవ్వరెంత జాలిపడినను రాజకీయపద్ధతి మాత్రము జాలిపడదు. అది ధర్మప్రకారము వర్తింపక మానదు. ఎవ్వరేమి చేయం గలరు? దాని నెవ్వరు ద్రిప్ప సమర్థులు? వారేమడుగుదురో యతం డందుల కేమి చెప్పునో వినవలెనని సభ్యులందఱును కుతూహలులై యుండిరి, కాని యతం డట్లుచేయలేదు. అతం డా

భారమునంతను బ్రాణనాథస్వామిపై నుంచెను. అప్పుడా యోగి యా వీరవతంసునిఁ జూచి, "ఓయీ! నీవు మత్తుఁడవై రాజశాసనము నుల్లంఘించి దుర్గమును మహమ్మదీయుల పాలుచేసి దేశమునకు ద్రోహ మొనరించితివని దొరతనమువా రభిప్రాయపడుచున్నారు. ఇందులకు నీవేమి చెప్పికొందువు?" అని యడిగెను.

ప్రతాపరాయుఁడు ధైర్యముతో సభ్యులను గలయఁ గనుగొని ప్రాణనాథునిఁ గాంచి, "ఓ స్వామీ! దుర్గరక్షణమున నే నెంతమాత్రమును బ్రమత్తుఁడనై యుండలేదు. నే నెప్పుడును దుర్గమును విడిచిపెట్టి కలయందైనను దలంపలేదు. కాని దైవవశమున నట్లు చేయక తీరినదికాదు. ఆపన్నయువతీరక్షణము నిమిత్త మట్లు చేయవలసివచ్చెను. ఆయువతి సామాన్యురాలా? కాదు. ఆమె రాజకీయపద్ధతివలనే నాకు మాన్యురాలు; నా ప్రాణప్రియ; నాకుఁ బ్రియురాలౌట మాత్రమున రక్షణార్హ గాదు. ఆమె రాజపుత్ర యువతి, పతివ్రత; సద్గుణవతి; రాజకుటుంబమున నుత్పన్నురాలు; రాణివలెనే గౌరవ మందఁదగినది; మహారాజున కొక వేలువిడిచిన చెల్లెలు. అట్టి యువతిని, అసహాయను, మనదేశమునందే, మనరాజధానికి సమీపమునందే, ముష్కరతురుష్కులువచ్చి బలాత్కరించి తీసికొనిపోయి మాన మపహరింప నున్నప్పుడు చూచి యే రాజపుత్రుఁ డూరకుండఁగలఁడు? అభిమానముగల యే రాజపుత్రుఁడు ప్రాణముల కాసించును? ఏ రాజపుత్రుఁ డట్టి సమయమున రాజశాసనమునకుఁ బద్ధుఁడై యుండఁగలఁడు?

ఉత్తమురాంధ్ర గౌరవ ముపేక్షించినఁ బ్రజలేమనుకొందురు ? అందులో మహారాజ సోదరి గౌరవమే యుపేక్షితమైన యిఁక జెప్పెడిదేమి?

అది ప్రభుత్వసంపద కెంతలోపమో రాజనీతిజ్ఞు లెవ రెఱుఁగరు ? నే నుత్తమ రాజపుత్త్రుఁడను. ఉత్తమ రాజపుత్త్రునకు మానరక్షణముకంటెఁ బ్రాణరక్షణము గొప్పది కాదు. ఆయువతి మానము నిమిత్తము నా ప్రాణము లీయ నిశ్చయించితిని. ఎట్లయినను రాజాజ్ఞను మీఱి దుర్గమును విడుచుట నా యపరాధమే. కాని యా దుర్గవిసర్జనము విపన్న స్త్రీరక్షణార్థము చేయఁబడెను; ప్రమత్తతచేఁ జేయఁబడలేదు. మీ రీవిషయమును సూక్ష్మబుద్ధితో నాలోచించి మీయిష్టము వచ్చినట్లు కానిండు. ఎట్లయినను నా కానందమే:" అనిపలికి శత్రువులు పన్నిన మాయోపాయములను దెలిపి యూరకుండెను.

ప్రతాపు డట్లు పలుకుచున్నప్పుడు సభ్యుల శరీరములు రోమాంచకంచుకితము లయ్యెను. ఆవచనములు వారికి యుక్తములుగాఁ జూపట్టెను. పెక్కండ్రు బాగుబాగని శ్లాఘించిరి.

ప్రాణనాథుఁ డదివిని ఛత్రసాలునివంకఁ జూచి యభిప్రాయమిమ్మని యడిగెను. అపుడు రాజతనింగాంచి, "స్వామీ! ఇతఁడొక ఘనకార్య మాచరించెను. ఒక ఘనతరకార్యమును బాడుచేసెను. ఒక యువతి మానముగాపాడ నొక మహాదుర్గము శత్రువుల కర్పించి దేశమునకు మహానష్టము గల్గించెను. అది మన ప్రయత్నమున కెంత యనర్థకారియో యోజింపుఁడు. ఇతఁడొనర్చిన ఘనకార్యము శ్లాఘించెదము. దేశమునకు దెచ్చిన

యనర్థమునకుఁ దగిన దండనము విధించెదము. ఎట్లయిన నితఁడు దండనార్హుఁడని నామతము" అని పలికెను.

అదివిని సభ్యులందఱును వెలవెలపోయిరి. ప్రాణనాథుఁడును విన్నవోయి మఱేమియుఁ జెప్పలేక యూరకుండెను. అపుడు ప్రతాపుడు మహారాజును జూచి, "రాజేంద్రా! దేశమునకు మహానష్టము గల్గించితినని కదా సెలవిచ్చితిరి? నాకుఁ గొంతసైన్య మిప్పింపుఁడు; వెంటనేపోయి శత్రువుల పాఱఁదోలి దుర్గమును స్వాధీనము గావింతును. దయచేసి యందుల కంగీకరింపుడు" అని ప్రార్థించెను.

సభాసదు లది కర్తవ్యమని తలంచిరి రాజును యోజింపసాగెను. మురారిపంతు లేచి రాజున కభిముఖుండై, "దేవా; ప్రతాపరాయుని ప్రార్థనము నెఱవేర్పఁబూనిన దొరతనమునకు మిక్కిలి నష్టము. మొగలులనుండి యాదుర్గమును దీసికొనుట యెట్టివానికైన సులభసాధ్యము కాదు. ఎందఱప్రాణము లనో యర్పింపవలసి యుండును. ఎందఱు మహావీరులో యాదుర్గమునకు బలి గావలసియుండును. దుర్గ మొకవేళ సాధింపఁబడినను సైన్యనష్టము గలుగకమానదు. అపజయమే సంభవించినచోఁ గలిగెడు నష్టమునకు మేరయే లేదు. ఇట్టి సమయమున నొకసైనికుఁడు వేగురసైనికులపెట్టు మహాసంగ్రామ మొకటి రానుండఁ దానిఁ బాటింపక మనకున్న సైన్యము నిట్లు నశింపఁజేయుట భావిఫలమునకు భంగమని నాయభిప్రాయము;" అని పలికి యూరకుండెను.

అపుడు ప్రాణనాథుఁ డాలోచించి రాజును జూచి, "రాజా? ప్రతాపుఁడు దండనాథుఁడే. అందుల కందఱును నంగీకరించుచున్నారు. మీవాదములపై నాకొక యంశము తట్టుచున్నది. మీరును యోజింపుఁడు. ప్రతాపునకొక నెల దినములవధియిత్తము. అతఁడు దొరతనమువారి సాయ మపేక్షింపకుండఁ దానురిపులకొప్పగించిన దుర్గమును సాధించి దేశనష్టమును దీర్పవలయును. నెలదినములలో నతఁ డట్లు చేయలేనిచోఁ బిమ్మట వచ్చి మీరు విధించిన దండన మనుభవించును. ఇది నీకిష్టమా?" అని యడిగెను.

రాజాలోచించెను. దానివలనఁ దనకు నష్టమేమియుఁ జూపట్టలేదు. అతఁడు స్వామినిజూచి, "అది నాకిష్టమే," యని యంగీకారమును సూచించెను.

పిమ్మట యోగి, "ప్రతాపరాయా! ఇందులకు నీ వంగీకరించి కార్యము సాధించుట నామత" మని పలికెను.

ఆవీరుఁడు కొంచె మాలోచించెను. మనమున నేదో తట్టెను. దేహ ముప్పొంగఁజొచ్చెను. లోపలనున్న వీరరస ముద్రేకించెను. స్వామినిజూచి, "యోగీంద్రా! నే నిందుల కంగీకరించుచున్నాను. ఇదే నాప్రతిజ్ఞ వినుఁడు. నెలలోఁగా నేను మహమ్మదీయులను జయించి దుర్గమును సాధించి యిచ్చెదను. ఇందుల కెంతమాత్రమును సందియము లేదు. ఈ నావధ్యవేషమును జూచుచున్నారుగదా! తుచ్ఛ మహమ్మదీయుల యుడుకు నెత్తుటిచే నీవస్త్రములఁ దడిపి మఱింత యరుణితములగాఁ జేయకుండ, వైరుల ప్రేవులమాలిక లీ మెడలోని వధ్యమాలతోఁ

జేర్పకుండ, నరాతుల చిక్కని నెత్తుటితో నా యీ రక్తచందన పుంబూత దట్టము గావింపకుండ, నీ వధ్యవేషమును విడువను. దైవప్రతికూలుఁడనై యట్లుచేయలేని నాఁడీవేషముతోనే వధ్య శిలను సమీపింతును" అని గంభీరుఁడై పలికెను.

అతని వీరాలాపములకు సభ్యు లాశ్చర్య మగ్నులైరి. రాజును మిక్కిలి యచ్చెరువొంది యప్పటికిఁ బ్రతాపుని విడుదలచేసెను.

# దిలారామ

## 7-వ యధ్యాయము

### రహస్యాలోచనము

శ్లో. "సంతోషామృతచిత్తానాం
యత్సుఖం శాంతచేతసాం,
కృతస్త ద్ధనలుబ్ధానాం
ఇతశ్చేతశ్చధానతాం."

మహమ్మదీయశిబిరమున మీర్జానసదరుద్దీను సంతోషసాగరమున దోప్పదోఁగుచుండెను. రామనాథునితో నాలోచించిన పనియంతయు నెఱవేఱెను. ఇదివఱకు నలుపురు సేనానాయకులు సైన్యములతోఁ గూడ వచ్చి పరాజయమంది మరలిపోయిరే, కాని బుందేలుఖండము పొలిమేరనైనను దాఁటినవారు లేదు. ఇతఁడట్లుకాక రక్తపుఁ జుక్కయుఁ జిందకుండఁగనే యానూతనదుర్గమును స్వాధీనము గావించుకొనెను.

ఈవిజయవార్త విన్నప్పుడు చక్రవర్తి పొందిన యానందమునకు హద్దులేదు. అతఁడాసేనానాయకునకును, రామనాథునకును గొన్ని బహుమానములంపుచు, "బలిష్ఠులగు నరాతులను జయించుటకు మాయయే ముఖ్యసాధనమని నమ్ముఁడు" అని సందేశ మంపెను. సేనానాథుఁ డందుల కెంతయును

సంతసించి దుర్గసాధనమున సహాయులగు వారికి బహుమానము లర్పించెను. దానిచే మొగలు సైనికులు మిక్కిలి ప్రోత్సాహవంతులై యుండిరి.

ఇట్లు నూతన దుర్గము స్వాధీనమైనను మొగలు సైన్యములన్నియుఁ బోయి యందుఁ బ్రవేశింపలేదు. ఇంకను బోలి మేరలో రెండువంతుల సైన్యము నివసించియుండెను. అందులకుఁ గారణ మెవ్వరికిని దెలియదు. వా రచ్చట నివసించి యుండుటను జూచి తమ కేనాఁ డేసమయమున మాయాబలముచే నెట్టి యపాయముచేయుదురో యని బుందేలులు మిక్కిలి భయమందఁ జొచ్చిరి.

సదరుద్దీ నొకనాఁటి నిశాసమయమునఁ దన శిబిరమునకుఁ బురోభాగమున నాసనాసీనుఁడై యుండెను. అంతట రామనాథుఁడు సేవకులతోఁ గూడ నచ్చటికివచ్చెను. సదరుద్దీ నదిచూచి లేచి రామనాథు నాలింగనము చేసికొని యుచిత మర్యాదల నొనర్చెను. వారందఱును యథోచితముగాఁ గూర్చుండిరి. అప్పుడు సేనానాయకుఁడు, "రామనాథా ! బలే ! శబాస్ ! నీవంటి బుద్ధిమంతుఁడు లోకములో లేఁడు; వహ్వారే! నీమాయాబలమునకు సంతసించితిని. ఇఁకఁదప్పకుండ ఛత్రసాలుని జయింపఁగలమని ధైర్య ముదయించెను. చక్రవర్తి యీజయవార్త విని సంతసించి మనకు బహుమానము పంపెను" అనిచెప్పి చక్రవర్తిపంపిన బహుమతిని రామనాథున కర్పించెను.

అప్పుడు రామనాథునకుఁ గల్గిన సంతసమునకుఁ మేరయే లేదు. ఆనందాతిశయమున నతని శరీరము సాంద్రముగాఁ

బులకరించెను. అతఁడు సేనాధిపతిని జూచి, "మిత్రమా! చూచి తివా నాబుద్ధిచాతుర్యము ! అదొంగయుత్తర మెంత పనిచేసి నదో యోజింపుము. రహీము బిచ్చగాని వేషముతో నేగ నిచో దుర్గప్రవేశము దుర్లభమే యగును. ఆదుర్గరహస్యములు మనకుఁ దెలియక పోవును మన మీయుపాయము పన్ననిచో నింత సులభముగా మన కీదుర్గము వశముగాక పోవును. రహీము మాయోపులలో నగ్రేసరునివలెఁ జూపట్టుచున్నాఁడు" అని పలికెను.

"రహీమునుగూర్చి చెప్పవలెనా ? వాఁడు మాయాబల మున నిరుపమానుఁడు ;" అని సేనాధీశుఁడు రహీమును నుతించెను.

" రహీ మేఁడీ?"

"వాఁడు పాలుస్సేనుతోఁ గూడ నూతన దుర్గమున నున్నాఁడు. మనముగూడ నీ సైన్యముతో నందు వసింతమా?"

అట్లుకాదు. నేఁ డొక క్రొత్తయుపాయము తట్టుచున్నది. అది ఫలించినచో బుందేలుఖండము మనకు సులభముగా స్వాధీనమగును."

"ఆ యుపాయ మేమి? "

రామనాథుఁడు సేనాధీశ్వరునితో రహస్యముగా నే మెమో చెప్పెను. సదరుద్దీను సంతసించి, "రామనాథా! నీయా లోచనము మిక్కిలిబాగుగానున్నది. ఛత్రసాలుని జీవముతోఁ బట్టనిపోఁగలమా?" అని యడిగెను.

"అనియే నాకమ్మకము."

"అచ్చటి కెందఱు సైనికులు గావలయును?"

"ముప్పది యిరువదు చాలును."

"సరియే. రాజధానికిఁ బోవు నామార్గమును బుందేలులు రక్షింపలేదా ?"

"లేదు, అది వారికేగాని యొరులకుఁ దెలియదని వారి యభిప్రాయము."

"మా కాదారి చూపువా రెవ్వరు?"

"ఇదిగో, ఇతఁడు చూపును" అని రామనాథుఁడు తన సేవకు నొకనిఁ జూపెను.

"రాజధానిపై కరుగ మన కీసైన్యము చాలునా?"

"చాలదు. నూతన దుర్గమునుండి కొంత రప్పింతము."

"అమ్మయ్యో! అది ప్రమాదకరము; చేజిక్కిన యాదుర్గమును వారు వశము గావించుకొందురేమో?"

"ఓయీ! ఆభయము విడువుము. ఒక నెలవఱకును బుందేలు లాదుర్గమును జయింపఁ బ్రయత్నింపరు. దానిఁ బ్రతాపరాయుఁ డొక్కఁడును నెలలోపల జయించి ఛత్రసాలున కర్పించెదనని ప్రతిజ్ఞపట్టెను. ప్రతాపుఁడు మాయాబల ముపయోగింపవలయునే కాని సైన్యము నుపయోగింపలేఁడు. ఎంత వీరుఁడైన నొక్క ప్రతాపుఁ డేమిచేయఁగలఁడు ? కావున మాయావియగు నొక్కని నాదుర్గమున కధిపతినిగాఁ జేసి కొంచెము సైన్యము వాని యధీనము చేయుము. వాఁడు సర్వదా దుర్గద్వారములు బంధించియుండినఁ జాలును. ఉపసేనానాథుని సైన్యముతోఁగూడ నిచ్చటికి రహస్యముగా రప్పింపుము."

"రహీమును దుర్గాధిపునిగాఁ జేయుదమా?"

"అది మంచి యాలోచనమే. అట్లే చేయుము. కాని జాగరూకుఁడయి యుండునట్లు శాసింపుము. పై వారిని లోపలికిఁ గాని లోపలివారిని బైఁటికిగాని పోకుండఁ జేయుమనుము. ఎట్లైయినను రహీము ప్రతాపుని మాయలోఁ జిక్కకుండినఁ జాలును."

"మీరట్లు సంశయపడ నవసరములేదు. ప్రతాపుఁడెక్కడ? రహీమును మాయాబలమున గెల్చుటెక్కడ?"

అట్లయిన సంతోషమే. ఈ రెండుపాయములును ఫలించినచో బుందేలుఖండము మనకుఁ గరతలామలక మని భావింపుము. ఒక వేళ విఫలమయినచో వెనుక మన మనుకొన్నట్లు నూతన దుర్గమును నిలయముగాఁ జేసికొని దండోపాయము నకుఁ గడంగుదము. నేను జెప్పిన స్థలమునకు మున్నూఱుగురు శూరుల నంపుము. నీవు సేనాసమేతుఁడవై యాతని సాయమున రాజధానికి రమ్ము. ఇదిగో నీసేవకుని గుర్తుంచు కొమ్ము. పరుల నెవ్వరిని నమ్మవలదు. సూర్యుఁ డస్తాద్రికిఁ జేరునప్పటికి మీరు రాజధానినిఁ జేరవలయును. నేనిఁకఁ బోయెదను" అని చెప్పి రామనాథుడు లేచెను.

# దిలారాము

## ౮-వ యధ్యాయము


వేఁట

శ్లో. “స్పృహయతి భుజయోరంతర
మాయతకరవాలకరరుహావిదీర్ణం
విజయశ్రీర్వీరాణాం



నూతన దుర్గమును శత్రువులాక్రమించుకొనిరని విన్నప్పటినుండియు ఛత్రసాలునకు సరిగా నిద్రపట్టలేదు. శత్రువుల కాపాటి యవకాశము గల్గించుటయు నిజభావిఫలోదయమునకు నంగకారి యగునని యతఁడు శంకించుచుండెను. ఇఁకనైనఁ దన సేనానాయకుల హెచ్చరించి జాగరూకుఁడై మెలఁగనిచోఁ జిరకాలము నుండి కష్టపడి సంపాదించిన జయలక్ష్మిని దన రాజ్యలక్ష్మితోఁ గూడ మహమ్మదీయుల చేతుల కప్పగింపవలసి యుండునేమోయని యతఁడు భయపడఁ జొచ్చెను. మహాయుద్ధము లొనర్చి ధనప్రాణ వ్యయముల కోర్చి చేసిన ప్రయత్నము ఫలోన్ముఖమై చెడిపోయినచో నెవ్వనికి విచారముదయింపదు? నోటిముందటిపదార్థమును బోఁగొట్టుకొనుట కెవ్వని మానసము చింతింపదు? ప్రతాపరాయుఁడు ప్రతిజ్ఞ చేసిపోయి యించుమించుగా నిరువదిదినములు గడచినవి. దుర్గ

మును సాధించుయత్న మతఁడేమియుఁ జేసినట్లు కానరాదు. ఒకవేళ జాటుచాటునఁ జేసినను నతఁడాకార్యమును సాధించు నను నమ్మకము రాజునకు లేదు. రాజునకే కాదు; ఎవ్వరికిని గూడ లేదని చెప్పవచ్చును. మహాసైన్యముచే రక్షింపఁబడు నాదుర్గము నొంటిగాఁడైన ప్రతాపుఁ డెట్లు సాధింపఁగలఁడు? మఱికొందఱు మిత్రులను దోడుదీసికొని పోయినను శత్రువుల శతఘ్నికాగ్నిజ్వాలల పాలఁబడి మాఁడకుండఁ గోటగోడను సమీపించుటెట్లు? సమీపించినను గోడకెగఁబ్రాఁకి లోనికిఁ బోవుటెట్లు? ప్రతాపరాయున కొకనెల గడువిచ్చుట తెలిసి మాలిన పనియని రాజు తలపోయఁజొచ్చెను. అసాధ్యకార్య భార మతనిపై మోఁపి యతఁ డొనర్పఁగలఁడని నిశ్చయించి శత్రువుల నన్నిదినములు దనదేశమునందు నిరపాయముగా నుంచుట మహానర్థకారి కాదా? వెనువెంటనే తనసైన్యముల వైరులపైఁ బంపిన నవి యీపాటికి దుర్గమును సాధించిన సాధించియుండును. అందులకై తాను ప్రయత్న మొనర్పమి కిప్పుడు ఛత్రసాలుఁడు విచారింపసాగెను. మఱియు శత్రు సైన్యములన్నియు దుర్గమును బ్రవేశింపమికిఁ గారణము తెలియ లేదు. అవి యట్లు ప్రత్యేకముగా నుండుటచే నే మాయోపాయముచే నేమియనర్థము కలిగించునో యని రాజును బ్రజలును బెదరుచుండిరి.

ఈసంతత చింతచేతను రాజకీయ వ్యవహారములచేతను, ఛత్రసాలునకు దేహపరిశ్రమచేయ నవకాశము చిక్కలేదు. ఒడలు మందముగానుండెను. తన్మాంద్యమును దొలఁగించుకొన మృగయావిహార మొకటి ముఖ్యసాధనము. శరీరమాంద్యము.

తోలఁగించుకొనుటకును, లక్ష్యభేదన మభ్యసించు కొనుటకును వేఁట దగినదని ఛత్రసాలునియభిప్రాయము. అయినను వేఁట యందే జీవితమెల్లఁ గడపుచు రాజ్యమును, ప్రజలను దన్నును మఱచి చెడిపోయెడి వ్యసనిమాత్ర మతఁడు కాఁడు.

మనస్సునకు సంతుష్టిగలుగు నట్లొకపరి మృగయావిహారము సల్పవలెనని మహారాష్ట్రవీరుఁడును మహారాజును మాటిమాటికినిఁ బ్రోత్సహించుచుండెను. తనమిత్రుని సంతోషమును దన సంతోషమును దిర్పదలంచి యొకనాఁ డరుణోదయ కాలమున మహారాజశ్వారూఢుఁడై కొందఱు మిత్రులు తన్ను వెంబడింప నొక మహారణ్యము ప్రవేశించెను. ఆసమయమున నాయడవి చూచుటకు మిక్కిలి యింపుగా నుండెను. పక్షులు కిలకిలమని మధురరుతములు చేయుచు గూండ్లనుండి వెడలి నానాముఖముల నెగసిపోవుచుండెను. పుష్పము లందలిగంధమును స్వీకరించి మలయమారుతములు ప్రసరించుచుండెను. రాత్రిసమయమున నాకులందుఁబడిన మంచుబిందువులు క్రమక్రమముగాఁ దదగ్రములకుఁ జేరి ముత్యాలజాలరుల ననుకరించుచుండెను. బాలసూర్యకిరణము లామంచుబిందువులందుఁబడి యందు నానావర్ణము లొదవించి చూపఱకు వింత గొలుపుచుండెను. వ్యాఘ్రాది జంతుసంతానము లప్పుడే గుహాలనుండి వెలువడివచ్చి యొడలు విఱుచు కొని యావలింతల దీయుచు నెరకై బయలుదేరుచుండెను. మృగము లప్పుడే మందలు మందలుగా వెడలి లేఁబచ్చికకై బీళ్లలో విహరించుచుండెను. లేడిపిల్లలు కడుపారఁ బాలు గ్రోలి చెంగుచెంగున దాఁటుచుఁ గొంతదూరము పర్వెత్తి

యేదియో భయకారణ మరసి తల్లులచెంతకు గంతులిడుచు వచ్చుచుండెను.

సాధుహృదయుఁడగు ఛత్రసాలుఁడామృగముల సుంతేనియు బాధింపఁ దలఁచుకొలేదు. వానివర్తనము లరయుచు నతఁడు పోవుచుండెను. అవియతనినిగాంచి భీతిల్లి నానాముఖములఁబఱవఁ జొచ్చెను. ఇట్లతఁడు గొంతదూరము పోవంబోవ నొకసెలయేఱు దారసిల్లెను. దానియొడ్డున నిసుముతిన్నెపై విహరించుచుఁ దుంగముస్తల నున్మూలించు నొకవరాహమతనిఁ గంటఁబడియెను. అది చిన్నయేనుఁగు గున్నవలె నిస్సత్త్వభావమున నుండెను. బాలచంద్రరేఖవలె నున్న దానికొమ్ము దదీయ నీలాకారమునకు వన్నె దెచ్చుచుండెను. రాజువెంటనే చేత నొక పేరీఁటె నంకించుకొని గుఱ్ఱమును దానివైపు మలపెను. ఆకొమ్ముపంది యతనిఁజూచి సుంతేనియు భయమంద లేదు. ముట్టెపైకెగయించి మూర్కొనుచు వడివడి నెదుర్కొని యది ముట్టెతో గుఱ్ఱమును బడఁద్రోసి వేటకాని నెత్తుటిని ద్రావవలెనని మీఁదఁ బడఁబోయెను. పంది కభిముఖముగాఁ బోయిచంపుట యెట్టివానికైన నలవికాదు. అందుచే రాజు తనగుఱ్ఱమును జెంగున దాఁటించి యీఁటెతోఁ బంది పిఱుఁదుపైఁ బొడిచెను. అదిమరలి తనకభిముఖముగుచుండ రాజు వెంటనే తప్పించుకొని వెనుకదెస పొడిచి యీఁటెతో దానిని మాటిపెట్టెను. ఈపర్యాయమతఁడు సత్తువకొలఁదిని గ్రుచ్చిన యీఁటె దానితోడను దూసికొనిపోయి నేలను గాడెను. తన శక్తియంతయు నుపయోగించెను గాని యాపంది మఱి తప్పించుకోలేక ఘుర్ఘుర ధ్వనులచేఁ గొండల మాఱు మ్రోయించు

చుండెను. రాజు దానిని తన రెండవచేతిలోని ఖడ్గముతోఁ బొలియించెను.

ఈవిధముగా నా మహారాజు కొంతసేపు మృగయా విహారము సలిపి యొకచో విశ్రమించెను. అంత నొకపులి భయంకరమై తన యనుచరులపైఁబడెను. అతఁడదిచూచి వింట బాణములు సంధించి దాని హృదయమున గ్రుచ్చెను. అది సహింపఁజాలక యాపులి వారినివిడిచి మహాకోపముతోఁ దన్నెదు ర్కొనెను. హస్తలాఘవచతురుఁడైన యమ్మహారాజు నిశాతములగు మఱిరెండు సాయకములచే దానిఁ దుద ముట్టించెను. ఇట్లతఁడు రౌద్రాకారమున విహరించుచుండ సూర్యుఁడు నభోమండల మధ్యవర్తియై రౌద్రాకారము వహించెను. ఎండ యతి తీవ్రముగా నుండెను. లేళ్లు మొదలగు జంతువులు చెట్లనీడలఁ జేరి నెమరువేయుచుండెను. పక్షి విశేషములు కులాయములు చేరి విశ్రమించుచుండెను. వెచ్చని గాడ్పులు వీచుచుండెను. ఛత్రపాలుఁడు మిక్కిలి దస్సి సాంద్రచ్ఛాయగల యొక పొదరింట విడిసెను. పరిచారకు లతనికిఁ దగిన యాహారాదులను సమకూర్చిరి. అతఁడు తృప్తిదీర భుజించెను. ఒకసేవకుఁడు సెజ్జ నమర్పఁగాఁ నతఁడందు శయనించెను. ఇంతలో మురారి పంతు మొదలగువారును భోజనాది క్రియలు నెఱవేర్చుకొని వచ్చి రాజును సమీపించిరి. అతఁడు మురారిపంతును జూచి, “ఓయీ! వేఁటవలన నాశరీరభారము కొంత దఱిఁగినది. మహమ్మదీయ వధానంతరమునఁ గాని తక్కినభారము తొలఁగదు. మహమ్మదీయులు యుద్ధమునకు రాక యచ్చట వేచియుండుటకుఁ గారణమేమో తెలియకున్నది.” అని యడిగెను.

"మహారాజా! ఇప్పుడు స్వాధీనము గావించుకొన్న దుర్గమందెక్కుడు సైన్యమున్నది. వారు మఱికొంత సైన్యమును గూర్చుకొని మనదేశము మఱియొకవైపున దాఁకఁ జూచుచున్నట్లున్నది. వారు సైన్యమునకై ప్రతీక్షించుచున్నారని నానమ్మకము."

"నూతనదుర్గమున మహాసైన్యమున్నది కాఁబోలు."

"అనియే కింవదంతి. తత్త్వము తెలియదు."

"ప్రకాంపుఁడు దానిసాధించుట కష్టమే."

"అని నే మొదటనే యెఱుఁగుదును."

"ఇఁక మఱి యుపాయమేమి?"

"మనము సైన్యముతోఁ బోయి ముట్టడించుటయే."

"అట్లుచేసిన పైనున్న మహామ్మదీయసైన్యము వచ్చి యెదుర్కొనక మానదు. మనము మధ్యమునఁజిక్కి నశింప వలసి వచ్చునేమో? పోనిమ్ము; మనము ముందుగాఁ బైనున్న మహామ్మదీయసైన్యము నెదుర్కొన్నచో?"

"అది మంచిదే. ఆసైన్యము చిన్నదికాన మనము తప్పక జయింపఁగలము. వారి సాయమునకై దుర్గములోనివారు వత్తురేని యాదుర్గము మన యధీనమగును. ఏదోయొకచోట మనకు జయము తప్పదు."

"పైనున్న మొగల్ సైన్య మెంతయున్నది?"

"సందేహమేల? చూచి సందియము దీర్చుకొనవచ్చును."

"ఎట్లు ?"

"ఈపర్వతశిఖరము నెక్కి!"

"అచ్చటికిఁ గనఁబడునా? "

"ఆఁ"

"నీ వెప్పుడైనఁ జూచితివా? "

"చూచితిని."

"నేఁడు పోవుదమా ?"

"అట్లే."

ఛత్రసాలుఁడు మిక్కిలి సంతసించి శత్రుసైన్యమును జూడ వేడుకపడుచుండెను. అంతట సూర్యుఁడు కొంచెము శాంతించెను; ఎండఁ దఱిఁగెను; వేఁడిగాడ్పు లిప్పుడు ప్రసరింపలేదు; నేల యిప్పుడు వెచ్చగాలేదు. రాజు తనపరివారమును బురమునకుఁ బోవ సెలవొసంగెను. వారు ప్రయాణసన్నద్ధులైనడచిరి. రాజు మురారిపంతుతోఁ బర్వతశిఖర మెక్కుటకు బయలుదేఱెను. వారు కొంతవఱకును గుఱ్ఱముల నెక్కిపోయిరి. ఇఁక మీఁద నట్లుపోవుటకు వీలులేదు. వారు వారువముల దిగి వాని నచ్చటఁ గట్టిపెట్టిరి. మురారిపంతు ముందు దారి దీయుచుండెను; రాజతని ననుసరించెను ? చిన్నగుట్ట నొకదానిని వారు దాఁటిరి, ఆగుట్టకును బర్వతమునకును మధ్యమున నొక లోయయున్నది. అది మిక్కిలి మనోహరముగా నుండెను. వారా లోయనుగడచి పర్వత మెక్కవలెను. వారేదో సంభాషించుకొనుచుఁ గొంతదూర మేగిరి. ఇఁక వారికి గంతవ్యస్థానము వచ్చినంత దూరము లేదు; మోఁచేతి మలపుగాఁ

బోయి కొండనెక్కుటయే. అంత మురారిపంతు, "రాజేంద్రా! దప్పిగానున్నది. నీవిచ్చటనే యుండుము. నేనా సెలయేటికరిగి నీరు ద్రావి వచ్చెద"నని చెప్పి యరిగెను. ఛత్రసాలుఁడందలివింతలను జూచుచుండఁగా నింతలో "అయ్యో! చచ్చితిని జచ్చితి" నని యొక యార్తస్వనము వినవచ్చెను. అది విని రాజు విభ్రాంతి జెంది కొంచెము దూరము పోయి చూచు నప్పటికి మురారి పంతు నెవ్వరో దుష్టులు బంధించుచుండిరి. రాజున కచ్చెరువు హెచ్చయ్యెను. ఖడ్గపాణియై యతఁడు శరవేగమున నచ్చటి కెగసిపడెను. ఆవింతమనుష్యులు నిరాయుధులై యుండలేదు. భయంకరఖడ్గముల దాల్చియుండిరి. సంఖ్యయందుఁ బదుగురి కంటె నెక్కువున్నట్లు గానరాలేదు. సూర్యుఁడు పశ్చిమదిక్కును జేరి యరుణకాంతుల నీనుచుండెను. తనమిత్రునవస్థచూచిన ఛత్రసాలుని వదనముగూడ నట్టేయుండెను. ఖడ్గముసారించి యెదుర్కొన్న రాజును జూచి శత్రువులు సుంతేనియు జంకక సమ రమునకుఁ దలపడి కత్తుల నతిలాఘవముగాఁ ద్రిప్పుచుండిరి. ఛత్ర సాలునకు వారు సామాన్యులవలెఁ దోఁపలేదు- ఆయుధవిద్యా చాతుర్యమున వారసమానులే. అయిన నతనికి వారెనసత్తురా? అతఁడు వారి పరాక్రమమునుగాని, యాయుధవిద్యా చాతుర్య మును గాని పాటింపక యొడికముతో వారిదెబ్బలను దప్పించు కొని వారిని నఱకుచుండెను. వారికత్తులుపది; ఇతనిదొక్కటియే. ఐన నిదియన్నింటితోను పోరాడుచునేయుండెను. ఆకత్తులుగలిసి నపుడు కన్నులు మిఱుమిట్లు గొలుపునట్లు మెఱుపులు వ్యాపిం చుచుండెను. పరస్పరము నొఱయికవలనఁ బుట్టినశబ్దము లుఱు

ముఁగుచుండెను. ఇఁక వర్షించుటయే తరవాయి. కొంతసేపటి కాకొంతయుఁ గూడఁ దీటి రక్తము వర్షింపఁజొచ్చెను. అది కాలువలుగట్టి ప్రవహించుచుండెను. నలుగురైదుగురు ఛత్రసాలుని కరవాలమున కాహారమైరి. ఇఁక నెంతేయుంది లేరని ప్రోత్సాహముతో నతఁడు సమర మొనర్చుచుండెను. అంతట సింహనాదములు చేయుచుఁ బొదరిండ్లనుండి వెలువడి వీరులు పెక్కురు వచ్చుచుండిరి. వారెచ్చటనుండివచ్చిరో యతనికిఁ దెలియలేదు. ఎందఱోచూచుట కవకాశము లేదు; వారెవ్వరో విచారించుటకుఁ గూడ వీలులేదు. భూమి యీనినట్టు లావీరు లక్కడ నిండిపోయిరి. ఛత్రసాలునికి మహాశ్చర్య మొదవెను ; కాని దానివలన నతఁడు నిశ్చేష్టితుఁడు కాలేదు. అతఁడు సంతతము ఖడ్గమును ద్రిప్పుచునే యుండెను ; శత్రువుల ఘాతములఁ దప్పించుకొనుచునే యుండెను ; నడుమనడుమ వారిని ఖండించుచునే యుండెను. ఒక నిముసమాత్ర మతఁడు ఖడ్గము ద్రిప్ప మానినచో నెన్నికత్తు లతనినెత్తిపైఁ బడునో ? ఆతనిహస్త మూరకుండిన నిఁక నతఁడు మరణించుటయే. ఆసమాచార మతఁ డెఱుఁగును. అందుచేతనే యతఁడు హస్తము నూరకుండ నీలేదు. పెక్కుమంది యతనికత్తికి బలి యగుచుండిరి. ఇంతట సాయంకాల మయ్యెను. సంధ్యారాగ కాంతు లంబరమునఁ గప్పెను. అందున్న మేఘఖండము లెఱ్ఱ పడియెను. ఆయుద్ధభూమియు నప్పటి యాకాశమును బోలుచుండెను. అందలి మొండెములు నెత్తుటిచేఁ దడిసి యప్పటి మేఘఖండముల కీడువచ్చుచుండెను.

పాపము! ఛత్రసాలుఁ డెంతసేపట్లు కత్తిని ద్రిప్పుచుండఁ గలఁడు ? ఎంతసేపట్లు వారితో యుద్ధము చేయఁగలఁడు ? ఇంకను దన్నెదుర్కొనుచున్న శత్రువులు పెక్కురుండిరి. తన కాయాసము మిక్కుటముగా నుదయించుచుండెను. మురారి పంతు బంధనములు ఛేదించిన నతఁడు దనకుఁ దోడు సూపి యుండును. కాని వీ లెక్కడ ? తాను వెనుకఁదిరిగినచో దన ప్రాణములు నిలుచు టెక్కడ ? శక్తియున్నంతసేపు పోరి వీర మరణ మందుట కతఁడు నిశ్చయించుకొనెను. ఇంతలో వేఱొక చోట యుద్ధము జరుగ నారంభించెను. అప్పుడే మఱొకచోట సంభవించెను. అంతట నింకొకచోట ! ఇట్లిప్పటి కప్పుడే మూఁడుచోట్ల కలహము జరుగుచుండెను. ఛత్రసాలు నాయాసము హెచ్చినకొలది శత్రువులసంఖ్య తగ్గఁజొచ్చెను. తన పరాక్రమమునకు వెఱచియో, పెక్కురు చచ్చుటం జేసియో శత్రు వెక్కుడుగాఁ దనదరికి రాలేదని యతఁ డనుకొనెను ; అంతియకాని యవాంతర యుద్ధములు సంభవించెనని యెఱుంగఁడు. తన చుట్టును నలువురైదుగురకంటె నెక్కువ లేరు. అధికాయాసమున సత్తువ సన్నగిలుచున్నను లేని ప్రోత్సాహమును దెచ్చుకొని యతఁడు వారిలో మువ్వురతలల నేలకు దొరలించెను. తక్కినవారు భయమునఁ బర్విడిరి. ఇఁకఁ దనయెదుట శత్రువులు లేరు. ఒకమాఱు నలువంకలు చూడ నతనికప్పు డవకాశముగల్గెను. అతఁడు తేఱిపాఱఁ జూడఁగాఁ దనకు సమీప

ముగా మూఁడుచోట్లఁ బోరాటము జరుగుచుండెను. శత్రువు లేకారణముచేతనో తమలోఁదాము గొట్టుకొనుచుండిరని యతఁడనుకొనెను ; వారచ్చటఁ బోరుచుండుటచేఁ దనపైకి రాలేదు కాని తనపరాక్రమమునకు వెఱచి కాదని యిప్పుడుఁ దెలిసికొనెను. అచ్చట శత్రువులసంఖ్య యింకను నూటికి మించి యుండెను. శత్రువుల కాకస్మిక కలహము సంభవింపనిచోఁ దా నాదినమున వీరమరణ మందవలసి యుండునని యతఁడప్పుడు నిశ్చయించెను. ఇంతలోఁ దా నలఁతఁ గొంతదీర్చుకొని మరల రిపులెదిర్చిన నెదుర్కొననుండెను. ఈ సమయమున మురారిపంతును విముక్తునిగాఁ జేయఁదలంచి యతఁడు పరికించెను, గాని యా మొండెముల తండములలో నతఁ డెచ్చట నుండెనో కనుఁగొన వశముకాకుండెను. చచ్చుచున్న వీరుల హాహాకారములు క్రమ్ముకొని యుండుటచే బద్ధుఁడైన యతని మూలుఁగైన వినిపింపకుండెను. ఇంతలో నెల్లచోట్లను సమరము చల్లారెను. తుదకు ముగ్గురు మిగిలిరి. వా రాయుధపాణులై రాజువైపునకు వచ్చుచుండిరి. వారినిజూచి ఛత్రసాలుఁడు ఖడ్గములు సారించుకొని నిలువఁబడెను. ఏకారణముచేతనో యా యోధత్రయ మతని నెదుర్కొనలేదు; కత్తులెత్తలేదు. క్రిందఁ బడవైచి వారు దండప్రణామ మాచరించిరి. ఛత్రసాలుఁడు నివ్వెఱపడి, "మీ రెవ్వ"రని ప్రశ్నించెను. "మహారాజా ! మీ సేవకుల" మని వారు ప్రత్యుత్తర మిచ్చిరి. అది

విని యశవంతుఁ డానందభరితుఁడై వారినిఁ జేరి కౌఁగిలించుకొని యెక్కుడుగాఁ బొగడఁజొచ్చెను. కొంతసేపు వారితో సంభాషించి మురారిపంతును వెదకి బంధవిముక్తుని గావించి రాజా వారందఱితోడను నగరాభిముఖుఁ డయ్యెను. ఆ యోధత్రయ మెవ్వరో తెలిసికొనఁ జదువరులు వేడుకపడుచుందురు. వారిలో నొకఁడు కేశవసింగు, రెండవవాఁడు రామలాలు, మూఁడవ వానిపేరు ముందునకుఁ జెప్పెదను.

# దిలారామ

## 9-వ యధ్యాయము

### ప్రతిజ్ఞానిర్వహణము

శ్లో. "న హి భవతి యన్న భావ్యం
భవతి చ భావ్యం వినాపి యత్నేన
కరతలగతమపి నశ్యతి
యస్యహి భవితవ్యతా నాస్తి."

"నేర్పుతోఁ జేసిన దొంగతనమైనను మంచిదే" యను లోకోక్తి యొకటిగలదు. ఏపనియందైన నేర్పుండవలయునని దానియభిప్రాయము, కాని దొంగతనము మంచిదని కాదు. మిడి మిడిజ్ఞానముగాక దేనియందైనను సంపూర్ణ చాతుర్యమున్నచో మానవుఁడు గొప్పవాఁడగును. తక్కినగుణాదు లెట్లున్నను సరియే. రహీము దుర్గుణుఁడే. అయినను వాని మాయాచాతుర్యమే వాని నంతకుఁ దెచ్చెను. వాఁడిప్పుడు దుర్గాధిపతియై గౌరవమందుచున్నాఁడు.

వెనుక వీఁడు మధురాపురాధిపత్యము వహించి తన యశ్రద్ధచేతను, గర్వముచేతను, దమకార్యమును జెఱిచికొని మృత్యువునోటఁబడి వచ్చెను. దానివలన వానికి బుద్ధికలిగెను. ఇప్పుడు దుర్గమున కధికారియైనను వానికి గర్వములేదు. మత్తతలేదు. తనంతటఁ దానే వాఁడు సకలకార్యములను శ్రద్ధా

ళువై చూచుచుండెను; జాగరూకుఁడై వర్తించుచుండెను; కంటికిని తెప్పవలె దుర్గమును గాఁచుచుండెను. పరుల నెవ్వరిని గోటలోనికి రాఁగూడదని వాఁడు నిశ్చయించి దుర్గద్వారము లను మూయించెను. పైనుండి మనుష్యులుగాని వస్తువులుగాని లోనికి రావలసిన యవసరము లేదు. అందే సమస్తమును గలదు. ఇఁక దుర్గద్వారములు తెఱవవలసిన యవసరమేమి? ఒకవేళ నేదేని బనియుండినచో రహీము తానేపోయి తలుపులను దెఱచి యది తీరినవెంటనే యెప్పటియట్లు బంధించుచుండెను.

ఎట్టివానికి నేదో విచారముండక తప్పదు. రహీము దుర్గాధికారము వహించి సుఖమును, గౌరవమును బొందు చున్నను వాని డెందమునకు హాయిలేదు. చిత్తము విరహాతుర మైనపుడదియెట్లు లభించును? తన్ను వలపించిన కాంతామణి వేఱొకచోనుండఁగా మనస్సు విరహానలతప్తమగుట సహజమే కదా? అందుచే నతని కారాట మెచ్చుచుండెను. దిలారాము యచ్చటికి సమీపముననే యున్నది. రహీముదివఱకు రెండు మూఁడు పర్యాయములు పోయి యామెను జూచెను. ఆమె తన్ను గాఢముగాఁ బ్రేమించినట్లు కనఁబడెను. తన్ను వలచిన దివ్యసుందరిని దుర్గమునకుఁ గొనివచ్చుట కతఁడు ప్రయత్నించి రెండు సారులు సేవకుల నంపెను గాని దిలారాము రోగపీడిత యగుటచే నాసేవకులతోఁ గోటకుఁ బోఁజాలక యతనికిఁ గోపము రాకుండఁ జేయుటకుఁ గాఁబోలును జంపావతిని బంపె ను. చంపావతి వాక్చాతుర్య మెట్టిదో బుద్ధివిశేష మెట్టిదో పాఠకమహాశయులకుఁ జెప్పిన పిష్టపేషణమగును. ఆయువతి రహీమును దర్శించి యతని సంతసింపఁజేసి వచ్చెను. మరల

మఱియొకనాఁడు రహీము ప్రియురాలికి సందేశమంపెను. దిలారామ యప్పటికిని స్వస్థచిత్తగా లేదు. మరలఁ జంపావతియే పోయెను. రహీమామెనుజూచి,

"యువతీ! ప్రియురాలిస్థితి యెట్లున్నది?" అనియడిగెను.

"అన్నా! ఆమెదుస్థితి యింతటఁ బూర్తిగాఁ దీఱునట్లు తోఁపదు"

"తగినమందిప్పింపలేదా?"

"ఆరోగ్యమును బూర్తిగా ద్రిప్పఁజాలినమందు లభింపలేదు."

"పోనిమ్ము; ఈ దుర్గమునకుఁ గొనిరమ్ము. నేను దగిన మందు దెప్పించి యిచ్చెదను."

"అట్లె చేసెదను. ఇచ్చటికివచ్చిన మందే యక్కఱలేదు. నీరూపము చూచిన నామెరోగము కుదిరినఁ గుదురవచ్చును."

"ఎప్పుడు వచ్చెదరు?"

"రమ్మనినచో నీదినమే వచ్చెదము. అచ్చటి మాదుర్దశ చెప్పనలవి కాకున్నది. దినముగడచిన దీర్ఘాయువుగా భావించుచున్నాము. ఈదినమైననుహాయిగా నిద్రాసుఖము చెందెదము."

"అదేమి యట్లనెదవు?"

"ఏమిచెప్పను? ఆప్రతాపుఁడు మాకు విరుద్ధుఁడై యున్నాఁడు. బ్రదుకుటెట్లో తెలియకున్నది. ఈదుర్గము మీకు కామె కారకురాలఁట!"

"అయ్యో! అయ్యో! పాపము ఆమె యేమిచేసినది?"

"దుర్గమునందలి రహస్యములను మీకుఁ దెలిపెనఁట అందుచే నతఁడామెపై క్రోధముగాని యున్నాఁడు. ఎప్పు డేమి చేయునోయని కంటిపై రెప్పవేయ లేదు."

"మీరంత శ్రమపడ నేల? ఈదుర్గమునకు వచ్చి సుఖముగా నుండుఁడు. ఈదినము వచ్చెదరా?"

"ఎట్లువచ్చుట?"

"రహస్యముగా నడిచిరండు."

"మాచెలి దుర్గాధిపతిభార్య కాఁదలచియు నడచి వచ్చుట యుచితమా? రాజు మగఁడయ్యెను జేతికి గాజుకడి యమే? యన్నట్లున్నది" అని చంపావతి నవ్వెను.

"మఱేమి చేయుమందువు?"

"సవారీనంపుము. దానిలోఁగూర్చుండి వచ్చును."

"మంచిది; పంపెదను. పొమ్ము; సిద్ధముగా నుండుము."

చంపావతి యావచనములు విని తిరిగిపోయెను. ప్రియ వస్తు లాభము సమీపించిన కొలఁది రహీమున కారాటము హెచ్చయ్యెను. దుర్గరక్షణభార ఖిన్నుఁడైన తనకాయువతి సుందరరూప మానంద సౌఖ్యములు గల్గించునని యతనినమ్మకము. జాముధాత్రి యయ్యెను. దిలారామునిమిత్త మతఁ డొక సవారీనంపెను. దానిమోయుట కతఁడు బోయీలను బిలిపింప లేదు. పైనుండివచ్చిన బోయీలు దుర్గరహస్యములను బెఱ వారికిఁ దెలుపుదురేమో యని వాని భయము. విశ్వాసపాత్రు లగు సేవకులపైనే యాకార్యభార మతఁడు మోఁపెను. వారు

ప్రభువు నానతిచొప్పున సవారీని దిలారాము యింటియొద్ద దింపిరి. వారిలో నొకఁడు లోనికేగి తమరాక యెఱిఁగించెను. అంతటఁ జాంపావతి వచ్చి వారినిజూచి, "ఓయీ! మాచెలియ యలంకరించుకొనుచున్నది. కొంచెముసేపుండుఁడు. ఈయరుఁగుపై విశ్రమింపుఁడు," అని చెప్పెను. వారట్లుచేసి కొంతసేపేదో మాటాడుకొనుచుఁ గూర్చుండి యుండిరి; కాని సురాపాన మత్తతకు నిద్రాభారము తోడై నెత్తిపై కెక్కెను. కొంచెము సేపు నిద్రించి యాభారమును దొలఁగించుకొననిచో సవారి బరువువహించుట దుస్సహమగునని వారు తలంచి పైవస్త్రములఁ జక్కఁగా నుపయోగించుకొని నిద్రాసుఖ మనుభవించు చుండిరి. ఇరుగుపొరుగులకుఁ బోవలసినను స్త్రీలు తలదువ్వుకొని శుభ్రవస్త్రములను దాల్చి యలంకారములను సవరించుకొని యద్దము చూచుకొని మనస్సు సమాధాన పఱుచుకొని కాని యిల్లు వెడలరు. ఇది యాఁడువారి స్వభావము. ఇట్లుండ దుర్గాధిపతిని దర్శింపఁబోవునపుడు దిలారాము యెట్టివేషము ధరింపవలెను? ఎన్నినగలు దాల్పవలెను? అందుల కెంతసేపు పట్టును? దిలారాము వేషముముగించుకొని వచ్చి సవారీలోఁ గూర్చుండెను. చంపావతి పోయి బోయీలను దీసికొనివచ్చెను; వారు సవారీనెత్తుకొని దుర్గాభిముఖులైరి. చంపావతియు వారిని వెంబడించెను.

వారిరాకకై ప్రతీక్షించుచున్న రహీమదిచూచి సంతోష భరితుఁడై వేగముగావచ్చి కోటతలుపు తెఱచెను. వారందఱును లోపలికరిగిరి. తలుపెప్పటివిధమున బంధింపఁబడెను. రహీము కవాటబంధనముచేసి వచ్చునప్పటికి సవారీ యతని

మందిరము చెంత నుండెను. వెంటనే యతఁడు సవారీలోనికిఁ జూచెను. శత్రువు లెవ్వరైన దానిలోఁ గూర్చుండి వచ్చిరేమో యని వాని యనుమానము. కాని యందు శత్రువులెవ్వరును లేరు. దిలారాము మాత్రము ముద్దులు మూటగట్టు వేషముతో నందుండెను. ఆరహీమానందముతోఁ జంపావతినిగని, "ఇంతయాలస్యమునకుఁ గారణమేమి?" అని యడిగెను.

"అన్నా! ఏమిచేయుదుము. నీబోయీలు సురాపానమత్తులై యెంతపిలిచినను బలుకరు. లేవరు; సవారీమోయరు. ఎట్లో వీరిని బతిమాలికొని సమాధానపఱచి వచ్చునప్పటి కింత యాలస్యమాయెను," అని చంపావతి చెప్పెను.

ఆవచనములు విని రహీము కోపోద్దీపితుఁ డయ్యెను. బోయీలలో నొకనిఁజూచి "మీకింత మత్తతగలదా?" యని వానినాడి కొట్టఁబోయెను. వాఁ డందులకు నోటితోఁ బ్రత్యుత్తరమీయక తనచేతనున్న దుడ్డుతో మాఱుచెప్పెను. రహీమాపరాభవము సహింపలేక వానిఁ దుదముట్టింప నెంచి ఖడ్గమును దీసెను. బోయీ యందులకు భయపడక కయ్యమునకు సిద్ధపడెను. ఇంతలో వానికత్తికత్తిగా మాఱిపోయెను. బోయీలందఱు నొకటిగై రహీము పైఁబడఁ దలఁచిరి కాని వారిలో నొకగాఁడు, "ఒక్కనితో నిందఱముపోరుట ధర్మముకా" దని తక్కినవారి వారించి రహీము నెదుర్కొనెను. చంపావతి భయపడి సవారిలోనికిఁ బోయెను. రహీము "సేవకున కింత కండకావరమా?" అనుకొని వానిపనిఁ జక్కఁజేయను నెంచి కవిసెను. వారిరువురు నొకరినొక రెదుర్కొనిరి. వారిఖడ్గములొండొంటితోఁ రాపాడఁగా ఖణేల్ ఖణేలుమను ధ్వనులుప్పతిల్లు

చుండెను. బోయీవాని యాయుధచాతుర్యము రహీమున కచ్చెరువుగొలిపెను. వాఁడు తన్నుఁ జంపవచ్చిన శత్రువుకాని సేవకుఁడు కాఁడని యతఁడు గ్రహించి తక్కినవారుగూడఁ దానంపిన బోయీలకు మాఱుగామాఱువేషములతో వచ్చిన శత్రువులని నిశ్చయించెను. దురాత్ములెవ్వరో పాప మాయబలల మోసపుచ్చి వచ్చిరని యతఁడనుకొనెను. ఇంతలో నాయలుకుడు విని చుట్టుపట్లనున్న రక్షకభటులు ఖడ్గపాణులై పర్వెత్తికొని వచ్చిరి. తక్కిన ముగ్గురు బోయీలును వారినెదుర్కొని యుద్ధమొనర్చుచుండిరి. రహీమావీరునితోఁ దన యావచ్ఛక్తిని బోరెను, గాని ప్రయోజనము లేదు. అంతట నాపురుషుఁడు వానిఁజూచి, "ఓరీ తురుష్కాధమా! ఇదివఱకుఁ బతివ్రతలను, సజ్జనులను నానావిధముల హింసించిన నీపాపఫలము నందింపఁ బ్రతాపుఁడిదె వచ్చినాఁడు; కాచుకొమ్ము. దిక్కుగలవారిని బిలిచికొమ్ము;" అని పెద్ద సింహనాదము చేసెను. అదివిన్నతోడనే వానిగుండె దడదడ గొట్టుకొనఁ జొచ్చెను. ఇదివఱకు జయమందున్న యభిలాషమిప్పుడు జీవరక్షణముపైకి మరలెను. నడుమనడుమ సాయమునిమిత్తము వాఁడు నలుదిక్కులు చూచుచుండెను. రక్షకభటులు వచ్చితనకుఁ దోడుసూపుదురని యతనియాశ. రహీమునందలి భక్తిచే రక్షకభటులు వచ్చుచునేయుండిరి కాని తక్కిన యోధులు వారినెదుర్కొని వెనుకకుఁ దఱుముచుండిరి. రహీమదిచూచి, నాఁడు తనయాయువు చెల్లుట నిక్కమని భావించెను. ఎట్లయినను బోరిచచ్చుటయే యుత్తమమని వాఁడు నిశ్చయించుకొనెను. ప్రతాపునకుఁ దీసికట్టయినను రహీము సామాన్యవీరుఁడు కాఁడు. కొంతవడి

వారిరువురును జిత్రగతుల సమరముసలిపిరి. రహీము తనతోఁ బోరు సల్పుచున్నకొలఁదిఁ బ్రతాపునికిఁ గోప మతిశయించు చుండెను. తుచ్ఛుఁడైన రహీము తనవంటివీరునితో సమముగా నంతసేపు నిలిచి పోరుటయా ? తనశక్తినంతయుఁ గూడఁదీసి కొని యతఁడు శరవేగమున రహీముపైఁబడి పట్టుకొని, క్రిందఁ బడద్రోసి, కాళ్లొకకాలితోను మెడ నొకకాలితోను ద్రొక్కి పట్టి, కత్తితో వానిగుండెలుచీల్చి గంభీరముగా సింహనాదము లొనర్చెను; వానిగర్భమందున్న ప్రేవులను మాలలగా ధరిం చెను. వానిగుండెలందున్న నెత్తురుదీసి కొంత మీఁదికెగరవేసి కొంత దనయొంటికిఁ బూసికొనెను. ప్రతాపుఁ డిట్లు రౌద్రా కారమున వీరవిహారము సల్పుచుండుట చూచినవారు దుశ్శా సనవధ నాఁటి భీమునిఁ దలంచిరి. పరిచితులగువారు గూడ నాసమయమున నతనిదరికిఁ బోవెఱచిరి. తక్కినవారు యుద్ధ ములుమాని యతని వైఖరిఁజూచి యాశ్చర్యపడసాగిరి. నాఁడు ప్రతాపుఁడు వీరరసాతిరేకమున నొడలెఱుఁగఁడు. ఇది భూమి యని, యిది యాకాశమని,యతనికిఁ దెలియునట్లులేదు. అతఁడు రహీము మొండెమును గత్తికిఁగ్రుచ్చి ప్రక్కకు విసరివైచెను. ఇంతలో నీవార్త దుర్గమంతటను వ్యాపించెను. మూలమూలల శయనించియున్న సైనికులంద ఱొక్కుమ్మడిని వచ్చి యతని దాఁకిరి. ప్రతాపుఁ డదిచూచి సహింపఁజాలక కరవాలమును గిరగిరఁద్రిప్పుచు మదపుటేనుఁగులపైకి సింగపుఁగొదమ భంగి వారిపై నుఱికి తీవ్రముగా యుద్ధమొనర్చుచుండెను. అతని ధాటికోర్వఁజాలక శత్రువులు కొందఱు బర్విడుచుండిరి. కాని యెచ్చటికిఁ బర్విడఁగలరు? ఒక దుర్గద్వారముచెంత రామ

లాలు ఖడ్గపాణియై ప్రళయకాలరుద్రునివలెఁ జూపట్టసాగెను; వేఱొక ద్వారమునొద్ద శివసింగు రుద్రాకారుఁడై మెలఁగుచుం డెను. కేశవసింహ ప్రతాపరాయులు దుర్గము నలువంకల విహ రించి కనఁబడి యెదిరించినవారినెల్ల వధించుచుండిరి. ఇఁక నం దఱున్నను వారు చంపఁగలిగియే యుందురు. ఆదుర్గము శవము లచే నిండిపోయెను. ఎచ్చటఁజూచినను మొండెములే; ఏవంకఁ గనుఁగొన్నను దెగిపడిన యవయవములే; ఏవైపుగాంచినను మాంసపు ముద్దలే; ఏపట్టున వీక్షించినను రక్తప్రవాహములే. ఆనూతనదుర్గము శత్రువులరక్తములచేఁ దడిసి జూపఱకు భయం కరముగా నుండెను.

ప్రతాపునిశరీరమునఁ బలుచోట్ల గాయములుపడెను. వానిలోఁ బెక్కులు సామాన్యములే కాని యొకటిరెండుమహా పాయకరములై నట్లుండెను. అన్ని గాయములనుండియు రక్తము ధారారూపముగా స్రవించుచుండెను. గాయములచే నెఱ్ఱనైన యతనిశరీరము తఱచుగాఁ బూచిన మోదుగువలె నుండెను. కొంతసేపటి కతఁడు మూర్ఛిల్లఁగా చంపావతీ దిలారాము లతని కుపచారములు చేయుచుండిరి.

# దిలారాము

## 10-వ యధ్యాయము

### ప్రతిజ్ఞానిర్వహణము

గీ. "రాజుధనమున నాశరీ • రంబు పెరిఁగె
నది తదర్థము వినియుక్త • మగుట లెస్స
ధీరతను దీనిఁ బోరికి • ధారవోసి
తెగువతో నాఋణంబును • దీర్చుకొంటి."

ప్రతాపుని ప్రతిన నెఱవేఱినది. జయలక్ష్మి యతనిని బరిపూర్ణానురాగమున వరించెను. అతని కీర్తి పరాక్రమములు దేశమున నెలకొనెను. అట్టిమహావీరుఁడు తమ తెగలో నున్నందులకు బుందేలులు గర్వపడఁజొచ్చిరి.

రామలాలీజయవార్తను రాజధానియందు వ్యాపింపఁజేసెను. ప్రజలు మిక్కుటముగా సంతసించిరి. వెనుకఁ బ్రతాపుని నిందించినవారుగూడ నిప్పు డభినందింపఁ జొచ్చిరి. నాఁడు ప్రతాపునివధ కర్తవ్యమని వాదించిన మహారాష్ట్రవీరుఁడు గూడఁ బ్రతాపుని సాహసమును బొగడసాగెను. ఛత్రసాలుఁడీ వార్తవిని యమితానందమొంది ప్రతాపుఁ డెంతకైన వీరుఁడే యని మెచ్చుకొనెను. దుర్గము జయింపఁబడి యసహాయమై యున్నదని తెలియఁగానే ఛత్రసాలుఁడు సైన్యము పుత్తెంచెను. అది హుటాహుటిని బోయి దుర్గము చొచ్చి దానిని రక్షించు

చుండెను. ఆదుర్గమును జూచుటకై రాజును బ్రాణనాథుడును పోయిరి. విజయవార్తవిని శాంతాపద్మావతు లమితానందముతో నచ్చటి కరిగిరి. ప్రతాపుని తల్లిదండ్రులుకూడ నిర్భర హర్షంబున గుమారునిజూడ వెడలిరి. ఇపుడు నూతనదుర్గ మించుమించుగా రాజధానికాఁ జొచ్చెను.

మహారాజు నూతనదుర్గమును బ్రవేశించుచుండఁగాఁ గేశవసింగెదురుగావచ్చియుచితమర్యాదలొనర్చి కొనిపోయెను. రాజు దుర్గమును గలయఁజూచి ప్రతాపుమందిరమున కరిగెను. ప్రతాపుఁ డిపుడు జ్వరపీడితుఁడై మంచముపై నుండెను. కొందఱు స్త్రీలతనికిఁ బరిచర్య సేయుచుండిరి. రాజు వచ్చుచున్నట్లు తెలియఁగానే యచ్చటఁబని నచ్చటనే విడిచి యువతులు లోని కరిగిరి. ప్రతాపుఁడు లేచి మహారాజును గౌరవింపఁబోయెను. కాని కట్లు విచ్చిపోవునని వైద్యులు వారించిరి. రాజుగూడ వలదని యుచితాసనాసీనుఁడయ్యెను. ప్రాణనాథుఁడతని పార్శ్వమునఁ గూర్చుండెను. అప్పుడు రాజు ప్రతాపునింగాంచి, "ఓవీర వరా; నీసాహస మచ్చెరువుగొలిపెను. నీవన్నంతపనిని జేసితివి. సంతసించితిని. నేను గఠినహృదయుఁడనై నీకు మరణదండనము విధించితిని. దానిని మన్నింపుము. అది నాకు విహితముగుటచే నట్లుచేయక తీరినదికాదు." అని పలికెను.

"మహారాజా! మీరట్లు భావింపరాదు. మీరు ప్రభువులు; మేము సేవకులము. మరణదండనము మీరు విధించితిరని నే నెన్నఁడును వేఱుగాఁ దలఁపలేదు. రాజ్యపాలనాపద్ధతులచొప్పున నడవనిచో రాజు ప్రజలఁ బాలింపలేఁడు. అపరాధులను దండించుట రాజునకు విధి. నేనపరాధిని; నన్ను దండిం

చుట మీకు విధి. ఇందుమీరారు చేసినదేమున్నది?” అని ప్రతా పుడు బదులుచెప్పెను.

“ప్రతాపరాయా! నీహృదయము నిర్మలమైనది; ఉదార స్వభావము గలది. కావుననే నీవు నాచే నవమానింపఁ బడియు నది సరకుగొనక నాఁడాయడవిని మహమ్మదీయులను జంపి నాకు సాయమొనర్చితివి. నీకృతజ్ఞతకును, నీయౌదార్యమునకును సం తసించితిని,” అని పలికెను. ప్రతాపుఁ డాయనతో “రాజేంద్రా! మీ సేవకుఁడు మీకుఁ బనిచేసిన నదియౌదార్య మనిపించుకొ నునా? అది యట్లుండనిమ్ము. మీరు నాయందు దయయుంచి స్వామివచనము పాటించి నెలదినములు గడువిచ్చినందుల కెం తయు సంతసించితిని. నాకు మరణమున విచారము లేదు. నాకీ యుద్ధమున మరణదాయకములగు గాయములు తగిలినవి. నేఁడో రేపో చచ్చుటసిద్ధము. అప్పుడైనఁ జావే; ఇప్పుడైనఁ జావే, కాని యిందులో నొక్కభేదమున్నది. నేనప్పుడే వధిం పఁబడినచోఁ బ్రభువుఋణము తీర్చుకోలేక పోయియుందును.

ఇప్పుడు నాకది లభించినది. మలినమగు తలారిఖడ్గము నకు నాపవిత్రశరీరము నప్పగించుటకు నామనస్సప్పుడు విచార పరీతమయ్యెను. కాని యిప్పుడు వైరివీరుల కరవాలముల కది పాత్రమగుటచే నాహృదయము నిర్విచారమయ్యెను. ఇఁక నేను మరణించినను నాకు వంత గలుగదు. ఇంతేకాక మరణ కాలమున మీయిరువుర దర్శనమును జేయఁగల్గినందుల కానం దించుచున్నాను. ఇఁక నా కాయాసము హెచ్చుచున్నది ; మాట తడఁబడుచున్నది ; ప్రాణములపై నాశపోయినది; క్రమ క్రమముగా గాయములబాధ యతిశయించుచుండెను. నేను—

బ్రదికియుండఁగా—మాతృ దేశము— పూర్తిగా—స్వతంత్ర మైనదని—విను భాగ్యము—కల్గినదికాదు.” —అని మఱి మాటాడలేకపోయెను.

రాజు హృదయము దుఃఖాకులమయ్యెను. అటువంటి వీరుఁడు దక్కు-భాగ్యము లేదు కాఁబోలునని యతఁడు విచారింపసాగెను. ప్రాణనాథుఁడు తొందరపడి లేచి యతనిసమీపించి చేతినాడిని బరిశీలించుచుండెను. ఇది తెలిసికొని లోపల నాడువాండ్రు విలపింపసాగిరి. ఆయేడ్పులకు దుర్గము ప్రతిధ్వను లిచ్చుచుండెను. ప్రాణనాథస్వామి వారిని వారించి, “విలపింప వలసిన యవసరము లేదు. మరణభయము రాదు;” అనిపలికి తనయొద్దనున్న యొక దివ్యౌషధము దీసి రెండుగడియల కొకసారి యీయవలయునని చెప్పి కేశవసింహున కిచ్చి రాజుతోఁ గూడఁ బైకివచ్చి “మహారాజా! ఈరాత్రి గడచిన జీవించునన్న నమ్మకమున్నది. దైవానుగ్రహ మెట్టులున్నదో!” అని పలికెను.

“ఇతనికై నామనస్సు మిక్కిలి విచారపడుచున్నది. మీరీదిన మిచ్చటనుండి యౌషధ మొసఁగి తగిన యుపచారములు చేయింపుఁడు. నేను రాజధాని కరిగెదను. జయముగల్గె నన్న సంతోషము లేకుండ నిదెట్లు సంభవించెనో చూడుఁడు. నేనచ్చటికేగినను నాయుల్లము తల్లడ మొందుచుండును. ఇతని క్షేమము నాకు వెంటనే తెలియఁజేయుఁడు,” అని ప్రార్థించి రాజు వెడలిపోయెను.

పరోపకారపారీణుఁడైన యోగి నాఁ డచ్చట నిలిచిపోయి, మాటిమాటికిఁ బ్రతాపునిశరీరస్థితిఁ బరిశీలించి యెప్పటి కప్పు డౌషధము మార్చి యతనికిఁ దగువిధమున నుపచార

ములు చేయించుచుండెను. ఆరోగము మహాప్రవాహమువలెఁ బొంగి వచ్చుచుండెను ; ఆ యౌషధబలమువలనఁ దఱుగుచుండెను. ఇట్లు రాత్రి రెండుయామము లతిక్రమించెను. ప్రాణనాథుఁ డప్పు డతని చేయిచూచి యచ్చటివారితో "దైవానుగ్రహమునఁ బ్రతాపుఁడు బ్రదికె"నని చెప్పెను. అదివిని వారందఱును సంతసించి కొంచెము ధైర్యముతో నుండిరి. స్వామి చెప్పినట్టుగానే తెల్లవాఱువప్పటికిఁ బ్రతాపుఁడు కొంచెము స్వస్థతఁ జెందెను. ఆయోగి వెంటనే ప్రతాపునికుశలవార్త రాజునకుఁ దెలియఁజేసెను.

# దిలారామ

## 11-వ యధ్యాయము

### చంపావతి శ్యామలయే

శ్లో. "మజ్జంతోఽపి విపత్పయోధిగహనే నిశ్శంకధైర్యావృతాః
కుర్వంత్యేవ పరోపకారమనిశం సంతో యథాశక్తి వై."

మానవులసంతోషము వర్షకాలపుసూర్యకాంతివంటిది. క్షణములోఁ గల్గుచుండును; క్షణములో మాయ మగుచుండును.

ఒకనాఁడు ప్రతాపుఁడును గేశవసింహుఁడును నొకచోఁ గూర్చుండిరి. వారికి సమీపముగా శాంతాపద్మావతు లుపవిష్టలయిరి. పరిచారికలు గొందఱు వారిని బరివేష్టించి యుండిరి. ప్రతాపుఁ డప్పటికిఁ బూర్తిగా నారోగ్యవంతుఁడై యుండుటచే వారందఱు నానందమగ్నులై వెనుకటివృత్తాంతములను జెప్పుకొనుచుండిరి. అప్పుడు చంపావతీ సహితయై దిలారామ యచ్చటికి వచ్చెను. అదిచూచి శాంతా పద్మావతు లెదురుగాఁ బోయి కౌఁగిలించుకొని వారిని గారవించిరి. అపుడు పద్మావతి దిలారామను జూచి, "అక్కా! నీయుపకార మెన్నటికిని మఱవఁజాలము. పలుమాఱు మాకుఁ బ్రాణదాన మొనర్చినను బ్రత్యుపకార మేమిచేయఁగలము?" అని పలికెను.

"సోదరీ! ఇందు నేనుజేసిన దేమియునులేదు, వారివారి యదృష్టమే వారినిగాచును. మనము నిమిత్తమాత్రలము. సాధు

వర్తనుల కందఱును దోడగుదురు. వారినందఱును సేవింతురు ఈ రాజపుత్రు(డట్టివాఁడు, మీరు నట్టివారలే; మీవంటివారిని సేవింప మాకు విహితము. మీరు నాయందు దయయుంచుట తప్ప వేతే ప్రత్యుపకారముచేయ నవసరములేదు," అని దిలారాము యనెను.

అదివిని శాంత, "అమ్మా! ఈ నీవచనమే నీ సాధుహృదయమును జాటుచున్నది. నీవు చిన్నదానవైనను గుణములచే మాకభివందనీయవు" అని పల్కి చంపావతిని జూచి, "యువతీమణీ! నీవుగూడ మా కనేకవిధములఁ దోడుపడుచున్నావు. నాఁడు మధురాపురమున మాకన్నపానాదు లొసంగి పెక్కుదినములు పోషించితివి. ఆ నీయుపకార మెన్నఁటికిని మఱవఁజాలము" అని పలికెను.

"చుట్టములుండుట యాపదలో రక్షించుటకేగదా?" అని దిలారాము యనెను.

"మాకీమె చుట్టమా?" అని శాంత ప్రశ్నించెను.

చంపావతి దుఃఖము నిలుపుకొనలేక లేచి శాంతపాదములపైఁ బడి యేడువనారంభించెను. అదేమో శాంతకు బోధపడలేదు. పద్మావతి వెలవెల బోవుచుండెను. కేశవప్రతాపు లాశ్చర్యముతోఁ జూచుచుండిరి. అప్పుడా చంపావతి దుఃఖమును నిల్పుకొని, "అమ్మా! నేను శ్యామలను, మీ కోడలను. మీకుఁ జుట్టమునే" యనెను.

శాంత యాశ్చర్యముతో నామెను కౌఁగిలించుకొని యేడ్చుచు, "శ్యామలా! శ్యామలా! బ్రదికియున్నావా? మాయదృష్ట మెంతమంచిది? ఈదిన మెంతసుదినము?"అని

సంతోషమును వెలిపుచ్చెను. అనంతరము పద్మావతి వదినె గారికి నమస్కరించెను; శ్యామల పద్మావతిని గౌఁగిలించు కొనెను. శ్యామల కేశవసింహునకు నమస్కరించెను; ఆతఁ డామెను దీవించెను. చంపావతి శ్యామలయని తెలిసినపుడు ప్రతాపునియానందమునకు మేరలేదు. వా రిట్లానందసాగర మునఁ గొంతసేపు దోప్పదోఁగిరి. వెనుకటి కష్టములన్నియు నీ సంతోషసముద్రమున లీనమయ్యెను.

అనంతరము శాంత కోడలిని దగ్గరగాఁ దీసికొని, అమ్మా! నీవలెనే నీభర్త బ్రదికియున్నాఁడు సుమీ ? అనిచెప్పెను.

"అవును. ఈమధ్యకాలముననే నా యదృష్టమువలన నాభర్తను జూచితిని. నిన్నటిదిన మిచ్చటనే యుండెను."

"శ్యామలా! నిన్ను మేమెంతమాత్రమును బోల్పలేకఁ బోతిమి ? నీవు మమ్ముఁ బోల్చితివా లేదా ?

"మిమ్ము మధురానగరముననే పోల్చితిని."

"నీవృత్తాంతము మా కేందులకుఁ దెల్పలేదు ?"

"మీకు దుఃఖమును గల్గింప నిష్టములేక."

"నీవృత్తాంత మిపుడు చెప్పుమా, వినెదము."

అప్పుడు శ్యామల యిట్లనియె. "అమ్మా! నాఁడు పడవ ప్రమాదవశమున మునుగుటచే భర్తతోఁగూడ యమును నలోఁ బడితిని. పిమ్మట మీకొడుకు నాకుఁ గనఁబడలేదు. నేనును మఱికొందఱమును నొకపుణ్యాత్మునిచే రక్షింపఁబడి తిమి. నాభర్త మృతినొందెనని నిశ్చయించుకొంటిని. మిక్కిలి విలపించితిని. చావ దలంచుకొంటిని, గాని బలాత్కార మర

ణము పాపహేతువని యాప్రయత్నమునుండి విరమించితిని. ఏబంధువులయింటికిఁ బోదును? మీరుతప్ప నితరులు లేరుగదా! సర్వదా మీయింట నేనున్నచో నన్నుఁ జూచుచున్న మీ కెప్పుడును దుఃఖము లేగదా? అట్టి దుఃఖమును మీకుఁ గూర్ప నిష్టము లేక మధురానగరమునఁ గొన్నిదినము లతికష్టముతోఁ గాలక్షేపము చేసితిని. ఆహారాదులు లభింపలేదు. ఒకనాఁడు దైవవశమున నీ దిలారామగృహమున కేగితిని. అప్పటి కీమె తల్లిజీవించియుండెను. ఆమె మిక్కిలి యోగ్యురాలు. నాచెప్పు కథల కామె యెంతయో సంతసించి నా కామెయింట విడిది యిచ్చి పోషించుచుండెను. నేను వండుకొని తిని యామె చెంతఁ గూర్చుండి ప్రతిదిన మేదియో ప్రసంగించుచుండెడిదానను. క్రమక్రమముగా నామెతోను, నీ దిలారామతోను నాకు మైత్రికలిగెను. కొంతకాలమున కామెతల్లి రోగపీడితయై మరణ సమయమున నన్నుఁ బిలిచి యీయువతి నప్పగించి, 'చంపా వతీ! నీవే దీనికిఁ దల్లివి. చేరఁదీసి రక్షింపుము. ఈయువతి గోరినవరునిఁ దెచ్చి పెండ్లిచేయుము. ఈమె సమస్తభారమును నీదే సుమీ! దీని కేలోపమును గలుగనీయనని నాచేతిలోఁ జేయివేసినఁగాని నాప్రాణము పోదని నాకప్పగించెను."

అనిచెప్పుచు శ్యామల కంటఁ దడివెట్టెను. దిలారాము యావృత్తాంతమును దలఁచుకొని యేడువ నారంభించెను. శాంతాపద్మావతులును గన్నుల నీరుగార్చుచు నామె నోదా ర్చిరి; అంత మరల శ్యామల యిట్లనియె. "నేనట్లుచేసెదనని ప్రమాణము చేసితిని. అదిమొద లీమెకు నేను దోడునీడనై వర్తించుచున్నాను. ఏనుహూర్తమున మామనస్సులు కలి

నెనోగాని మేమిరువురమును దోఁబుట్టువులకంటెను నెక్కువ ప్రేమతో మెలఁగుచున్నాము."

"శ్యామలా ! మేము కారాగృహమున బంధింపఁబడక మునుపు మధురానగరముననే యుంటిమికదా! మమ్మెపుడై నను జూచితివా?"

"లేదు. మీ రాపురమున నున్నారనికూడ నాకుఁ దెలియదు. రహీమిర్వుర ననాథయువతులను బాధించుచున్నాఁడని" నేవింటిని. కాని బాధింపఁబడువారు మీరేయని యెఱుఁగను. నాఁడు కారాగృహమున మిమ్మునుఁజూచి పోల్చికొంటిని. అది మొదలు మీ-సేవచేసి కృతార్థనైతిని."

"నీకు మేము చుట్టాలమని తెలిసియే కాఁబోలు ! ఈ యువతీమణి మమ్ముఁబోషింప సమకట్టినది? "

" మొన్నటివఱకును దిలారామ యది యెఱుఁగనే యెఱుఁగదు. నాఁడు మిమ్ముఁ బోషింపఁబూనుట పరోపకారచింతనే కాని వేఱుకాదు."

"శాంత దిలారామను గౌఁగిలించుకొని, "యువతీ ! మీయుపకారము వర్ణింప మేమశక్తలము. నాఁటిరాత్రి మీరు మానిమిత్తము చేసినసాహస మేమని చెప్పఁగలను ? తలఁచుకొన్న గుండె పగులుచున్నది. శ్యామలా! తరువాతియుదంతము చెప్పుము" అని యడిగెను.

"ఆరహీము బహుదుర్మార్గుఁడు. ఆతనిని వరింపుమని యాపురాధిపతిభార్య యీమెను మిక్కిలి ప్రోత్సహించుచుండెను. వాఁడుసద్గుణవంతుఁడు కాఁడేమోయని సందేహించి యీమె నిరాకరించుచుండెను. ఒకఫకీరిచ్చిన యుత్తరమువలన

రహీముచర్తనము మాకుఁ బూర్తిగాఁ దెలియవచ్చెను. అది మొదలీమె రహీమును రోయుచుండెను," అని శ్యామల చెప్పుచుండఁగా,

"మావదినె ప్రోత్సాహమువలన నాదుష్టుని వరించి గోతిలోఁ బడియుందును. కాని యామహాపురుషుఁడు నాకు రహీముచర్తన మెఱిఁగించి పుణ్యము గట్టుకొన్నాఁడు," అని దిలారాము పలికెను.

కేశవసింగదివిని, "యువతీమణీ! నాఁడు ఫకీరువేషముతో వచ్చినవాఁడను నేనే! రహీముచర్తనము నాకుఁ జిన్నప్పటినుండియుఁ దెలియును. నీవంటియుత్తమురాలు ల్చకిదుష్టుని వరించుట సముచితముకాదని యట్లు చేసితిని," అని కేశవసింగనెను.

"ఆఁ ఏమీ! నాఁడు ఫకీరుగావచ్చినవారు మీరా? ఆహా! నాకు మంచియుపకారము చేసితిరి. అయ్యా! మీరా వేష మెందులకు ధరించితిరి?" అని దిలారాము యడిగెను.

కేశవసింగు తనవృత్తాంతమును వినిపించెను. "ఈదిలారాము తన్ను వరింప నిష్టపడ లేదని రహీ మెఱుఁగఁడా యేమి?" అని శాంత ప్రశ్నించెను.

"ఎఱుఁగఁడు. ఈమె సంభాషణాదులవలన నట్టియభిప్రాయ మెప్పుడును సూచింపలేదు," అని శ్యామల బదులు చెప్పెను.

"మీరాపురమును విడిచి వచ్చుటచే రహీ మనుమానింపలేదా?"

"అనుమానింపకేమి? అనుమానించి మమ్ముఁ జంప నీ పుర మునకు వచ్చెను. కాని మేమతని మోసపుచ్చితిమి," అని శ్యామల యావృత్తాంతమును వినిపించెను.

అందఱును వారియుక్తికి మిగుల సంతసించిరి. "మా కిచ్చట సంభవింపనున్న యీ యపాయమును దప్పించుటకే మీరు మధురాపురినుండి వచ్చినట్లున్నది" అని శాంత యనెను.

"ఇట్లగునని మాకేమి తెలియును? మేమానాఁడు చేసిన సాహసము పురాధికారి యెఱిఁగి బాధించునేమోయని భయపడి యిచ్చటికి వచ్చితిమి. మాదురదృష్టవశమున నాదురా త్ముఁడుగూడ నిచ్చటికేవచ్చెను. ఈ ప్రతాపుఁ డాదుష్టుని సంహ రించి నాకును మా చెలియకును బరమానందము గల్గించెను," అని శ్యామల ప్రతాపుని సన్నుతించెను.

ప్రతాపుఁ డదివిని "పలుమాఱు మమాపదలనుండి తప్పించి మీరు గల్గించిన యానందములో నిది సహస్రాంశమై నను గాదు. ఇందు నుతించుట కేమున్నది?" అని ప్రత్యుత్తర మిచ్చెను.

వారెట్లు కొంతసే పన్యోన్యమును ప్రసంగించుకొని సం తోషసాగరమున నీదులాడుచుండిరి.

# విలారామ

## 12-వ యధ్యాయము

### రామనాథుని యుపదేశము

శ్లో. "స్త్రీషు న రాగః కార్యో రక్తం పురుషం స్త్రియః పరిభవంతి,
రక్తైవ హి రంతవ్యా విరక్తభావా తు హాతవ్యా."

నేఁడు పున్నమ. నిశాసమయము. అదియొక యామమాత్ర మతిక్రమించెను. సుధాకరుఁడు షోడశకళలతో విరాజిలుచుండెను. నాఁడతనియచ్చ కలాసముదయములో లీనమై కనఁబడియుఁ గనఁబడనివిధమున నుండెను. నీలాకాశమునఁ బ్రకాశించుచున్న చంద్రుఁడు నిర్మల జలపూరితమగు సరోవరమున వెలయు తెల్లఁదామరపూవు ననుకరించుచుండెను. పండువెన్నెలలు సాంద్రముగ వ్యాపించుటచే జగమంతయుఁ బాలగచ్చు చేయఁబడినట్లు సుందరముగాఁ గానవచ్చుచుండెను. చంద్రుఁడమృతకిరణుఁడు; అమృతసంపర్కమువలన నెండినమ్రాఁడులే చిగుర్చుచుండును. జీవులహృదయములు తలిర్చుటలో వింత యేముండును? ఆసమయము సర్వానందకరముగా నుండెను. మలయమారుతములు ప్రసరించి తదానందమును మఱింత వర్ధించుచుండెను.

దురదృష్టవంతులు దప్ప నాయానందసుఖ మనుభవింపనివా రెవ్వరుందురు? చంద్రికాప్రసారమును మలయమారుతమును దమంత తామె ప్రసరించి సుఖింపఁ జేయుచున్నను సుఖింపలేనివారు నిజముగా దురదృష్టవంతులే.

మొగల్ శిబిరమున నొక పురుషుఁడు తన గుడారము నకు ముంగిట నొక యాసనమునఁ గూర్చుండెను. వానిముఖము విచారపరీతమై యుండెను. అది వామకరాంబుజమున వ్రాలి యుండెను. నిట్టూర్పులు వెడలి వానిగడ్డమును బ్రక్కలకొత్తి గించుచుండెను. ఆ స్థితినరయ వానిహృదయమున నానంద మున్నట్లు గానరాదు. పండువెన్నెలగాని మలయమారుతముగాని వానినెమ్మనికి సంతోషముగొలుప లేకుండెను. లోపల విచారము విలయాగ్నివలెఁ బ్రజ్వరిల్లి బాధించుచుండ వానికానంద మెట్లు సంభవించును? శైత్యోపచారములు దేహతాపమును దొలఁగింపఁ గలవు కాని మనస్తాపమును దొలఁగింపఁ గలవా?

కొంతసేపటికి వేఱొకపురుషుఁ డతనిచెంతకు వచ్చి నిలువఁబడెను.

"మిత్రమా! సేనాధిపా!" అని సంబోధించెను. అతఁడు త్రుళ్లి పడిలేచి; రామనాథా! రామనాథా! వచ్చితివా! నీ నిమిత్తమే చూచుచున్నాను. నావిచారాగ్నిహోత్రము భవదీయవాక్సుధా సేచనమునఁ జల్లార్పనున్నాను" అనియెను.

"సేనాధీశా! వచ్చితిని. మనకు మహాపాయము సంభవించినది. తలఁచుకొన్న గుండె పగులుచున్నది. ఆహా! ఎంత కష్టము! నిష్కారణముగా మన సైనికులు హతులైరి."

"అందువలననే మఱింత విచారము. మనసైన్యము నశించెను. సుంతేనియు ఫలములేక పోయెను. చేఁజిక్కిన దుర్గము శత్రువుల పాలయ్యెను."

"దుర్గమేకాదు. చేఁజిక్కనున్న ఛత్రసాలుఁడుగూడఁ దప్పించుకొని పోయెను. మనయత్నములు ఫలించియు ఫలో

స్సుఖమయియుఁ జెడిపోవుటచే నాకు దురంతసంతాప ముదయించుచున్నది."

" మనరహస్యములు శత్రువుల కెట్లో తెలిసిపోయెనని తలంచెదను. లేనిచో నామహారణ్యములోని కాసమయమున వారెట్లు రాఁగలుగుదురు? వారు రానిచో ఛత్రసాలుఁడు మన వీరులచేఁ జచ్చుటో, మనకుఁ జిక్కుటోయైయుండును."

" మిత్రమా, నీవన్నది సత్యమే. ఛత్రసాలుఁ డెంతటి వీరుఁడైన నొక్కఁ డేమిచేయఁగలఁడు? అతఁడు కత్తిద్రిప్పుచుఁ దనప్రాణమును గాచుకొనుచుండెను. కాని యట్లెంతసేపు త్రిప్పగలఁడు ? కొంతసేపటి కారాజలసిపోయెను మనతలంపు నెఱవేఱినట్లే నిశ్చయించితిని. కార్యము ఫలోన్ముఖమై యుండుటచే మనవీరు లతనికరవాలమున కెరయగుచున్నను విచారింపలేదు. కాని యింతలో యమదూతలవలె మువ్వురు యోధులచ్చటఁ బ్రత్యక్షమైరి. మనవీరుల నెదుర్కొని విదారింప నారంభించిరి. ఇఁక నేమిచెప్పను ? క్షణకాలములో మనకార్యమంతయుఁ జెడిపోయెను. నా మనోరథమంతయు మంటఁ గలసిపోయెను. నాయుత్సాహము భగ్నమయ్యెను. నాసంతోషమంతరించెను. నాయాశాసౌధము గూలిపోయెను మిత్రమా! మన రహస్య మొరులు దెలిసికొనిరని నేను నమ్మఁజాలను. నాసేవకులలో నట్టి స్వామిద్రోహులు లేరు. నాఁటి శత్రువులరాక కాకతాళీయమువంటిదని తలంచెదను."

" ఎట్లయిన నేమి ? మనకార్యము పూర్తిగా నశించెను గదా ? ఉక్కుతునుకలవంటి సైనికులు గూలిరిగదా ? ఇఁక నిప్పుడేమిచేయుట ? ఆదుర్గము వైరులపాలగుటచే వెనుక మన

కొనుకొన్న యత్నముకూడ సాగునట్లులేదు. అడుగమఱచితిని. ఆనాఁడు నీసేవకుఁడు రాలేదేమి? వచ్చినచో రాజధానిపైకిఁ బోయినను మనకుఁ గొంత మేలుగలుఁగునేమో?"

"అదెట్లయినదో చెప్పెదవినుము. నాఁడు నాసేవకుఁడు వచ్చుచుండఁగాఁ బాము కఱచినదట! వాఁడు చచ్చి బ్రదికెను. ఆలోచింప నాఁడు మీరతని వెంట వచ్చినను గార్యము సులభ సాధ్యముకాదు. ఛత్రసాలుఁడు చిక్కినచో వానిని మనవారి కప్పగించి నేను వడివడిగావచ్చి మిమ్ముఁ గలిసికొని మాయో పాయముచేఁ గోటలోనికిఁ గొనిపోవలెనని యెంచితిని. కాని రాజు మనకుఁజిక్కకపోవుటచే మన మనుకొన్న సమయమునకు రాజధానిని జేరలేకపోతిని. మీరు రప్పుడు వచ్చినను యుద్ధము పొసఁగక మానదు. అది సంభవించిన నున్నసైన్యముకూడ హతమయియుండును."

"రామనాథా! శత్రుసైన్యమున నొక జీవమునైనఁ గొన కుండ మనము దుర్గము స్వాధీనము గావించుకొంటిమి. వారో తమవారిలోనొకఁడైనఁ జావకుండ మనసైన్యమును బూర్తిగాఁ గూల్చి దానిని స్వాధీనము చేసికొనిరి. వారికీ విషయమున నెంత లాభము గలిగినదో చూడుము."

"అది మనరహీము తెలివితక్కువచేఁ గలిగినది. రహీము కామాంధుఁడై కార్యము చెఱిచెను. వాఁడు బుద్ధిహీనుఁడు. ఆదిలారామకుఁ దనుఁ బ్రేమింప నిష్టము లేనియప్పుడు వాఁడు దానిఁ జేరనీఁగూడదు. తనపై ననురక్తయగు కాంతపై మనస్సు నిల్పినందులకు వానికి మధురానగరముననే తగిన ప్రాయశ్చిత్త మైనది అనునను వాఁడు బుద్ధితెచ్చుకొనక మరల వారినే

నమ్మి యింత దెచ్చెను. తన ప్రాణము గోల్పోయెను; మనకార్యము చెఱిచెను. తన్ను వలవనికాంతను దాను వలఁచినచోఁ బరాభవము తప్పదు. కావున బుద్ధిమంతుఁ డగువాఁ డట్టికాంతల చెంతకుఁ బోరాదు. రహీమింత కామాంధుఁడని యెఱుఁగక యేటఁబడితిమి? ఇఁకనైనను జాగరూకులమై వర్తింపవలెను. లేనిచోఁ గృతార్థులము కాలేము."

"వెనుక మనవిజయవార్తవిని చక్రవర్తి యెంతో సంతోషించి పెక్కుబహుమతులు పంపెను. ఇప్పుడీయపజయవార్తవిని యేమిచేయునో యని భయపడుచున్నాను. ఈయస్థైర్యముచేఁ జేయవలసినదేమో నిశ్చయింపలేకున్నాను."

"మిత్రమా! నీవంతమాత్రమునకు భయపడకుము. తగినజయోపాయము నాలోచింతము."

"ఓయీ! చక్రవర్తివర్తనము నీవెఱుఁగుదువుకదా? మనకుఁ బూర్వమువచ్చిన సేనానాయకుని గతి యేమయ్యెనో తెలియునా? అతఁడు బుందేలులకుఁ జిక్కి విడిపించుకొనుటకు లక్ష యేఁబదివేలిచ్చుకొనెను. అచ్చటి కరిగినతోడనే చక్రవర్తిసభలో వానినిందించి వానియుద్యోగమును బిరుదములను నూడఁదీసెను. మనము విఫలులమైనచోఁ జక్రవర్తిమొగ మెట్లు చూడఁగలము? చూచినను సర్వస్వముమీఁదను నాశ వదలుకొనవలసినదే! మహాసభలో నతనియెదుట నేనెన్నియో ప్రగల్భములు పలికి వచ్చితిని. ఇపుడు వట్టిచేతులతోఁబోయిన నెంత యవమానమో, యెంత చిన్నతనమో, ఎంత దుఃఖకరమో యూహింపుము. కావున మన మెట్లయిన నిదివరకు వచ్చినవారికంటెఁ గొంతకార్యమైన సాధింపకుండిన నిఁక ఢిల్లీకరుగుట

దుర్ఘటము. దుర్గము స్వాధీనమగుటవలన నాకుఁ గొంచెమాశ యుదయించెను. కాని యది యిప్పుడు సమూలముగా నున్మూలింపఁబడెను."

"నీవంతగాఁ జెప్పనక్కఱలేదు. మనము కార్యముసాధింప లేక పోయినచో నీకేకాదు. చక్రవర్తివలనఁ బరాభవము నాకు-కూడఁ గలుగక మానదు. వెనుక మహారాష్ట్రమున నేను జూపిన మాయాచాతుర్యమునకుఁ జక్రవర్తి యెంతయో సంతసించి యెక్కుడుగా గౌరవించి నాకంటె నితరుఁ డీబుందేలుల మోసపుచ్చువాఁడు లేఁడని నమ్మి నన్నిచ్చటికిఁ బుత్తెంచెను. యుక్తవచనములచేఁ జక్రవర్తిని సంతసపఱిచి వచ్చితిని. జయమందినను బరాజయమందినను జక్రవర్తివలన మన మిరువురము గూడ సమానఫల మందవలసినవారమే. ఈ కార్యమును సాధింప నీకంటెను నేనెక్కువ వేగిరపడుచున్నాను," అని రామనాథుఁ డనెను.

"మనము చేయవలసిన పనియేమి?"

"మనపరాజయమును సార్వభౌమునకుఁ దెలియకుండ నుంచుట మొదటి కార్యము."

"ఇప్పు డట్లుచేసినను దరువాత నౌరంగజేబునకుఁ దెలియక మానునా? తెలిసిన మనమోసమును గ్రహించి ప్రాణములతో మిగుల్చునా?"

"నీవన్నది సత్యమే. కాని యీపరాజయమును, జయమును నొక్కమాఱే తెలిసిన మంచిదని నా యభిప్రాయము. పరాజయము జయములో లీనమై దుష్ఫలప్రదాయి కానేరదు."

"జయముగల్గునని నీవు నిశ్చయముగాఁ జెప్పఁగలవా?"

"ఆఁ; చెప్పఁగలను. ఒకవేళఁ బరాజయమే సంభవించు నని యనుకొనుము. అప్పుడైనను నీరెండు నొక్కుమాటు దెలుపుటయే మనకు క్షేమము."

"ఏమది?"

"చక్రవర్తివలనఁ గల్గు దుష్ఫలమేదో యొక్కటే సంభవించును. కావున రానున్న దుఃఖముగూడ నొక్కమాఱే కాని పలుసారులుండదు."

"నీవు చెప్పినది సరియే! తరువాతఁ జేయవలసినదేమి?"

"అందులకొక యుపాయమున్నది."

"ఏమది?

రామనాథుఁ డాతురుష్కసేనాని చెవులో నేమేమో చెప్పెను. అతఁ డదివిని కొంచెము సంతసించి, "మిత్రమా! నీయుపాయము కార్యకారియే. కాని యది నిర్విఘ్నముగా జరుగవలెను. ఈరహస్య మొరులచెవి సోఁకకుండ నుంప వలయును."

"అవును. కానిచోఁ గార్యమెట్లు సాధింపఁబడును!"

"ఆనాఁటికిఁ దప్పక పంపెదవా?"

"పంపెదను," అని చెప్పి రామనాథుఁ డాయడవిలో నంతర్ధానము చెందెను.

సదరుద్దీనుని మనస్సతని వచనములవలనఁ గొంచెము కలకఁ దేటెను. అతఁడు తనశిబిరమునకుఁ బోయి నిద్రించెను.

# దిలారామ

## 13-వ యధ్యాయము

శ్యా ౧ల ప్ర

గీ. "పరులొనర్చినయుపకృతిఁ మఱవఁజాల
వేడ్కఁ బ్రత్యుపకృతిచేయఁ వెనుకఁదీయ
వలయుచో నిత్తు నాదుజీవంబునైనఁ
గాని నేను గృతఘ్నుండఁ గాను నిజము."

ఒకనాఁడు పద్మావతి తన శయ్యాగృహంబున ద్వారముచెంతఁ గూర్చుండెను చెలికత్తెయొకతె చమరీవాల సదృశమగు నామె కేశకలాపమును జిక్కుడల్చి జడయల్లుచుండెను. ఆయువతి యద్దమును జూచుకొనుచు నిదివఱకు దువ్వినపాపటను సవరించుకొనుచుండెను. ఆసమయమున నొకయువతి యచ్చటికరుదెంచెను పద్మావతి యామెనుజూచి "వదినే? శ్యామలా! రమ్ము; కూర్చుండుము," అని మర్యాదచేసెను

శ్యామల యామెచెంత గూర్చుండెను. చెలికత్తె జడయల్లి ముగించుటచేఁ బద్మావతియు నామె కభిముఖముగాఁ దిరిగెను. తెలిదమ్మిఱేకుల మాలికల నీసడించుఁ దనచూపుల నామెవదనముపైఁ బఱపి "వదినే! నీ వొక్కర్తుకవే వచ్చితివి. మనహితురాలు రాలేదేమి?" అని యామె యడిగెను.

"రాలేదు; ఇంటనున్నది."

"ఏమి చేయుచున్నది ?"

"ఏమి చేయును ? విచారించుచున్నది."

పద్మావతి నివ్వెఅపాటును సూచించుచు, "ఏమేమీ ! విచారించుచున్నదియా ?" అనెను.

"అవును ; అంతకంటె నామె చేయునదేమి ?"

"అందులకుఁ గారణము ?"

"ప్రారబ్ధము."

"వదినే ! పరిహాసములాడక యథార్థవృత్తమును దెలుపుము. విచార కారణమేమి ?"

"పరిహాసమాడలేదు. వాస్తవమునే చెప్పుచున్నాను."

"నీవన్నది సత్యమే యైనచోఁ బ్రారబ్ధ మనుభవమునఁ గాని నశింపదందురు. అనుభవమునఁగాక దాని నశింపఁజేయు నుపాయ మేదియు లేదా ?"

"అందులకొక యుపాయమున్నది."

"అది సాధ్యమగునా ?"

"అగును."

"ఎవరికి ?"

"నీకు."

పద్మావతి వెఱఁగందుచు, "ఏమీ ! వదినే ! ఆయువతి విచారమ్ము తొలఁగింప నాకు సాధ్యమా ? అట్లయిన నామె విచార మిప్పుడే యంతరించును."

"నిజముగా నాసుందరి విచారము తొలఁగింపవలెనని యున్నదా ?"

"ఉన్నది."

"ఈపాట యెచ్చటనుండి వచ్చినది?"

"నాలుకచివరనుండి కాదు; హృదయకుహరమునుండి."

"చక్కఁగా నాలోచించుకొని చెప్పుము."

"వదినే! నాయంతరాత్మతో నాలోచించు కొనియే చెప్పుచున్నాను. నీవింతగా నన్నడుగ నక్కఱలేదు. అనేక పర్యాయములు మానప్రాణములు గాచిన యువతీమణి కేమి ప్రత్యుపకారము చేసిన ఋణవిముక్తియగునో తెలియఁజాలకున్నాను. త్రికరణశుద్ధిగాఁ జెప్పెదను వినుము. పద్మావతి యెప్పుడును గృతఘ్నురాలు కానేరదు. వేయేల? ఆమె నిమిత్తము నాప్రాణములు విడువుమన్నను సంతోషపూర్వకముగా విడుతును."

ఆమాటలు విని శ్యామల యాశ్చర్యమగ్నురాలయ్యెను. పద్మావతిహృదయ మట్టి నిరంకుశమైనదని శ్యామల యదివఱకెఱుఁగదు. ఆమె మందహాసముచేయుచు, 'వదినే! పద్మావతీ! నీవట్టి యభయహస్త మిచ్చెదవేని మన చెలికి విచారమే లేదు."

"తప్పక యిచ్చితిని; చెప్పుము."

"ఆసుందరి తనకున్న సర్వస్వమునువిడిచి యీదేశమునకు వచ్చి యీపురమునం దుత్తమజననివాసమునకుఁ దగనియింట వసించి పలుబాధలనుభవించుచుండుట యెందుకో తెలియునా?"

"తెలియదు. నీవే చెప్పుము."

"రూపమున నవమన్మథుఁడును, బలాక్రమమున శ్రీరాముఁడును, గుణరత్నముల సముద్రమును నగు మాయన్నను బ్రతాపరాయుని—," అని యాపయి శ్యామల చెప్పమానెను.

"నీకాసందియ మెందుకు? చెప్పుము. ప్రేమించి వచ్చిన దనియేకాదా నీయభిప్రాయము?" అని పద్మావతి యడిగెను.

శ్యామల తలయూఁచెను.

"దీనికింత విచారమేల? ఇంత సంశయింపనేల? ఆమె యభీష్టము దీర్ప నాయభ్యంతర మేమియు లేదు. నాభర్తయా యువతిని బరిగ్రహించినచో నమందానందము చెందెదను. సౌందర్యాది గుణముల నాలోచించి చూచిన నాకంటె నా యువతియే నాభర్తకుఁ దగిన యిల్లాలు. ఆమెను నా సోదరినిగా భావించుచున్నాను. నావచనములం దన్యత మేమియును లేదు; నేనిందులకు సమ్మతించుటయే కాక నాభర్తనుగూడఁ బ్రోత్సాహించెదను," అని పద్మావతి నిండుమనంబుతోఁ బలికెను.

శ్యామల యామె గుణసంపదకు మిగుల సంతసించెను. లోకములో స్త్రీలు తనభర్తను వేఱొకయువతి ప్రేమించి వచ్చిన నామె నెంతో తిరస్కారముగాఁ జూతురు; దానితో నకారణవైర మూనుదురు; కలహము పెంచుకొందురు; తుద కాలలనను నానాబాధల పాల్చేసి తాము నానాశ్రమలుపడి సుఖము చెఱుచుకొందురు. పద్మావతియు నట్లే ప్రవర్తించునని తలఁచి శ్యామలా దిలారాములు సందియపడుచుండిరి. ఈయభిప్రాయముచేతనే పద్మావతి యుండఁగాఁ బ్రతాపునిఁ జూడ నూతనదుర్గమునకుఁ బోవ మానిరి. ఇపుడు శ్యామల యధికానందభరితురాలై ఇఁకఁ బ్రతాపరాయుని సమ్మతింపఁజేయుట యతిసులభమని సంతసించి, పద్మావతిని జూచి, "యువతీ! నీయుత్తమగుణము శ్లాఘనీయము. నీహృదయముకృతజ్ఞతాపూర్ణము. సర్వవిధములచేతను మనల నమ్మివచ్చిన యువతి కట్టి

యుపకారము చేయుట ముఖ్యకార్యము. మాయన్ననుజూచి మాటాడెదను. సమయమరసి నీవుగూడ నిక్కార్యమునుజక్కఁ జేయఁ బ్రయత్నింపుము," అని పలికి శ్యామల ప్రతాపునిచెంత కరిగెను.

శ్యామల యుత్తమప్రవర్తనము పరోపకారబుద్ధియుఁ బ్రతాపున కెంతో సంతోషకరములు. నాఁడు మధురానగరమునఁ దమకు సంభవించిన మహాపదను దప్పింప నామె పన్నిన యుపాయము లతని కత్యాశ్చర్యము గొలిపెను. ఆకారణమున నతఁడు శ్యామల నెంతో గౌరవించుచుండెను. ఆయువతి తనకు బాంధవురాలని తెలిసినప్పటినుండియు మఱింత గౌరవించుచుఁ దనసోదరికంటె నామె నెక్కుడుగాఁ బ్రేమించుచుండెను. ప్రతాపుఁడు శ్యామల కిప్పుడు యుక్తగౌరవ మాచరించి, "సోదరీ! యెందుల కిటువచ్చితివి?" అని యడిగెను.

"నీసందర్శనమునకు."

"దిలారామకు మనమిచ్చిన భవనాదులు సుఖకరములుగా నున్నవా?"

"అని నేనుజెప్పలేను."

"భవనాదు లామె కనర్హములా?"

"కావు."

"మఱియెందుచే నట్లంటివి?"

"నీవు సమస్తమెఱిఁగియు నన్నిట్లడుగుట యనుచితము."

ప్రతాపుఁడు కొంచె మాలోచించి శ్యామలను జూచి, "సోదరీ! నీయభిప్రాయము నా కవగతమైనది. దిలారామ

యత్యుత్తమురాలు ; హితురాలు ; సౌందర్య మహితురాలు ; సద్గుణవంతురాలు ; పరోపకారిణి ; మంజుభాషిణి. అట్టియువతిని వరింప నెవ్వనిమన మారాటపడదు ? ఆమెను వరింపవలెననియే యున్నది. మొగలిపుష్పమును జేకొన నెవ్వఁడిష్టపడఁడు? కాని దాని నొక కాలసర్పము పరివేష్టించియున్నది. ఎవఁడు సాహసించి దానిఁ జేకొనఁగలఁడు! సర్పమస్తకమునయున్న రత్నమొత్తో మనోహరమైనది; కాని యెవఁ డారత్నమును గ్రహింపఁగలఁడు ? అట్లే దిలారామ యుత్తమురాలయినను మహమ్మదీయ సంబంధముచే నిషిద్ధురాలు. ఏమిచేయుదును ? నేనొకవేళ సాహసించి పెండ్లాడినచో నాకులమునకుఁ దీఱని కళంకము సంభవించును. ఆ కళంకము నాతో నశింపదు ; ఆచంద్రార్కమును భూమిపై నిలిచిపోవును అందులకు నేనిష్టపడను. కాని మీరు నిర్బంధించినచో నామెను వరింపఁ బద్మావతీసహితుఁడనై మహమ్మదీయుఁడ నయ్యెదను," అని పలికెను.

శ్యామల కొంచెము యోజించి, "అన్నా! ఆమె క్షత్త్రియకులజ. చిన్నప్పు డెప్పుడో మహమ్మదీయ సంబంధము గల్గియుండును. అంతేకాని తరువాత నాసంబంధమేమియు లేదు. నేనే యామెకు సకలోపచారములను జేయుచుంటిని. అట్టియువతి నిషిద్ధురాలు కాదని నానమ్మకము," అని పల్కెను.

"సోదరీ! అట్లనకుము. ఎప్పుడైనను నామెకు మహమ్మదీయ సంబంధము లేకపోలేదు. అట్టిదానిఁ బరిగ్రహించిన లోకు లేమందురో యోజింపుము."

శ్యామల మఱి మాటాడలేక లేచి వెడలిపోయెను.

శివాజీ—ఛత్రపతి—క్షత్రియకుల—రామ

# విలారాము

## 14-వ యధ్యాయము

### మొగలాయీల పరాభవము

శ్లో. "స్వయం మహేశః శ్వశురో నగేశః
సఖా ధనేశ స్తనయో గణేశః,
తథాపి భిక్షాటనమేవ శంభో
ర్బలీయసీ కేవలమీశ్వరేచ్ఛా."

సూర్యుఁడపరాంబుధిలోఁ గ్రుంకెను. ఆకాశ మింకను సాంధ్యరాగమును విడిచిపెట్టలేదు. దిగంతములను దక్కఁ దక్కినచోట్ల నింకను జీఁకట్లు క్రమ్మలేదు. గురుఁడు శుక్రుఁడు మొదలగు పెద్దచుక్కలు మూఁడునాల్గు మాత్రమే యాకాశమునఁ దొంగితొంగి చూచుచుండెను; ఇంకను బ్రకృతియంతయుఁ బూర్తిగాఁ నిస్తబ్ధతను వహింపలేదు. పశువు లింకను గోష్ఠంబులఁ బ్రవేశింపలేదు. వెనుకఁబడి జిక్కిపోయిన కాకాది పక్షివిశేషము లింకను గగనమునఁ బ్రయాణము చేయుచునే యుండెను.

ఆసమయమున మొగలుల శిబిరములలో నెక్కువ కలకలధ్వను లుదయించెను. సైనికులందఱును మిక్కిలి చుఱుకుగాఁ దిరుగుచుండిరి. కార్యభారము తలపైఁబడినప్పు డెట్టిమందుఁడైనను జుఱుకుదనమును వహించును. అట్లుండ, సదరుద్దీను

వంటి మహావీరునిమాట చెప్ప నేల ? అతఁడు నాఁడు యుద్ధానుకూలవేషము ధరించి యిట్టిటు నడయాడుచుండెను ; సైనికుల హెచ్చరించుచుండెను. త్వరగా వారివేషములు ముగింప నాజ్ఞాపించుచుండెను. వారును నతిశీఘ్రకాలములోనే యుద్ధవేషముల ముఁగించిరి.

సదరుద్దీనున కింకను మెఱియలవంటి సైనికులు మూఁడు వేలమంది కలరు. వారందఱును ఖడ్గకవచాది యుద్ధసాధనముల దాల్చి యమదూతలవలె భయంకరులై సమరసముత్సాహపూర్ణులై యుండిరి బుందేలుఖండమునెల్ల నొక్క గ్రుక్కను మ్రింగవలె నన్నంత యాఁకఁటితో వారుండిరి. వారు తమ పతి శాసనముచే బారులుగట్టి నిలువఁబడి యొక్కొకపంక్తికిఁ బదిగురుచొప్పున నుండిరి. ఆసైనికులందఱు నొకదానివెనుక నొకటిగా మున్నూఱుపంక్తులఁ దీర్చిరి. సేనాముఖమున నుపసేనానాథుఁడగు హుస్సేనుండెను. సదరుద్దీను వెనుకతట్టునను బార్శ్వములందును సంచరించుచు సైనికుల కుత్సాహము గల్గించుచుండెను. అంతయు సిద్ధమైనను, నేకారణముచేతనో కాని సైన్యమున కింకను నడువ నాజ్ఞ లేదు.

నాఁడు కృష్ణపక్ష ద్వితీయచంద్రుఁడు పొడుపుకొండ దండను జూపట్టి తన యమృతకరములను లోకముపైఁ జల్లి ప్రాణులను సంతసింపఁ జేయుచుండెను. తదీయఁ కాంతిచేఁ జీకటిఁ గొంత తఱిఁగెను. చంద్రుఁడు ప్రయాణసన్నద్ధులైన మొగలు సైనికులకుఁ గరదీపికవిధమున నుండెను.

ఆసమయమున నొకపురుషుఁడు వేగముగా వచ్చి సదరుద్దీనుఁగాంచి నమస్కరించెను. ఆనూతనపురుషుని గాంచి యతఁ

దమితానందము చెంది, "ఓయీ! క్షేమముగా వచ్చితివా? సర్వమును సన్నద్ధమైనది. నీనిమిత్తమే ప్రతీక్షించుచున్నాము," అని పలికెను.

"సేనాధిపా! ఇఁక నాలస్యమెందుకు? సైన్యమును గదలింపుము. నిశీథసమయమునకు రాజధానిని సమీపింపవల యునని రామనాథుఁ డాజ్ఞాపించి యున్నాఁడు. వేగముగాఁ బోవుదము లెండు. అయ్యో! చెప్ప మఱచితిని. సైన్యమును నిశ్శబ్దముగా నడపింపవలెనని మాయజమానుఁడు మీతో మఱిమఱి చెప్పుమనెను. రాజధాని చొచ్చునందాఁక యట్లు వచ్చినచో జయలక్ష్మి కరతలామలకమని యతఁడు వచించెను. మీరావచనమును బాటించి కృతార్థు లగుఁడు," అని క్రొత్త పురుషుఁడు విన్నవించుకొనెను.

సదరుద్దీనదివిని మిక్కిలి సంతసించి, "ఓయీ! రామ నాథుని యాలోచనము మన కవశ్యాచరణీయము అట్లే చేయు దము. శత్రుదుర్గము చొచ్చునందాఁక మన రాక దెలియనీ రాదు. నేను వెనుకనుండి సైన్యమును నడపుదును. నీవు హుస్సేనుతోఁ గలసి ముందుండి మార్గచోదకుఁడవు కమ్ము" అనిచెప్పెను. అతఁ డందుల కంగీకరించి ముందునకు నడిచెను. హుస్సేనును నాపురుషుఁడును దారిచూపుచుఁ బోఁజొచ్చిరి. సైనికులు వారిని వెంబడించిరి. సేనాధిపతి వారి వెనుకభాగ మున జాగరూకుఁడై నడచుచుండెను. అతనియాజ్ఞచే నెవ్వ రును మాటాడలేదు. అడుగులచప్పుడు తప్ప మఱేమియు విన రాలేదు. ఆ యాఱువేల యడుగులు నొక్కమాఱే పడుచుం డుటచే నాచప్పు డొక్కటిగానే వినవచ్చుచుండెను. అయిన

నది గంభీరమై ప్రశాంతమగు నాసమయమునఁ బెక్కుమైళ్లు వఱకు వ్యాపించుచుండెను. ఆప్రాంతారణ్యములలో నివసించు మృగము లాధ్వనికి వెఱఁగంది యథాయథలై పోవుచుండెను.

సైనికులు విశాలమగు మైదానమున కొంతదూరము నడిచి యొక మహారణ్యమున ప్రవేశించిరి. అందలిమార్గము మిక్కిలి యిఱుకుగా నుండెను. వరుసగాఁ బదుగురికంటె నెక్కువమంది పోవ వీలులేదు. సదరుద్దీనది రామనాథునివలనఁ దెలిసికొనియే తనసైనికుల నట్లు బారులు దీర్పించెను సైనికులు నిరాటంకముగాఁ బోవుచుండిరి. వారిఁక నొకకొండలోయ నతిక్రమింపవలసి యున్నది. అది దాఁటినచో నిఁక రాజధాని పైఁబడినట్లే. అచ్చటికిఁ బో గలిగినచో నతిసులభముగా రాజధానిని బట్టుకొందురు. అట్టిదుర్గము స్వాధీనమైనచో నిఁక బుందేలుఖండమును జయింపఁ గష్టమేమున్నది? ఇట్టితలంపులతో సదరుద్దీనుహృదయము పరిపూర్ణ మగుచుండెను; ఉత్సాహ మధికమగుచుండెను; జయలక్ష్మి యతనిహృదయ రంగమునఁ దాండవించుచున్న ట్లతనికిఁ దోఁచుచుండెను. అతనికేకాదు; మొగలుసైనికు లందఱకు నట్లే తోఁచుచుండెను.

వారు నిరాటంకముగా నిశ్శబ్దముగా నాలోయను జొచ్చిరి. దానికిరుప్రక్కలను నెత్తయిన కొండలున్నవి. వానియందుండు నడవులు సాంద్రములుగావు. వాని చఱియలు మిక్కిలి యేటవాలుగా నుండెను. చంద్రుడింకను నభోమండల మధ్యవర్తి కాకపోవుటచే నాలోయలోఁ దత్కాంతులు ప్రసరింపలేదు; ఒకప్రక్కనున్న కొండశిఖరమున మాత్రము పడుచుండెను.

ఇంతట నొక గంభీరమైన శబ్దమేదో వినవచ్చెను. అది విని సైనికులు నిలిచిపోయిరి. ముందునకడుగుపడ లేదు. ఒక వరుస తర్వాత నొకటిగా సైనికపంక్తులు నిలువఁబడిపోయెను. ఆధ్వని యేమోయని వారు యోజించుచుండిరి. ఆ చప్పుడట్లు వినవచ్చుచునే యుండెను. ఏనుగుతలకాయంత తాటిగుండొకటి మహావేగముతో వచ్చి సైనికపంక్తులపైఁ బడెను. దానివేగమును సైఁపఁజాలక రెండుపంక్తులవారు నలఁగిపోయిరి. కొందఱి ప్రాణము లెగిరిపోయెను. మఱికొందఱి యవయవములు నలఁగిపోయి నేలఁ బడిపోయెను. దీనివలన సైనికులలోఁ గళవళపాటు హెచ్చయ్యెను. వారిక నిశ్శబ్దముగా నుండఁజాలక పోయిరి. వారి కోలాహలధ్వను లాలోయను నిండెను. వారట్లు తడఁబడునంతలో మఱికొన్ని పెద్దపాషాణము లుభయపార్శ్వము లందున్న కొండలశిఖరములనుండియు దొరలివచ్చుచుండెను. శిఖరమువిూద విడిచిన పాషాణ మొక్కటియే యైనను నది మార్గమధ్యమునఁ బట్టుదప్పియున్న మఱికొన్ని బండలను దోడ్కొని వచ్చునుగదా? గంభీర మేఘగర్జనమువంటి ధ్వనులు వినఁబడుటతప్పఁ బాషాణములసంఖ్య యెంతో తెలియకుండెను. సైనికులు పెక్కండ్రు చచ్చిపోవుచుండిరి. అదిచూచి భయపడి మొగలులు ప్రాణములు గాచుకో యత్నించిరి; కాని యెట్లు కాచుకోఁగలరు? ఆపాషాణము లెటునుండి వచ్చుచున్నవో యాచీఁకటిలో వారికి గోచరింపలేదు. ఎటుపోవుటకును వారికిఁ దోఁపలేదు. కొందఱు బెగిలి చచ్చుచుండిరి. కొందఱు హాహాకారములు చేయుచుండిరి. ఒక్కొకపాషాణము పెక్కుర ప్రాణములు దీయుచుండెను. ఒక్కటియు వ్యర్థముగాఁ

బోలేదు. ఒకయఱగడియకాలములో మూఁడువంతులసైన్యము నేలఁగూలెను; వారికి మార్గచోదకుఁడై వచ్చిన పురుషుఁడా చీకటిలోఁ గనఁబడలేదు. వాఁడు ముందఱకరిగెనో లేక యాపాషాణఘాతముల మ్రందెనో దెలియలేదు. హాసన్నెట్లో ప్రాణములు పిడికిటిలోఁ బెట్టుకొని సేనాధిపతిని సమీపించెను. ఇఁక నిక్కడనుండివఁ బ్రాణములు దక్కవని హతశేషులగువారిని దోడ్కొని సేనాధిపతి వెనుకకుఁ బర్వెత్తెను. క్షణకాలములో వారాలోయను దాఁటిపోయి ప్రాణములు దక్కినవని సంతోషించిరి. సదరుద్దీనావృత్తాంతమును దలఁచుకొని గుండె బ్రద్దలు చేసికొనెను. తమరహస్యమును శత్రువీరు లెట్లో తెలిసికొని యీయుపద్రవమును గల్గించిరని యతఁడు భావించెను. మాయచేఁగాక బహిరంగముగా శత్రువుల నెదుర్కొని పోరినచోఁ గొంతైనను జయము గల్గునుగదా యని యతఁ డప్పుడు చింతింప నారంభించెను. తనసైనికులలోఁ బెక్కండ్రను వ్యర్థముగాఁ జంపుకొంటినని కడుంగడు దుఃఖింపఁ జొచ్చెను. ఇఁకఁ జక్రవర్తి మొగము చూచుటెట్లో యతనికి బోధపడలేదు. అతఁడు సైనికులతో వెనుకఁ దామువిడిసియున్న స్థలమునకు మరలి వచ్చుచుండెను. సైనికులతోఁగూడ సదరుద్దీను కొంచెముదూరము నడుచునప్పటికి వారికి ముందువైపునుండి యేదియొధ్వని వినవచ్చెను. తోడనే యతఁడు నిలువున నీరయిపోయెను. ఇంతలో నొక మహాసైన్యమువచ్చి వారిని జుట్టుముట్టెను. ఇఁక మొగలు సైనికులలో నెవ్వరికిని బ్రాణములపై నాశలేదు. శక్తికొలఁది పోరాడి వీరమరణమునొంద నిశ్చయించుకొని వారు శత్రువులఁ దార్కొనిరి. వారి నిశాతకరవాలములు శత్రుకరవాలముల

మార్కొనెను. యుద్ధము ప్రారంభమయ్యెను. ఒక్కించుకకాలము సంకులసమరము జరిగెను. ఇరుప్రక్కలను జాలమంది చచ్చుచుండిరి. కొంతసేపటికి మొగల్ సేన నిశ్శేషమయ్యెను. బుందేలు సేనాధ్యక్షుఁడగు ప్రతాపుఁడాసమ్మర్దమున మెల్లఁగా హుస్సేనుని బట్టికొని కొంతసేపుపోరి చిత్రవధగావించి తనకసి దీర్చుకొనెను. తరువాత నతఁడు సవరుద్దీను నిమిత్తము వెదకెను. గాని యతఁడు గానరాలేదు. పోరాట మారబ్ధమగునప్పుడే నాతఁడు మెల్ల మెల్లగా జాఱి ప్రాణములు దక్కించుకొనెను. ఇట్లాదినమున నించుమించుగా మొగలు సైన్యమంతయుఁ గూలెను. బుందేలు లమందానందభరితులైరి.

పిమ్మటఁ బ్రతాపరాయుఁడు తనసైన్యమును వేఱొక మార్గమున నడిపించుకొని రాజధానికి వచ్చుచుండెను. కొంత దూర మరుగునప్పటికి వారికి మఱియొక చిన్నసైన్యము తారసించెను. దాని కధిపతి కేశవసింహుఁడు. మొగలులకు మార్గ చోదకుఁడగు పురుషుఁడాసైన్యముతోఁగలిసి వచ్చుచుండెను. ఆరెండుసైన్యములును నేకమయ్యెను. నాఁడు వారొనర్చినపనులను బరస్పరము చెప్పుకొనుచుండిరి; సులభముగా జయమబ్బినందుల కానందించుచుండిరి.

అప్పటి కొకజాముఁరాత్రి గలదు. కేశవప్రతాపు లాసైన్యమును రాజధానికి నిశ్శబ్దముగా నడపుకొనివచ్చి దుర్గమునకుఁ బశ్చిమద్వారముచెంత నిల్చిరి.

ఛత్రసాలుఁడామదుర్గరక్షణభారమంతయు మురారిపంతులపై మోఁపెను. అతఁడు బహుజాగరూకుఁడై రాత్రిందివములు దానిఁ గాపాడుచుండెను. అందులోను నాఁటిరాత్రి

యతఁ డెందునిమిత్తమో కాని యాపశ్చిమద్వారము నొద్దనే కాచుకొనియుండెను. ఆవచ్చుచున్న సైన్యమునుజూచి యమితానందమునొంది మురారి యాద్వారమును దెఱచి వచ్చిన వారి కెదురుగాఁ బోయి, "మిత్రమా! రమ్ము; మంచిసమయమునకు వచ్చితివి. దుర్గములోని సైనికులనెల్ల జోకొట్టి నిద్రింపఁజేసితిని. సైన్యమును రానిమ్ము," అని చెప్పి వారిని లోనికిఁ దీసికొనిపోయెను. దీపపువెలుతురునఁ గేశవసింహాదులను జూచి యతఁడు నివ్వెఱపడి యెటకో పోఁజొచ్చెను. కేశవప్రతాపులు వానిని వెంబడించి పట్టుకొని బంధించిరి.

# చిలారాము

## 15-వ యధ్యాయము

### మురారిపంతువృత్తాంతము

శ్లో. "వ్రజంతి తే మూఢధియః పరాభవం
భవంతి మాయావిషు యేనమాయినః
ప్రవిశ్యహి ఘ్నంతి శఠా స్తథావిధా
న్న సంవృతాంగాన్నిశితాఇవేషవః." భారవి.

ఛత్రసాలునికిఁ బ్రాణమిత్రుఁడగు మురారిపంతును-గేశవసింహాదు లేల బంధించిరో యెవ్వరికిని దెలియలేదు. ఆమహారాజునకుఁగూడఁ దెలియదు. అందులకుఁగారణ మెవ్వరైనను దమ్మడిగినచో, వాఁడు ద్రోహియని కేశవసింహాదులు చెప్పుచుండిరి. మురారిపంతు ద్రోహియన్న నమ్మక మెవ్వరికిని లేదు ; రాజున కంతకంటెను లేదు. అదివినుటచే వారి కాశ్చర్య మతిశయించుచుండెను. గతించినరాత్రి మొగలులు చేసిన మాయోపాయమును, దానికిఁ గేశవసింహాదు లొనర్చిన ప్రతీకారమును రాజధానియందును, దదితరస్థలమునందును గ్రమక్రమము వ్యాపింపఁజొచ్చెను. కాని యవి స్పష్టముగా నెవ్వరికి బోధపడలేదు. ఛత్రసాలునకుఁగూడ నందెన్ని యోసందేహము లుదయించెను. వానిఁ దొలఁగించుకొన రాజొకసభగావించెను.

ఆవిచిత్రవృత్తాంతమును వినుటకుఁ బ్రజలెంతో వేడుక పడుచుండిరి. వారు గుంపులుగుంపులుగావచ్చి యాసభాయంది

రమునఁ గూర్చుండిరి. కొంతసేపటికి సభాతలము జనులచే నిండి పోయెను. పురమునందున్న యున్నతోద్యోగులును, ధనికులును వచ్చి యథాస్థానములఁ నలంకరించిరి. ప్రాణనాథస్వామి కూడ వచ్చి సింహాసనమున కభిముఖముగా నొక యున్నతాసనమున నుపవిష్టుఁ డయ్యెను.

కొంతసేపటికి సమస్తరాజలక్షణలక్షితుఁడై ఛత్రసాల మహారాజు వచ్చి సింహాసనాసీనుఁ డయ్యెను. తదుత్తర క్షణమునఁ గేశవసింహ శివసింహ ప్రతాపరాయులు బద్ధుఁడైన మురారిపంతును దోడుకొని సభామండపముఁ జొచ్చిరి. ఆ యోధత్రయమును దమకేర్పఱుపఁబడిన యాసనత్రయము నలంకరించెను. రాజభటులు మురారిపంతును రాజున కభిముఖముగా నిలువఁబెట్టిరి. అతఁడు ముఖమువంచుకొని సిగ్గుచే నెవ్వరిని జూడఁజాల కుండెను. ఛత్రసాలుఁడదివఱకుఁ దన వలన మహాగౌరవమందుచున్న మహారాష్ట్రవీరుఁ డప్పుడా కొలువున నవమానితుఁడై యుండఁగాఁ జూడఁజాలకపోయెను.

అప్పుడు రాజు కేశవసింహునిఁ జూచి, "బాబాజీ! మనకాప్తమిత్రుఁడై వర్తించుచున్న మురారిపంతు నేల బంధించితిరి? అతఁ డొనర్చిన యపరాధమేమి? అతని వృత్తాంతమేమి? అది సవిస్తరముగా వక్కాణింపకున్న నా మనస్సు విచారమును బొయకున్నది. వినిపింపుఁడు" అని పలికెను.

అది విని కేశవసింహుఁడు లేచి నిలువఁబడి రాజును, సభ్యులను నొకమాఱు గలయఁగనుఁగొని యిట్లు చెప్పఁ దొడంగెను.

"రాజకుమారా! వీఁడు బంగాళ బ్రాహ్మణుఁడుగాని మనమనుకొన్న మహారాష్ట్రవీరుఁడు కాఁడు. వీని మొదటి పేరు రామనాథుఁడు. వీఁడు మహారాష్ట్ర నామముల కనుగుణముగా మురారి పంతనెడి నామముఁ బెట్టుకొనెను. వీనికిని శివాజీ మహారాజునకును ఎంతమాత్రమును సంబంధములేదు వీఁడౌరంగజేబు సేవకుఁడు. మాఱువేషములు వేసికొని శత్రురాజ్యములఁ దిమ్మరి తద్రహస్యములను జక్రవర్తికిఁ బంపుటయే వీనిపని. చక్రవర్తి యిందులకే వీని నుంచుకొనెను. సార్వభౌముని యనుమతివడసి మనదేశమునకు వచ్చి వీఁడింతలేసి యుపద్రవములఁ గల్గించెను. మనకు సంభవించిన యిక్కట్టుల కన్నింటికిని వీఁడే కారణము. ఈ పాపాత్మునివలన మన బుందేలఖండమంతయు స్వరూపనాశము గావలసినదే. కాని ధర్మబుద్ధిపరాయణుఁడవగు నీకు భగవంతుఁడు సహాయభూతుఁడై యుండుటచే నట్టి యుపద్రవము గడచిపోయెను. అట్లు కానిచో వీని మాయాబలమున నీవు మహమ్మదీయ చక్రవర్తిచేతికిఁ జిక్కిపోయి యుందువు. ఈ ప్రాణనాథస్వామి చక్రవర్తి కారాగారమున బంధింపఁబడి యుండును. నీరాజ్యము, నీదేశము; నీసర్వస్వమును సార్వభౌముని సామ్రాజ్యమున లీనమై యుండును; చిన్నప్పటినుండియు నీ వొనర్చిన ప్రయత్నములన్నియు మంటగలిసి యుండును. అక్కటా! ఎంతమోసము! ఎంత ప్రమాదము! మహామహుఁడైన ప్రాణనాథస్వామిని బంధించికొని పోయినవాఁ డీపాపాత్ముఁడే కదా? నూతన దుర్గము సులభముగా శత్రువులకుఁ జిక్కుట యీ దుష్టుని మాయోపాయములవలననే కదా! నిజమతక్షణమందును, నిజరాజ్య

స్థాపనమందును, బద్ధకంకణుఁడవై, ప్రజానురాగమును ప్రజా గౌరవమును బడయుచున్న నీవు—ఇంతమంది బంధుమిత్రా మాత్యులచేఁ బరివేష్టితుఁడవై యుండవలసిన నీవు—అసహాయుఁడవై— ఆనాఁడు— ఆఘోరారణ్యమధ్యమునందు — దుష్టకార్యతత్పరులు నధికసంఖ్యాకులును నగు నామహమ్మదీయ వీరులకుఁ జిక్కి మృత్యువువాతఁ బడి వచ్చుట యీదుష్కర్ముని దురూహవలననే కదా?"

అని చెప్పినపుడు కేశవసింహునికంఠస్వరము గంభీరమయ్యెను; కన్నులును వదనమును, నరుణితము లయ్యెను; ఒడలు పులకరించెను. అతని వదనగహ్వరమునుండి వెడలి వచ్చు నా గంభీరవచనములు విని సభ్యులును రోమాంచకంచుకితగాత్రులైరి ధైర్యశాలియగు మహారాజు శరీరముగూడజల దరింప నారంభించెను.

కేశవసింహుఁడు మరలఁ జెప్ప నారంభించెను.

"గతించినరాత్రి వీఁ డొనర్చిన యపాయ మన్నిటి కంటెను మహత్తరమైనది. వీఁడు తనవచనరచనలచే నిన్ను మెప్పించి వంచించి దుర్గరక్షణభార మంతయుఁ దానే వహించెను. నిన్నటిరాత్రి యీదురాత్ముఁడు రహస్యముగా మొగల్ సేనానాయకునకు సైన్యముతోఁ గూడ వచ్చినచో రాజధానిని బట్టుకొని జయమందవచ్చునని వార్తనంపెను. వాఁ డుద్దండవేగముతో సైన్యమును గదలించుకొని మనదేశము నెల్ల నొక్కగ్రుక్కను మ్రింగనెంచి వచ్చుచుండెను. నేనును రామలాలు నది తెలిసికొని నూతనదుర్గమున నున్న యిన్నూ ఱుగురు సైనికులతోఁ గూడ వారు వచ్చుమార్గమున కడ్డుగాఁ

పోయితిమి. ఇద్దఱమును జేరి యొక సూర్గుర భటులతో మార్గమున కిరుప్రక్కల నున్న కొండలపై నెక్కి పెద్దగుండుఱాలను మీాట పన్నియుంచితిమి. సదరుద్దీను సైన్యములతో లోయఁ బ్రవేశించెను. అది మే మెఱిగి మీాటఱాలను విడిచిపెట్టితిమి. అవి మహాధ్వనితో దొర్లిపోయి సైనికులను గూల్చెను. కొంత సేపటిలోనే శత్రుసైన్యము చాలవఱకు నిహతమయ్యెను. సదరుద్దీ నీయుపద్రవమును దెలిసికొని హతశేషులతో వెనుకకుఁ బరుగెత్తెను. ప్రతాపరాయఁడు సైన్యముతో వచ్చి వాని నడ్డగించెను. మనవీరులచే మిగిలిన శత్రుసైన్యముగూడ నశించెను. సేనాధిపతి మాత్ర మెట్లో తప్పించుకొని పోయెను. మే మట్లు పోయి శత్రువుల సంహరింపనిచో నీపాటికి బుందేలుఖండ రాజధానిగోపురముపై మహమ్మదీయపతాక మెగురుచుండును. వీఁడు నిన్నటిరాత్రి సైనికుల నందఱను నిద్రపుచ్చి తమ సైన్యమును గోటలోఁ బ్రవేశింపఁ జేయుటకుఁ బశ్చిమ ద్వారమునఁ గాచుకొని యుండెను. ఆచీఁకటిలో మా సైన్యమును తమదానిగా భావించివచ్చి వీఁడు దుర్గద్వారము తెఱచివైచెను. అప్పుడు తురుష్కసైన్యమే వచ్చి పడినచో మన బుందేలులగతి యేమౌనో యోజింపుఁడు. నీవు వీనిని నమ్మి దుర్గాధిపత్య మొసంగుట యనాలోచితకృత్యము" అని విన్నవించి కేశవసింగూరకుండెను.

సభ్యులును, ప్రభువును; నత్యాశ్చర్యమగ్నులైరి. అప్పుడు ప్రాణనాథస్వామి మహారాజునుజూచి, "ఓరాజేంద్రా! నీ వీతని నెట్లుగా నమ్మితివి ? క్రొత్తవారిని విశ్వసించుటవలన వచ్చిన ఫలమెట్టిదో తెలిసెనుగదా ?" అనెను.

"స్వామీ! ఆవృత్తాంతము చెప్పెదను వినుఁడు. నేను వెనుక భీమనదీతీరమున శివాజీ మహారాజును సందర్శించితిని. అతఁడు నాకీ కరవాలమును బహూమతిచేయఁగా నేనిది తీసికొని యతనికి మన్ముద్రాంకితమగు నంగుళీయకము నర్పించుకొంటిని. ఆ యంగుళీయక వృత్తాంత మతిరహస్యము. వీఁడది యెట్లు కనుఁగొనెనో నాకుఁ దెలియదు. వీఁడు వచ్చి తన్ను శివాజీ మహారాజు పంపెనని నాతోఁ జెప్పి యా యంగుళీయక మానవాలుగా నిచ్చెను. అది నాకంతయు సత్యముగాఁ జూపట్టెను. ఈ యుంగర మీతని కెట్లు వచ్చెనో తెలిసికోవలసియున్నది" అని రాజు వచించెను.

అది విని శివసింగాసనమునుండి లేచి రాజున కభిముఖుఁడై, "ఆవృత్తాంతమును, నేఁ జెప్పెద నాలింపుఁడు. మా జనకుఁడు కేశవసింహుఁడు చక్రవర్తియొద్ద మహోద్యోగియై యుండెడివాఁడన్న సంగతి మీ కెల్లరకును దెలియును గదా! అప్పుడు నేనుగూడ సార్వభౌముని గొలువునందుంటిని. కార్యాంతరముపై నేను బ్రయాగమునకుఁ బోయి యుంటిని. అచ్చట నొకనాఁ డుదయకాలమున విహారార్థము గుఱ్ఱము నెక్కి చాల దూరముపోయి మరలి వచ్చుచుంటిని. దుర్మార్గుఁడగు చక్రవర్తి శివాజీ మహారాజును మంచి మాటలాడి నమ్మించి ఢిల్లీకిఁ గొని వచ్చుటయును, నమ్మహారాజును గారాబద్ధునిఁ జేయుటయును, దనకై పిండివంటలను గొనివచ్చిన యొక సేవకునకు లంచమిచ్చి వాఁడు తెచ్చినబుట్టలోఁ గూర్చుండి శివాజీ తప్పించుకొనుటయును మీ యందఱకును దెలిసియే యుండును.

అమ్మహాత్ముఁడు బైటఁబడెను గాని యతని బట్టుకొనుటకై రాజభటు లెల్లయెడలను ద్రిమ్మరఁజొచ్చిరి. అతఁడెట్లో తప్పించుకొని యలహాబాదునకు వచ్చెను. ఒకనాఁ డతఁడు గంగలో స్నానము చేయుచుండఁగాఁ జూచి యచ్చటివా రను మానపడుచుండిరఁట. అది యమ్మహారాజు గ్రహించి బ్రాహ్మణ వేషమున నచ్చటనుండి తప్పించుకొని వచ్చుచు నాకుఁ గాన వచ్చెను. నేనతని నంతకుముందు చూచియున్నాను. వెంటనే యానవాలుపట్టి గుఱ్ఱముదిగి నమస్కరించితిని. ఆతఁడు నన్ను యోగ్యునిగాను రాజపుత్రునిగాను గ్రహించి తనవృత్తాంతము నెల్లనాకు వినిపించెను. అది విన్నతోఁడనే నాగుండె నీరయి పోయెను. నేనొక గుఱ్ఱమునిచ్చి దానినెక్కి సత్వరముగాఁ బొమ్మని చెప్పితిని. అతఁడు నా యుదారభావమునకు సంతసించి నాకు బహుమతిగా నొకయుంగరము నిచ్చెను. దానిపై తమ ముద్రయున్నది. అదిచూచి నేననుమానించుచుండఁగా నతఁడు భీమనదీతీరమున వర్తిల్లిన వృత్తాంతమును జెప్పి, అది రహస్యముగా నుంచుమనెను. అతఁడు వెడలిపోయి సురక్షితముగా స్వదేశమును జేరెను. కొన్నిదినములకు నేను ఢిల్లీపురమునకు వచ్చితిని. పిమ్మట మాకుటుంబమున కనివార్యములగు నాపద వచ్చుట యందఱకును దెలియును. నేను దేశమునఁ ద్రిమ్మరుచు నొకనాఁటి రాత్రి మధురాపురప్రాంతారణ్యమునఁ బడి వచ్చుచుఁ గొందఱు దొంగలచేఁ బ్రబలమయిన దెబ్బలుతిని యవి మాన్పుకొనుచు నొక పల్లెయందుంటిని. నాకు ద్రవ్యావసరముండుటచే నాయుంగరము నమ్మఁ జూపితిని. అప్పుడి మురారిపంతు శిష్యపరివేష్టితుఁడై సన్న్యాసి వేషధారియై

యాపల్లెయం దుండెను. నేనాయుంగరము నష్టుట కిత చెంతకుఁ బోయితిని. భవన్ముద్రాంకితమగు దానినిజూచి యితఁడనుమానపడుచుండఁ దద్వృత్తాంతమునెల్లను జెప్పక తప్పినది కాదు. అదివిని వీఁడు నన్నుమిక్కిలిగౌరవించుచు నదిమొదల సేవకునిగాఁ జేసికొన్నాఁడు. దురాత్ముఁడగు వీనియుపదేశముఁ మీకు మహోపకార మొనర్చితిని. ప్రాణనాథస్వామిని బంధించి ఢిల్లీకి గొనిపోవలయునని మాకు వీఁడాజ్ఞాపించెను. మే మీతని గొనిపోవుచుఁ బరాత్పర రామశాలులతో యుద్ధమొనర్చితిమి. నాఁడు పరాత్పరునిచే నేను జావవలసినదే కాని దైవవశమున బ్రదికితిని. పిమ్మట నొకనాఁ డాకస్మికముగా నాజననీజనకాదులఁ గలిసికొంటిని. అదిమొదలు వీనిరహస్యములనెల్ల మాజనకుని కెఱిఁగించుచుంటిని. వీఁడు రాత్రిసమయమునఁబోయి మొగల్ సేనానాయకునితో రహస్యాలోచనము చేయుచుండెను. నాయందు వీని కెక్కుడు విశ్వాసము. నన్నుఁగూడఁ దనతో మహమ్మదీయ సేనానివేశమునకుఁ గొనిపోవుచుండెడివాఁడు. ఒకనాఁడు నేను వీనితో నరుగలేదు. ఆనాఁడు వీరు యోజించినదేమో నాకుఁ దెలియలేదు. కావుననే నూతనదుర్గము తురుకలకు వశమయ్యెను. తక్కిన వెప్పటివప్పుడే మాజనకున కెఱిఁగించుచుండుటచే వానికతఁడు ప్రతీకారము గావించి కృతార్థుఁడయ్యెను. నన్ను విశ్వాసపాత్రునిగా భావించి వీఁడు నిన్నమార్గచోదకునిగాఁ బంపెను. ఆరహస్యములను వెంటనే నేను వీరికిఁ దెలుపనిచో నీపాటికిబుందేలురాజ్యము మఱియొకరీతిగా మాఱిపోయి యుండును," అని యాతఁడు తనవృత్తాంతమును వినిపించి విరమించెను.

అంగులీయ వృత్తాంతమును, శివసింగు చరిత్రమును విని సభ్యులును రాజును నధికాశ్చర్యము నొందిరి.

పిమ్మట రామనాథుని మాయోపాయముల కత్యాశ్చర్యముచెంది వాని దుష్టకృత్యములను సభ్యులు పలువిధముల నిందింపఁదొడఁగిరి. అప్పుడు రాజు వానినిఁజూచి "ఓయీ! నీ విందుల కేమిచెప్పుకొందువు?" అని యడిగెను.

అప్పుడు వాఁడిట్లు చెప్పఁదొడంగెను; "రాజేంద్రా! నేను దురదృష్టవంతుఁడను. వారు చెప్పినదంతయు సత్యమే. నేను జక్రవర్తి కాంతరంగిక సేవకుఁడను. పేరుమాత్రమే సేవకుఁడనికాని నేనట్లు గానుండలేదు. చక్రవర్తి కుమారునివలె నున్నాను. మీవలన నాల్గుపర్యాయములు పరాభవమంది చక్రవర్తి విచారపరీతుఁడై మిమ్మేక మాయాబలమున జయింపనెంచి నన్నిచ్చటికంపెను. మొదట నేను సన్న్యాసివేషధారినై బయలుదేఱితిని. మాయావియగుపరాత్పరుఁడు మారహస్యము నెట్లో తెలిసికొనెను. మొదట నేను వానిమాయకుఁ జిక్కితిని. కాని పిమ్మట వానిని మోసకానిగాఁ గ్రహించి యావేషమును మార్పనుంటిని. ఏవేషము వేయుదునని యోచించుచుంటిని. ఇంతలో శివసింగు దారసించెను. అంగులీయ వృత్తాంతమును విని మహారాష్ట్రవీరవేషమున నీచెంతకు వచ్చితిని మాచక్రవర్తి కార్యము నవలీల నెఱవేర్చి యుందును; కాని యీశివసింగు నన్నునమ్మించి వర్తించుచు సర్వకార్యములను భంగముగావించెను. మీచేతికిఁ జిక్కిపోతిని. నాప్రాణము నాశరీరము మీయధీనములై యున్నవి. మీయిష్టమేమిచేసిన నాకు సంతోషమే," అని పలికి వాఁడూరకుండెను.

అనంతరము రాజు స్వామినిజూచి; "అయ్యా! పరాత్పర యోగి మఱి కానరాలేదేమి?" అని యడిగెను.

"అతఁడావేషముతో నుండవలసిన యవసరము లేక పోవుటచే నా యవతారమును విడిచి కేశవునిలోఁ గలిసి పోయెను" అని స్వామి యుత్తర మిచ్చెను.

పరాత్పర కేశవసింహుల యభేదమును విని సభ్యులును రాజును మిక్కిలి యాశ్చర్యపడిరి. అప్పుడు రాజు ప్రాణనాథునితో, "అతఁడాయవతార మెందులకుఁ దాల్చెను" అని ప్రశ్న వేసెను.

"చక్రవర్తిసేవకులనుండి తప్పించుకొనుట కట్టివేషమునుదాల్చెను. స్వతంత్రుఁడవగు నిన్నుఁజేరి నిర్భయుఁడై యది విడిచి పుచ్చెను" అని యోగి చెప్పెను.

రాజు సింహాసనమునుండి లేచి కేశవసింహునకు నమస్కరించి, "బాబాజీ! పరాత్పరయోగివి నీవే యని నేను దెలిసికోలేక నేనీ దుష్టునివచనములు విని నిన్నుఁ ద్రోహినిగా భావించితిని. ఆ తప్పిదమును క్షమింపుము. చక్రవర్తితోఁ జేయు చున్న మహాసంగ్రామ మెట్లు గెల్చుటో యని సందియముందు చుండెడివాఁడను. కాని నీవవలీల శత్రువులఁ దూలించి సులభముగా నాకు జయము సమకూర్చినందుల కమందానందమ్ము చెందితిని," అని యతనికి నమస్కరించెను. పిమ్మటఁ దన కాసమరమునఁ బెక్కువిధములఁ దోడ్పడిన ప్రతాపశివసింహులను రామలాలు భట్టాచార్యునిపెక్కుడుగా గౌరవించెను.

అపుడు ప్రాణనాథుఁడు రాజును జూచి, "కుమారా! మురారిపంతు మన శత్రువని నాకుఁ జిరకాలము క్రిందటనే

తెలిసెను. ఆ రహస్యము కేశవసింహుఁడు గ్రహించి నాకుఁ జెప్పెను. నీ కిది తెలియఁజెప్పిన కోపము నాపఁజాలక యీ రామనాథునకు నీవు వెంటనే శిక్ష విధింతువు. అట్లయిన మనకుఁ దెలియవలసిన శత్రురహస్యములు తెలియకపోవును. వా రూహించుచున్న మా యోపాయములన్నియు విఫలముగాక మిగిలియున్నచో వానిని వేఱొకపుడు పన్ని మనల సాధింపఁ బూనుదురు అందులచే మురారిపంతు సమాచారమును నీ కప్పుడు దెలుపలేదు. ఇఁక నీ రామనాథునకుఁ దగినదండనము విధింపుము'' అని చెప్పెను.

ఛత్రసాలుఁడు స్వామి యనుమతిచొప్పున వానిని యా వజ్జీవమును గారాగృహమున నుండ నియమించి నాఁటికి సభ చాలించెను.

# దిలారామ

## 16-వ యధ్యాయము

### దిలారామ నిశ్చయము

శ్లో. "అనురాగవతీ సంధ్యా దివసస్తత్పురస్సరః,
అహో దైవగతిశ్చిత్రా తథాపి న సమాగమః."

ఆర్ఛాపురమున రాజకుటుంబములోనివారు నివసించెడి మందిరములన్నియు నొక్కస్థలమున నున్నవి. కేశవసింహ ప్రతాపరాయాదులగృహము లొకదాని నొకటి చేరియున్నవి. వానిలో నొక యుత్తమమందిరమున నిరువురు యువతులు గూర్చుండిరి. వారిహృదయము లానందకందళితములై యుండ లేదు. వారి వదనపద్మములు వికస్వరములై యుండ లేదు. అవి శోభాహీనములై చూపట్టుచుండెను. వారిముఖములు హస్తకమలముల వ్రాలియుండెను. పుండరీకదళముల నీసడించు వారి కన్నులందు బాష్పములు నిండియుండెను. అవి క్రమక్రమముగాఁ గొలుకులనుండి ధారారూపమై క్రిందికిఁ బ్రవహించుచుండెను. వేఁడినిట్టూర్పులు వెడలుచుండెను. వారిలో నొకతె దిల్లారామ. రెండవది శ్యామల.

"చెలియా, దిలారామా ! నీకార్యము నెఱవేర్పలేకపోదునని యెప్పుడును ననుకొలేదు సుమా ? విఫలీకృతకార్యనగుటచే నపారదుఃఖము నొందుచున్నాను."

"శ్యామలా, అది వెఱ్ఱితనము. నీవు చేయఁగల్గినంతయుఁ జేసితివి. కార్యము ఫలింపనిచో నీవేమిచేయుదువు? ప్రతాప రాయునిఁ బ్రాణవల్లభునిగాఁ బడయు భాగ్యమే నాకున్నచో మహాత్ముదీయసంబంధము నాకు లేకయేయుండును. ప్రతాపు నితోఁ బ్రథమసంభాషణము సలిపినప్పుడే నే నీకోర్కెఁగూర్చి నిరాశచేసికొన్నాను. నీవచనములచేఁ దప్ప నే నతని వరింపఁ గలనను నమ్మకము నాకెప్పుడును లేదు నాహృదయ మిప్పుడు నిష్కామమై సుఖించుచున్నది. మీవంటి మిత్రసత్తములరాంద్ర వియోగమునకే యీదుఃఖముగాని భగ్నమనోరథ నగుటకుఁ గాదు. ఏమిచేయుదును? నీవిఁక విచారము వదలుము."

"వదలవలెనన్నను నన్నది వదలకున్నది. ప్రతాపరా యుఁ డిట్లుచేయునని నేను అనుకొనలేదు."

"ఈవిషయమై యాపురుషుని నిందింపరాదు. అతని వలన నుంతేనియు నపరాధము లేదు. నేను బలాత్కరించిన నతఁడు జాతిమతములను వఁలి నన్ను వరింపనున్నాఁడు. కాని నాకది యిష్టములేదు. పద్మావతి ప్రతాపుల దాంపత్య మను కూలమైనది. వారు సుఖించినఁ జాలును. వా రానందించినఁ జాలును. వారిసుఖమే నాసుఖము. వారియానందమే నా యానందము. ఇందులకై చింతింపకుము."

"నీ వొక యుత్తమనరుని జేపట్టినఁగాని నా కీచింత తొలంగదు."

"అట్లెప్పుడును జరుగదు. నన్నుఁ బ్రతాపుఁడు ప్రేమిం చినను ప్రేమింపకపోయినను నే నతని మనసారఁ బ్రేమించితిని. అతనిఁ బ్రేమించినమనస్సు వేఱొకనిపై కరుగుట యసంగతము.

చెలీ! ఉత్తమవరుఁడు లభింపనిచో యావజ్జీవము బ్రహ్మ చారిణినై యుందునని జోహరాతో మొదటనే చెప్పితిని. ఇప్పు డీక నశ్లే చేయనుంటిని. సంసారమును ద్యజించితిని. నాకిఁక సెలవిమ్ము పోయెదను. మాతల్లి మరణించినది మొదలు నేఁటివఱకును నీవు నాకొనర్చిన యుపచారములకు బహు మతిగా నాయొంటనున్న యాభరణముల నొసగుచున్నాను. సంతోషపూర్వకముగా నన్ను దీవించి వదలిపెట్టుము. ఎవ్వరి కిని దెలియకుండ నిచ్చటినుండి పోయెదను," అని దిలారాము చెప్పుచుండగా విని శ్యామల దుఃఖము నిలుపుకోలేక భోరున నేడువఁజొచ్చెను. అదిచూచి దిలారాముయు దుఃఖింపసాగెను. కొంతసే పిరువురును దుఃఖార్ణవమగ్నులై యుండిరి. అప్పుడు శ్యామల దిలారామను గాంచి,

"చెలియా! నీయాభరణములు నాకు బహుమతిగా నిచ్చెదవా? నీకృతజ్ఞతకు సంతసించితిని; కాని నాయాభర ణములే నాకు నిష్ప్రయోజనము లగుచున్నప్పుడు నీవినాకేల? మనయిర్వురనగలను నిఱుపేదరాలగు నొక బ్రాహ్మణయువతి కిత్తము. ముం దాపనిచేసి తరువాతి యత్నమునకుఁ గడంగు దము," అని పలికెను.

దిలారాము యదివిని నివ్వెఱపడుచు, "ఆభరణములు నీకు నిష్ప్రయోజనము లెట్లగును?" అని యడిగెను.

"యోగిని కవిరెందులకు?" అని యామె ప్రత్యుత్తర మిచ్చెను.

"చెలీ! నీవు యోగినివా?"

"అవును; నేఁటినుండి"

"చాలుఁజాలు; ఈ వెఱ్ఱివిడువుము ఇట్టి దుర్బుద్ధులను మానుము."

"ఇది దుర్బుద్ధికాదు. నాకును సంసారమున విరక్తి యుదయించుచున్నది. నీ కనవరతమును సహాయురాలనై వర్తించెదను. ఏమైనను సరియే నిన్నువిడిచి యిట నుండనొల్లను. లెమ్ము; పరులకుఁ దెలియకుండ వెడలిపోవుదము" అని శ్యామల ప్రయాణముచేసెను.

దిలారాము యేమియుఁ జెప్పజాలక కొంచెమునే పూరకుండి, "శ్యామలా! నానిమిత్తము పండువంటి కాఁపురము గూల్చుకొందువా?" అని ప్రశ్నించెను.

"నీనిమిత్తముకాదు. సంసారముపై నిష్టములేనియప్పు డేమిచేయుదును?" అనిచెప్పి కొంతసేపయినతరువాత "చెలియా! ఎందుల కీమాటలు? నాకడపటివచనము వినుము. నీతల్లి మరణించునపుడు నిన్ను నాకప్పగించినది. నే నందుల కంగీకరించితిని. నీ వెచ్చటికేగిన నచ్చటికేగుదును. నీ వెచ్చట నుండిన నే నచ్చటనుందును. ఇది నానిశ్చయము. నీ వొకవేళ నన్ను మోసపుచ్చి వెడలిపోయినను సర్వమును విడిచిపెట్టి నిన్ను వెదకి కలిసికొందును. అంతియకాని యిచ్చట నుండుదాననుగాను," అని శ్యామల తన మనోనిర్ణయ మెఱిఁగించెను.

కొంతసేపటికి ముందేవచ్చి శివసింగు, వారి సంభాషణము వినుచుండెను. అతఁడువచ్చి వినుచుండెనని వారికిఁ దెలియదు. అతనిఁ జూచినతోడనే వారిరువురును లేచి నిలుచఁబడిరి. అప్పుడు శ్యామల యతనికి నమస్కరించి యొకయాసన మర్పించెను. అతఁ డందుఁ గూర్చుండెను. దిలారామ గోడనూ

తఁగాఁగొని నిలువఁబడెను. శ్యామల యామెప్రక్క నిలిచెను. శివసింగునకు భార్యపై నెక్కుడనురాగము. శ్యామలకు దిలారాముపై నెంత ప్రేమయున్నదో యతనికిఁ దెలియును. దిలారాము యచ్చటనుండి వెడలిపోవునపుడు శ్యామలకూడ నామెను వెంబడించిపోయి తన్ను వియోగవ్యథలపాలు సేయునేమో యని యతఁడు భయపడసాగెను. నేఁటి వారిసంభాషణ మతని భయమును మఱింత వర్ధింపఁజేసెను. అతఁడు వారినిజూచి,

"ఓ యువతీమణులార, మీ ప్రయాణ మెప్పుడు ?" అని యడిగెను.

వారదివిని విభ్రాంతలై యొండొరులను జూచుకొనిరి. తమప్రయత్న మెట్లో యతఁడు తెలిసికొనెనని వారు గ్రహించిరి. దిలారాము యతనిఁజూచి, "సోదరా! ప్రయాణ మెక్కడికి" అని యడిగెను.

అతఁడు మందహాసము చేయుచు "ఎక్కడికా ? దేశములను జూచుటకు," అని బదులుచెప్పెను.

అదివిని వారేమియు మాటాడక యధోముఖులై నేలఁ జూచుచు నట్లే నిలువఁబడిరి. అప్పుడు శివసింగు దిలారామునుద్దేశించి, "సోదరీ! మీ ప్రయత్నము నేనెఱుఁగుదును. ఇఁక నెందులకు నాయొద్ద దాఁచెదరు? నీకు శ్యామలయందుండు ననురాగ మెట్టిదో యెఱుఁగుదును. శ్యామలకు నీయం దెంత యనురాగమున్నదో యదియును దెలియును. మీ ప్రేమానుబంధమును ఛేదింపఁదలంపను. ఒకవేళఁ దలంచినను ఛేదింపలేననియే నా నమ్మకము. నిన్నిచ్చట నివసింపఁజేయఁదగినంత సామర్థ్యము

మూ కెవ్వరికిని లేకపోయెను. నిన్నిచ్చట నుండుమనుటకును నో రాడకున్నది. నిన్నెడఁబాసి యుండుటకు మామనస్సు లొప్ప కున్నవి. ఏమిచేయుదుము ? నేను మీయిరువురకును రక్షకుఁ డనై మీతో వచ్చెదను. నిన్ను శ్యామల విడువలేదు. శ్యామ లను నేను విడువలేను. విప్పఁదరముకాని ప్రేమానుబంధమును విప్పనెంచి విఫలుల మగుటకంటె నందఱమును గలిసియుండు టయే మంచిది." అనిపలికి యూరకుండెను.

దిలారామను జూడవచ్చిన పద్మావతి వారివృత్తాంతమును గ్రహించి తటాలున నింటికి మరలివచ్చి తల్లితోఁ జెప్పెను. అది వినుటతోడనే యామెకు గుండెలో తాయి పడెను. కొడు కును గోడలును మరలఁ దమ్ము విడిచిపోవుదురేమో యని భయపడి యామె యావృత్తాంతమును వెంటనే భర్త కెఱిం గించెను. కేశవసింగు రామలాలుభట్టాచార్యునితోఁ గూడ దిలారాము మందిరమున కరిగెను. శాంతా పద్మావతులు గూడ నచ్చటికేగిరి. వారితొట్రుపాటును జూచి యేదో వారి కాపద సంభవించెనని తలపోసి యిరుగుపొరుగులవా రొక్కొక్కరే యచ్చటికిఁ బోఁజొచ్చిరి. నీటిలోఁబడిన తైలబిందువువలె నా వార్త జనులనోళ్లలోఁబడి పురమంతటను వ్యాపించెను. ఎట్టి వార్తయైనను వ్యాపించునపుడు వక్తల చాతుర్యమునుబట్టి మార్పుచెందక మానదు. ఉన్నదున్నట్లు చెప్పక తమ కల్పనాతి శయ మావార్తకుఁజేర్చి మొదటిస్థితిని గప్పిపుచ్చుట ప్రజల నైసర్గికము.

అది క్రమక్రమముగా నంతఃపురమున వ్యాపించెను. కేశవసింహుని కొడుకును గోడలును దిలారామయుఁ గలిసి

యిచ్చుటకో పాటిపోయిరనియుఁ, గేశవసిం గందులకు విచా రించుచున్నాఁడనియు నచ్చటివా రనుకొనఁజొచ్చిరి. అది మెల్ల మెల్లగా రాజకీయవిషయములను గూర్చి ముచ్చటించుచున్న ప్రతాపచ్ఛత్రసాలుల కర్ణపథమునఁ బడెను.

ఛత్రసాలుఁడు కేశవసింహునిఁ బినతండ్రినిగామాత్రమే చూచుకొనలేదు; తండ్రియనియే భావించుచుండెను. శాంతను దల్లినిగాఁ దలంచుచుండెను. ఆదంపతులకు మరలఁ బుత్ర వియోగదుఃఖ మనివార్యమై వచ్చినదని విని రాజు మిక్కిలి విచారపరీతహృదయుఁడయ్యెను. ప్రతాపరాయుఁడును, మిక్కిలి దుఃఖితుఁడయ్యెను. వారిరువురును వెంటనే బయలువెడలి దిలా రామయింటికిఁ బోయిరి. కేశవసింహాదులు వారికుచితమర్యా దల నొనర్చిరి. అందఱును గూర్చుండినవెనుక శివసింగు దిలా రామవృత్తాంతముఁ బూర్తిగాఁ జెప్పెను. ఆయువతి ప్రతాప రాయుని మోహించియున్నదని యదివఱకు ఛత్రసాలునకుఁ దెలియదు. ఛత్రసాలునకే కాదు; కేశవసింహాదులకుఁ గూడఁ దెలియదు. దిలారాము తమవారికిఁ జేసిన మహోపకారములును, దదీయ సుగుణసంపదను, రాజు పలుమాఱు వినియుండెను. [illegible] రాలిని విచారపరీతనుగాఁ జేసి యటనుండి వెడలిపోనిచ్చుటకుఁ గాని శాశ్వతబ్రహ్మచర్య మవలంబించి తనపురమందుండు మనుటకుఁగాని యమ్మహారాజు మన స్సంగీకరింపలేదు. ఆయువతి సత్ప్రవర్తనమును, సౌందర్యమహిమను గాంచినపురుషుఁ డెవ్వఁ డట్లనుటకు సాహసింపఁగలడు? అప్పుడు కేశవసిం హుఁడు రాజునంజూచి,

"ఓ రాజకుమారా, ఈ దిలారాము వృత్తాంతము నాకుఁ బూర్తిగాఁ దెలియును. చెప్పెదను వినుము. ఈ దిలారామను బెంచిన హమీద్ఖాను నాకుఁ బ్రాణమిత్రుఁడు. ఒకప్పుడతఁడును, నేనును జక్రవర్తిసైన్యమును నడిపించుకొనిపోయి రాజపుత్రస్థానమునఁ జిత్తూరు మండలమున నొకపురమును ముట్టడించితిమి. ఈపిల్ల యెట్లోతప్పిపోయి మొగల్ సైనికులకు దొరకెను. వారీమెనుదెచ్చి హమీదు నెదుటఁ బెట్టిరి. అప్పుడీయువతి యైదేండ్లపిల్ల; మమ్మునుజూచి యేడువ నారంభించెను. హమీదు దయార్ద్రహృదయుఁడై యీమెనెత్తుకొని తన శిబిరమునకుఁ గొనిపోయెను. ముద్దులు మూటగట్టు పిల్లను జూచి యాఁడుసంతానములేని యాఖాను మిక్కిలి ప్రేమతోఁ బెంచుకొనెను. అప్పటినుండియు నతనియింటనే యీమె పెరిఁగినది. ఈమె చిన్నప్పటిపే రిందిరయఁట! అట్లని యీమెయే యడిగినవారితోఁ జెప్పుచుండెడిది. మనస్సుల హరింపఁజాలు సౌందర్యముగల యీమెకు దిలారామయని ఖాను పేరు పెట్టెను. కొంతకాలమున కామె హమీదు కూతురనియు, తద్గర్భజనితయనియు జను లనుకొనిరి. ఈమె క్షత్రియవంశోత్పన్నగాని మహమ్మదీయకులజ గాదు. ఈమె ప్రవర్తనము పాపనివర్తనము. సద్గుణము లార్యులకుఁగూడ నభివందనీయములు. సుగుణములచేతను, సౌందర్యముచేతను సత్కులప్రసూనతచేతను బ్రతాపునకీమెవరణీయయే; కాని యీమెకు సంభవించిన మహమ్మదీయసంబంధ మందులకు నిర్బంధమగుచుండెను. ఏమిచేయఁగలుగుదుము? ఈమె బుద్ధిపూర్వకముగా నాసంబంధము గల్గించుకొలేదు. అది యజ్ఞానవశమున సంభ

వించెను. అజ్ఞానకృత మగుదానికెల్లను బ్రాయశ్చిత్త మున్నది. దీని కేల లేదో తెలియదు. ప్రతిమతమువారును జైనవారిని దమమతములోనికి రానిత్తురు కాని మనవా రట్లుచేయుట కొడంబడరు. ఇంతకంటె ఘోరతరపాపకరులు ప్రాయశ్చిత్తమున శుద్ధులగుదురని చెప్పుచున్న ధర్మశాస్త్రము లెందుచేతనో యీవిషయమై నోరెత్తలేదు. ఒకవేళ నెక్కడేని శాస్త్రము లంగీకరించినను శిష్టు లనఁబడువా రొప్పక యీసంస్కరణ మును ద్రోసిపుత్తురు. మనమత మట్టినిర్బంధములు గల దగుటచే నానాఁటికిఁ గృశించుచున్నది. మనమతమును వదలిపోవు వారేకాని వచ్చి చేరువారు లేరు. దీనివలన నెంతనష్టమో మన శిష్టులు గ్రహింపఁజాలకున్నారు. పాపము! యోగ్యురాలగు దిలారామ నిపుడేమిచేయుమనుటకును నోరాడకున్నది," అని యుపన్యసించెను. దిలారామ వృత్తమువిని యందఱు నాశ్చర్యముచెందిరి. దిలారామవంటి యుత్తమురాలి కట్టి మ్లేచ్ఛ సంబంధము గల్గినందులకు మిక్కిలి విచారింపసాగిరి. అందఱును బరితపించువారేకాని కర్తవ్యాంశము నుపదేశించువా రొక్కరును లేరు. రామలాలుభట్టాచార్యుఁడు ధర్మశాస్త్రములోఁ దాదృశసంస్కార ముండకపోవుట పెద్దలోపమని భావించెను. ఆవిషయమును జర్చించి సిద్ధాంతము చేయలేక యందఱును మూకీభావమును దాల్చియుండిరి.

అప్పటి మహామహుల సంతాపమును గాంచి దిలారామ, "అయ్యా! వృథాగా మీరిట్లు పరితాపము చెంద నేల? ఈసంస్కారమును గూర్చి శాస్త్ర మంగీకరింపనియప్పుడు పాపము! మీ రేమిచేయుదురు? నావిషయమున మీరు చింతిం

పవలదు. నే నిఁక శాశ్వత బ్రహ్మచర్యవ్రత మవలంబించితిని. నే నిచ్చట నుండవలసిన యవసరము లేదు. కాని నే నీస్థలమును విడిచి పోయినచోఁ బెక్కండ్రకుఁ బరస్పరవియోగదుఃఖము గల్గించుదాన నగుచున్నాను. నావలన శ్యామలయు, నామె వలన శివసింహుఁడు, నతనివలనఁ దదీయ జననీజనకులును, వారివలనఁ బద్మావతీ ప్రతాపులును విచారాకులు లయ్యెదరు. పూర్వజన్మమున నెవ్వరి కేదుఃఖము కలిగించుటచేతనో నాకీ జన్మమున దుస్సహదుఃఖము సంభవించెను. ఈజన్మమున నిప్పు డిట్టి దుఃఖ మిందఱకుఁ గల్గింతునేని ముం దెట్టిదాననై జన్మింప వలయునో చెప్ప లేను. కావున వీరందఱును గలిసి సుఖమందు నిమిత్తము నేనిచ్చట నివసించి నాకున్న సంపదలను సత్కార్యా చరణమున వ్యయింపుచు సుఖకాలక్షేపము చేసెదను. ఇది ముమ్మాటికిని నిశ్చయము," అని పలికెను. అదివిని యచ్చట వారందఱు నామె సద్బుద్ధిని మిక్కిలి శ్లాఘించిరి. దిలారామ బుందేలుఖండమున నివసించి పరుల కుపకార మొనర్చి మహా కీర్తి నార్జించుచు సుఖకాలక్షేపము చేసెను.

# ఛెలారామ

## 17-వ యధ్యాయము




శ్లో. "ఉద్యోగినం పురుషసింహ ముపైతిలక్ష్మీ
ర్దైవం ప్రధానమితి కాపురుషా వదంతి
దైవం విహాయ కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నేకృతే యది నసిధ్యతి కోఽత్ర దోషః."

ఐదవపర్యాయము గూడ బుందేలులే సంపూర్ణ జయమందిరని విన్నప్పుడు చక్రవర్తికిఁ గల్గిన సంతాపమును వర్ణింప శక్యముకాదు. బుందేలు లొకవేళ ఢిల్లిపైకి దండెత్తి వత్తురేమోయని యతఁడు భయపడఁజొచ్చెను. ఎట్లో సంధిచేసికొని బుందేలులతోడి విరోధమును దుదముట్టించినఁగాని తనకు క్షేమములేదని నిశ్చయించి, యతం డొకరాయబారికిఁ దన యభిప్రాయమును దెలిపి బుందేలుఖండమునకుఁ బంపెను.

ఛత్రసాలుఁడు కొలువుకూటమున నుండఁగా మొగలు రాయబారివచ్చి దర్శించి తనతెచ్చిన సందేశమును విన్నవించెను. అప్పు డమ్మహారాజు వానినిజూచి, "ఓయీ, మాదేశము స్వాతంత్ర్యమై యుండవలయును. మాదేశమున జిజియాపన్ను రాఁబట్టఁగూడదు. వెనుక షాజహాను మాతండ్రియగు చంపతరాయున కిచ్చిన భూఖండమును మాకీయవలెను. మా

కిదివఱకయిన యుద్ధవ్యయములు చక్రవర్తి యొసంగవలెను. యుద్ధసాహాయ్య మొనర్ప సైన్యము నిమ్మని చక్రవర్తి మమ్మడుగ రాదు. ఇందులకు మీ రంగీకరించినచో సంధిపొసఁగును. లేకున్న లేదు" అనిచెప్పెను.

అదివిని రాయబారి, "రాజేంద్రా, మీరుకోరినదాని నంగీకరించెదము కాని చక్రవర్తి విరోధులకు మీరు సాయపడ రాదు. ఇందులకు మీ రంగీకరింపవలయును" అని మనవి చేసికొనెను.

ఛత్రసాలుఁ డందుల కంగీకరించెను. ఒకరికొక రంగీకారపత్రములు వ్రాసికొనిరి. నేటికి బుందేలుఖండము స్వతంత్ర మయ్యెను. ఛత్రసాలుని ప్రయత్నములు ఫలించెను. అతని మనోరథ మీడేరెను.

అనంతర మొక శుభదినమున నమ్మహారాజు పట్టాభిషిక్తుఁడయ్యెను. ప్రాణనాథస్వామి యానందబాష్పము ప్రవహింపఁజేయుచు నాతని మస్తకమునఁ గనకకిరీటము నుంచి దీవించెను. ప్రజలందఱు నానందసూచకధ్వనుల నొనర్చిరి. యుద్ధములలోఁ దమతమ యద్వితీయ పరాక్రమము చూపిన వీరుల కందఱకును దగిన బహుమానము లిచ్చి సంతసింపఁజేసెను. అనంతరము రామలాలును బిలిచి "ఆర్యా! మీ కేమిగావలయును" అని యాయన యడిగెను.

అతఁ డమ్మహారాజును జూచి "రాజేంద్రా! మీరు నాకుటుంబమున కొనర్చిన యుపకారమే చాలును. వేఱు బహుమతు లక్కఱలేదు. మనదేశమునకు మహమ్మదీయసంబంధమును దొలఁగించి మావంటి సాధుబ్రాహ్మణులకు స్వేచ్ఛ

గలిగించితిరి. మహాపురుషులరగు మీరాకు మాసాయ మేపాటిది? అయినను మీకీ మహాకార్యమునఁ దోడ్పడ నాయంతరాత్మ నన్ను శాసించుటచే నట్లొనర్చి కృతకృత్యుఁడనైతిని. ఏతత్కార్యార్థము కులధర్మమును విడిచి పరశురామునివలెనే క్షాత్రధర్మ మవలంబించితిని. నిజకార్య నిర్వహణానంతరమునఁ బరశురాముఁడు బ్రాహ్మణవృత్తి నవలంబించి తపంబొనర్చి పాపవిముక్తుండై ముక్తిఁజెందె. అట్లే నేనును మదీయకుల ధర్మ మవలంబించి కాశీపురమునకేగి పాపనివృత్తికిని, నిర్వృతికిని దప మాచరించుకొందును. నాకిఁక సెలవొసంగుఁడు" అని పలికెను.

అతని దేశభక్తికిని స్వధర్మానురక్తికిని, రాజును బ్రజలును మిగుల సంతసించిరి. ప్రాణనాథస్వామి ఛత్రసాలుని దీవించి యతని యనుమతిఁబడసి శిష్యులతో రామదేవాలయమున కరిగెను.

ఛత్రసాలుఁ డిట్లద్వితీయపరాక్రమమున స్వతంత్రుఁడై చిరకాలము ప్రజానురంజకముగా రాజ్యమేలెను.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1952